దేశి సారస్వతము 3.

శ్రీ ల

# పౌ రా ణి క పు పా ట లు

(భారత భాగవత కథల పాటలు)

దేశి సారస్వతము 3.

# స్త్రీల పౌరాణికపు పాటలు

(భారత భాగవత కథల పాటలు)

●

'కృష్ణశ్రీ'
సంపాదితము




ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్ :: హైదరాబాదు.

# విజ్ఞప్తి

ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రకటింపబూనిన దేశి సారస్వత సంపుటాలలో ఇంతవరకు స్త్రీల రామాయణపు పాటలు "పల్లెపదాలు" వెలువడినవి. ఇప్పుడు "స్త్రీల పౌరాణికపు పాటలు" ప్రకటించుచున్నాము. వీలును బట్టి "వీరగాథలు" గూడ వెలువడ గలవు. విశేష శ్రమ కోర్చి వెనుకటి రెండు సంపుటాలకు సంపాదకత్వము వహించి, ఈ సంపుటిని గూడ సిద్ధముచేసి యిచ్చిన కృష్ణశ్రీ గారికి మా కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాము.

ఇదివరలో పరిషత్తు ప్రకటించు గ్రంథములకు ఉదారముగ ఆర్థిక సహాయము చేసి, ఈ సంపుటికిని సహాయము ననుగ్రహించిన కేంద్ర ప్రభుత్వ సాంస్కృతిక వైజ్ఞానిక వ్యవహారాల మంత్రిత్వ శాఖ వారికి ప్రత్యేకముగ మా కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొనుచున్నాము.

హైదరాబాదు.
శోభకృతు - శ్రీరామనవమి.

విధేయుడు
దేవులపల్లి రామానుజరావు

# విషయసూచిక


| | | |
|---|---|---|
| దక్షునియజ్ఞము | .... | 1 |
| మేనకాదేవి నొప్పులు | .... | 16 |
| పారిజాత పల్లవి | .... | 19 |
| ధ్రువచరిత్ర | .... | 25 |
| త్రిపురసంహారము | .... | 33 |
| గజేంద్ర మోక్షము | .... | 35 |
| వామన చరిత్రము | .... | 40 |
| అంబరీషోపాఖ్యానము | .... | 46 |
| శ్రీకృష్ణుని జననము | .... | 49 |
| గుమ్మడు పాట | .... | 54 |
| బాలక్రీడలు | .... | 58 |
| కృష్ణలీలలు | .... | 62 |
| కృష్ణుని ముద్దులు | .... | 65 |
| జేరిపండు పాట | .... | 68 |
| శ్రీకృష్ణుని చల్దులు | .... | 71 |
| కాళింగమడుగు | .... | 76 |
| కృష్ణ జలక్రీడలు | .... | 88 |
| బృందావన క్రీడలు | .... | 93 |
| గోవు పాట | .... | 97 |
| గోపికా గీతలు | .... | 100 |
| భ్రమర గీతలు | .... | 122 |
| చిలుక రాయబారము | .... | 132 |
| రుక్మిణీదేవి సారె | .... | 141 |
| లక్ష్మీదేవి సొగటాలాట | .... | 143 |
| రుక్మిణీదేవి వేవిళ్లు | .... | 147 |
| రుక్మిణీదేవి సీమంతము | .... | 150 |
| సత్యభామ సరసము | .... | 168 |
| రుక్మిణీదేవి ముచ్చట్లు | .... | 176 |
| రుక్మిణీదేవి విజయము | .... | 180 |
| చెంచిత కథ | .... | 185 |
| తులసీదళము | .... | 192 |
| ఉషా స్వప్నము | .... | 198 |
| కుచేలోపాఖ్యానము | .... | 201 |
| సుభద్ర కల | .... | 207 |
| సుభద్రా కళ్యాణము | .... | 208 |
| సుభద్రసారె | .... | 220 |
| మార్కండేయ | .... | 232 |
| ధర్మరాజు జూదము | .... | 239 |
| శశిరేఖ పెండ్లి | .... | 247 |
| కీచక వధ | .... | 250 |
| విశ్వరూపము | .... | 258 |
| పద్మవ్యూహము | .... | 264 |
| పండు పాట | .... | 267 |
| సారంగధర | .... | 270 |
| ధర్మాంగచరిత్రయనుపాముపాట | .... | 280 |
| గంగాగౌరీ సంవాదము | .... | 295 |
| చిరతొండరాజు కథ | .... | 300 |
| కామేశ్వరి పాట | .... | 308 |
| సురాభాండేశ్వరము | .... | 315 |
| శ్రావణ మంగళవారపు కథ | .... | 320 |
| కుమ్మరి గుండయ్య కథ | .... | 324 |
| వరదరాజు పెండ్లి | .... | 332 |
| సవతుల కయ్యం | .... | 336 |
| వెంకటేశ్వర్లు వేట | .... | 342 |
| చిలుకుముగ్గుల పాట | .... | 345 |
| దత్తాత్రేయ జననము | .... | 351 |
| ఏకాదశీ మహాత్మ్యము | .... | 354 |
| తిరుమంత్రము | .... | 369 |
| తులసి చాతుర్మాస్యాలు | .... | 371 |
| సూర్యుని గుర్రాలు | .... | 373 |
| వశిష్ఠ వాక్యాలు | .... | 376 |
| రామనామ మహాత్మ్యం | .... | 380 |
| వైకుంఠ వర్ణనము | .... | 390 |

# దక్షుని యజ్ఞము

అతివరో జూ స్తివా ఆదికాలమందు - రామ ప్రతిష్ఠయా రామలింగామూ
దొరకొనియున్నాడు దొరసానిసన్నిధిని - కలిసికొనియున్నాడు కౌగిటలోను
యెడలేకదానితో యేకమైయున్నాడు - పలుకూచునున్నాడు పరమరహస్యముగాను
పడతిరో పార్వతీ ప్రాణేశుడుండూట - జాగ్రైయున్నదాశే. ౧

వేకుజామునలేచి వెయిశంఖులుపట్టాగా - వరశంఖులు బట్టగాసరసమాడే
హర్షాముగలిగితె ఆసన్నిధున్నాడు - యేసన్నిధున్నాడు యేకాంబ్రలింగమై
హరిసన్నిధున్నాడు అల్లిబిల్లిగ్గాను - నాగవర్ణుడప్పుడు నరహరినిగావించి
కొల్లగానున్నాడు గోవిందునిసరస కల్లగాదేచూడు కమలాక్షుడుండుటా
కలకలానవ్వె - హరుడూ. ౨

హెచ్చూగయేకాంబ్ర లింగమైతానూ - పట్టినబ్రహ్మశిరములు ద్రుంచియో
కంఠమున కాలకూటంబు ధరియించుకొని - మెప్పుగానున్నాడు మేటిపర్వతాన
చుట్టుగానురలంత సురటివిసరగాను - సుదతిరో జూ స్తివా శుభభానుని కొలువు
శుభమైయున్నవాడే. ౩

అంతటా దక్షుడూ అతిసంభ్రమముతోనూ - గావించయజ్ఞమ్ము మదినిదలచే
అల్లుండ్రకూతుండ్ర తోడితెస్తామని - కలియుగ మంతాను కడువేగరప్పించి
పెద్దకూతురు తనకు పెత్తనంగలదనీ - పెద్ద అల్లుడుతనను యోచనగలవాడు
తోడితెత్తా మని మనసులోపొంగుచూ - ఆనందముగానుండెనూ. ౪

అంతట దక్షుడూ అతిసంభ్రమముతోనూ - బంధువులరావించె ప్రతిహార్లాచేత
యెక్కడెక్కడరాజులే యప్సరాస్త్రీలు - పాడినపాటకుల బంధువులరావించి
అందినపొందినా యాబంధువులనూ - అల్లుండ్ర కూతులనప్సరాస్త్రీలానూ
అందరినిరావించెనూ. ౫

అంతటదక్షుడూ అతిసంభ్రమముతోను - ఈశ్వరుం డున్నట్టి పురమునకొచ్చి
సత్వాటకులవీణె పాటకులనుజూచి - తనలోకధారుడై తపసుచేయుచుండగా
పాదపద్మమ్ములకు మ్రొక్కుగలదనిపలికి - హస్తములుముడుచుకొని అతినమ్రుడై పలికె
దండంబుదండంబు దండంబు లనిపలికి - దండంబుయోదేవ దండంబులనిపలికె
దీక్షబట్టుక శివుడు వివరాము తెలియాకా - విరసాముతోనుండెను.

హర్షముతేవికా అమృతములు తనకనుచూ - కూతురున్నట్టి యాగ్యహాముకొచ్చె
అల్లలంతటదక్షుని రాకతాపొడగని - శీఘ్రానగద్దైపై వేగమునతాలేచి
కాళ్ళుగడగడవణకి పాదఅర్చనజేసి - భయమున భీతినియేమియూర్ష్యతోయని
వెలదితా నిలచుండెనూ.

వెలదిముఖముజూచి తండ్రితాయిట్లానెనూ - చేడెనీకూనాకు చెల్లెఋణమూ
భీకరుండై తాను కంటసంబులుతోచ - పాపాత్మునితోపొందుజాసి పుణ్యుడనై తి
నీచులతోను భాషింపంగనేరాదు - గర్వాంతకుడనై తి యింతపర్యంతమూ
పార్వతీనీవునా పాలింటనేలేవు - యింతినీకూనాకు యింతెకదలాయె నని
అతివేగమున తర్లెనూ.

వేగతర్లగ వెలదివ్యాకులాబడుతూనూ - యేమియూర్ష్యతోదక్షుండువిడనాడె
ఈశ్వరుణ్ణితన్ను విడగనాడుచుపోయె - చెదరవాడినమనను కెంగలాడుచుకోయే
చేడెలారా తెలియుడీ.

అంతటదక్షుడూ తనపురముకేతెంచి - అసురుల బిలిపించి అతిశీఘ్రముతోను
వనసెరిగియజ్ఞ శాలలు గట్టింత మని - ఈశాన్యమున భమిడి స్తంభము వేగనమర్చించి
అపశకునముతో గట్టె ఆయజ్ఞశాల - ఆటకూటమ్ములూ నాటకపుశాలలూ
నేస్త్రైనమిద్దెలూ దీక్షైనశాలలూ - ముత్యములు వజ్రాలమకట్టించిరాశాల
స్వర్ణరత్నాలనూ కట్టించిరాశాల - చిలుకలు గోడలా చిత్తరవులేయించి
భమిడి స్తంభాలతో పందెళ్లు వేయించి అగ్నిహోత్రునికరుగు అయిదుగుండంబులూ
అవజ్ఞతోగట్టి రాయజ్ఞాశాలా - ఆనందమునమండరే.

దక్షకాంతయు తనాపతితోను యిట్లానెనూ - అలనాడు కైలాస గిరికెంపై స్థిరి
ఈశ్వరులాదేవి యేమనెనో చెప్పుడి - పరమేశ్వరుతోగాక పార్వతీదాననెన
భయమునభీతిని పలుకరించదాయెనా - వెనుకటమ్మునిపలికె వేగిరంవ స్థిరా

అటుగాక కైలాసగిరిపర్వతమ్మీద - తనులోకధారుడై తపసుచేయుచుండెనా
కైలాసగిరిమీద ఘనుడుపాలించుచునూ హరునకోరితీర. ౧౧

వెలదిరోవినవెనేపోయినప్రొద్దునా - పోతరించుచున్నాడు పొల్లుగాననుజూచె
నీతిదప్పిమనమునీచునికియిస్తిమే - యింతచెడుగువాడగుట యిహమందుగాననే
బంధువుల లోపలా పార్వతీరాదనీ - పలుకోటిబలికితే భంగమాయెనుబ్రతుకు
జంగమాదేవంటు తలవంపులాయెనూ - అయింతిమనపాలింట లేదనీదలచీ
యీప్రేమలే విడువుమీ. ౧౨

అమాటవినినఖయ అతిదుఃఖమును బొంది - గోలుగోలూమనిరి కూతుశ్చూతాను
యేదిక్కుబోదునే యింతినీకొరకై - ఎందాకనీపురము యెదురు తెన్నులుజూస్తు
కాకున్న కన్నతండ్రితో కంటకములేల - నీచములు బలికితివనీవు పతినిగూడి
నీయాశ మనసందు మోహపాశములేక - నమ్మితివ నీప్రాణనాథుణ్ణిచాల
నమ్మితివదుర్మార్గునీ. ౧౩

గోలుగోలూమని కోపించి ఉగ్రుడై - తలపొయ్య నేమిటికి ధవళాక్షిరో
యెంతశోకించినా విరసాము యోగము - అనాటికానఖయ గర్భచిందాయెనని
గర్భచిందాయెనని కాంతదాశ్చెదవేమి - ఈభ్రమాభ్రమమనసునందునా విడనాడు
యెరుగ నేనూను యజ్ఞము దలచితిని - యెగ్గుజెప్పెదవేమె వేషభాసూరాల
నలుగురువింటేను నను గేలిగొట్టేరు - నాయీడువారిలో నాబంధువులలోను
విద్యకులమెరుగకాయిచ్చిందేరాత - ఇచ్చితేసరిజేసుకుండీదేనీతి
యుచితమామనకోర్వనూ. ౧౪

అయింతిమనపాలింట లేదనితలచి - పూజితమయిన సుతలిందరేయనుకొనీ
మనసుకుదరకేజేసుకొ మలవరాయీవలెను - చెరవదలియైననూ చేదెవచ్చినగాని
ప్రియముజేసిమీరు పీటవెయ్యగవద్దు - వెలదిరమ్మనిమీరు కౌగలించాబోకు
యెక్కడున్నాస్త్రీలు అక్కడేయుండుకొని - ముప్పదిక్కించ:డియోముగుదలారా
మూడుతెరవులుకాయకా. ౧౫

అమాటవిని నఖయ అతిదుఃఖమునుబొంది - దుఃఖతులుఅయిరియజ్ఞముకు సంభ్రమపడిరి
యజ్ఞయశ్శామంత వేగగావించుకొని వచ్చిరి - చుట్టాలువరుసవరుసలతోను
వచ్చిరిదేవతలు ఋషులుతాము గూడి - యెటునుండి వచ్చెదరు యోదేవతల్లార

పార్వతిని గానరు యోబంధువుల్లార కైలాసగిరి యానగ వింటిమే వోసఖియ
యింత రాకడమేము యించుకాయెరుగమూ - కేవలంయీశ్వరుడు మహానుభావుడూ
ఆదివిష్ణువుకంటె అంతరముగలవాడు - చూచితేసూర్యుడూ తలచితేవుగ్రుడూ
అతనియెదుటను నిలచి యెదురాడగలమ - అతనిమనసూ మనకు యెంతఅంతరవుగలదు
యిపుడు తర్లుమని విచారించి వుచితార్థము నేడు యుందామనిచాల
విచారించుకొనిరీ. ౧౬

ఇక్కడయీశ్రమా కడతేర్చుకుండాగ - అక్కడ పార్వతీకైలాసగిరిమీద
వచ్చెడిదేవతల వలనొప్పతాజూచి యెటనుండి వచ్చెదరు యోదేవతల్లార
ఎక్కడికిమీరు విజయము జేయుచున్నారు - అంతవృత్తాంతమ్ము తనతోడజెప్పుమనీ
సాష్టాంగముగ నొరిగెనూ. ౧౭

నిండున్న మునులంత నిర్భ్రాంతమును బొందీ - విపరీతకాలమిది అంత్యకాలంవిది
అంతగాకా వాణ్ణి ఆశ్రయించగరాదు - కన్నబిడ్డను బాపి గడుసంభ్రములుజేసె
కన్నీరుగారగా కాంతముఖమూజూచి - కలియూగమంతాను కంటిమొకటిగ గనుక
కనవమ్మ వోచెలియ కనవేవినవే - మనవీ చేకొనవే. ౧౮

ఏడుదినములునాయె యజ్ఞమ్ము దలచూపూ - దక్షునీ పురమంత స్వర్గమైయున్నదీ
మ్రోగుచున్నది మోక్షపుర మనగాను - సిద్ధాన్నకటకమే సాధువీపురమనగ
ఏవైపుజూచినా వెండికోటలు తరుచు - ఏవైపుజూచినా భమిడికోటలు తరుచు
ముత్యవజ్రాలును స్వర్ణరత్నాలునూ - ఏదినము కూతుళ్ళు యేదినము అల్లుంద్రు
అహములు రాత్రులూ యాగమనిపట్టుకొని
వేగిలేచుట మొదలు వెయివేలునడువగా - అతివనీవూ రాని యాకట్టడీయేల యీ
హరుడు బంపాడాయెనా. ౧౯

ఆమాటవిని గౌరి అతిసంభ్రమునుబొందీ - వద్ద చెలియనుజూచి వనిత తానిట్లానెనూ
పిలిచినారోయేమి పిలువకున్నారేమి - తోయజాక్షిరో నేను పోయివచ్చెదననుచు
అయినానుగాక మా హరుడుతోనూజెప్పి - అజ్ఞబుచ్చుక వేగబోయి వచ్చెదననుచూ
పతిసన్నిధికివచ్చెనూ. ౨౦

ఇంపుతోడుత గౌరి ఈశ్వర్లకూ మ్రొక్కి - విన్నపము దేవరా వినుడాసతీ
కన్నవారినిజూడ కలిగేను చిత్తంబు - ఉన్నవారీలోను పూరడింపగలేను

వెళ్ళెదనని బుద్ధి వేవేగబుట్టినది - మళ్లదూనాకింక మనసునాబాయదూ
అవశ్యమైనా పనులు అతిక్రమించగరాదు - అనతినాకిమ్ము అతివేగరమ్మానీ
కరకంఠతగునానతీ. ౨౧

వనిత పలుకులువిని వనితశంభుడు పలికే - వ్యాధి సేయక నుంద్రు యేలోకమ్మునా
ముద్దుజేసీవారు ముందారపిలువరూ - నయనానచూడరూ నాతివెళ్ళగరాదు
నీతిమంతులుగారు నీవారుసరిరారు - ఛీతరించున్నారు బొల్లుపోనాడేరు
కట్లుబడునట్టుండు కాంతనీదేహమ్ము - ఏల మాటలుకొన్ని యేలయాడెదవింక
నీతులేజెప్పకా నిజములేబలుకాక - నిలయమునసుండు సఖియా. ౨౨

ఉదరాములోనుండి వులుకూతు గౌరీతా - కరుగూతుకండ్ల నీళ్లుగారుచూ
కదులోతు శివుని పాదములపై తానరిగి - అలుసుగాబుట్టితీ అసరనై వారింట
వేగిలేచుండగా వెపోవేలునడువగా - కీడుమేలెంచుచూ యిందుండగారాదు
పంపెడివాక్యములు పలుకుమీ వోదేవా - కరకంఠ తగునానతీ. ౨౩

ఏమిసేయుదుదేవ మనవిసేగై కొమ్మీ - అందరిని చూడకా అణగియుండగలేదు
ముద్దుచేసీవారు ముందారపిలువ రని - పలుకొకటిపలికితిరి భంగమాయెను బ్రతుకు
నాడు మాతండ్రొచ్చె నాగధర మీకడకు - దీక్షబట్టుచుమీరు తపసులై యుండగా
నా సన్నిధికివచ్చి నాతిరమ్మని బలికి - హరుడునూ నీవూను అతివేగరమ్మానీ
అతని పురమునకేగెనూ. ౨౪

నాగ కుండలధరా నన్ను నేలిన స్వామీ - నాగధర యీమాట లాడదగునా
అడినా నాలుకా నోరుతడియాలేక - తండ్రి జేసిన తప్పు తలపోయుచుండగా
ధరణీశ అడిగితిని తప్పుగలదే అడల - తప్పులు అన్నియును వొప్పుగా క్షమియించి
మమ్ము దయజూడుమా - నిర్మలాచిత్తుడవు - నిత్య మల్లేశ్వరుడ కేవలము దేవుడవు
దేవతల మాపాల ఆత్మబంధుడవూ - మహానుభావుడవు భర్తజేసినముద్దు ఖేచరవీధులు బారు
భర్తసేయనిముద్దు పంచలా పాలౌను
పాములా భరణభూషిత నన్ను యేలుకొని - పంపెటి వాక్యములు పలుకుమీ వోదేవా
కరకంఠ తగునానతీ. ౨౫

వనిత పలుకులువినీ వనితశంభుడు పలికే - యెంతజెప్పినగాని యెరుగరాదే బుద్ధి
నెలత పన్నెండేండ్లు నినుకానకా తిరిగి - వచ్చి దక్షునియింట వనితనిన్నూ దెచ్చి

నెలత నా హృదయమున నేటిదాకా యెంచి - మునులు దేవతలంత ముఖ్యమనికొలువగా
కలలోకంబులూ పాలింపుదూమనము - పోతరీకునిచేత ఘాతమాటలుబడను
పోనునీకూవేగ కారణంబుండాగా - కాంత వేగంబోయిరా. ౨౬

అని శంభుడూబలుక నెలనెలా పడుతూను - కలవెలాపడుతున్న గౌరి ముఖమూజూచి
కాంత నీకింతేల కడుశోకవారాధి - యింతమాత్రము పనికి యింతి అడలగనేల
యింతమాత్రము పనికి పోనిస్తునానిన్ను - వేడుకలు చాలలూ వ్యసనమైయుండాగా
వనజాక్షి చెప్పుమనెనూ. ౨౭

అంతనుండి లేచి వనజాక్షి గౌరీతా - పోయివచ్చెద పుష్పకము వేగదెమ్మనిబలికె
ఘనతతోడుత గణానాయకునిబిలుచుకొని - తావేగ పుష్పకము తానెక్కి గౌరీతా
పంపెటివారి సౌఖ్యంబించు కాలేక - వ్యథపడుతు వెళ్ళేటి వెలదిముఖమూజూచి
వేడుకలు కడలాయెనూ. ౨౮

కూడికలు లేవికా కుందరదనామనకూ - అరగడియ వోడబాసె అతివ నీకూనాకూ
హితవుగాజెప్పితే యెంతవినవైతివీ - సరకుశాయకనీవు చచ్చేటి వేళలో
సఖియ నామాటలూ దలచుకుందువుగాని - దంతుర్లుబట్టగా సకలానికి మనమూ
సరకుశాయకపోతిమి. ౨౯

చెడుబుద్ధిగాదింక చేడెనేజెప్పేను - చెలియనీచిత్తాన దెమ్ముకొమ్మీ
ఆడినామాటలూ అనుభవించీనపుడు - అతివనీకుండగా అవిధియంత ముందరా
మేనకకుజన్మించి మేలుగాననుగోరి - కీడు నీకుండగా కిందబడక జన్మమూలూర
కింకర్ల వేబాధలూ. ౩౦

పతిపలూకులువిని పణతి కోపించుకూ - పోయివచ్చెద పుష్పకము వేగదెమ్మనిబల్కి
తలజలక మార్చి యోసఖియతానప్పుడూ - రాగి భూషణాలు రమ్యముగ ధరియించి
ముత్యవజ్రము తొడుగులు ముగుద తాదొడగి - వజ్రాల వడ్యాణము వనితతాధరియించి
పాదకింకిణీలు పాయవజ్రమ్ములూ మోదముతోహస్త కంకణనూడిగంబులూ
ముత్యవజ్రాల భమిడాకులేనవరత్న - పొసగొని ముత్యాలు పూసకుంటేల్లేసి
సురతాని ముత్యాల జూడకాపులదండ - ఒప్పుమకుటంబులూ నొప్పు సంపెంగలూ
పొగడరేకులు జాజుమల్లి దండలుముడిచి - వీభూతి శేర్చుక్క తిలక మమరగదీర్చి
చంద్రకావీరవికె తేజస్సుగాదొడిగి కాయవస్త్రం పట్టుపీతాంబ్రం గట్టి

వంటినలుగున బుట్టిన యా పుత్రునీ బిలచి - ఈశ్వరనందనా వినాయకాపతి
నందిపై యెక్కుమని నాతిముందరనిలచి - ధగధగా మానమున తావెలుగుచూగౌరి
కైలాసమూ వెడలెనూ. ౪౧

చంకపుత్రుని జూచి సఖియలందారూ - పార్వతీ పరమేశ్వర్లను పాయననుచూ
ముందరవచ్చేటి అనాగతంగానకె - వెలది కైలాసమున వెడలి నాచందమున
కాంత కీ పురుషునికి యింతెకడలాయెనని - కాకిపాపములు ముంద్ర వాహనమ్ములుదీర్చె
పార్వతీశ్వరులకూ మోహబంధము కాసెనని - బల్లొకటి పలికి పార్వతిపై ప్రాకెనూ
బుగబుగమండుచూ శోకయార్పు వినబడెను - కన్నులుగానకా కామాంధకారమున
అల్లదుగో దక్షునీపురమనుచు తనవద్ద - సుతునికిచెప్పుచూ తావెలుగుచూగౌరి
దక్షునీపురము కొచ్చె. ౪౨

తోయజాక్షిరోయింతి పోయిపోయీ నిలచీ - ధవళాక్షి కన్నతండ్రి పురముగ వినిజూచి
నందివాహన నేను పోయివచ్చినదాక - పోరుగున యుండుమని తోపునాబంధించి
ఘనతవినాయకుని నెలత చంకనుబెట్టి వచ్చి దక్షునిపురము ముందార
గవినివాకిట నిలచెనూ. ౪౩

గవిని కాపులవారు గడగడావణకుచూ - నెలతకీతెరవిచ్చి పాయనిలచుండిరీ
ధగధగామానమున తలుపులన్నీ వీడెను - అతిసంభ్రమమ్ముగా అదిపార్వతిదేవి
చెల్లెళ్ళ మణిమలా చేడెతానూజూచి - చెదర నాడుకువస్త్రి తండ్రిభాగ్యము జూడ
యింత వైభోగము జూడ కీ దేహమేమిటికి - అనుచు తనమదిని సంతోషప్రియమునుబొంది
వచ్చి దక్షుని యజ్ఞశాల ముందర భమిడి - స్తంభమున తానిలచెనూ. ౪౪

చంకపుత్రుని దీసి సఖియలందారూ - అక్షంతలు గంధాన ధూపదీపమ్ముగా
గణనాధు పూజించు దక్షకాంతయు తాను - పాలసెవ్వలుపప్పు పాయసాన్నము నెయ్యి
ఖండించినా చెఱకు కోలతే పుండ్రాళ్ళు - మెండుగా బోసిరీ కొండలాదీ పొడవు
పార్వతీ మీదను చింతయించుక లేకా - భక్షించుచూనుండెనూ. ౪౫

పక్షములులేవికా అదిపార్వతివనెనూ - చెల్లెళ్ళు తమ తమా పుత్రులను యెత్తుకొని
వెలది ముఖముజూచి తొలగి పోయీరంత - ఇంతిమ ననూనందు యే క్రోధమునులేక
యేమించియున్నట్టి యజ్ఞశాలల కొచ్చి - పావకుని యురువులూ పంచవేదమ్ములూ

పాపకుని ప్రార్థించి తల్లి దండ్రిని జూచి - తొల్లిజూచిన లక్ష్మి తొలగుచున్నట్టుండు
యెక్కడి రాజ్యలక్ష్మి వచ్చెనిక్కడికి - అనుచు తనమదిని సంతోష ప్రియమును బొందె
ఆదిపార్వతిదేవి. ౧౬

క్రేగంట దక్షుడూ అతివ ముఖముజూచీ - హరినారాయణటంచు పేల్చెసమిధలు
పండ్లు పటపటగొరికి భీకరుండై తాను - ముఖము మలినిలూ దేహమున చెమటలూ
కన్నుల రక్తంబు కారగాదేహాన - నాటి నిఘాతలు నొవ్వనాడగ దొణగె
సభవారంత వినగా. ౧౭

ఎంతజెప్పినగాని యెరుగరాదే బుద్ధి - నాడెకడజేస్తినీ నాకు నీవు లేవనీ
నేటిదాకా నీవు నిజమౌటయెరిగితే - ఉన్నట్టుయెరిగితే నువిదయీ శోభనం
తలపెట్టకేపోదు సరివారిలోపాలా - అల్లుడూ కూతురూ రాకతీరాదని
అక్షంతలు గంధాన అర్చించి పిలచితిన - శోభనానికి మాకు సొంపుబుట్టాదనీ
జోడీలుబెట్టించి తోడితెప్పిస్తినా - అతివ యిందరిలోను హీనపడకానీవూ
అధికురాలని వస్తివా. ౧౮

ఆశపాతకురాల అతిహీనురాలా - దుర్మార్గురాల దుష్టురాలా
కాలకంటకురాల కష్టురాలా నీవు - కష్టనీతూరాల ఘాతకురాలా నీవు
ఏమనుచువస్తివే యింతి నాయింటికి - కులహీనుడింటికి యేమనుచు వస్తివే
కులమెంచి చూచితే శునకమౌదువు నీవు - నీ పతికిగలయట్టి నీమమ్ములూ లేవు
ప్రతిప్రతీ భూములూ చరియింప నేరమూ - ఈశాన్య మందునా తిరుగాడ నేరమూ
స్మాశాన మందునా మట్టుజేర్చుకు మేము - మునివృత్తితోడనూ తపసుసేయా నేరమూ
యెక్కి తిరుగనుమాకు యెద్దుదున్నా లేదు - కప్పుకుతిరుగను మాకు కావిబొంతా లేదు
భద్రాసనమ్మకే పులిచర్మమూ లేదూ - హస్తమ్ము పూతకే అడవియేముకా లేదు
అడవిమృగముల జంపి ఆ యెముకలూ దెచ్చి - పాతగట్టుకు మేము శంఖూద నేరమూ
పూటకూళ్ళుగుడిచి బూటకము నేరమో - వేటజంగల గూడి చరియించ నేరమూ
సందిట రుద్రాక్షలు తామరా పూసలు - చంక పెండెంబులూ బిగియించ నేరమూ
వచ్చిన వారికి వంచనలుసేయకా - మీదు జూచుచు హరహరాయన నేర
మటువంటిపున్నమా చంద్రుణ్ణి నీవుబాసి - నెలత నీ హృదయమున ప్రాణమ్మ లుండెనా
అతః పాతాళన అణగియుండగ లేకా - అధికురా లనివస్తివా ౧౯

యోకుమ్మరీ సానకెన్ని పాత్రలు గలవో - వుచితాని కొకపాత్ర వుపచర్యకొకపాత్ర
యెడమభరణపుపాత్ర పాయసాన్నపుపాత్ర - అటువలే నాగర్భ వాసంబు సరిజేస్తి
ఆదిశేషునికి అరువైయారూ గ్రుడ్లు మురుగును యొక గ్రుడ్డు వెలది
ప్రక్కను బడి వెలుసునో యొక గ్రుడ్డు - వెలది ప్రపంచమున దెలియను యొక గ్రుడ్డు
అటువలె నాగర్భ వాసంబు సరిజేస్తి - అతివ యిందరిలోను హీనపడకా నీవు
అధికురాలని వస్తివా. ౪౦

పోతరించకు దక్ష పొంగు కూడూగాదూ - వ్యధబెట్టినన్ను యేమనుభవించేవు
యో మునీశ్వర్లార యో దేవతలారా - వీని మాటలు చెవులకింపులై తోచెనా
సకలదేవతలార యోసభాముసులార - దక్షునిమాటలూ సంతోషమాయనా
పతిమాట వినకనే భంగిపోయీవస్తి - పతిమాట వినని స్త్రీ పాపిష్టురాలు
పతివ్రతయందురా జగతిలో నెవరైన - యిందరూ రాగాను విరహాగ్నినే బొంది
కూరాకుయేమయిన త్రాగిలోయెదననుచు - కూర్మి జేసుకునేను కూతుర ననివస్తి
కానుకీకొరగాక కంటికీయీగగా - గౌరిపార్వతి యనుచు కాంతలంతా బల్క
పృథివిలో స్త్రీలంత నా వ్రతముచేయగా - అడిగినవారికీ అభయములు యిస్తూను
పార్వతీశ్వరుడనీ వట్టిపూజలుసేయ - యెవ్వరిని యెవ్వరిని యికనమ్మగారాదు
తల్లినీ తండ్రినీ సమస్త బంధువులనైన - అత్తను మామను గర్భవాస సుతునైన
నమ్మరాదే యీ యువిదలాకూ నిపుడూ - నరలోకామందునా. ౪౧

అయ్యయ్యో పతిమాట వినకనేవస్తి - అతివ యింతాసేపు వోర్వంగాలేక
విచారించుకోని విలపించుకోని తాను - భూమిలోదుష్ట దక్షుని పుత్రినగుకంటె
అడవిలో నొక వ్రాను అయివుండుటే మేలు - దక్షపుత్రీననే లోకనిందయు వేగ
బాపు కుందునే ననీ పార్వతీ తాబలికి - కానిమ్ము లెమ్మనీ తలయూచి ప్రార్థించె
మాసములు పాపములు బాపేటి పావకా - ఖాండవ వనము దహన మొనర్చిన పావకా
అదియనక యిదియనక యెగ్గుకాయకనన్ను - సర్వముగనన్ను భక్షించుమీ పావకా
పావకుడ నిన్ను నే బంధువనిప్రార్థిస్తి - నీవైన దయజూచి నిగ్గుకాయిుము నన్ను
పదుగురులోపలా భంగపుచ్చక నన్ను - భస్మంబు జేయుమని పావకుని ప్రార్థించి
తలవంచుకు గూర్చున్న తల్లిదగ్గరకొచ్చి - పుపుడోటనీరులే పాదములు సోకినా
వెన్న కరిగినరీతి తల్లిగర్భం బవును - కదలకున్నావేమి కలుకురాయీవలెను
నీవేమి జేసేవు నాజన్మఫలమిదీ - నిందింపు టా వట్టినిష్కారణమె గాని
అక్కచెల్లెళ్లు నా కడ్డుబడిరారుగా - ఓహో నేనెంత వోరిమిగల దాన్ని

తాలిమీ గలదాన్ని తండ్రిచే బాధలకు ఉత్తమా గుణములా పతివ్రతనై తేను
వీరభద్రుడు వచ్చి యీళ్వర్లకీ బుట్టి
తలలు బాహువులుద్రుంచి పావకునికి వేల్చి
సంహారకారమా జేసునోవీరన్న - అనుచు శాపముబెట్టి యా పార్వతీదేవి
యెన్ని జన్మంబులూ యెత్తిబుట్టినగాని - చావుపుట్టుక లేని సదాశివునికి నేను
భార్యనుగావలెనని పావకుని ప్రార్థించి - మిట్ట మధ్యాహ్నమున మహామునులు జూడగా
బొటనవ్రేలుతోను కట్టడయి వ్రాయగా - మధ్యాహ్నమున మహామునులు జూడగా
మండి తామగ్గెసఖియా. ౧౨

అక్కడ మునులంత ఆశ్చర్యమునుబొంది - అహా పతివ్రతా యెంత సాహసురాలూ
కన్నులసంజ్ఞలా మహామునులు గదిలిరీ - సన్నలచాయలా మహామునులు నడిచిరి
పోవు మునులను జూచి పోతరీకుడు బలికె - వనిత శంభుడుతన లోకానకేరిరణ
వనితశంభుడు తన నొసట వ్రాసినవ్రాలు - వొద్దనయెవ్వరికి వశములుగావింక
కడతేర యజ్ఞంబుగావింతమని పలికి - హస్తమ్ములోయెముక అజ్యంబులో ముంచి
స్వాహాయని వేల్చెనూ. ౧౩

అంత వృత్తాంతంబు యానందిగైకొని - అంత వృత్తాంతమ్ము హరునితోనూ జెప్ప
శీఘ్రముగ జడలన్ని వేగానదులుపుకొని - చిందువిందాయెనా యెందుకింతాసేపు
శీఘ్రానలలాటముపై చెమటలూదీసె - శీఘ్రాన చక్రాతిపై చినుకూలేజల్లె
ఝుణఝుణా మ్రోయుచూ ఘణఘణలాడుచూ - వీరభద్రుడు బుట్టె వీరములుపలుకుచును
కాస్తునుపూస్తునో విష్ణులోకామంత - కొందును తిందునో సకలలోకములెల్ల
అంతవృత్తాంతమ్ము తనతో జెప్పూమనీ - తండ్రిపాదముల కొరిగే. ౧౪

పోకుమని సతితోను పోరాడయారాడ - పోయిసతి పాపాత్మునగ్ని పాలాయెనూ
దక్షుడీపురికేగి పురముపాడుచేయు - మనతండ్రి వాక్యంబు వినితానువీన్న
ఇంతికై పోరాడి పురము పాడూజేతు - భాగ్యవతీ యారీతి పరిపూర్ణమాయెనని
మహానుభావుడా మగువకడలగవద్దు - తండ్రి నీ సెలవడిగి తాగదిలెవీరన్న
ధవళశంఖులు రెండు తళతళా మెరయగా విభూతిపెండికట్లు విరిపైనతల జడలు
హావీరహావీర వీరరుద్రాయనుచు - వచ్చె దక్షునిపురము ముందార
గవినికాపుల గొట్టెనూ. ౧౫

తాలిమీ గలదాన్ని తండ్రిచే బాధలకు ఉత్తమా గుణములా పతివ్రతనై తేను
వీరభద్రుడు వచ్చి యీశ్వర్లకీ బుట్టి
తలలు బాహువులుద్రుంచి పావకునికీ వేల్చి
సంహారకారమా జేసునోవీరన్న - అనుచు శాపముబెట్టి యా పార్వతీదేవి
యెన్ని జన్మంబులూ యెత్తిబుట్టినగాని - చావుపుట్టుక లేని సదాశివునికి నేను
భార్యనుగావలెనని పావకుని ప్రార్థించి - మిట్ట మధ్యాహ్నమున మహామునులు జూడగా
బొటనవ్రేలుతోను కట్టడయి వ్రాయగా - మధ్యాహ్నమున మహామునులు జూడగా
మండి తామగ్గెసఖయా. ౪౨

అక్కడ మునులంత ఆశ్చర్యమునుబొంది - ఆహా పతివ్రతా యెంత సాహసురాలూ
కన్నులపంజ్ఞలా మహామునులు గదిలిరీ - సన్నలచాయలా మహామునులు నడిచిరీ
పోవు మునులను జూచి పోతరీకుడు బలికె - వనిత శంభుడుతన లోకానకేశిరణ
వనితశంభుడు తన నొసట వ్రాసినవ్రాలు - వొద్దనయెవ్వరికి వశములుగావింక
కడతేర యజ్ఞంబుగావింతమని పలికి - హస్తమ్ములోయెముక ఆజ్యంబులో ముంచి
స్వాహాయని వేల్చెనూ. ౪౩

అంత వృత్తాంతంబు యానందిగైకొని - అంత వృత్తాంతమ్ము హరునితోనూ జెప్ప
శీఘ్రముగ జడలన్ని వేగానదులుపుకొని - చిందుబిందాయెనా యెందుకింతాసేపు
శీఘ్రానలలాటముపై చెమటలూదీసె - శీఘ్రాన చక్రాతిపై చినుకూలేజల్లె
ఝుణఝుణా మ్రోయుచూ ఘణఘణలాడుచూ - వీరభద్రుడు బుట్టె బీరములుపలుకుచును
కాస్తునుపూస్తునో విష్ణులోకామంత - కొందును తిందునో సకలలోకములెల్ల
అంతవృత్తాంతమ్ము తనతో జెప్పూమనీ - తండ్రిపాదముల కొరిగె. ౪౪

పోకుమని సతితోను పోరాడయారాడ - పోయిసతి పాపాత్మునగ్ని పాలాయెనూ
దక్షుడీపురికేగి పురముపాడుచేయు - మనతండ్రి వాక్యంబు వినితానువీన్న
ఇంతికై పోరాడి పురము పాడూజేతు - భాగ్యవతీ యీరీతి పరిపూర్ణమాయెనని
మహానుభావుడా మగువకడలగవద్దు - తండ్రి నీ సెలవడిగి తాగదిలెవీరన్న
ధవళశంఖులు రెండు తళతళా మెరయగా వీభూతివెండికట్లు విరివైనతల జడలు
హావీరహావీర వీరరుద్రాయనుచు - వచ్చె దక్షునిపురము ముందార
గవినికావుల గొట్టెనూ. ౪౫

యెచ్చోటనైననూ పుత్రుడు జన్మించెనా - మాతృవంశముబట్టి మమ్మురక్షించరా
కరుణించికావరా యేలుకోరతండ్రి - పురుషభిక్షముబెట్టరా. ౫౦

పోకుమనిసతితోను పోరాడియారాడి - యెన్నివిధంబులా యెంచిచెప్పినగాని
పతితోనుపోరాడి పడతిచనుదెంచగా - ఆడరానిమాట లాడితిరయప్పుడూ
అతియుగ్రకోపమున ఆయతివనుండగా - సమస్తమూ అడలగా సరిగద్దెకూర్చొని
హస్తమ్ములో యెముక ఆజ్యమ్ములోముంచీ స్వాహాయనివేల్చిరీ. ౫౧

యెంతదుస్సాహసులు పతినియివ్వకున్న - పావనుని మదిలోను పరమేశ్వరుని తాదలచి
ఈచంద్రతారకం యీకలియుగామందు - ఆచంద్రతారకం ఆకలియుగామందు
ముక్కునచీమిడి మునికంటగారగా - తలయెత్తిబ్రతుకకా తలదించుకొని బ్రతుకూ
బ్రతుకుమని శాపమిచ్చె. ౫౨

అనియిట్టు వీరన్న అల్లరాజేయుచూ - అచటిమునులంతాను అతిభయముతో జనిరి
బ్రహ్మయున్నట్టియో వరపురముకూవచ్చి - మ్రొక్కినిలచుండిరీ మునీశ్వర్లూయంత
హస్తములుజోడించి ఆబ్రహ్మతోడను - దక్షపురయజ్ఞమ్ము తార్కాణముగ జెప్ప
ఆశ్చర్యపడి బ్రహ్మ అంతరిక్షము జూచి - రుద్రుకడకు బోదమని ఆమునుల తోడుకూ
కైలాసమేబోయెనూ. ౫౩

చింతాక్రాంతుడైన ఆరుద్రునీ జూచి - బ్రహ్మయామునులతో సాష్టాంగమొనగే
మ్రొక్కినిలచునట్టి యామునులనూ జూచి - యేమికార్యము నేడు యిచ్చటకు యేతెంచ
అనియిట్లుపలుకగా ఆబ్రహ్మతా బలికె - దక్షపట్ణపుకథలు తార్కాణముగజెప్పి
వీరన్నచెయ్యిలూ వింతలుగా జెప్పి - దక్షప్రజాపతిని బ్రతికించుమని వేడి
యజ్ఞమ్ము సాంగముగ గావించమనిజెప్పి - పాదాలకే మ్రొక్కిరీ. ౫౪

అప్పుడు యీశ్వరుడు ఆమునులతో ననియె - వినుడు జెప్పెదమీకు వివరాముగా నేనూ
దుష్టులనుశిక్షించ సుజనులనురక్షించ - అవతారమెత్తితిమి అవనిలోపల మేము
ఇంచుకక్రోధమూ మనసునాలేదనీ - పదమని యీశ్వరుడు దక్షపురముకు వచ్చి
శిరసువెతకించియో గొఱ్ఱెశిరసూ దెచ్చి - దక్షునీకినిలిపియో యజ్ఞమ్ముజేయించి
భాగములు బుచ్చుకొని త్రిమూర్తులందరూ - ఆమునులతో గలసి సంతోషించుచూ
తమపురములకే వెళ్ళిరీ. ౫౫

ఏలరవీరన్న యేటికివేళ్ళేవు - యిచ్చోట మాయత్త మామ బంధువులయిన
యిచ్చటి యుద్ధానికి లేదనిమదిదలస్తివ - విసరగ విసరగా వీరబాణములాయె
ఆకాశవీధులూ అంతవృక్షమ్ములూ - మేడలుమిద్దెలు గోపురంబులుగదిలె
కదలెను స్తంభములు వీరన్నకడకొచ్చి - వొకరెక్క బట్టుకొని వకరెక్క ఖండించీ
బ్రతుకు మని సెలవిచ్చెనూ. ౫౬

అంతట యావర్ష దేవుడే చనుదెంచీ - ఉరుములు వురిమేనూ మెరుపులు మెరిసెనూ
పెద్ద పిడుగులుపడెను పెనుగొండలా పొడవు - యేనుగు తొండమూ యెంతపలమోగాని
అంతపలమూ వాన భూమిమీద గురియగా - అక్కడయాగంగ పట్టజాలకపోయె
సముద్రములన్నియును కల్లోలమగుచుండ - బ్రహ్మాండములుగదిలె బ్రహ్మతానూగదిలె
బ్రహ్మగూర్చున్నట్టి వాహనమ్ములు గదిలె - ఇల్లిచర్మముకదిలె ఈశ్వరుండూగదిలె
అటుగాక కైలాస గిరియును మరికదిలె - సూదిబెజ్జమ్మూను యెంతవలమోగాని
అంతవలమూ వాన భూమిమీద కురియవలె - నెలమూడు వర్షాలు మెప్పుతోకురియుమని
బ్రతుకుమని సెలవిచ్చెనూ. ౫౭

ఈరీతియజ్ఞంబు యింతిరో కడముట్టే - దక్షపుత్రిక తాను దగ్ధమైయటుబోయి
చలికొండ దొరసాని చెలియ యచ్చరకాంత - మేనకయను పేర మేటియౌసుగుణాఢ్య
పతిగూడియిష్టముగ భాగ్యములనొందియును - సంతతిలేనట్టి చింతచేబొగలంగ
వరపుత్రినై పురవైరిసతినగుదు - మగువమనసున నెంచి మోదమలరగవేగ
హిమవంతునగరికి వనితానూపోయెనూ. ౫౮

నాతికిచూలాయె నవమాసములునిండె - పుట్టె హిమవంతుని యింట ఆదిపార్వతిదేవి
శివశివయనకనూ పాలైన త్రాగదూ - హరహరయనకనూ వుగ్గయిన త్రాగదూ
ఘణఘణమనుచునూ ఘంటలే మ్రోయకా - కన్నులానే జూడదూ. ౫౯

ఈరీతిపార్వతీ గారవమ్మున పెరిగె - కన్యకు యౌవనాకార మప్పుడురాగా
చంద్రబింబముబోలు చెలియ ముఖమూకాంతి - యింతికి కుచములూ యీడుగాకనిపించె
శివునిపై శీఘ్రముగ మోహమగ్గలమాయె - తల్లిదండ్రిని జూచితరుణి చేతులుమొగిచి
సాష్టాంగదండములు తరుణితానూజేసి - ఈశ్వరుని జూడకా యిక నిలువజాలనూ
వనములకునేబోయి తపసు నొనరించుకొని - ఈశ్వరుని పెండ్లాడి యింటికివచ్చెదను
అడ్డుచెప్పక మీరు అజ్ఞయివ్వక గాని - హరమ్మువల్ల నని అతివతానూబలికి
అక్కడే నిలచుండెనూ. ౬౦

ఆమాట వినివారు అతి దుఃఖముతోనూ - కూతుర్నిజూచియో కంటజలములు దెచ్చి
గౌగిటను జేర్చుకుని కన్నతండ్రియు బలికె - నీవుకోరినయట్టి వరునినే వెతకించి
పెండ్లిజేసెదనమ్మ చేడెరోనేనీకు - తపసుకుబోవద్దు తరుణి నీవెక్కడికి
నినుబాసియు మేము నిమిషమోర్వాలేము - కన్నతల్లినిబాసి కానలకుబోవూటా
కాంతనీకూ న్యాయమా. ౬౧

వారిమాటలువిని వనితతాకోపించి - ఆగ్రహంబునలేచి అతివతావెళ్ళగా
ఒంటినరుగుట జూచి ఒకసేననూయిచ్చి - తప్పక తమ మనసు తల్లడింపుచునుండ్రి
వనములకూ యేగి వనజాక్షి యప్పుడూ - ఆకుమీదాకుంచి పోకమీద పోకుంచి
నంటిసూదిమీద వనితకాలూయుంచి - వరుసగా నీశ్వరుని వనిత తపసూసేయ
తపసుకు మెచ్చియో ధవళసంఘుము బట్టి - జంగమావేషమున తపసి ప్రత్యక్షమై
యేమీగోరెదవూ యింతినీవని యడుగ - హరునికి భార్యగా వగ గోరితేను
అది నాకు దయిసేయుమని హస్తములుమోడ్చి - సాష్టాంగ దండ నమస్కారములుతాజేసి
వనితా నిలుచుండెనూ. ౬౨

వనితముఖమూజూచి చిరునవ్వుతోబలికే - శివునిగోరెదవేమె జంగాలవారిని
కొండంతతపసిని నీవు గోరుటన్యాయమా - అని ఈశ్వరుడు బలుక అతివతా భీతిల్లి
గడ గడ వణకుచూ కాంతతా బలికెనూ - ఈశ్వరుని పెండ్లాడ కి జగమునందునా
నిలచియుండుట నాకు నీతిగాదని బలుక - కలకలనవ్వుతూ కాంతమూజూచి
నీవుగోరిన వరుడు నినుగోరి తావచ్చు - హిమవంతునీ పురికి యేగుమని యీశ్వరూడూ
కైలాసమున కొచ్చెనూ. ౬౩

ఈశ్వరుండూ తాను భృంగితోనూబలికే - హిమవంతునింటికి శీఘ్రముగ నీవేగి
పార్వతిని తనకిచ్చి కళ్యాణము సేయుమని - వారినియడిగి కడువేగమునరమ్మని
చెప్పిపంపాగానె భృంగీశ్వరుండొచ్చి - హిమాచలంబున హిమవంతునీ జూచి
హరునికీ యతివనూయిమ్మనియడుగగా - జంగాలకూ మేము యివ్వలేమని బలుక
కాంతముఖమూజూచి గడగడా వణకుచూ - కన్యనూ యిత్తునని ఘనుడట్లుజెప్ప
భృంగీశ్వరుడు తాను సంతోషమున వెళ్ళి - రుద్రునితో జెప్ప సంతోషముననను
దేవేంద్ర దేవతల బ్రహ్మ విష్ణునితోను - శంఖులు యూదగా సకల సంభ్రమముతోనూ
ఈశ్వర్లుదా మెచ్చిరీ. ౬౪

హిమవంతు నెదుర్కొని విడిదిళ్ళ నిల్పియో - కడుసంభ్రమూతోనూ కాంతనూ దెప్పించీ
కాళ్ళుగడగి తాను కన్యధారబోసె - ఘనుడు యీశ్వర్లకూ కడుసంతసమునా
పార్వతిని యిచ్చియో వరరాజులా జూచి - హరుడు నేడూ తనకు నల్లుడగుటచాల
తనజన్మ పావనము సభవారితో చెప్పి - ఐదురోజులు పెండ్లి అతిశోభగా జేసి
నాగవల్లి జేసి కట్నంబులిప్పించి - నాతికిశోభనము నయముతోడుత జేసి
సంతోషముననుండిరీ. ౬౫

పంచభక్ష్యమ్ములూ పాలుపెరుగుతోను - బంధువులతోడనూ బంతి యారాగించి
వీడెములు జేసియో అతివతోనూగూడి అత్తమామల సెలవు అతివేగ బుచ్చుకొని
కాంతతల్లీవచ్చి కౌగిటను జేర్చుకొని - ఈశ్వర్లనూ గూడి యీజగామంతయూ
యేలుమని దీవించి వడిబియ్యమూ బెట్టి - నాతినీ దీసుకొని నందిపై తానెక్కి
కైలాసమూ వచ్చెనూ. ౬౬

ఈపాట యెవరైన పాడిన విన్నానూ - యిష్ట సంపదలిచ్చు యీశ్వరులాదేవి
కైలాసంబిచ్చునూ. ౬౭



# మేనకాదేవి నొప్పులు

లాలి శ్రీ నవతనూజా - లాలి సురకల్ప భోజా
లాలి కరతల పుణ్యసరోజా - ఆలించు లాలినుత కల్పభోజా
నెలదప్పె మేనకాదేవికనుచూ - మేలిమితో చెలులెల్ల చెప్పుకొనుచూ
నెలత నీభాగ్య మనుచూ - మెల్లిమెల్లె పలికిరిట్లని నవ్వుకొనుచు
రుచులపై వేడ్కలేదూ - శిగ్గుచే వసియింప నలవిగాదు
ప్రకటముగ దెలియనియకా రెండోనెల ప్రచురమాయెను మేనకా
భావమెంతయున లేదూ భుజియించ కేవలం బుద్ధిలేదు
జిగిబిగీ బట్టలేదు బలువైన వేవిళ్ళ కోపలేదు
వనజాక్షి వునికిజూచి - చూలాలవని పలికి మదినిగాంచి
శిగ్గుపడి ముఖము వంచా - దిన శుద్ధిజేసిరా స్త్రీలుగలసి
మూడో మాసమున బాలాకుచములను నీలిమావి స్తరించెనూ
మేలయిన వదనముననూ ధవళమా లీలగా గనుపించెనూ
నాలుగవ మాసముననూ పాలుబడెనని కొందరూ
మేలిమితో బాలికామణికందురూ - అందరు దినదినము స్త్రీలచేత సేవిందురు
అయిదవ మాసమునను మంచి దినమందు అయిదువుల బిలువనంపి
మోదముతో ధనముబంచీ శీమంతమాది శుభమందునుంచి
కలికి చేతుల గాజులూ తొడిగించి రెలమితోడుత కాంతలూ
ఫలములను పచ్చి పెసలు పంచిరాచెలులకునూ చంద్రముఖునూ
ఆరోనెల బాలకనుచు చనెను తన జననిగర్భమ్ములోనూ
సనకాదులెన్నగాను మేలిమితో బాలికామణి కందురూ
యేడోనెల బాలకనుచూ కదులాడ యెడమభాగమున బాలా
ఆడ శిశువనుచు అబలా - అని జనులుకోరి యందురుగ్రక్కునా
యెనిమిదో మాసమున నూతన పతినిసతి కూడికూడలేకా
మోదముతో వీడలేకా పవళించి మారుమాటాడలేకా

తొమ్మిదవ మాసముననూ మాట్లాడి సొమ్మసిల మొగమువాడ
సమ్మతిగ చెలులువేడా - మోదముతో కొంగుదిగ వీడవీడా
వనజాతీవునికి జూచి అలసట సొలసెనని మదినిగాంచి
తలఅంటి పోసి తుడచీ జల శుద్ధిజేసిరా స్త్రీలుగలసీ
అమ్మరో రాగదమ్మా భుజియించవమ్మ యేదిష్టమమ్మా
సమ్మతిగ దెల్పవమ్మా మాయమ్మ కొమ్మరో వేగరమ్మా
వద్దన గూడదమ్మా వినవమ్మయర్రావు పాలుసుమ్మా
యర్రగాగాచిరమ్మా వేవేగజుర్రవే ముద్దుగుమ్మా
సుదతిభుజియించలేకా నిజప్రసవ వేదనకు నిలువలేకా
నొప్పులని జెప్పలేకా - చెప్పకనుచెలుల కనుగప్పలేకా
నగపతికి జెప్పరమ్మా - వేల్పులకు నగమీదుగట్టరమ్మా
మగువలకు గండమమ్మా వీలయిన తగువారి నడుగరమ్మా
అనుచు చెలులూబల్కగా అరుణాలు ఘనపాటకులు చదువగా
ఘనమంత్రతీర్ధజామియగా సన్నుతించెను నిజ ప్రసన్నములు
కరములతో మంత్రసానీపట్టి తనపురవుసతి వీపునాని
గట్టిగా వుండుమాని కూర్చుండి కరుణించుదైవమాని
తరుచుగా మేనలసెను, యుస్సుమని తరుణిపై చేయివేసెనూ
వెరచి యిటుఅటు జూచెనూ - తాళదని తరుణి కనులటుమూసెనూ
తరుణి పరవశముజెందె నగరాజు మోదమందె
దివినుండి దిశలెల్ల తెలివినొందె వనజాతీవునికి జూచి మ్రొక్కి-
దైవాల వేడుకొమ్మా - అయిన ప్రొద్దుగరమ్మా
శిరస్సు వుదయంబాయెనో చూడరమ్మా మృగశిరా వృషభముననూ
భీకరమ్మున ప్రథమ చరణమందునా - తగుసింహా లగ్నమందూ
సప్తమీ బుధవాసరమ్మునందూ
నగరాజు పట్టణమునా దివినుండివిరుల వానలుగురిసెనూ
తరులు చిగిరించె పూచె - బాలికా మెగురుతీగెలు మెరసెనూ
కలవాణు లేతెంచిరీ బాలకూ జలకంబు లాడించిరీ
సొలసిపాన్పున నుంచిరీ - వేడ్కతో బాలరూపముగాంచిరీ
తమ్ములను బోలుకనులూ - ముంగురులు తుమ్మెదల బారుమిగులూ
అమ్మ యీ బాల వయోయలూ జగమెల్ల నెమ్మదిని బ్రోవజాలూ

ముఖము వీక్షింపరమ్మా యీ బాలకా మారిసౌమ్ముసుమ్మ
అమ్మరో వినగదమ్మా శివునికి పట్నంపు రాణిసుమ్మా
యిరువయి వొకదినమునా - యేతెంచి వరవధూమణుల మేనా
శ్రీసర్వ కామదాంబని వ్రాసిరి - బాలికా రత్నములును
వరహంస తూలికాతల్పముననూ శృంగార మేడలోనూ
బంగారు తొట్టొకటి కావించియూ - మేనకా రత్నముననూ
వూచిరా బాలికను మణులందరూ - యీ పాటపాడినా విన్నగాని
సకల సంపదలిచ్చి రక్షించు శంకరుండెల్లప్పుడూ.

# శ్రీ పారిజాత పల్లవి

శ్రీకృష్ణుండొకనాడూ శృంగారాహారుండై
శ్రీకాంతామణి నగరుకువచ్చెను చెలువముతోడుతనూ
ఏకాంతమ్మననుండీ యింతులు తా నాడగనూ
ఆకస్మికముగ నారదుడను వక కుచ్చిత ఋషియు నేతెంచే
వచ్చిన నారదుజూచీ వనితలు తానూ మ్రొక్కి
అచ్యుతుడూ నారదుడూ ఉండిరి ఆసీనంబులనూ
కుచ్చితుడై నారదుడూ కృష్ణుడికొక కానుకగా
కుసుమపువు చిగురాకున పొదిగియిచ్చెను వేడుకను
అది స్వామీ అందుకు కన్నులనద్దుకు మ్రొక్కి
కలహాంబుని మదిదలచి - వెన్నుడు రుక్మిణికిచ్చెను వేడుకతో
అమగువా వేగముగా అందుకుని నవ్వుచు
వినయముతోడుత తనపతి కంత వినుతులుచేసెను
శరణు శరణు కృష్ణా శరణు శ్రీగోపాల హరి
శరణు కనకాంబర గిరిధర శరణు శరణుదేవా
మిన్నందిన వేగమునా మేలుకై వొప్పెను
అమగువంతట కొప్పునముడుచుక అత్యాశ్చర్యముతోను
తనదేహం వక వింత ఛాయలు మెరయగను
చెల్వారు మెల్వారు యెంతచల్వమో కాంతా లోచనకూ
తలకురులూ వకవింతా మేలుగ నలుపులుయెక్కె
అరుదుగ కోమలి వడలికి వక వన్నధికమయ్యితోచె
శుకవాణీ యీపువ్వుచోద్యం అకలంకముగా వినుమీ
వికశించుండును వాడదు యెన్నడు విడి వాసనచెడదూ
వకయేడూ యీపూవు వనరుగ నీవద్దవుంటే
సకలమైన వస్తువులనూ సమకూర్చుకు వుండూ
అని నారదముని ఆడినవాక్యములన్ని
వినయముతోడుత సత్యభామకు వినిపించిరి చెలులూ
యేమని చెప్పుదుమమ్మా యింతిరో నీ మగనికి

నారదుడొచ్చి పారుజాతమ్ము నొసరుగయిచ్చెగదే
సామజవరదుడు రుక్మిణికాపువు సరగునయిచ్చెగదే
అమగువా ఆపువ్వందుకు వేగమునా
నవ్వుచు తన కొప్పున ముడుచుకు సొంపుననుండెగదే
తరుణులుజెప్పినమాట నెలత సుగంధి విని
సరగున అపుడు కోపముతోటి తరుణుల కిట్లనెనూ
సరసిజాతులారా సర్వజ్ఞుండని యెరిగి
యెలమీ నడుపుకు వస్తీ యిందరి సవతులలోపలనూ
నాకంటెక్కువ అనితలచెన రుక్మిణినిపుడు
అని తలకాయను విగియించి తరుణి మౌనముచేత
సొలయుచు నవరత్నమ్ములు కలసిన సొమ్ములు సళ్ళించె
చెదిరినకొప్పటువిడిచి - శిథిలముగా ముడుచుకొని
సొలయుచు నవరత్నమ్ములు కలసిన మందిరములు దాటి
పూరింటిలో నొక్కా- కీలడుగు మంచముపయి
చీరొక్కటి పరుచుకు పవళించెను శ్రీహరులనుదలచి
వారిజలోచనుడంతా కోపందీర్పా భావను
డయి చనుదెంచెను తనభామా గృహామునకూ
భక్తుల వాకిట నుంచీ సరగున లోపలి కేగి
కనకపుమేడలు రంగస్తలములు కలసివెతుక దొడగే
మెత్తనిపానుపు వెదకే - మేడామడుగులు వెదకే
చిత్తరుచవుకెలు వీక్షింపుచు తనచిత్తము కిట్లనెనూ
కలహంసలు నడువవుగా కలియరు యింతులురారూ
అమర మృదంగము తంతులుబట్టరు హారుజాడగరారూ
యిన్నాళ్ళావలెలేదు సుదతీ మందిరమేమొ
చిలుకకు పద్యంజెప్పదు కోవెల కెలమియ్యదు ఫలమూ
యెలమీవేళలా పనులూ శాయదు పంకజముఖి కేమీ
సిరిముఖమేమో చిన్నబోయున్నది చెలియతో యెవరయినా
పన్నుగముని దెచ్చినయా పారుజాతపూ మాట
విన్నపములుజేసిరి కాబోలు మా వెన్నెల మొలకకునూ
అనుచూ మందరధరుడు అలసీవెతుకగ



కనకపుమేడలు రంగస్థలములు కలసివెతకిఅలసె
వనితలమాటలు చెవులావిని వ్యాగ్రుండయిపోయీ
వనజనాభుడు కూర్మితో సత్యయ వెనుకతాను నిలచె
మాళవిదేవి విసరేటి మగువచేత సురటి
మౌనముతోడుత మురవైరందుకు మత్స్యాక్షికి విసరే
అనళినాతుండపుడూ ఆత్మలో నగుచునూ
పూబోణిమీదను పన్నీరప్పుడు చల్లంగాదొడగే
ఇందాకా లేనింట్లో యీ వింతా వాసనలూ
యెందుండేతెంచెను లేకనుచును యింతితా మేల్కొనెనూ
పల్లవాధరులంత సయ్యెదలార్చుకొనుచూ
ఉల్లముబోవుట నయనము బల్కుట బుద్ధిగాదె చెలియా
పున్నమచంద్రునిబోలు మురిపెంపు నీమోము
చిన్నబోయున్నా కారణమేమె చిగురుబోడి చెపుమా
బంగారు తీగెకంటె బాగయిన నీమేను
కలికందులు కందిన కారణమేమే కాంతారో చెపుమా
తమలాపాకులువంటి తరుణి నీహాస్తములూ
చిరిచెమటలు బట్టిన విధమేమే చిగురుబోణీనీకూ
చిగురుటాకుల వంటి చెలువంపూ పాదములూ
వస్త్రిళ్ళాడేటి కారణమేమే వనితరో నీకనెనూ
శింగిణి విల్లులబోలూ మురిపెంపు నీకనుబొమలూ
పొంగున్నవి తల నొప్పింతువుగదవే
లలితాంగి అప్పటివేళా బట్టి గొప్పా కన్నులనీరూ
కుప్పలుగా పూరించెను రెప్పలనద్దుకోవె
ఇంతాచేసీ విభునీ యేమిశాయగా గలవే
ఇంతులకింతేసి పంతములేటికె - ఇందువదన చెప్పవే
కాంతరో పతితో కలహంబేటికి కంబుకంటి లేవే
వనితా లేలెమ్మనుచూ పూరడించి వక వనజగంధి లేపె
జ్ఞాతులారామీరు నగధరునివారు గాదా
ఈవగలెక్కడ నేర్చిరనుచూ వనితలదిట్టుచునూ
అకలంకి నీదేహం అలయించుకునేవేమే

కమలాక్షుల మాటలువిని నాపయికరుణ దప్పనేలే
మదిరాక్షీ జనులాడే మాటలతూ వెరచీ యీపువ్వూ
మొఖమాటమ్మున ఇచ్చితిగానీ మోహమ్మునగాదే
నీవాణ్ణిగానటవే నీకూ తప్పితినయినా
నీపంపే వచ్చితినిపుడూ నీబంటను గానా
పద్మానాభుండపుడూ సత్యాభామ పాదముపై
వరిగెను భామలు అప్పుడు సిగ్గులతోడుతనూ
ముఖచంద్రుడులేవురునూ మైదూలోపలదాగి
అతివలుజూడగ అప్పటివేళల అతిసంతోషముతోనూ
చిగురుటాకులవంటి చెలువగు పాదములా
నగమెట్లు దన్నితిరి మీరూ మందరగిరిధరా
నెట్టన మందరగిరి మోశినట్టి గట్టితలలూ
ఇంత మృదువగుటకు కారణమేమో మారజనక చెపుమా
అనుచూ పాదములొత్తి అతివలు సేవలుశాయా
మనసిజ గురుడూ సంతోషమ్మున కలియ నవ్వుచూనూ
వక్కాపువ్వూ యింతికి నీ వొసగితి గాకా యికనూ
చక్కని పారిజాతం కొనితెస్తును సరసవనములోదీ
యెక్కువతో నాటింతూ నీపూల వనములోనూ
అని హరిబల్కగ యింతీ గ్రక్కునా లేచీ
మక్కువతోడుత శాక పాకమ్ములు మరిసేయూమనెనూ
జలకమాడి వక్కా సన్నావలిపెంగట్టి
అలికులవేణి రత్నాభరణములన్నీ ధరియించె
చెదిరిన కొప్పును ముడిచీ సందిటి దండలు భుజముల
మెరయగ సందడి సేయుచు పంపులు పెట్టుకు జనులూ
పాకయత్నములు శాయా సంపెగ తైలము కృష్ణునికంటెను సత్య
భామ దేవీ అలరుచు గంధము అలదీ మలయుచు మేనునూలచే
జలకములార్చి వలిపెములిచ్చెను తన పతికంతటనూ
తెల్లని వస్త్రముచే తళ్ళువత్తుకొనుచూ
పీతాంబ్రమ్ములు ధరియించెను ఆ శ్రీకృష్ణుండపుడూ
వల్లెవాటుచెంగూ భామపయి వొప్పుగాను వేసి

బంగరు కుర్చీలమీద బాగుగ గూర్చుండిరి
సంధ్యావందనము వేళ లాయెనని సఖియలతో బలుకా
బంగారు కలశలతో బాగైన వుదకములు దెచ్చిచ్చిరి
తిరుమణి శ్రీచూర్ణమ్ముల బాగాతీర్చి దిద్దుకొనిరి
పరిమెళములు స్వామి బాగా నలదుకొని
బంగారు పళ్ళేరములో పంచా బక్షాన్నములూ
పూర్ణముల మరగ వేడుకతో పరమాన్నము వడ్డించిరి
పూర్ణేందులంతటనూ సంపూర్ణముగ వడ్డించిరి
పరిపూర్ణముగా భుజియించి లేచిరి పురుషోత్తములపుడూ
అకుమడుపులిచ్చె మంచీ అత్తరు జవ్వాదిచ్చె
మల్లెలు మొల్లలు విరజాజులు తానిచ్చె సత్యభామా
తన వాహనమయినా గరుడిని ముదముతో విలువగనూ
కనకపు రెక్కలు విసరుచు చక్కని గరుడుడు వచ్చెనయా
గోవిందాకృష్ణ హరి గోపాలా గోవర్ధన
గిరిధర వామన కేశవ శ్రీధర శ్రీహరియనుమానూ
తనవాహనంబయినా గరుడునిపై యెక్కి అమరులు
తమరూ అతివేడుకతో అమరావతికేగిరి
పలుకులు కర్పూరమును పాదొకటిగావించీ
పారుజాతం పెల్లగించుకు వచ్చెను పక్షీంద్రుని మీదా
పట్టుకురాగాను గట్టిగ యింద్రుడు సేనలతోనూ
కృష్ణుని మీదికి కయ్యానకువచ్చె
మతిదప్పి వచ్చితివా మహిమీదను యీ చెట్టు గయి
కొని మరల నీ పురికేగగలవా - చెడుగు మనుజులెల్లా
గర్వముతోనూ చెట్టుదెమ్మనంటే
మర్మముతోనూ మటు మాయముగా పారుజాతం పెల్లగించి తివా
అంతట యింద్రుడు మహానుభావుడు వరదుడు అని తెలిసి
అడిగిననేనూ యిత్తుననుచునూ పాదములబడెనూ
అంతట అమరులు తమరూ అతి వేడుకతో అమరావతి కరిగిరీ
ఆ వేళను అట్టైవుండి మరునాడు ప్రొద్దున్న
అంతఃపురముల లోపలకొచ్చెనూ ఆనందముతోనూ
కర్పూరపు పలుకులతో పాదొకటి గావించీ

నెలతలు వేడుకతో పన్నీరు గోసిరపుడూ
చిగుళ్ళు ఆకులతోనూ మొగ్గలు పువ్వులుతోనూ
కాయలు పండ్లూ తోటిచెట్టూ వికశించీ యుండే
వట్టి ౖమానుౖకిందా పట్టె మంచంవేసి చెలికత్తెలతో
సత్యభామతాపవ్వళించి యుండే
అంతట కృష్ణుండపుడూ ఆనందమ్ములతోనూ
పట్టెమంచము పయి కూర్చుండెను సత్యభామతోటి
పూచిన పువులన్నీ రుక్మిణికడ కపుడూవెళ్ళ
తుమ్మెదలయి పువులు అన్నీ రుక్మిణిపయి ౖవాలే
వేశ్యకాంతవు గనుక నీవు పువులన్ని ముట్టరాదు
అంటరాదు అని కృష్ణుడు తాబలికే
అంతలోనె నారదుడు ఆనందముతో పాటపాడుచూ
సత్యభామతో దా నవ్వుచు బలికే
పూచిన పువులన్నీ రుక్మిణి కడకువెళ్ళే
తుమ్మెదలయి పువులు అన్నీ రుక్మిణిపై ౖవాలే
వట్టిమాను యీ రవ్వాయేలనీ నారదుడూ బలికే
అంతట కృష్ణుడపుడూ నారదు చెయ్యి బట్టుకొని
నారదుతోటి కృష్ణుడు అప్పుడు నవ్వుచు తా బలికే
వక్క పువ్వూ దెచ్చి వనితలకు నారదనూ
జగడంబెడితివి అనుచూ కృష్ణుడు నారదుతో బలికే
నారదుడు కృష్ణుడుగలసి రుక్మిణిమేడలకేగె
నారదుడప్పుడు రుక్మిణితోనూ నవ్వుచు తా బలికే
పారుజాతపు చెట్టు సత్యభామ పెరటా వేయుటగాని
పూచిన పూవులు అన్నీ నీ పైసేౖవాలెగదే
అనుచూ నారదుడూ బలుకా - హస్తములు ముకుళించీ
నారదునికి కృష్ణునికీ ౖమొక్కెను రుక్మిణి తా నపుడూ
గోవిందా కృష్ణహరీ గోపాలా శ్రీధర
గోవర్ధన గిరిధర వామన కేశవ శ్రీధర హరియనుచూ
పారుజాతపూ పువ్వూ యెవరూపాడిన విన్నాను
సతులకు సౌభాగ్యం గల్గును సంతోషమ్మున పుంౖడూ.

# ధృవ చరిత్ర

శ్రీకాంతవల్లభుని శ్రితరక్షకునీ - మాకులస్వామయిన శ్రీకృష్ణుదలతూ
కొమరొప్ప గురునకు వందనంజేసి - అమరవందితుడయిన హరునిచింతింతూ
విదురుని ప్రశ్నజేసిన మహేశ్వరుండూ - వినిపించెనాపరమ భాగవతుచరిత
బ్రహ్మపుత్రుడు స్వాయంభువుమనువు - అతనికి ఉత్తాన పాదుడనుసుతుడు
ఉత్తానపాదునికి యువిదలిరువురును - సుమతి సురచియను కులభామినూలు
జ్యేష్ఠభార్య సుమతి తర్వాత సురుచి - సురుచిపై ప్రేమతో నిర్మలరాయుడుండె
సురుచిభయమున సతిని చూడకా వెరచి - పెద్దభార్యను వూరిబైటతావుంచె
తనదిగాదన్నట్లు యూతరుణిమందిరము - దాసిగతి నిత్యపడి నడుపుచునుండే
సుతులులేకను రాజు తపస్సుకుపోవ - తపస్సులో బ్రహ్మ చూతఫలమిచ్చె
ఆ ఫలము తానిచ్చె చిన్నభార్యకునూ - ఆ ఫలము తాదినీ ఆ చిన్నభార్య
టెంకపారాబైచె ముంగిటలోనా - ధాన్యానికొచ్చి నాదాశితాజూచి
ఫలము వివరంబెల్ల ఆ వణితినడిగి - టెంకయు గొంపోయి సుమతికినివ్వ
అదినూరి త్రాగినే పద్మాయతాక్షి - పట్నంబు జూచుటకు ప్రభువుయేతెంచీ
పట్నపుసతి మందిరముగనెనూ - ఆరాత్రి సతియింట నిలచెనారాజు
పరమపతివ్రతతో కలకుండిరాజు - అవనిపతిచనియె తన అంతఃపురమునకూ
సురుచికేళితోవున్న సర్వతేజుణ్ని - హర్షముతో గర్భములు వారు ధరియించ్రి
పాలిక్కునలుపాయె వణతులకుఅంతా - ఒకిలింతలుపుట్టె పుబ్బెకుచములునూ
కమలాక్షులకు గర్భచిహ్నలేతోచె - మనస్సులు వేడుకలు మరిచిరికిండ్లు
బొలుపొందజెట్టిరా పూబోణులకును - నవమాసములునిండె నాతులకుఅంత
సురుచిపుత్రముగనే శుభముహూర్తమునా - హర్షముతో రాజు విప్రులాబిలచీ
గోదానభూదాన సువర్ణదాన - అశ్వ గజమాదిగా అఖలదానములు
సొంపుగా జేసెను విప్రోత్తములకూ - జేష్టపత్ని అగు సుమతికినపుడూ
సుతుడుకలిగేనని రాజుకెరిగించే - సుమతి సుతునకు ధృవుడని నామమిడిరీ
సుతుడు పెరుగుచునుండె శుభకోర్కెలలర
అంత అమరావతి పట్నమ్మునాను - అయిదేళ్లు ధృవుడుండె హర్షమ్ముతోనూ
బాలుడంతట తన బాలలీలలనూ - పరమాత్మ తలచుతూ కాలంబుగడపి
ఒకనాడు ధృవుడు తన తండ్రినగరికినీ - అరుదెంచె అష్టాది సభకొల్పుచుండా

పుత్తముడు తండ్రెడమ తొడనుగూర్చున్నా - తానెక్కి కుడితొడను కూర్మిగూర్చుండె
అదిచూచి వోర్వలే కందున్నజనులూ - కొండెమ్ము జెప్పిరి సురచితోనపుడు
కోపించి సురుచి భూపాలుసభకొచ్చీ - ధృవునికని సకల దుర్వార్తలేపలికీ
సుతునిసరసను నీవు యుర్వీశుతొడనూ - వుండచెల్లునె ధృవుడ దుండగమ్మునను
హెచ్చుగా కూర్చుండ నాబిడ్డతోసాటా - అధము రాలికిపుట్టి అధికమయినట్టి
అవనీశుతొడ యెక్క అర్హామచెపుమా - కడవరనుంచి నా కాంతకూపుట్టి
ఘనమయిన పూజలునూ పొందగలవా - యెవ్వరునిను రమ్మనిరి యిచ్చోటికనినా
యెవరునిను పిలువగవస్తి వేరుపడచెపుమా - లెమ్ము లెమ్మని పలుక లేవకుండినను
పొమ్ము పొమ్మనిపలుక జంకకుండిననూ - పృధ్వీశుకడనిలచి పెక్కుదూషించి
దిక్కులుకంపింప ధిక్కరింపుచునూ - రక్కసివలెవచ్చి రచ్చమధ్యమునా
సురుచి కరమున ధృవునిపట్టియీడ్చె - ఆ సభాలోనపుడు నిండియున్నట్టి
మంత్రిప్రధానులు ఆప్తులు బుధులూ - హడలగదొడగిరీ క్రూరకృత్యముకూ
సుతునితో సమముగా సుమతితనయూని - హరిభక్తునీ ధృవుని చక్కనీతనయూ
స్త్రీకాంతుచే రాజు కఠినంబుదలచీ - సురుచిచే బాలుణ్ణి అవమానపరచె
నిరపరాధిని సురుచి నిందతాజేసే - పడద్రోయుట భావ్యమా పణతికాసభలో
పలచదనముజేసి జాలింతలేకా - వల్లభునితొడమీది శిశువునేత్రోసే
సతిత్రోయగా తన శిశువునూజూచి - ముద్దాడి లాలించి యెత్తుకొనడాయె
అతివయిట్లూజేసి అంతఃపురమునకూ - పరుగునతాబోయె పద్మాయతాక్షి
పడిలేచి ధృవుడు కనుబొమలు నలుపుచునూ - బహు దుఃఖమునుపొంది ఖిన్నుడగుచూనూ
తల్లినగరికివచ్చు సుతుజాడజూచి - తనయునిగని గుండె ఝల్లుమనగాను
యింతికౌగలించి యలనాగసుతుని - చెక్కిలినొక్కి భుజమునజేర్చుకొని
అదిరేటి యుదరమ్ము హస్తానదిమి - చెదిరిన తలకురులు చేరగాదువ్వి
ముఖపద్మమందున్న ధూళిపోదుడిచీ - కనుగవ యుదకముల వస్త్రములనద్దీ
మా కుల దీపకా మన్మధాకారా - మా యయ్యా నీ కింత సంతాపమేలా
పురుష శిరోమణీ భూపాలతిలకా - హారములు వీడినా తెరగువినుపించూ
రాజశిరోమణీ రాజశేఖరుడా - తేజమ్ము గ్రుంగినా తెరగుపినుపించూ
పావకరత్నమా పూర్ణకళత్రా - మా యయ్యా నీ చొప్పు మాకెల్ల దెల్పు
వసుధీశవరపుత్ర వనజదళనేత్రా - శశిముఖ విస్తార చారుసూధార
ఆడబోయినచోట తోడిబాలకులు - అదిరించికొట్టిరో అయ్యానిన్నిపుడూ
అని తల్లి ప్రార్థించి అడుగగాసుతుడూ - వినుపించె మాతతో నిజోత్తరములూ

ఉత్తముడు తండ్రెడమ తొడను గూర్చున్నా - కూరిమితో కుడితొడను నేను గూర్చుంటి
అదిచూచి సురుచి తా నోర్వగాలేక - అవనిపై పడద్రోచి అదరించికొట్టె
ఆ సభనడుమనూ దుర్వార్తలాడే - ఆ వాక్యములు విని వనితతాపడలి
సురచి వాక్యములెల్ల మరిమరీదలచీ - వసుమతిపైబడి తాను మూర్ఛిల్లి
తెప్పిరిల్లీ తెలిసి ధైర్యంబుబొందీ - బాలుణ్ని తా బిలిచి భయమంతబాపి
నిర్భాగ్యురాలికి నీవు జన్మించీ - సౌభాగ్యమును పొంది తగుసుతుడవనుచూ
యిపుడు మనమున్నట్టి యిరువెరుగలేకా - అతని తొడపయినెక్క అర్హులమె చెపుమా
స్నేహమ్ముకలవారు మోహంపుసుతులూ - నీకురాయునిజేర నీతియే బాలా
తప్పుగాదీమాట ధరణిపత్ని బలుక - ముద్దుమాటలు చెప్పి యూరడింపుచునూ
తొల్లి మనవారెల్ల హరినిపూజించి - వరములు భోగభాగ్యములనుభవించీ
యిందుకు మనమింక వగువంగనేలా - యింద్రాధిపతిగొల్చి యికనయిన బ్రతుకూ
తపమున తండ్రి తొడలపయి నీవు యెక్కూ - ఉత్తమురాలయిన ఉత్తమూ తల్లీ
సత్యమేపలికింది సందేహమేలా - యీ పాపకర్మని యిడుమలాకన్నా
ఆ పుణ్యవనములకు అరుగుమీయయ్యా - వనములకరిగి ఆ వనజాతు పూజించుట
వచ్చి వైకుంఠపతి మెచ్చివరమిచ్చూ - భక్తివిడనాడకుమి బడలకుమి తండ్రీ
చిత్తమున హరిచరణ కమలమ్ము గొలువూ - బుద్ధి సుతునకుజెప్పె పూర్ణశశివదనా
ముద్దాడిశిరమును మూర్కొని బుజ్జగించె - సుతునికానల కంపి సుమతిశోకించె
దాసినై నేగంటి యీ సుతునిననెను - నాకు జన్మిస్తివని ఘనవిచారమునా
మును పెవరి ధర్మములు చెరిపితినిసను - సాధు సజ్జనులాను దూషించి పలుకా
సుతులు పతులూ కూడి సుఖమున్నవేళా - చూడజాలక యెవర్ని వీడదోలితినో
స్తన్యపానములేని బాలులకూ - వకనాడు యియ్యనీ పాపాత్మురాల్ని
కాబట్టి దాసినై పుడమి నేనుంటి - పెక్కుకాలమునకూ యీసుతుడు గల్గె
బాలునయిదేళ్ళకు కానలపాలుజేస్తి - అతివ శోకించి తలచూరకున్న
అవనిపతి వినియెనంత ధృవువార్తా
యీరీతి నిట్లుండ కానలకేగి ధృవుడు సంగీతశారదు నారదుజూచి
చేతులుచాచి సాష్టాంగ మొనరించి - వందనమురుషివర్య వోబ్రహ్మతేజా
నీరజాతునిజాడ నాకుయెరిగింపు - కమలభవాదులు కానంగలేని
పురుషోత్తములజాడ నాకుచూపించు - ఘనమగు తరుణోపాయమ్ము జెప్పు
అని ధృవుడు తపోధనునడుగగాను - యేమిరా బాలకుడ ముఖపద్మమేమి
అవమానము జెందినా రీతిగన్పట్టె - ఆ మాటలూవిని రుషితో బాలకుడూ

వుత్తానపాదుడీ తొడనుగూర్చున్నా - వుపమాతచూచి దుర్వార్తలే పలికే
అందుకు వోర్వలేకా పురీవెడలీ - అరుదెత్తివనములకు వినుము మునివర్యా
అనవిని రుషియు నాసుతునకిట్లనియె - బాల్యుడవు వో ధృవుడ బాలుడవు నీవూ
భావంబుగనలేవు బ్రహ్మపదమేలా - జ్ఞానంబురాలేదు యోగంబు నెట్లు
సాధింపగాలేవు చనుము నీ పురికి - కానరెంతటివారు కలలోనుహరిని
కమలభవాదులకు కడుదుర్ఘటంబు - వాయుభక్షణ రుషులు కనుగొనాలేరు
వైకుంఠపతిగనా కానలాకరుగా - తగదు తగదూ నీకు వోరాజ తనయా
దండిబలమూగలా పాండవూలెల్లా - మెండు తపములుచేసి సాధించినారా
మాతకు నీవుతప్ప మరిసుతులులేరు - ఖిల్లక నీవు పొమ్మి పురికి వేగమునా
సురుచివాక్యములనే క్రూరబాణములు - తరుచుగా నాటినవి నా హృదయమందు
భరియింపలేను ఆ బాణ జ్వాలలకు - అందులకు వుపశాంతి హరిపాదములూ
చెందకగాని వేరౌషధములేదు - కాకనేయిక పురికి కదల మునివర్యా
ఘనమయిన తరుణోపాయ మెరిగింపుమనెనూ - బాలుడి తపస్సుకు బ్రహ్మాశా మెచ్చి
ఉపనయనగాయత్రి యుపదేశమొసగె - మరియును దెల్పెదా బాలకావినుమీ
ముందర ప్రఖ్యాతమధువనం గలదు - అందలి ఋషియాశ్రమందునా నీవూ
వసియించి పారుతూ యుండేటినదిలో - స్నాన సంధ్యలుదీర్చి దేవతార్చనచేసి
ఫలపుష్ప తరువులా బడలికలుదీర్చి - తులశితో పూజించు త్రయిలోక్యపతిని
చిత్తాన చింతించు చక్రహస్తుని - వుగ్రమోహనశంఖు చక్రధారూని
మక్కువతొ ధ్యానించుమి యా ముకుందూని - మాధవుల పదపంకజములు ధ్యానించూ
మధుసూదనుడు మెచ్చియిచ్చు ఘనపదవీ - అనిచెప్పి నారదుడు అటుతోవగాను
వనములకు తానేగె బాలకుడు ధృవుడు - ఋషిచెప్పినా మధువనమ్ములకు
బోయి బాలుడు తపము తా చేయుచుండె - కొలువుచాలించి వుత్తానపాదుండు
అంతఃపురమునకేగి హంసతల్పమునా - శయనించి తనసుతూ చేష్టలూదలచి
యంతయున శోకవార్ధి యందుమునిగీ - బాలుడు యా ధృవుడు సభకేలవచ్చు
వచ్చిన సుతునేల తొడపై నుంచితీ - ఆ రాజ భటులేల పత్నికి తెల్పిరీ
పత్నేల పదత్రోచె పశిబాలకూని - యూరకుంటినిగాని ప్రేమించనైతి
స్త్రీల హృదయములోన నే చిక్కియుంటి - ఇహమందు పరమందు యీయపవాద
భరియించి నా పాపజన్మమికనేల - ధర్మపత్నిని దాసిగా నేలుచుంటి
భూమి పతిగాపుట్టి అధముడానయితీ - తరుణికి వెరచినే తనయునీ విడువా
నయుతిని సుతునెట్లు నేజూచువాడ - ఆలియాశాచేత సుతు జంపుకొంటి

అనుచును దుఃఖంచి కొలువుకూవచ్చి - అపుడు భటులను దిక్కుదిక్కులకు బంపా
చిక్కలేదొకచోట సాధుబాలకుడూ
పాములు మృగములు బాలుణ్ణిబట్టి - భక్షించితినియెనో ఆకానలందూ
పులులు యెలుగులుతోడు బోతులూబట్టి - భూతములు మింగెనో సాధుబాలకుని
నదులు వాగులు మడుగులుదాటలేకా - మడుగులలో మునిగి మడిసేనో శిశువు
దినమొక్కనాడునా కడకురాకున్నా - నేడు బాలునిబాసి బ్రతుకంగలేనూ
బాలుడులేని యీ బ్రతుకునా కేలా - యీ భాగ్యమిక నేల యీ రాజ్యమేలా
మేడలు నగరులూ రాజసౌధములు - హయగజ భటులునూ అరదంబులేల
యీరీతి వుత్తాన పాదుడూయుండ - ప్రభువు సంతాపంబు బ్రహ్మకుపి తెలిశి
వచ్చెను నారదుడు ద్వారమున కపుడు - నారదు రాకయూ రాజుతాజూచి
అర్ఘ్యపాద్యములిచ్చి వందనముచేసి - సింహాసనం బివ్వ రుషియుకూర్చుండె
క్షేమమారాజమీ రాజ్యమంతాను - సతిసుత బాంధవులు సుఖమున్న వారె
అని క్షేమమడిగినా నారదూతోను - గద్గదస్వరముతో ధృవుచర్య జెప్పె
వగవకుమి భూమీశ - వాంఛలీడేర్తు సుతుడుకానలకరిగె శ్రీవిష్ణుకొరకూ
క్షేమాన వున్నాడు పుత్రరత్నంబు - తపముచే వరమొంది కదలివచ్చూను
అనిచెప్పి నారదుడు వైకుంఠపురికేగె - చింతగాయుడుమాని కొంత హర్షమునా
వుత్తమసూను ద త్తరిదివ్యతపమూ - యత్నమ్ముతోనుండె నిశ్చలామతియై
కందమూలాదులు భక్షణలుచేసీ - వుండి బాలుడు వుగ్రతపమొనారించె
వకపదము భూమిపయినుంచి బాలకుడూ - అరునెలలు తపము అట్లు శాయగను
బాలుని తపముకూ భయమందిసురులూ - బ్రహ్మకడకూజనిరి విన్నపంజెయ్యా
వినవయ్యా సృష్టీశ - వోయివిధాత - చెప్పెద మా ధృవువృత్తాంతమెల్లా
వుత్తాన పాదుడీ పుత్రుడూ ధృవుడు - బాలుండు అయిదేండ్ల ప్రాయంపువాడు
యెండకాలములందు యెండలోనయినా - వానకాలామందు వుదకంబులోనూ
చలికాలమునదీక్ష తప్పకాజేయూ - యెప్పుడు వెరువడీ రుతుధర్మములకు
హరిభక్తివదలడు ఆ చిన్నివడుగు - అనిచెప్పి మరియునా అమరులెల్లాను
అరిగిరి వైకుంఠవాసి సన్నిధికి - ధృవుని తపోవేడిమికి తాళలేకా
మా లోకముననుండ వెరచి మీకడకు - వచ్చి మీ మరుగుజొచ్చితిమి దేవదేవా
మన్నింపు రక్షింపు మమ్ము బ్రతికింపు - అనవిని సురులతో హరియిట్టులనిరె
మీ లోక హానిలేదని సురులా - తమ తావులకుబంపి గజవరదుడంతా
వైనతేయుని దలువ వచ్చినిలచుండె - తన వాహనంబయిన గరుడుపై నెక్కి

యిరుగడ శంఖచక్రములు మెరయా - విభవముతో హరిమధువనముకే వచ్చీ
చూడుమి శంకరుడ మూడేండ్ల బాలకుడూ - అడవులతపసున్న అద్భుతం గలదా
మాతను విడిచి మధువనం ప్రవేశించి - మా ప్రీతి గయికొని వదలకున్నాడు
వాని తెమ్మని వచ్చి రఖలదేవతులు - కరము పట్టీడ్చినా కదలడే ధృవుడూ
శిరము పట్టీడ్చినా కనులు విప్పాడు - ధృవయని పిలచినా పలుకడెవ్వరితో
పరమాత్మ ధ్యాన పరవశుడై వుండె - మాయలు పన్నినా చిక్కడే ధృవుడూ
మంత్ర తంత్రములకు పలుకకున్నాడు - హరిపద ధ్యానంబు తప్పకాజేయూ
ధృవుని తపస్సునకు తను హర్షమొంది - అంకమున జేర్చుకొని అపుడు తనలోనా
పొంకమయినా ముఖకమలంబు దుడుచీ - చెక్కిళ్ళు పుణికి బాలుని ముద్దులాడి
తపము చాలించుమీ తనయ నీ వింక - కోరిన వరమిస్తు కొదువలేకుండ
అనవిని బాలకుడు కనులెత్తిచూచి - శంఖచక్రములతో ధగధగ మెరయచున్న
పక్షీంద్రుచేరున్న పరమాత్మజూచి - దేవాదిదేవుడాయో సార్వభౌమా
రావణాంతకులయిన యోరఘూరామా - ప్రహ్లాదవరదయో పాపసంహరణా
నాదుఃఖములు బాపి నన్నురక్షించు - బ్రహ్మరుద్రాదులా భక్తికీమెచ్చి
పాలించివారలకు పదవులొసగితివీ - వుత్తమపురుషుడవు పూజ్యుడవునీవూ
సత్యపాలకుడవు సర్వేశ్వరూడ - నిత్యుడా నిరమ్మడ నిర్మలాకార
నీకు సరిసమానులూ అధికుల్లులేరు
ధృవునిస్తోత్రమునకు నాహరియుమెచ్చీ - నవ్వుచుతొడనుంచి నారాయణూడూ
బాలనీవైదేండ్ల ప్రాయంబువచ్చీ - బహుతపముజేస్తివీ పరాక్రమముతోనూ
యేమివరమడిగినా యిచ్చెదనునీకు - అనవినిబాలుడు కడుసంతసిల్లి
భూములు రాజ్యములు మదపుటేనుగులు - దల్లిదండ్రులు సతులు దగుబాంధవూలు
కల్లలు మాయబొమ్మలాటలూనుమ్మి - నీపదకంజములు తప్ప యితరమేనొల్ల
అనియడుగగా హరి ధృవుకంతటను - అచ్చమయినా మోక్షపదవియూ నొసగె
నీతలితండ్రులకు నీవిద్యజూపి - కొంతకాలంబుండి నాదుసన్నిధికి
సరగున చనుదెమ్ము బాలుడానీవు - అనిచెప్పి హరియుతా స్వర్గమునకేగె
తపసులుచాలించి వడుగుతాలేచి - తండ్రికడకూరాగ ద్వారపాలకులూ
వుత్తానపాదుడికి సుతురాకదెల్ప - తాళమేళములతో సంగీతములతో
వీణగానములతో మద్దెళ్ళతోను - అంగనలు నాట్యంబు లాడుచుండగనూ
మంత్రిసామంత పరివారములతోనూ - యెదురుగావచ్చి రాజు సుతుగారవించె
తండ్రినిగనుగొని కరములుమోడ్చి - సాష్టాంగవందనం చాలదాజేసె

ప్రణమిల్లిమ్రొక్కి నా సుతుచేరదీసి - యెత్తికౌగిటచేర్చి ముద్దుపెట్టుకుని
కన్నుల నానందబాష్పములురాల - పెద్దలు సురులు భూసురులుగొల్వగనూ
అమరంగ ధృవుని కాశీర్వాదములు జేసిరి - మాతకు సురుచికి మరి ధృవుడు మ్రొక్కె
యెత్తికౌగిటజేర్చి స్తన్యంబుయిచ్చె - సునీతికోరిన వరము ఫలియించె నేడు
సురలుమెచ్చగ సుతుడు కూరుడయివచ్చె - హరిచేత వరమొంది అధికమయినట్టి
తనవారితోగూడి తనరాజ్యమునేలె - సునీతికి వుదయించినా పుత్రుడేవీడు
సునీతినిబోలు పతివ్రతలెందులేరూ - అనియిట్లు పురజనులు అంతటనుబలుకా
వినుచువుత్తముడు అంతఃపురముకరిగె - మంగళహారతులిచ్చిరి మగువలు వేడ్కా
బాలునికి వివాహంజేసి పట్టమ్ముగట్టి - వైరాగియై తాను అరిగె వనములకూ
వుపమాత సురుచిచేసిన అవమానంబుమరచీ - తమ్ముణ్ణి తానిలిపె తనమంత్రిగానూ
వుత్తముడు వకనాడు వేటకూవెళ్లె - గంధర్వ యక్షకిన్నర కింపురుషులూవున్న
వనములకుబోవగా వుత్తముని శిరసు - యక్షగంధర్వులు శిరసు ఖండించ్రి
దారులుచెప్పగా తల్లిదావీని - సురుచియయినాతల్లి సుతునిగానాక
పుట్టలు చెట్టులు కొండలూగుహలు - వేటాడుచోట్లెల్ల వెదకివేసారి
తనసుతునిగానకా అగ్నిలోజొచ్చె - చెప్పిరిధృవుని కుత్తముని తెరగెల్లా
అప్పుడుకదలెనే గంధర్వులపయిదండు - నిలిచిపౌరుషముతో యుద్ధమ్ముచేయా
ధృవునికాల్బలమెల్ల భూమిపైబడియె - చింతించె వుత్తానపాదుడంతటనూ
స్వాయంభువు మనువు అచ్చోటికేతెంచె - యక్షులుదేవగంధర్వుల కెదురించ
యిదిమనకు సాటిగాదయ్య కోరగాదు - పుణ్యశ్లోకుడవయితే భూములేలూమీ
అన్యాయమూచెయ్య అర్హమెవ్వరికీ - తప్పునీ తమ్ముడియందు గలదనెనూ
యీరీతిమనుమనికి తాబుద్ధిచెప్పి - అరిగెనుతానపుడు విష్ణులోకముకూ
ధృవుడును తాపోయి తనసీమకపుడు - యిరువదియారువేలేళ్లు యెడతెగక
హరిపదధ్యానమున అఖిలరాజ్యంబు - తానేలి విష్ణుపద సాయుజ్యమిపుడు
చేరువకువచ్చినా తరుణమయ్యెనుగా - అని తనతండ్రి వుత్తానపాదునిదలచి
మధువనమునున్నాడు మాతండ్రిదెండి - అని పరిచారకుల నాక్షణంబునను
పంప తోడుకువచ్చె తన జనకునటకు - వైకుంఠపురములో వాసుదేవుండు
తనదాసుడయినట్టి ధృవునితెచ్చుటకు - పుష్పకంబులతోను వాహనులనిచ్చి
భూరిపుణ్యాశాలి బాలభక్తుడు - ధృవుడనురాసుతూ దున్నవాడు
అతనిదోడ్కొనిరండి అతిశీఘ్రముగాను - హరియాజ్ఞ తలదాల్చి ఆ భటూలంతా
దేవలోకముదాటి బ్రహ్మలోకంబు - తపోలోకముదాటి పట్నాలుపల్లెలు

నదులునూదాటివచ్చి విమానములతో - శరణయ్యావోధృవా శరణయ్యమీకు
ప్రహ్లాదవరదుడు మిమ్ము తేబంపె - అనగను ఆనందవార్ధిలోమునిగి
ఆహ్లాదములతోను జననిజనకూల - దగ్గిరజేర్చుకుని సభనుగూర్చుండి
తనముద్దుబాలకుల వద్దికాబిలచీ - మంత్రిప్రధానులా మాన్యులాబుధుల
కాపులకరణాల భటసమూహాముల - రాజ్యభారంబెల్ల రవ్వలేకుండ
ప్రజల రక్షింపుమని బలికెతనయులతో - ధృవుడుమేల్కొని కొలువుకూటముకు
వచ్చువేళలా గొడుగులు పడగలు - ఛత్రచామరాలు చప్పన్న నిరుదులు
పెక్కుసురులు రుషులు వచ్చిరివేడ్క - వుత్తమపురుషులూ ప్రజలుప్రదక్షిణము
జేసిరి స్నానముచేసి దానమ్ము - హరినారాయణ కృష్ణాయనుచు హరిధ్యానము జేయుచు
తనువూవిడచి
దేవరూపమూ తానేదాల్చే - విరులవాన దేవతలు గురియించిరి
హరిదూతలూ విమానములూ - యెదుటవుంచి వేంచేయుమన్నా
కలకాలంబు కష్టముకోర్చి - కన్నతల్లినివిడచి వంటరిగా
వచ్చుటసమ్మతి లేదనిబలుక - ఆ మాటలువిని హరిభక్తులప్పుడు
వెళ్ళేవిమానము మీతల్లిది చూడుమనెను - కనుగొని ధృవుడంత పుష్పమునెక్కి
వాసుదేవునిపద కమలములుగొలిచి - హర్షంబుతోనుండె వైకుంఠపురిని
బాయకయీపుణ్య కథపఠియించ - మోక్షసద్గతిగల్లు నిఖపీయందు.



# త్రిపురసంహారము

శ్రీశైలలింగమీ చరిత కథామృతం - జీవనం బహుజన్మపావనంబు
సంగీతసాహిత్య సకల విద్యల గురువు - గణనాయకుని మదినిగని భజింతు
కావ్యఛందంబున గణపద్ధతులు తెలియ - వ్యాసాది మునుల కెల్లాను మ్రొక్కి

త్రిపురసంహారంబు తెనుగున రచియించి - వినయముగా సుదతులకు విన్నవింతు
త్రిపురదనుజులు మువురు త్రిభువనంబులయందు - త్రిదశుల నెల్లాను తరిమితరిమి
యెలమితో దనుజులు హెచ్చియున్నారని - సురలు రజతాద్రికేగీ

శరణు రజతాద్రీశ శార్వాణీహృదయేశ - శంకరా పరమేశ శరణు శరణు
శరణన్నమాత్రాన శంభు డంతట జూచి - వెరవాకుడని వారి వెరపుదీర్చి
సురలార మునులార సుజన వందితులార - సమయామూకాదు వినుడీ

దానవులకు తొల్లిధాత యిచ్చిన వరము - తప్పింప నెవ్వరి తరముగాదు
ఉగ్రుడై రుద్రుండు అజునితో ననియెను - నీవర బలమున నింతవచ్చె
దితిజాధములను సాధించి రావలెనన్న - కమల సంభవు డొప్పెనూ
ఈ వార్తలన్నీ - కమలాక్షుతో జెప్పెనూ

ముగ్గూరు మూర్తులము యీ మూడు పురములు - సంహారించెదమనిరి సాహసమున
సాధించుటకు అతని రధము సాధకమని - భువి నవఖండ ముల్ప్రొసగనిలిపి
యిరుసున నర్కుండు యిజ్జోడు చక్రముల్ - తీరుగా ఘటియించిరీ
రథాంగములు - దిద్దిశృంగారించిరీ

బహుబ్రాహ్మణుల యొద్ద బడియున్న గుఱ్ఱముల్ - పొలములపై దాటి పూనుకొలిపి
నలుదిక్కులను జూచి నలువసారథియయ్యె - రాతివింటికి పాము నారిచేసి
హరియుతా బాణమయె ఆ బాణమునకును - శరధి తూణీరమయ్యె
ఇరవొందగామింట - సురలు వెరగంది జూడ

ఫాలాగ్ని నేత్రంపు బాణంబునేమొక్కి - సంధించి యుద్ధసన్నద్ధులైరి
రౌద్రానలాభీల రుద్రావతారుడై - రుద్రుండుతారథారూఢుడయ్యె
సమరసన్నాహంబు సమకూడెనని చాల - సురలు సంతోషించిరీ

ధనువు గుణధ్వనుల్ దశదిశల్గంపింప - తరులు గిరులు నేలఉరికి పడియె
శంఖనినాదముల్ చెలగి బోరుకలగ - బెదరి దైత్యుల గుండె లదరిపడియె
భేరీమృదంగముల్ చేరి వెంబడిమ్రోయ - కదనామునకు నడచిరి
రాక్షసులంత - బెదరిగుంపులు విడచిరి

పురములపై దృష్టిపూర్ణాహుతిగబట్టి - శరము సంధించె యా శంకరుండు
పిడుగుల పగిది పడవేసె బాణంబులు - నేలపై పురములు కూలిపడెను
శిరములు కరములు శిథిలమై పురముల - హతమైరి దనుజులెల్లా

పురహరుం డతడని పురుషోత్తముం బిలచి - జయభేరి వేయించె జగతి మెరయ
తలచిన కార్యంబు తక్షణంబుననాయె - తేరుమళ్లించమని తెలియబలికె
కైలాసగిరి త్రోవకై చనిరి సురలెల్ల - యాలపాడుచు నడచిరి
రాత్రిరి శివునకు - జోలలు పాడమనిరీ

# గజేంద్రమోక్షము

ధరణి ఇంద్రద్యుమ్ను డను పేరి మహారాజు - ఒనరొప్ప ద్రమిళ దేశాధీశుడూ
పరగసమ్మతిలీలకూడి భారతకేళి - పరగ తన పణతితో కూడుండగా

వరసతుల విడచితనువెలయు రాజ్యమంత - వనరొప్ప మంత్రుల కప్పగించి
దురితములు తొలగించి వాటిజేరు ముదితోను - తన్నుదామఱచి సుజ్ఞానుడగుచు

ఆ రాజు మతిలోను ఆనందమునపొంగి - అరిగింది అరిగెనట దూరమ్మునా
మేరుదరిజేరియో సారమది యెట్టిదో - దూరమ్ము పొడగాంచి పరమేశుడూ

చారుతరమైనట్టి చిగురాకులు పువ్వులు - దారుకావన కనకగిరి దాపున
చేరి యాదరికింద నిలచి చిత్తామందు - కోరి పురుషోత్తముని కొలువదలచీ

చలనూరనుదుట తిరుమణి జాటికురుమేను - కలయనామమ్ములే కడుదీర్చిరి
కుచిచిలుక కుచిపొత్ర మునితన్ను సేవింప - తులసి వనమాలికలు నెలతలమిరి

ఆదినారాయణుని చిత్తాన తలచుకుని - కరమున నాసిక కలియబట్టి
మనసులో పరముడగు హరి తలచి మదిలోను - తన్నుతామరచి సుజ్ఞానుడవుటా

పరగగా నారాజు సన్మతులు యెట్టివో - పరమేశ్వరుడు నట్టి అవసరమున
చనుదెంచె అగస్త్యముని - అక్కడున్నట్టి శిష్యులెల్లా గొలువగా

ధారుణీశుడు ఎదురు రాకపోయెనని - తనలోను కోపించి తపసివరుడు
తోచికోపామంత - కుంజరము గమ్మనె కువలయేశు

అంత యామోహాములు విడచి తన మదిలోను - గజరూపు చేకొనెను గంభీరుడూ
మనసులోవున్న తన శాపమెన్నడుతీరు - చెప్పవే మునినాధ అని పలికెను

పాలక విష్ణుదేవు రక్షణచేత - నీ శాప పరిహారమని పలికెను
అని చెప్పి మునిపోయె నంతట గజరాజు - తిరుగాడుచుండి దిక్కులు మెల్లగ

వడివడక కడిమిచే మదనుజడి అధికమై - కదిసి యింద్రియములు అణచుకొనక
మెల్లగా వచ్చి తనవెల్ల యేనుగుకొండ - అతి విస్తరమనుచు అలవిపొగడా

వడివడిక దంతావళము అన్ని వైపులా - పెంటియేనుగుల గూడి ప్రేమమీర
కొడుకులను పిలుచుకొని అతివేగిరమ్మునా - వేడుకలతోటి ఖరియించుచుండె

అంత వేసంగితో ఆవనములోపలా - నదులు బావులు చెరువు లన్ని నడిచి
అంత కంతకిచేత అతికరువు లందదక - అడుగు మోపగరాక ధరణిమీద

అంత దప్పిగొనీ డస్సికొనిరాజు తన - తనువునకు ఉదకాలు ఎటగానకా
అంత దవ్వున ఉన్న ఎండమావులు చూచి - కోరి వుదకములంచు భ్రమలుపడెను

వెనక చూడకరండి వేగమే వుదకములు - కలవనుచు తన ప్రజల కలియపిలచి
చలముతో రాళ్ళురప్పలు దీసి తరువులు - తొండమున పెరికి దారులు చేయుచూ

వెనక చూడకరండి వేగమే వుదకములు - కలవనుచు తన ప్రజల కలియపిలచి
పుణికి యా పొదలన్ని పెరికివేయుచు తాను - చలమార చంగల్వకొలనుజొచ్చె

కోనల వెలపల వున్న కోరి తన దైవాల - మడుగు డాయగవచ్చె మదగజములు
మడుగునూతాగాంచి కొనలలో వురికెను - పలికెనే కొండశిలవెల్ల పగలా

నీళ్లలో వున్నట్టి కమలములు తీసుకొని - తొండముల మీదికే ఎత్తిపట్టె
అంతట గజరాజు ఆలిబిడ్డలుగూడి - నీళ్లు త్రాగుచు వుండె ప్రేమమీర

వులికిపడి మొసలి తన పట్టినా కోపాన - చెట్టుగల తొండములు అట్టెబట్టె
చెట్టు చుట్టు తానుతోకూడి ఆ మకరి - కదలకా చేసేనూ దంతిశ్రేష్ఠూ

ఈ కొలనిలోనుండె గంధర్వు డొకముని - స్నానమొనరింపగా వచ్చినపుడు
నాగాంగనలు కొలువగా క్రీడలాడుతు - వారిచేతనె గంధర్వుడోడె

సతుల చూచిన పురుషు డతిగర్వమునపొంగి - తన్నెరగడీమాయ తపసి అనుచు
తనలోను మదమున తెలియనేరక మకరి - పని సేయతలచి యంగనలతోను

ఓ కోమలాంగనా మణులార చూడుడని - మునిలాగె మునిగి తా శాపమిడెను
ప్రాకటంబుగ తన్నుపట్టిన కోపాన - మొసలి గమ్మని పలికెను

అట్టి భీషణుడుండెనమ్మ యా జలధిని - పాలించుతూ వుండె కడుబలముతో
కట్టెల్లనై వున్న కనుల కోపమ్మున - పట్టెను కరిరాజు పాదములను

అంతటా గజరాజు ఆలిబిడ్డలుగూడి - గజరాజును ఎట్టువిడుతుమనుచు
మేరు తన గిరిరాజు వేరు కదలగదీసి - మకరి తన కరి దివ్యయమరి వేట

పెక్కుతరువులు ఫలములను తెచ్చి మీరెపుడు - పెట్టితిరి మాకింత ప్రేమమీర
నారాయణుని దివ్యనామమే గతియనుచు - పాయ నేనుగు మొఱ్ఱబెట్టసాగె

ఇక్కడా మీవంటి పతినిజూసినాము - ఎక్కడికిపోదుమో ఏమిగతియో
వళ్ళంటవచ్చినా వనితరో సుఖములు పొమ్మన్నదోపు సుఖదుఃఖములు

ఈకొలనులోనుంచి ఈకనకకోనలలో - వుండగల ఘాతములు అందముకోరరు
బ్రహ్మాండమును కాచు పరమాత్మనీదలచి - అందందు మొఱబెట్టి కుయ్యసాగె

మత్స్యమై జలధిలో జొచ్చి సోమకుద్రుంచి - తెచ్చి చదువులు బ్రహ్మకిచ్చినాడు
అచ్యుతా మీమీద చిత్తమ్ము నిలిపితిని - మత్స్యావతార మము కరుణించరే

సురలు అసురులు అమృతము చిలుకగా - కుధరమూ కిందికి క్రుంగగాను
మిమ్ములను వేడగా మూపునను ఎత్తుకొను - కూర్మావతార మముకరుణించరే

ధరణియంతాబట్టి చాపగాజుట్టితా - క్రూరుడా పాతాళమున జొచ్చినా
పసగొన్న దానవుని వనధిలో బోరిగొన్న - వరహావతార మము కరుణించరే

కలడనుచు లేడనగ స్తంభమ్మున పుట్టియా - ప్రహ్లాదు గాచి యసురుణ్ణిద్రుంచి
చించి యాతనిపేగు జందెముగ వేసుకొను - ప్రహ్లాదవరద మము కరుణించరే

వామనుడవై పుట్టి వసతి మూడడుగులు - కారణమ్ముగ వచ్చి దానమడిగి
ముజ్జగంబుల మూడు అడుగులను మోపిన - వామనావతార మముకరుణించరే

జమదగ్ని రాముడై యిలమీద శత్రువుల - ఇరవై యొక్కమారు క్రమముమీర
అసురులను ద్రుంచియో భూసురుల రక్షించు - రామావతార మమురక్షించరే

దశరథరాముడై దశకంఠు దునుమాడి - శరణన్న భీషణుకు అభయమిచ్చి
అసురులను ద్రుంచి యా సురులరక్షించినా - దశరథరామ మముకరుణించరే

బలభద్రమూర్తివై హస్తినాపురమందు - వానిగర్వామణచి క్షేమమ్మునా
వసుధలో మీకీర్తి వర్ణింపవచ్చునా - బలభద్రమూర్తి మము కరుణించరే

బుద్ధావతారమున బుద్ధులూచెరచియూ - ముద్దులగుల్పినా ముద్దుకృష్ణా
సద్దుచేయగ మీకు సాటియెవ్వరులేరు - బౌద్ధావతార మము కరుణించరే

ఆశతో మిమునమ్మి అంబరీషుడు తాను - అచ్యుతా శరణన్న అడ్డుపడుచు
ఆ పాపములుబాపి అక్షయస్వర్గములు - వారి కిచ్చిన భంగి కరుణించరే

క్రూరుడైనట్టి యా ఘంటాసురుడు తాను - హరినామ కీర్తనల విననేరకా
కర్ణముల గంటలూ కట్టుకొని తిరగగా - హృదయాన ఉదయించి కరుణించరే

అతి క్రూరుడైనట్టి ఆ యజామిళుడు - అంత్యకాలమందె మిము తలచినా
ఆ పాపములు బాపి అక్షయాస్వర్గములు - వానికిచ్చిన భంగి కరుణించరే

అట్టి యా కంసుడూ పురిటిళ్లకును వచ్చి - ఎత్తి యా మాయను యెగురవేయా
ఆ పాపములుబాపి మీ చేతిలో చావు - వాని కిచ్చిన భంగి కరుణించరే

అట్టి యా పూతకి పట్టి వాడలకొచ్చి - అడ్డాల వేసుకొని పాలివ్వగా
ఆ పాపములుబాపి మీ చేతిలో చావు - దాని కిచ్చిన భంగి కరుణించరే

బాలత్వమున మీరు పారాడుచుండగా - మాయ శకటాసురుడు బండిరూపై
పై బార బలమెరిగి పాదమున తన్నియు - వాని కిచ్చినభంగి కరుణించరే

అట్టి తృణావర్తుడట్లు ఎత్తుకపోవ - ఇరవైన బాహులకు బరువుతోచి
ఎగురుతూనేవుండి వాని హరియించుచూ - వాని కాచిన భంగి కరుణించరే

శబరి యెంగిలి పండ్లు దాచివుంచి భక్తి - పెట్టెనే మీ కింత ప్రేమమీర
ఆరగించి మీరు అభయమ్ము లిచ్చియు - దాని కాచినభంగి కరుణించరే

అట్టి కుచేలుడు ఆలి చెప్పగవచ్చి - ప్రియము చేసి మీకు అటుకు లొసగ
ఆరగించీ మీరు అభయమ్ము లిచ్చియూ - వాని కాచిన భంగి కరుణించరే

అవిటికాళ్ళ కుబ్జ అగరు గంధముతీసి - ప్రియముచేసి మీకు అర్పించగా
అందుకొనుచూ మీరు దాని తిన్నగదీసి - దాని కాచినభంగి కరుణించరే

శ్రీ ల పౌ రా ణి క పు పా ట లు

పాపదుశ్శాసనుడు పణతి ద్రౌపదిదేవి - సభలోను వలువలు విప్పదొడగ
అన్యాయ పందెములు అతివకేశీ మీరు - దాని కాచినభంగి కరుణించరే

చర్మములు వదులాయె శల్యములు దిగజారె - కావరే మమ్మిపుడు కమలనాథ
మీమీద భక్తిని నిల్వనివ్వదు బాధ - నిలవలేనని మొర్ర పెట్టసాగె

అని మొఱలు పెట్టగా ఆదిదేవుడు తాను - గజరాజు దైన్యముకు కరుణించెను
తన శంఖు చక్ర గద పద్మమ్ము తీసుకొని - కదలె గరుత్మన్నెక్కి కమలాక్షితో

నడచి యిరుగడలాను నరలోకములవారు - తుంబురులు నారదులు భక్తజనులు
ముల్లోకములవారు మురవైరి కొలువగా - కొలను దాపుకు వచ్చి కొమరు మిగుల

హరికి కోపం వచ్చి మొసలి కంఠం మీద - అటు మీద వేసెను చక్రమ్ముతో

గంధర్వుడను పేరు హాహా వినుమీదేవ - చంచలమ్ముగ బుద్ధి తిరుగూటతో
మీరాకకే ఎదురు వున్నవసరమ్మునా - శాపమ్ము మీచేత వీడెనాకు

ఇంద్రద్రుమ్నుడు పేరు దేవదేవా వినుము - అగస్త్య ముని శాప మిచ్చె నాకు
మీరాకకే ఎదురు వున్నవసరమ్మునా - శాపమ్ము మీచేత వీడెనాకు

రెండు శాపాలనీ ఆదిదేవుడు నవ్వి - శ్రీ లక్ష్మితోకూడ శ్రీ విష్ణుడూ
మూడు లోకములవా రెల్లరూ చూడగా - వారికి వైకుంఠ మిచ్చినారు

మూడులోకములవా రెల్లరూచూడగా - కదలె గరుత్మన్నెక్కి కమలాక్షితో
ముల్లోకములవారు మురవైరిచూడగా - పుష్పవర్షము గురిసె ఒప్పుమీర

గజేంద్ర మోక్షమను కవిత్వమునుగొని - వసుధలో ఈపాట వర్ణించినా
ఆయురారోగ్యములు ఐశ్వర్యమిచ్చునే - వైకుంఠమిచ్చునే వల్లభుండు.

# వామన చరిత్రము

సరస్వతి గౌరిని వరలక్ష్మి దలంతు - విఘ్నేశు పార్వతీశంకరులదలచు
వామనమూర్తికథ వర్ణింతునేను - పాపరాసులనెల్ల పారంగదోలి
శేషవాహనరూప ఓ పుణ్యచరిత - తెప్పలుగ హరికథలు చెప్పుకుందూరు
బలిచక్రవర్తనే ప్రబలరాక్షసుడు - సకలదానంబులా సర్వజ్ఞుడయ్యి
దానసామర్థ్యమున అన్ని లోకములూ - యెదురులేకా భూమునేలు మాతాను
శూరులగు దేవేంద్ర దేవతులనెల్ల - శూరుడయి స్వర్గంబు చొరకుండగొట్టె
సురులు భూలోకమున సర్పరూపమును - ధరియించి జగమెల్ల చరియింపుచుండ్రి
అమరుల పొడగాన కదితి భీతిల్లి - అతిశోక దావాగ్నిలో మునుగుచూను
చిత్తమున వగచుచూ కశ్యపబ్రహ్మ - వచ్చి అదితి యెదుట నిలిచి తాబల్కె
వున్నారు నీ సుతులీ యుర్వియందు - చనినారు బలికోరకు స్వర్గంబు విడచి
యెంతయిన బలిదానమే మరలబోదు - యెందయిన బలిగెల్వ నెవ్వరీతరము
బ్రహ్మేంద్రరుద్రులు దేవతలు మునులు - నిలుపతే రాబలి చేయు ధర్మములు
అట్టెగా నిమ్మనుచు అదితి నీమమునా - పట్టిరీ వొక వ్రతం పరమాత్మగూర్చి
చెలగి ద్వాదశి వ్రతం చేయుచునుండె - అదితి తపస్సునకు ఆత్మలో మెచ్చి
శంఖచక్రములతో శ్రీవిష్ణుమూర్తి - గదయును ఖడ్గమును చేతులను మెరయ
వచ్చి యెదుటనునిలిచె నారాయణుండూ - దేవాదిదేవుని దేవితా జూచి
ప్రణమిల్లి మ్రొక్కినా పణతినిదీసి - కోరుము వరమని కోమలినడుగ
బలిననచి దేవేంద్ర పట్నంబు నీవు - నాసుతుకి గట్టుమీ నరనాథయనిన
యింతి నీ కోర్కెలు యివి వృథాయనుచు - కాలంబు సమకూర బలిననచివైతు
నీగర్భమందు వామనుండనై పుట్టి - బలి ననచి వైతునూ ప్రబలంబుగాను
అంత కశ్యపు మనసు ఆనందమాయె - హాదేవదేవనుచు హరి దలచుచుండె
అంత ఋతుమాసంబు అదితికినివచ్చె - అదితి గర్భంబునా శ్రీహరిజొచ్చె
ప్రథమ మాసంబునా బడలి దేహంబు - రెండవ మాసమున నెలతకళదప్పె
మూడవ మాసమున ముద్దయియుండె - నాలుగవ మాసమున నరరూపమాయె

అయిదవ మాసమున అవయవపూర్తి - ఆరవమాసమున ఆయుస్సు పోసె
యేడవ మాసమున కేశములుకలిగె - యెనిమిదవ నెలను కన్పట్టె గర్భంబు
తొమ్మిదోమాసమున వికసించె తాళి - ప్రసూతకాలమని వణికినిదోచె
బ్రహ్మేంద్రరుద్రులు బ్రస్తుతిసేయ - తుంబురు నారదులు గానంబుసేయ
రంభ పూర్వశి మేనకలు నాట్యమాడ - దశదిక్కులకాంతి దీప్తితో వెలుగ
కోటిసూర్యులకాంతి తేజంబుగనగ - ముక్కోటి దేవతలు మురియుచూడాడ
భాద్రపద మాసమున శుక్లపక్షమున - శ్రవణద్వాదశినాడు దివ్యదినమందూ
అమరమధ్యాహ్నపు సమయమందూన - కొమరొప్పకశ్యపుని కదితి గర్భమున
అమరులకు తమ్ముడయి అదితి కుదయించె - దేవు డుదయించగా దినమందు భేర్లు
ధిమ్ముధిమ్మనమ్రోసె నాకాశమందు - దేవతలు పుష్పవర్షము కురిపించిరి
భానుతేజునికన్న ప్రభగలిగి వెలుగ - పరమాత్ముడప్పుడూ బాలరూపముతో
తనయుడు కలిగెనని కశ్యపబ్రహ్మ - పుత్రోత్సవంబిచ్చె యెల్లభూసురుల
దశదినంబులు వారు గడిపినా వెనుక - నామకరణముజేసె వామనుండనుచు
శుక్లపక్షము పెరుగు సోమునివగిది - అభివృద్ధి బొందెనూ ఆ పరాత్పరుడు
అందంపు అడుగులా చిన్నిపాదములా - చే నొప్పుచుండెటి జానులూకురులూ
పొన్నకాయలబోలు చిన్ని పిరుదులునూ - అరటి ఆకులబోలు నా యరికాళ్లు
అదితి జేసిన తపసు అధికఫలమాయె - పంచవర్షమ్ములు బాగుగారాగ
పొందుమీరగ బృహస్పతిని బిల్పించి - అక్షరాభ్యాసంబు సుతునికిజేసి
వుపనయనమునుజేసి చిన్న వడుగునకు - వేదశాస్త్రంబులు వేడ్కతో జెప్పె
అరువైయారు విద్య లన్ని నేర్పెను - బ్రహ్మాదిరుద్రులూ బ్రస్తుతులుసేయ
బ్రహ్మోపదేశంబు బృహస్పతిజేసె - పసిడిమౌంజిగోచిపతకంబుగట్టె
పొసగవుత్తర జందియములునువేసె - తిరుమేనగంధంబు నుదుట తిలకంబు
తీర్చితోడుక వచ్చె నదితి దగ్గరకు - భవతిభిక్షాందేహి యని సుతుడు అడుగ
ఆ సుతునకుబెట్టె అమృతభిక్షంబు - సావిత్రితాయిచ్చె మరల భిక్షంబు
గాయిత్రితా యిచ్చె మూడవసారి - శ్రీలక్ష్మితాయిచ్చె సిరిసంపదాలు
సరస్వతి తాయిచ్చె సకలవిద్యలునూ - శివుడు పార్వతియిచ్చె తేజస్సుబలము
బ్రహ్మేంద్ర రుద్రులు సురులును మునులు - శక్తి తమ తేజస్సు యిచ్చిరందరునూ
అంతట బయజ్ఞ మయిన సమయమున - వెన్నుడు బ్రాహ్మణ వేషంబు బూని
విప్రులు యెచ్చోట తేగుచున్నారో - వచ్చెద కచ్చోట యిచ్చుయును మీర
అయిన నాకు దానమంచాశ గలిగె - అందరముగూడి బలి నడుగుదామనుచు

శ్రీవల్లభుడు లోక సృష్టిరక్షకుడు - భావజగురుడగూ పద్మలోచనుడు
యేతెంచె యా విప్రసంఘములగూడి - రాక్షసరాజగు బలిచక్రవర్తి
అమరావతీపురం తానేలుచుండి - సురవరులు మునులు భూసురులు పొగడగను
చెలువొంద యాగంబు సేయంగదలచి - పట్టణప్రాంత నదీతీరమందు
నాలుగు యోజనముల పొడవయినయట్టి - రెండు వెడల్పుగల యట్టి
చతుర్ముఖములతోను శాలవేయించి - హోమగుండంబులే యూపస్తంభములు
వుపయోగ పాత్రలూ హోమద్రవ్యములు - అపరిమితముగాను అందు సమకూర్చి
పణతియు తానును బ్రహ్మరథమెక్కి - భేరీమృదంగములు శంఖములుమ్రోయ
శాలప్రవేశమయి చెన్నొంది వెలుగ - జనకుని కడకేగి వామనుండంత
తండ్రితోదగబల్కె తాపసోత్తముడా - యేదానమడుగుదు బలియింటికేగి
అను ముద్దు పల్కులూ ఆలించి తండ్రి - కటకట కార్యంబు కర్తయయి తాను
శ్రీవిష్ణు జన్మించి లీలలు జరిపి - మాయకలనగాను నన్నడుగుచుండె
నాయవతార ముద్దుపుత్రకా నీవు - నగరులు సౌధములు నవరత్నములు
గజములు అశ్వములు ధేనురాజ్యములు - కోరకపృథ్వి మూడడుగులడుగూమీ
బలిని కోరుము నీకు భయమేమిలేదు - అంతె చాలును మనకు హర్షంబుసుమ్మి
వింతలు మరియేమి వివరించకూము - మంతనంబుననుంచె మంచిదీపుత్ర
అని వీడ్కొనగవేగ ఆ వడుగు చనియె - గొడుగు జంద్యెముచేతనూ పూచికోలా
చిన్నమడుగూగోచి మసిబొట్టు నుదుట - చిటిచిట్టి అడుగులతో శ్రీకృష్ణమూర్తి
ఘల్లుఘల్లున పాదగజ్జటుల మ్రోయ - వామనుడు వేంచేసె రాజశాలకునూ
రాక్షస రాజగు బలిచక్రవర్తి - చెలగి కూర్చున్నాడు సింహాసనమున
సమస్తదేవతలు సప్తమహాఋషులు - బ్రహ్మాదిరుద్రులు అష్టవసువూలు
గరుడగంధర్వులూ అప్సరా స్త్రీలు - కొలువున నిండిరీ కొమరొప్పగాను
వచ్చిన పరమాత్మ వారెల్లజూచి - సాష్టాంగ దండంబు సరగునను జేసి
అర్ఘ్యపాద్యంబిచ్చి ఆసనంబిచ్చి - శంకరుడొ విష్ణువో వాయుదేవుండో
నింద్రుడో చంద్రుడో యా కుబేరుండో - యజ్ఞనారాయణుడో వేంచేసెననుచు
చెలగి పూజలుచేసి ప్రస్తుతించిరి - ఇచ్చె మంత్రాక్షతా రాక్షసేశునకు
మేలిమితో అక్షతలు శిరసందుదాల్చి - దేవదేవునిచేత దీవనలు గొనెను
ఓరాజదేవేంద్ర ఓకీర్తిసాంద్రా - పరమధార్మికుడ వని ప్రజలు చెప్పంగ
అష్టదిక్కులకీర్తి విలసిల్లుచుండ - పేదవిప్రుడ నేను బాలుండనగుట
దానంబు నిన్నడుగ శక్తి నిచ్చుటకి - వినియు రాక్షసరాజు వడుగుతో బల్కె

బాలుడవు నినుజూడ బుద్ధియెక్కువలు - తల్లెవరు తండ్రెవరు వూరేది తెల్పు
నీపేరు యెవ్వరో నిజముగా చెల్పు - అనగ నాహరి నవ్వి బలిరాజుతోను
పెక్కుదేశంబులూ వక్కలోకంబు - నిక్కముగ నేనుందు నిర్మలభూమి
భూమి ఆకాశంబు నాకు తలిదండ్రి - చుట్టాలు బంధువులు పృథ్విలోలేరు
వూరులు నాకూగారు నేనూరులకగుదు - శరధియందున నుందు చోటెందులేదు
దశదిక్కులానుందు తరముగాకుండ - విశదంబుగా నన్ను వివరింపలేరు
కనివినిచూచినా ఘనులెవరులేరు - కనిపిస్తు నా నిజము ఘనముగానీకు
మనుజమాత్రునిగాను మదినెంచవలదు - తత్త్వమార్గంబెల్ల దనుజపతిదెలిసి
మందరగిరిధరుడొ మధుసూదనుండో - కాకుంటె ఒకచిన్న బాలునివలె
యీాస్థితంబులు కోర యిటకొచ్చువాడె - యిస్తును విప్రునికి అఖిలభాగ్యములు
అనుచు మదిలోదలచి ఆ వడుగు నిలిచి - దానమడుగుము నీవు పొరుడాయనిన
పృథివి మూడడుగులు దానమ్ము యిమ్ము - తడవు సేయగవలదు త్వరగానుబంపు
అనవిని బాలునీ యాననము జూచి - బాలుడవు బాల్యుడవు కష్టమెరుగవు
సతిసుత సంపదలు నీవెరుగవయ్యా - భూములు పురములూ కనకసౌధములు
సింహాసనంబులూ గజఅశ్వములును - యిన్ని సంపత్తులూ యిట నిండియుండ
కోరితి వక వెట్టి దానంబు యిపుడు - మూడడుగులా భూమి నీ కేమిపాలు
సభవారు నవ్వరా ఓ సార్వభౌమా - అని యిట్లు దనుజేశు డాసభలో బల్క
చిరినవ్వు నవ్వుచు శ్రీవిష్ణుమూర్తి - అధికదానంబడుగ ఇల సాటిగాదు
భూములు పురములు మేలందలములు - నవరత్న సొమ్ములు ధాన్యరాసులును
నాకేమి కోరగాపు ఓయి సురరాజ - పృథివి మూడడుగులు దానంబు ఇమ్మి
యిచ్చేటివాడ నిన్నడుగ నేమిటికి - వేదంబులందున శాస్త్రంబులందు
తర్క మీమాంసలను తగపరీక్షించూ - ఛప్పన్న విద్యలు యెల్ల శాస్త్రములు
నేర్చితిని వకటయిన నేవిడువకుండ - జగములో గలయట్టి విప్రబృందముకు
తడయక నేనిస్తు తగినపరీక్ష - దానంబు నాకిమ్ము దనుజేంద్ర యనిన
నసురులగురు వగు శుక్రాచార్యుండు - సభలోకి రాగను రాజుతాజూచి
చేసెను దండంబు చెయ్యెత్తి మ్రొక్కి - మ్రొక్కులుగైకొని మునియుదీవించి
ఓదానవాధీశ ఓధర్మరాజ - ఓరాక్షసేశ్వరా బలిచక్రవర్తి
నామాట వినవయ్య నాకనివాసా - బాలుడు బ్రాహ్మణుడు బహుతంత్రవాది
మాయలు మంత్రములు బహునేర్చినాడు - ఆదివిష్ణునాథు డవతారమూర్తి
మత్స్యమై సోమకుని మర్దించినాడు - కూర్మమై కుధరమును కుదురుగానిల్పె

వరహావతారమై హిరణ్యాక్షుజంపె - నారసింహుండై ప్రహ్లాదునిగాచె
వామనరూపమై వసుధజన్మించి - నిన్ను వంచనజేయ యిటకొచ్చినాడు
పొట్టివానికె గాద పుట్టెడూ బుద్ధి - దిట్టతనమున నీని ఝుడిపించివిడువుమీ
గట్టిగా యితనికి కడుపులోపలను - సృష్టించెసుమి బ్రహ్మ చపలబుద్ధులు
నినుబట్టి పాతాళమున బెట్టుటాకు - వామనుండయి పుట్టె వనజనాభుండు
దానంబు అతనికి నీవియ్యవలదూ - వట్టి యుక్తులుజెప్పి పంపుమీవాని
గట్టిగా నీపాలి కాలకింకరుడు - ఆచార్యుపల్కులూ ఆ రాజు వినియు
తపసితో నిట్లని తా జెప్పదొడగె - వోవిప్రపుంగవా వో మునిచంద్ర
నీజెప్పు సుద్దులు హితపుగావయ్య - లోకాలకు కర్త శ్రీవిష్ణుమూర్తి
ఆదినారాయణుడు అఖిలరక్షకుడు - కోరి దానంబడుగ నే నిస్తునంటి
ముచ్చట పాదముల మూడు అడుగూలు - సత్యంబుగాయిస్తు వోతాపసేంద్ర
యిచ్చెదనని వొప్పి మరి మారుమాట - సత్యంబుదప్పి నేబల్క పాడగునె
నారాయణుడు క్రిందు నేను మీదాయె - పౌరుషకీర్తుల ప్రబలదానంబు
శ్రీవిష్ణుకూనిచ్చి సిద్ధిబొందెదను - అనుపల్కు రాజు మాటాలించి గురువు
మెల్లగ వేంచేసె మేడలలోకి రత్నాల గద్దెయు రంగుగావేసి
ముద్దుల బాలుని అందు కూర్చుండబెట్టి - సభలోనందరుజూడ సంతోషముననుః
బంగారు పళ్లెములో పాదుకలనుంచి - కనకకలశంబుతో వుదకంబుదెచ్చి
తనసతిచేతితో తరగవడ్డింప - భక్తితో గడిగె నా పార్థివోత్తముడు
కృష్ణార్పణంబని వటుడు బల్కగను - సభవారు నవ్విరి సామాన్యుడనుచు
మూడడుగులుయిచ్చె దానవేశ్వరుడు - పుచ్చుకొని హరి పెరిగె నాకాశవీథి
ఆకాశ మొకయడుగు భూమి యొకయడగు - మూడవయడుగుకు చోటిమ్మురాజ
బ్రహ్మాది రుద్రులు యెల్ల దేవతలు - సూర్యచంద్రాదులూ అష్టవసువులును
గరుడగంధర్వులూ రాక్షసులు మునులూ - ఝుడిసి తత్తరపడిరి యానమయమందూ
కాలాగ్నిరుద్రుడై హరియుండగాను - విష్ణు భక్తాగ్రేసరుడు వైష్ణవోత్తముడు
బలియుడగు బలికిన తాతయైనట్టి - ప్రహ్లాదుడూ వచ్చి వందనముజేసి
శరణుశరణు నీకు శరనిధీతల్పా - రాక్షసేశునివల్ల యెగ్గెమిగగ్గె
ఆడినమాటకు యెదురాడినాడ - కావుము సర్వేశ వో జగదీశ
మాధవమిముదలతు మదిలోననెపుడు - అనిపల్కు బాలుని మాటలవినవ్వి
పరమాత్మ డిట్లని సుతుతోడబల్కె - పుడమి మూడడుగులు దానములు ఒసగి
వొక్కడుగుకూ చోటు యివ్వకున్నాడు - విడువక బంధింతు విశ్వంబులోన

తడయుట తగదింక ధర్మంబుగాదు హరిహరీయని యసురు డపరాధి నేను
కాళింగుశిరస్సుపై నుండు పాదములు - అహల్యా శాపంబు బాపు పాదములు
మున్ను నే గడిగిన ముద్దు పాదములు - నాతప్పు క్షమియించి నన్నురక్షించి
నాతలనుంచుమీ నలినాయతాక్ష - అని బలి బల్కగా విని వామనుండు
మూడవపాదం బలికి శిరసందు - మురయుచు తానుంచె మురవైరి యపుడు
సుతుడ యేలుమని చూపించెదారి - గంగపు వుదకంబు కడువేగదెచ్చి
విరివిగా మునులెల్ల యాశీర్వదింప - పట్నంబు తాగట్టె దేవేంద్రునకు
ప్రహ్లాదుని బిలిచి హరియిట్లుబలికె - మీ మనుమ బలియుని స్వర్గలోకముకు
యేడాది కొకతూరి మూడు దినములను - మాసన్నిధినియుండ సెలవి స్తిమయ్యా
అనిపల్కి వామనుడు వైకుంఠపురికి - ప్రహ్లాదుదోడుకొని వేంచేయగాను
ఋషులు తమ విడుదులకు తర్లి వెళ్ళిరి - లోకనాయకుడగు శ్రీవిష్ణు కథలు
పాటలుగావించె పణతులకు నెల్ల ఆయురారోగ్యంబు యఖిలసంపదలు
మానుగాపొందెదరు మహిలోనజనులూ.

---

# అంబరీషోపాఖ్యానము

శ్రీరామునాత్మలో చిత్తమునదలతూ - పాదారవిందములు భక్తి పూజింతు
అంబరీషుడనియెటి పుణ్యపురుషుండూ - గోవింద భక్తుని మహిమ వర్ణింతూ
హరినామ కీర్తనుడు హరివాసముండె - పరగద్వాదశినాడు భక్తితోడుతను
పంచభక్ష్యాన్నములు పక్వములుజేసీ - యెంతయిన భక్తితో బ్రాహ్మలకుబెట్టు
గంగిగోవులగూ పాడి గోవులును - వెండికొమ్ములుపైడి గొలుసులేకట్టి
నిలువెల్ల నవరత్న సొమ్ములేబెట్టి - దానములు యిచ్చును భూసురులకెపుడు
యిట్లు జరుగుచునుండ దూర్వాసముని - అంబరీశుని జూడ అటుడాలువచ్చె
వచ్చినముని జూచి యెదురుకొని రాజు - అర్ఘ్యపాద్యం బిచ్చి ఆసనం బిచ్చి
యేల చనుదెంచితిరి ఓ పున్యాపురుష - మీరానతిచ్చిన పనినే జేసెదాను
అనవిని రాజుతొ రుషి యిట్లు పలికె - ఓ అంబరీష పరమపావనుడ
బాయని భక్తిగల ఓ హరీదాస - నేడు ద్వాదశిగాన అతిథిగా నేను
నీ యింట భుజయించు కోర్కె తొవస్తి - ఆ మాట విని రాజు హర్షంబుతోను
ద్వాదశి వేళకు - రుషినీ రమ్మనెను వచ్చెదననిపోయి దూర్వాసముని
పారేటి నదిలోన స్నానంబుజేసి - జపసంధ్య నిష్టలూ సల్పుచూనుండె
అంతట నంబరీషు సత్రములోగా - దేవతార్చనచేశి బ్రాహ్మల బిలచి
ద్వాదశి ఘడియతే జరుగునని తలచి - వ్రతభంగ మొచ్చునో హరిభక్తి జెడునొ
రుషియు రాకాపోయెనని తల్లడించి - దూర్వాసు కడకేగి తనుజేరి పిల్వ
పిలచిన పలుకడు కళ్ళుజూడక - యేమిసేయుదమనీ విప్రులానడుగా
విద్వాంసులందరూ శాస్త్రములు జూచి - తులసి పారణాజేయ తప్పులేదనిరి
తులసి పారణజేసీ రుషి రాకకొరకు - యెదురుచూడగ ముని అంతలోవచ్చి
వడ్డించు పంచ భక్ష్యాన్నములు చూచి - నీ పత్ర్తీ అన్నమ్మునే కోరివస్తే
నీ విట్లు భుజియించ నీతియే జెపుమా - అల్పుడా నీయింటి అన్నమ్ము నేనూ
వల్లనని వక జడా తను తీశివైచె - వేశిన ఆ జడా వెయ్యి ముఖములుగా
కారుచిచ్చులభంగి కాలుతూవుండి - అంబరీషుని గృహముకంతటను వచ్చె
అధిక భక్తుడు గనుక అంబరీషుండు - అచ్యుతుని దలచితే అణగే నా మంట
కృష్ణా కృష్ణాయనుచు కీర్తనలు శాయ - విష్ణుచక్రం వచ్చి ఆ మంట మ్రింగె
అంతట వదలకా ఆ మహామునిని - వెంటదగిలి వచ్చె నా విష్ణుచక్రం

సాగరము జొచ్చె నా సాగరము జొచ్చె - శిలలందు జొచ్చి నా శిలలందు జొచ్చె
బిలములు గుహాలలో తప్పకను జొచ్చె - దేవలోకముకేగి దేవేంద్రుతోడ
విష్ణుచక్రము నన్ను వెంటాడుచుండె - కావుమని ఋషి యడుగ దివిజనాథుండు
ఏమి వరమడిగినా యిచ్చేనుగాని - పుండరీకాక్షునికి చాల లేమనిరి
కైలాసపురమునకు కడువేగబోయీ కాయుమని పల్కగా కలకంఠుడపుడూ
ఏమివర మడిగినా యిచ్చేముగాని పద్మాయతాక్షుతో పగగూడదనిరి
బ్రహ్మలోకమునకే పరుగునా నేగి - తనకుగల భయమెల్ల స్రష్టతో దెలుపా
వెర్రి ముని నీ వింత వ్యసనపడనేలా - అది అచ్యుతులున్న ఆ కడకె బోమ్మీ
పాపములు కాయునూ బంధములు విడునూ - లోకేశుడున్న యీ లోకముకు బోమ్మీ
బ్రహ్మ జెప్పినమాట యోగివల దాల్చి - బంగారుమేడలే పశిడికోటలునూ
పంరేటి కాలువలు పద్మాల సరస్సులూ - శృంగారముగనున్న స్త్రీలు గొనియాడా
అచ్యుతా అనియెపుడు హంసలూ బలుకా - గోవిందయని యెపుడు కోయిలలు బలుకా
నారాయణని యెపుడు నెమల్లు బలుకా - సూర్యుడు చంద్రుడు దేవేంద్రుడుగొలువా
యక్షకిన్నరులు కింపురుషులు గొలువా - రంభాది యప్సరసలు నాట్యములు శేయా
సనకసనందనులు సన్నుతి శేయా - చక్కని వైకుంఠ పురికళ్ళజూచి
దూర్వాస మహాముని నగరుకాజొచ్చి - ఆదీ అచ్యుతుడున్న అంతిపురమునకూ
శ్రీదేవి భూదేవితో గూడియున్న - అఖిలాండ నాయకుని కాకళ్ళజూచి
అచ్యుతానంద గోవింద శరణనెనూ - తనకోట్ల సాష్టాంగ దండములు బెట్టె
అలకించి చూచె పతితపావనుడు కూర్చుండు ఋషివరా గూర్చుండు యోగి
నా భక్తులా మహిమా నీకు దెల్పెదను విష్ణుభక్తుల చరిత్ర వివరంబుయిపుడు
భక్త వత్సలుడని పాడరో నన్ను భక్త పరాధీనుడని పొగడరో వారూ
అనాథనాథయని పొగడరో వారు అనంతనామముల ననుపొగడు వారూ
రూపులేని వాణ్ని రూపుచేయుదును - రేకలేని వాణ్ని రేక చేయుదును
కానరాని వాణ్ని కనిపించుకుందూ - చిక్కరాని వాణ్ని చిక్కించుకుందూ
వేదములంటే చిక్క శాస్త్రముల చిక్కా - మంత్రములనే చిక్క మౌనీవలల చిక్కా
ముక్కోటి తీర్థాల మునిగినా చిక్కా - ఆకులు నమలి మీరడవి లోపలనూ
వరషకాల మెంత తడసియున్నాను - జపతపములు శేసి వెల్లందుడున్నా
భక్తిహీనులయితే ననుగానలేరు - కులములు శ్రేష్టమని కొందరందూరు
గోత్రములు శ్రేష్టమని కొందరందూరు - కులములుకే కాద - గోత్రములు కాద
నందయశోదలూ భక్తులూ గనుక కారివాటికి కావలసివస్తి శేసూ

రణమందు భీష్ములు యుద్ధంబుజేసి - బాణజాలము మీద పండియుండెనుగా
నా రాకకే లేచి యెదురెదురు జూచె - భార్యనైనా విడిచివుండేనుగాని
భక్తుల విడిచి నే క్షణముండలేనూ - అంబరీషుడు పరమభక్తుడూ గనుక
అతని నిందాశాయదగునె యోమౌని - నీ వేగి అతనికి శరణొందుమనగా
మళ్ళేను ఆ మౌని వైకుంఠపురిని - ఆలోక మీలోక మన్నిలోకములు
క్షణములోపలదాటి తడయకావచ్చె - అంబరీషు గృహాము కటు జేరవచ్చె వచ్చిన ముని రాజు
చెచ్చెరాజూచి
యెదురుగా తా వచ్చి అర్ఘ్యంబులిచ్చి మీ రాక నా జన్మ సాఫల్యమయ్యె
వచ్చినపని దెల్పు వో విప్రవర్యా - అనవిని రాజుతో ఋషి యిట్లు బల్కె
నీ బత్తీ అన్నమునే కోరివస్తి ఆ మాటవిని రాజు బహుసంతసించి
పంచ భక్ష్యాన్నములు పక్వములుజేసి బంగారు పళ్లెములో వడ్డనాశాయ
భోజనము జేసెనే వారు రంతటనూ - తాంబూల మిచ్చెనూ రాజశేఖరుడు
విష్ణుచక్రం నన్ను వెంబడించేను - కావుమని చెప్పె నా అంబరీషునితో
విష్ణుచక్రం వలన భయమేమిలేదు - అని బల్కగా ఋషి అరిగె వనమునకూ
అంబరీషుడంత హరిని ప్రార్థించి - విష్ణుచక్రం వలన భయములేకుండ
పారుని కావుమని భక్తితో వేడా వరదుడు తన ఆయుధము మళ్ళించె
అంబరీషుని చరిత అఖిల పాపములు పోగొట్టి పఠియింపయూ విష్ణుపదవి
చేకూరు భువిలోన శాశ్వతంబుగను - శ్రీకృష్ణు డిచ్చును అఖిల సంపదలూ.

# శ్రీకృష్ణుని జననము

కస్తూరి రంగరంగా - నాయన్న - కావేటి రంగరంగా
శ్రీరంగ రంగరంగా - నినుబాసి - యెట్లునే మరచుందురా
కంసుణ్ణి సంహారింపా - సద్గురుడు - అవతారమె త్తెనప్పుడూ
దేవకీ గర్భముననూ - కృష్ణావ - తారమ్మై జన్మించెనూ
యేడు రాత్రులు చేరిచీ - ఒకరాత్రి - యేకరాత్రిగ జేసెను
ఆదివారము పూటనూ - అష్టమీ - దినమందు జన్మించెను
తలతోను జన్మమ్మైతె - తనకు బహు - మోసంబు వచ్చుననుచు
ఎదురుకాళ్ళను బుట్టెను - పదుగురు - దాదులను బంపెనపుడు
నెత్తురుతోపుండి యపుడూ - ఆబాల - కాపుకాపున యేడ్చుచు
నన్నేల యెత్తుకొనవే - ఓతల్లి - దేవకీ వందనంబు
ఒళ్లెల హీనంబుతో - ఈరీతి - నున్నాను కన్నతండ్రి
నిన్నెట్లు ఎత్తుకుందూ - నీవొక్క - నిమిషంబు తాళరన్నా
గంగనూ ప్రార్థించెనూ - జలనిధుల - గంగతా నుప్పొంగెను
గంగనదిలో నప్పుడూ - దేవకీ - జలకంబులాడె నపుడు
ఇకనైన యెత్తుకొనవే - నాతల్లి - దేవకీ వందనంబు
కాని బాలుని వలెను - నన్నిట్లు - యెడబాసి యుండతగునా
నీ పుణ్యమాయె కొడకా - యింకొక్క - నిమిషంబు తాళుమనుచూ
కామధేనువు నప్పుడూ - దేవకీ - కడగి ప్రార్థించగాను
పాలవర్షము గురిసెను - అప్పుడా - బాలుపై చల్లగానూ
తడివస్త్రములు విడచెనూ - దేవకీ - పొడివస్త్రమును కట్టెను
పొత్తిళ్ళమీద నపుడూ - బాలుండు - చక్కగా పవళించెను
తనరెండు హస్తములతో - దేవకీ - తనయుణ్ణి యెత్తుకొనెను
అద్దాలపై వేసుక - ఆబాలు - నందచందము చూచెను
వసుదేవు పుత్రుడమ్మా - ఈబిడ్డ - వైకుంఠ వాసుడమ్మా
నవనీత చోరుడమ్మా - ఈబిడ్డ - నందగోపాలుడమ్మ
సితపత్ర నేత్రుడమ్మా - ఈబిడ్డ - శ్రీరామ చంద్రుడమ్మ
శిరమున చింతామణి - నాతండ్రి - నాలుకను నక్షత్రము

పండ్లను పరుసవేది - భుజమున - శంఖుచక్రములు గలవు
వీపున వింజామరం - నాతండ్రి - బొడ్డున పారిజాతం
అరికాళ్ళ పద్మములును - అన్నియూ - అమరెను కన్నతండ్రీ
నీరూపు నీచక్కనా - ఆ బ్రహ్మ - యెన్నాళ్లు వ్రాసెతండ్రీ
అన్నెకారి కడుపునా - ఓ అయ్య - ఏల జన్మిస్తినయ్యా
మా యన్న కంసరాజు - ఇప్పుడూ - వచ్చు వేళాయెరన్నా
నిన్ను నే నెత్తుకోని - ఏత్రోవ - నేగుదుర కన్నతండ్రి
ఆ చక్కదనము జూచి - దేవకి - శోకింపసాగె నపుడు
తల్లి శోకము మాన్పగా - మాధవుడు - తంత్రమొక్కటి చేసెనూ
పెద్ద బొబ్బలు పెట్టుచూ - మాధవుడు - గట్టిగా యేడ్వసాగె
శోకంబు చాలించియూ - దేవకి - బాలుణ్ణి యెత్తుకొనెను
నా యన్న వూరుకోరా - నా తండ్రి - గోపాల పవళించరా
అల్లదుగొ బూచివాడు - నా తండ్రి - వస్తాడు పవళించరా
బూచులను మర్దించనూ - నలినాక్షి - బుద్ధిమంతుడను అమ్మా
బూచేమి చేసునమ్మా - నాతల్లి - బూచి నన్నెరుగు నమ్మా
నీ పుణ్యమాయె కొడుకా - నీ వొక్క - నిమిషంబు తాళుమనుచు
అల్లదుగొ జోగివాడూ - నా తండ్రి - వస్తాడు పవళించరా
జోగి మందుల సంచులూ - ఏవేళ - నాచంక నుండగాను
జోగేమి చేసునమ్మ - నాతల్లి - జోగి నన్నెరుగునమ్మా
నీ పుణ్యమాయె కొడకా - నీవొక్క - నిమిషంబు తాళుమనుచు
అల్లదుగొ పాము వచ్చె - నాతండ్రి - గోపాల పవళించరా
పాముల్ల రాజె అయినా - శేషుండు - పాన్పుపై యుండగానూ
పామేమి చేసునమ్మా - నలినాక్షి - భయము నీకేలనమ్మా
నీలమేఘపు చాయలూ - నీమేను - నీలాల హారములునూ
సద్గురుడు వ్రాసెనాడు - నాతండ్రి - నీరూపు నీచక్కన
నిన్ను నేనెత్తుకోనీ - యేత్రోవ - పోదురా కన్నతండ్రి
నాకేమి భయములేదే - నాతల్లి - నాకేమి కొదువలేదే
మా మామ కంసుకుండు - ఈ వేళ - నన్ను వెరపించవస్తే
మా మామ నాచేతనూ - మరణమై - పొయ్యేది నిజమునుమ్మా
వచ్చు వేళాయెననుచూ - నాతల్లి - వసుదేవు పిలువనంపూ

గోపెమ్మ బిడ్డ నిపుడూ - శీఘ్రముగ - తెచ్చి నీవుంచవమ్మా
అంతలో వసుదేవుడూ - బాలుణ్ణి - తలమీద ఎత్తుకొానెనూ
రేపల్లె వాడలోనూ - గోపెమ్మ - ఇంటనూ వచ్చె నపుడూ
గోపెమ్మ పుత్రినపుడూ - వసుదేవు - భుజముపై నెక్కించుకూ
అతి త్వరితముగ వచ్చెనూ - దేవకి - హస్తముల నుంచె నపుడు
దేవకికి తనయు డపుడూ - పుట్టెనని - కంసునకు కబురాయెను
ఝల్లుమని గుండెలదర - కంసుండు - పీఠంబు దుమికె నపుడూ
జాతకంబులు చూచెనూ - గండంబు - తగిలెనని కంసుకుండు
చంద్రాయుధము దూసుకా - శీఘ్రముగ - దేవకి వద్దకొచ్చె
తెమ్మని సుతునడిగెనూ - దేవకి - అన్నదీ అన్నతోనూ
మగవాడు కాదురన్నా - ఈ పిల్ల - ఆడపిల్ల నమ్మరా
ఉపవాసములు నోములూ - నోచి యీ - పుత్రికను గంటినన్నా
పుత్రి దానము చేయరా - నాయన్న - పుణ్యవంతుడవురన్నా
దేవాదిదేవులైన - బ్రహ్మ రు - ద్రాదులకు పూజచేసి
పూజ ఫలములచేతనూ - వారి కృప - వల్ల పుత్రికను గంటీ
నీ పుణ్యమాయెనన్నా - నీవు పు - త్రికను దయచేయుమన్నా
నిర్దయాత్మకుడవగుచు - నీవిట్లు - చేయుట తగదు రన్నా
ప్రేమతో చెల్లెలపుడు - అన్నను - చెయిబట్టి బ్రతిమాలెనూ
గంగాది నదులయందూ - పుత్ర దా - నము చేయమని వేడెనూ
కాదుకాదని కంసుడూ - దేవకి - పుత్రికను అడిగె నపుడు
అడ్డాలపై బాలనూ - పుచ్చుకుని - ఎగరేశి నరకబోయె
అంబరమునకు ఎగురగా - వేయనపు - డా బాల కంసు జూచి
నన్నేల చంపెదవురా - నీ యబ్బ - రేపల్లె వాడలోను
పెరుగుతున్నాడ వినరా - కృష్ణావ - తారమై జన్మించెనూ
నిజముగా దోచెనపుడూ - కంసుండు - యేతెంచి పవళించెనూ
రేపల్లె వాడలోనూ - పెరుగుచు - న్నాడనీ దిగులొందెను
నీ యబ్బ నీ తాతరా - కంసుడా - కృష్ణుండు పుట్టెననుచూ
చల్లమ్మ వారలెల్లా - ఆకబురు - చక్కగా చెప్పగాను
పూతకికి కబురాయెను - అప్పుడా - పూతకి చనుదెంచెను
శృంగారముగ పూతకీ - స్తనములకు - విషధార పూసుకొానెను

రేపల్లె వాడలందూ - కృష్ణుడు - తిరుగుచున్నా చోటకూ
చనుదెంచి విషపుపాలూ - ఇవ్వనూ - సమకట్టి ఇవ్వగానూ
బాలురతో బంతులాడ - కృష్ణుని - బాలురందరు కొట్టగా
కావుకావున ఏడ్చుచు - పరుగెత్తి - వీధి నడుమను నిలచెనూ
ప్రేమ కృష్ణుణ్ణి చూచీ - పూతకి - ప్రియముతో బుజ్జగించి
నా యన్న వూరుకోర - నా తండ్రి - పాలు యిచ్చెదను రార
మూడు గుక్కలు పీల్చగా - పూతకి - భూమిపై కొరిగి పడగా
గోపెమ్మ చూచి అపుడూ - బంగారు - గిన్నెలో బువ్వపెట్టి
ప్రొద్దున్న వుగ్గుపోసి - కృష్ణుణ్ణి - యెడలోను పండవేసె
అంతలో కంసహితుడూ - బండిరూ - పై యెదురుగావచ్చెనూ
పాదములు రెండు పిడుగు - లావలే - దడదడా విసిరెనపుడూ
వృషభమై వచ్చినిలువ - ఒక్కలఘు - వున చంపివేసెనపుడూ
చల్లమ్ముివారలెల్లా - ఈ కబురు - చల్లగా చెప్పిరపుడు
రేపల్లె వాడలోను - ఉన్నట్టి - గోపికలు గుంపుగూడి
"మాయిళ్ళ కొచ్చునమ్మా - కృష్ణుడు - మమురవ్వ చేసునమ్మా
తాళలేమమ్మ మేము - మీ సుతుడు - తాలిమితో వుండడమ్మా
మగనివలె పనులుసేయా - నీ సుతుడు - మాయిండ్లలోకి వచ్చూ
ఇనైకన బుద్ధిచెప్పి - ఇంతిరో - పదిలమ్ము సేయుమమ్మా"
అనుచునూ గట్టిగాను - మనమంత - గోపెమ్మ కడకుబోయి
చెప్పుదామనుచు వారు - గోపెమ్మ - చెంతకేగగ నప్పుడు
గోపాలకృష్ణు డపుడూ - అచటనే - పాలుత్రాగుచు నుండెనూ
ఇదియేమి యాశ్చర్యమే - ఓ చెలియ - ఇదియేమి చోద్యమమ్మ
కనుపాపలను దీసునే - కృష్ణుడు - దొంగతనములు చేసునే
ఇకనేమి చేసునోను - మన ముబులు - పాటమున వస్తిమమ్మా
అమ్మనే నెరుగనమ్మా - నా త్రోవ - నేబోవు చుండగాను
ననురవ్వ చేసిరమ్మా - నేనంత - భయపడీ వస్తినమ్మా
కొబ్బరి కుడకలనుచు - గోపికలు - గొబ్బున పిలువబోవ
కొబ్బరి కుడకలనుచు - గోపికలు - గుబ్బలను చూపినారు
పౌర్ణమి రోజులందు - జలజాతు - లందరూ కూడకోనీ
చీరలటు తీసివేసి - గోపికలు - జలకమాడుచు నుండగా

తీసిపుంచిన చీరలు - కృష్ణుండు - వేసె ఆ పొన్నమీద
వేసియూ వేణునాదం - పూదుచూ - పుండె నా మాధవుండూ
జలకమ్ము చాలించియూ - గోపికలు - మనచీర లేమాయెనే
నమ్మరాదమ్మ కృష్ణుని - ఇకను ఈ - చినగొల్లవాని నెపుడూ
ఎంతపని చేసెనమ్మా - ఓ చెలియ - ఏమి యాశ్చర్యమమ్మా
వెదకుచూ కొందరుండీ - నీళ్ళలో - మునిగియుండిరి కొందరూ
అప్పుడూ గోపికలలో - ఒకయింతి - తాజూచి శ్రీకృష్ణునీ
రారె ఓ అమ్మలార - ఈ పొన్న - మీదనున్న కృష్ణునీ
ఇవ్వరా మా చీరెలూ - ఓ కృష్ణ - ఇవ్వరా మా రవికెలూ
దండంబు పెట్టెదార - కృష్ణయ్య - దయయుంచి దయచెయ్యరా
అందరూ ఒకచేతితో - దండంబు - పెట్టగా చూచి తాను
పొందుగా మీరందరూ - దండంబు - రెండుచేతుల బెట్టరే
ఎంతపని వచ్చెననుచూ - గోపికలు - మానభంగము నొందిరీ
వసుదేవ తనయునకునూ - దండంబు - రెండుచేతుల బెట్టిరీ
పొందుగా వలువలన్నీ - కృష్ణుండు - పేరుపేరున ఇచ్చెను
నాయత్త తిట్టునేమొ - యనుచు నొక - రొకరితో వగచిరపుడూ
మాయాడు బిడ్డ యిపుడూ - కొట్టునో - నా బావ దండించునో
నా మగడు నన్ను బ్రతుక - నివ్వడూ - నేనేమి చేతునమ్మా
కస్తూరి రంగ రంగా - నా యన్న - కావేటి రంగ రంగా
నినుబాసి యెట్లునే మరచుందురా.

# గుమ్మడు పాట

రాణించు ముత్యాల రావిరేకయు బొట్టు - కురు వెండ్రుకల నడుమ గునిసియాడ
బాగైన ముత్యాల పౌజు కమ్మలజోడు - చెక్కిళ్ళపై మెరుగు సేయుచుండ
వక్ష స్థలంబున వరుస పతకులు రెండు - ఒప్పుగా తమతోన నొప్పుచుండ
రంగారు బంగారు రచనా కలాపంబు - నసియాడు నెన్నడుము పసలుచూప
మేటి పటుత్రాడు కవ్వానమించ జుట్టి - వల్లెవాటుల కొంగు లుయ్యాలలూగ
కరమునను కంకణంబుల రవముసెలగా - తరుణి యొయ్యారమున పెరుగు చిలుకుచుండె.

కలికి కంఠపుసరులు చక్కగ - గొప్ప ముత్యపుసరులు జారగ
కలికి కరమున కంకణాదులు - కలసి మ్రోవగను
గరివి కెదురుగ పెరుగుదించెను - కడవ స్తంభం మొదట నిలిపెను
కరమునను దట్టించి కవ్వము - ఇంతిచే బూనె.

ఘుమ్మ ఘుమ్మన పెరుగు తరచగ - కోరి విని ప్రార్థించి కృష్ణుడు
అమ్మ వెన్నాయనుచు కవ్వము - నణచి పట్టగనూ
నమ్మరా కృష్ణమ్మ పెరుగులో - నడుమ గుమ్మడు తిరుగులాడును
నమ్మకున్నను ఘుమ్మ ఘుమ్మను - నాదమిటు వినుమీ ॥కృష్ణా గుమ్మడిదుగో॥

వామహస్తము నణచి పాదము - వసుధ మీదికి కాలు యెత్తుకు
భూమి కదలగ నవయవమ్ములు - బొజ్జ కదలగనూ
కోమలీకంబైన చక్కని - గునిసియాడెడి నడుము వంచుకు
ప్రేమ లెన్నుచు చెయ్యి చాపెను - పెరుగు తరచగనూ॥

కాటబోయిన వారి పాపడు - కడవలోపల చెయ్యి ముంచెను
తూటుపొడిచీ కరచె గుమ్మడు - తొలగి పోవగనూ
మాటలేటికి విడుము కవ్వము - అన్న నీకును వెన్న బెట్టెద
యేటికీ ఇందున్న గుమ్మడు - యెగిరి కరచెడినీ ॥కృష్ణా గుమ్మడిదుగో॥

గుమ్మడేడే గోపిదేవి - గుమ్మడేడే కన్నతల్లి
గుమ్మడిని పొడచూపగదవే - అమ్మ గోపెమ్మా ॥గుమ్మడేడే॥

క్రుచ్చు తనమున వేదములుగొని - తెచ్చి వెరచుచు జలధిలోపల
జొచ్చియున్నా వాని వెంబడి - జొచ్చి వెనుదగిలీ
మత్స్యమై సోమకుని ద్రుంచితి - మొదటి చదువులు బ్రహ్మకిచ్చితి
అచ్చయాంబు గుమ్మడనియెడి - మాట నేనెరుగా ॥అమ్మా గుమ్మడేడే॥

సురులు నసురులు జలధి తఱచగ - సరగునను భూధరము క్రుంగగ
అల్లసురవరులెల్ల పొగడగా - వారి కిష్టముగా
గిరికి కుదురుగ కూర్మమైతిని - క్రిందిలోకమునందు గుమ్మడి
తరచుగా నొకమాటకై నను - తరుణి నే నెరుగ ॥అమ్మా గుమ్మడేడే॥

చారు భూమి చరాచరమ్ములు - చంకబెట్టుకు హైమనేత్రుడు
వారి నిధిలో జొచ్చి నంతట - వాని వెనుదగిలీ
కోరి వరాహరూపమైతిని - రక్కసుని రణభూమి జంపితి
వారి భూములలోన గుమ్మడి - పేరు నే నెరుగ ॥అమ్మా గుమ్మడేడే॥

జగములన్నియు విష్ణుమయమని - చదువు బాలుండిందు గలడన
పరుగునను దట్టించి స్తంభము - పగులవేయగనూ
సగము మృగమై హేమకశ్యపు - చంపి దానవసుతుని గాచితి
మగువరో అందున్న గుమ్మడి - మాట నేనెరుగా ॥అమ్మా గుమ్మడేడే॥

వడుగు బ్రాహ్మణ వేషముననే - బలిని అడిగితి దానమిమ్మని
పుడమిలో మూడడుగులిచ్చెను - పొంగి వేడుకతో
అడుగులను బ్రహ్మాండ ఖాండము - అంతటను నే నపుడు నిండితి
అడుగు క్రిందను గుమ్మడనియెటు - అరసి నే నెరుగ ॥అమ్మా గుమ్మడేడే॥

వరుస నెరుగక కార్తవీర్యుడు - వచ్చి యా సురధేనుకై గొని
పరగగా జమదగ్ని జంపిన - పగకు నే నపుడూ
వరుస నిరువది యొక్క మారులు - వెంటబడి భూపతుల జంపితి
వైరి భూములలోన గుమ్మడి - పేరు నే నెరుగ ॥అమ్మా గుమ్మడేడే॥

పరగగా రాక్షసుల బాధకు - విబుధ దేవతలెల్ల శరణని
కోర దశరథ రాజసుతుడై - యవని జన్మించీ
జలధి బంధనజేసి రావణు - జంపితీ రణభూమిలోపల
బలిమిగల యా గుమ్మడనియెడు - మాట నే నెరుగా ॥అమ్మా గుమ్మడేడే॥

సంతసమ్మున రామకృష్ణులు - సదయులై రేపల్లె వాడలో
యింతులకు పదియారు వేలకు - ఇష్టమొనరించీ
కుంతి సుతునకు సారథై తిని - కురుబలమ్ముల నణచుచోటను
మంతనమ్మున గుమ్మడనియెడి - మాట నే నెరుగా ॥అమ్మా గుమ్మడేడే॥

యుద్ధయోగము చేయు చోటను - పణతులను చెరుపంగవలెనని
వృద్ధ బ్రాహ్మణ వేషముననే - వేడ్కలమరగనూ
యుద్ధమున రాక్షసుల చంపితి - ఉత్పత్తిల్లగ భూమి దెచ్చితి
యుద్ధ యోగమునందు గుమ్మడి - చోద్యమే నెరుగా ॥అమ్మా గుమ్మడేడే॥

మర్మమెరుగక కలియుగమ్మున - మత్తులై నీచులను మించియు
నిర్మలాశ్వము నెక్కి వారల - నణచి మోదముతో
ధర్మదేవతలనెడి రాజుల - ధరణిలో నిలుపంగవలెనని
ధర్మయుద్ధములోను గుమ్మడి - తెరవు నే నెరుగా ॥అమ్మా గుమ్మడేడే॥

చిత్తమును బహుచందములుగా - చంద్రకళయును జలసమస్తము
సప్తరాత్రులు వుంటినే - వటపత్ర శయనమునా
హరి యెగతియని అక్షయంబుగ - నారదాదులు శ్రుతులు చేయగ
యోగమార్గమునందు గుమ్మడి - పేరు నే నెరుగ ॥అమ్మా గుమ్మడేడే॥

మేదినియు మిన్నొక్కటగుచు - మెండు జలముల దిశలు మునుగగ
మోదమలరగనుంటినే నా - మొదటి రూపమునా
ఆదరమ్మున తిరిగి యంతట - అమ్మ నే జగమెల్ల నుండితి
వెదకితిని జగమెల్లవేమరు - గుమ్మడిని యెరుగా ॥అమ్మా గుమ్మడేడే॥

స్త్రీల పౌరాణికపు పాటలు

ఇందుగలడా గుమ్మడంటివి - ఎందుగలడో చూడుమాయని
వందనంబిడివేగ తన తిరు - వాక్కు తెరవగనూ
నందనందను నోటిలోపల - నాతిపొడగనె చరాచరంబులు
చంద్ర సూర్యులు మొదలుగాగల - సకల దేవతలూ

వెరువవలెనని గుమ్మడంటిని - వెరచితిని తెరువాకు మూయుము
చిరుతలను వెరపించు చందము - చేస్తినో తండ్రీ
కన్న బలిమిని గుమ్మడంటిని - కరుణ జూడుము దేవమణినను
కరుణతో హరిదాసు నేలిన - కాకుళాధీశా॥

---

# బాల క్రీడలు

శ్రీ రమణీ విభుడూ - సకలా - శ్రితజనవత్సలుడూ
నారాయణుడూ - నాతికి పురుషుడు
విను నందుని యింటా - లీలా మానుష విగ్రహుడై
వినిపించెదనా - వృత్తాంతంబులు - వినవేడుకలౌనూ
వాలాయముగానూ - ఇదుగో - బాలక్రీడలనూ
బాల క్రీడలు - వింటే పాపము - పరిహారములగునూ
నందుడి దేశమునా - గోవుల - మందానందములై
వందిభాడుచును - మునుకొని వచ్చెను - ముకుందుడుదయించె
కొల్లలు గోవులునూ - తమరే - పల్లెవాడలోనూ
కొల్లలు గొల్లలు - పాడగనేమిట - కొదువలేదు సుమ్మీ
ముఖముల్వేడుకతో - దాగుడు - మూత లాడుకొనుచూ
మూత లాడుచూ - నవ్వుచు కేరుచు - కొంగుజార విడిచె
వకతె చేతిపండూ - పుచ్చుకు - వకతై భక్షించీ
పండు పోయెనని పకపక నవ్వగ - పళ్ళు గిలకరించె
వుప్పళించె నొకడూ - చెవులో - గోప్యమాడె నొకడూ
ముక్కుపట్టుకూ - మలయుచు వచ్చి - ముఖము చేర్చెనొకడూ
వకడే పోరాడీ - తనమది - వకడై రాగానూ
నిగిడిపదము'కూ' - అరుస్తూ మరి - బెదరించెను వకడూ
గిరిగిరి గింతలునూ - బంతులు - వెన్నెల గాయగనూ
వడి బొంగరముల - నెవ్వడిగలయా - సుడిగాలి పడగలనూ
చిమ్మన చింద్రీలు - యింతికి - చిమ్మగ జారగనూ
సమ్మతి గిరిగిరి - పిల్లవాళ్ళను - సందడిచూపులను
చిత్తజు బోణిరో - దినదిన వన్నెలు - పెచ్చుగ గంతులనూ
చెంగుచెంగునా - వచ్చి యంతట - చిటమటకాయలనూ

సమ్మతి కిచకిచ - మేకపిల్లలే - సందడి చూపులునూ
మేలుగ నాడుచునూ - అవివక - లీలలు వెన్నుడిపి
బాలురతో గో - పాలుడు ఆడెడి - బాలవినోదములూ
బాలకృష్ణుడిపుడూ - తమ రే - పల్లె వాడలోనూ
పుట్టు దొంగతన మెట్లు - ఛరింతము - పురుషోత్తము దలచీ
చోర విద్యనేర్చె - మిక్కిలి - జార విద్యనేర్చె
అతివ కృష్ణునీ - వార్తలు యశోద - దేవికి జెప్పుదమూ
కలికి నీవు రావే - చక్కని - కంబుకంఠి రావే
మలయజగంధీ - రావే నీవో - మదనజనని రావే
ముద్దుగుమ్మ రావే - నీవో - మోహనాంగి రావే
పెద్దదానవూ - రావె కళావతి - ప్రేమావతి రావే
అని యింతులు తామూ - వకర్ని వకరు - పిల్చుకొనుచూ
మలయ సుగంధులు - తల్లి యశోద - దగ్గరకే తెంచ్రీ
ఏమే యేశోదా - నీ కొడు - కెంత దుండగీడే
మా మందిరమున - గలపాలన్ని - మరిగి త్రాగినాడూ
బిరబిర వారింట్లో - బిందెడు - నెయ్యి త్రాగినాడూ
వెరువక మా యింట్లో - కడివెడు - పాలు త్రాగినాడు
వెక్కసముగ తానూ - వెన్నా - గుక్క పీడకుండా
మిక్కుటమ్ముగా - తిని మరివక్కా - చెట్టు యెక్కినాడే
తరి గుండల పెరుగూ - తాగీ - వట్టికుండ తెచ్చీ
పొరుగింటిడి మరి - వారికి వీరికి - కలహము పెట్టెనే
పెరుగు తరచగానే - అంతట - బిరబిర తావచ్చి
వెరువక తన చె - క్కిలి కఱచెను కడు - విపరీతము కదవే
గొల్ల వాడకేగీ - మీగడ - కొల్లగ తా దినీ
గొల్ల చేడెలా మూతికి రాచెను - పల్లవ పాణిరో
వెక్కిరించుకొనుచూ - ఒక వృ - ద్ధాంగన పట్టుకొనీ
చిక్కు పట్టుకు - ఏదే అవ్వా - శివమాడు మనెనూ
శింగొంగీ పనులూ - వీనివి - చెప్పతరము గాదే
ముందరె దేవుని - బోనం వండితె - ఎంగిలి చేసెగదే
మందయాన కొమ్మా - కొలుపుకి - ముందరి బోనములూ

చిందర వందర - చేసినాడిదీ - చెల్లుబడే నటవే
అందముగా మేమూ - వాకిట - దేవర గొలువగనూ
పందిలి వేసితె - కాళ్ళదన్నె మరి - పాపముగాదటవే
ఇంపుతొ పోలమ్మా - ముందర - వుంచిన పూహారములూ
పెంపుడు కోతికి - పెట్టివచ్చెనవి - బిడ్డల పనులటవే
గోనబోయెడింట్లో - చక్కని - కోడలి పడుచునకూ
అర్ధరాతిరీ - పొద్దుకాడతే - లంటబెట్టె గదవే
యెల్లప్పుడు మమ్మా - కలుసుకు - యెడబాయక వుండే
గొల్ల నెలతలను - గట్టిగ బట్టగ - నీ కొడుకే మగడూ
వాసిగాను మా - వయసులన్ని మీ - వాడికి దుంబాలా
అని ఈ లాగుననూ - గోపిక - లంతా జెప్పగనూ
విని యశోదా దే - వప్పుడు వారికి - వాక్రుచ్చెను యిట్లూ
యేలాగేలాగూ - మావా - డేమే మీ యింటి
పాలును పెరుగును - వెన్న దినునమీ - భవనమ్ముల కొచ్చి
పాలు నెయ్యి బోసీ - గిన్నెలో - పంచదారం వేసి
బాలకృష్ణచే - కొమ్మన గిన్నెడు - పాలయినా గొనడూ
ఏ కడుపున తాగూ - మీమీ - యిళ్ళలోని పాలూ
వాక్రుచ్చంగా - నోరెట్లొచ్చును - శ్రీకృష్ణుని మీదా
విన్నవారు కారా - బిడ్డల - కన్నవారు కారా
ఎన్ని సుద్దులూ - పన్నేరే మా - చిన్నవాని మీదా
కసిగందుని బట్టీ - మాటలు - కల్పనశాయుదురా
చిన్నవాడు మీ పాపల - బోలెడి - పాపడుగాదటవే
గండము లిప్పుడునూ - కలవే - కలికి కృష్ణునికి
దండి రక్కసీ - వచ్చిన యప్పుడు - గండ మొకటి గడచే
బండిరాపు తప్పె - అదివక - గండంబై గడచే
మద్దులు విరువగనూ - అదివక - గండంబై గడచే
చెల్లంబో మేమూ - కంసుడు - చేసిన మాయలకూ
చల్ల వేళ్ళనూ - పూదుకు త్రాగుచు - సమయము గడుపుదుమూ
తరుణులార వీణ్ణి - చూచితె - దయలేదా మీకూ
శిక్షించెద బా - లుని దండించెద - కోపము శాయకుడీ

అని వారలనెల్లా - తమతమ - వాసమ్ములకనిపి
కూరిమితోయే - శోదకుమారుని - చేరగ పిలుచుకొనీ
యేమిర శ్రీకృష్ణా - దొంగప - నీలాగు శేయకురా
జారుడవని నీవూ - ఖాపలు - చాల చెప్పినారూ
పవు మీరగా - జారుడనైతే - అంతా యెరుగరశే
కల్లలాడ బోకూ - గట్టిగ - దొంగవు ఇక నీవూ
తల్లికి నీకూ - వెరపని పించగ - దండించుట లేదూ
అనుమతి వచనమునూ - ప్రేమతో - అపుడు గోపిదేవి
విస్మృతి నొందుచు - విడియం మేన - శ్రీ గంధములలదే
శ్రీవల్లభ జోజో - యిటువలె - శింగజోప జోజో
నమ్మిన వారిని - రక్షించేటి - నారాయణ జోజో
మంగళకర జోజో - కృష్ణా - మా వల్లభ జోజో
స్థిరముగాను సిరులిచ్చి - ఎప్పుడూ - కావవయ్య కృష్ణా.

---

# కృష్ణలీలలు

'భృంగిగాడు పాటవలె'

వినవమ్మ యశోదమ్మ నీవరతనయుడు చేసేటి దుడుకుపనులు
పట్టి విచారింపబోతె భారత భాగోతమాయెను
ఎట్లనే ఇక ఎట్లనే, యశోదమ్మ ఎట్లనే ఇక ఎట్లనే॥

అయిదు ఏళ్ళ బాలుడు వాడెంతవాడు ఏమిచేసెను
మరుగుబెట్టక దాచక ఆ మర్మములనూ విప్పి చెప్పరె
చెప్పరే, చాటి చెప్పరే ఆ ఘాతలేమొ చెప్పరే చాటి చెప్పరె॥

దొరబిడ్డ అనుచు మేము దూరి చెప్పలేము కాని
చిరుతవారలు ఇట్లు సేయగ ఎరుగమెన్నడు ఇరుగుపొరుగుల
పోరి యడుగవె నీవె యడుగవె యశోదమ్మ నీవె అడుగు ॥ఎట్లనె॥

ఇంత దుడుకు ఏమి చేస్తిని నావంటి వారు లేరమీకు
ఎంతకైన సాహసులు ఇంతులు ॥ఎరుగనే తల్లీ ఎరుగనే॥

సందులోనూ చిన్నకోడలు జలకమాడుచు నుండగాను
ఇందు ఎవ్వరులేరు దానమిమ్మనీ చెయి ఒగ్గినాడు ॥ఎట్లనె॥

ఆడవారి చోటికి మగవాడవై ఏమిటికి బోతివి
చిన్న పిల్లను దానమిమ్మని వేడ నీ కచలేమి యున్నది
ఏమిరా కృష్ణా యేమిరా గోపాల కృష్ణా ఏమిరా కృష్ణా యేమిరా

పండ్లు పండిన కిచ్చిలి చెట్లుండగా నేనందు కరిగితి
పండ్లు ఇమ్మని దోసిలొగ్గితి పైని నాకేమి తెలియదమ్మా ॥ఎరుగనే॥

పెరుగు జిలుకుచు ఉండగా మరుగునను నిల్చుండి వెన్నను
నాల్గుచేరల తీసుకుని తా బిరబిరను ఉటికేసినాడు ॥ఎట్లనే॥

అడిగినంత వెన్న నీకు పెడుదును మన యిండ్ల లేదా
ఇరుగు పొరుగూ ఇండ్లకేగి దొంగలీ తినబోవనేల ॥ఏమిరా॥

దేవరకును పెట్టలేదని ఆవరకె అనుకొంటూవుండిరి
దేవరేమొ మింగిపోయెను తెలియక నామీద పెట్టిరి ॥ఎరుగనే॥

గొల్లపిల్లలంత గూడి చల్లలమ్మాబోవ కృష్ణుడు
చిల్లరాళ్ళతో చల్లకుండలు చిల్లులూ పడవైచినాడు ॥ఎట్లనె॥

గొల్లపిల్లలంత గూడి చల్లలమ్మాబోవ నీవు
చిల్లరాళ్ళతో చల్లకుండలు చిల్లులు బడవైచినావట ॥ఏమిరా॥

చల్లగా ఆ సమయమందు వడగండ్ల వర్షము కురిసి కుండలు
చిల్లులేమొ పడినావి చిల్లరాళ్ళని ఏలాగు చేతును ॥ఎరుగనె॥

వేణునాదము ఊదుకుంటూ వేడుకలతో పాడుకుంటూ
మేదక పిల్లను పట్టుకొనీ బెదరబెట్టి వైచినాడు ॥ఎట్లనె॥

సరసమైన సాధుపిల్లల గురుతుతోటీ ఉండవద్దు
అంటె పిరికిపిల్లలొద్ద కెళ్ళి దినదినము ప్రియాడుతె స్తవు ॥ఎట్లురా॥

అరుగుమీద చెలులతోటి ఆడుకొంటిని అంతకంటె
ఎక్కువ యేమి యెరుగనే ఓయమ్మలారా ॥ఎరుగనే॥

నోటినిండా విడెము పెట్టుకు నీటుకాటుక చేరిరాగ
బాటలో నిల్చున్న కాంతకు పాపపై ఉమ్మేసినాడట ॥ఎట్లనె॥

చూడలేదే అమ్మ నేడు చేడెలెక్కడ చిన్నవాళ్ళు
ఆడుకుంటూ ఉండి గోడబారుపై ఉమ్మేస్తె పడెను ॥ఎరుగనే॥

గడియగడియకు వచ్చినాడు నీటుగా కూర్చుండి వచ్చి
చెలుల మీద కన్నువైచి బుగ్గలను కొరికొచ్చినాడు ॥ఎట్లనె॥

చక్కని శ్రీకృష్ణ రమ్మని చెక్కిలికి ఒక ముద్దు నిమ్మని
రక్కసివలె నన్ను బట్టిన వక్కవన్నుతాకె నేమొ ॥ఎరుగనే॥

ఉట్టిమీద పాలు నెయ్యి చక్కగానే జుర్రుకుని తా
నెక్కువైనా పెరుగులంతా ఎంగిలీ చేసొచ్చినాడు

ఇరుగు పొరుగు ఇండ్లకూ పోవద్దురా అంటేను వినవు
ఎరుగజేయుదు మాను మీ రోటికి కట్టివేతు నిన్నిక

నేను ఇంటిలో నుంచి పోలేదమ్మ నేడు కానిపోని
మాటలను కల్పనచేసిరి మగువ లిందరు నాదుపైని

నిన్న రాత్రి చలగాలి నీటి కూదుకుంటె మేము
బోటులా మా చెయ్యిబట్టీ చాటునకు రమ్మని పిలచె

చాకటనగ తిరిగి నీవు చిన్నవాడవై యుండి
కన్నకడుపూ ఎట్లు ఓర్చును నిన్ను విడచీ కన్నతండ్రి

చెలులు చెప్పిన మాటలన్నీ స్నేహమై యున్నావి నీకు
పామునైన పట్టి శాపలు చేసెదను నే నేమి యెరుగను

గౌరి పూజచేసి కొలనిలో ఆడుకోపోతె కొలనులో
తాను వచ్చి మమ్ము కోర్కెలు తీర్చమనెను చోద్యకాదు

గోపివద్ద పోవద్దురా అని అంటె వినవూ ఎన్నినాళ్ళు
తపసు చేసితి నిన్ను కంటిని తనయుడా ఓ చిన్ని కృష్ణ

ప్రేమతోనా రాయవాక్యము స్వామి మేడలయందు నా దగు
సాటులయితే చాల గలరు చాల చెప్పుదురమ్మ నీతో

# కృష్ణుని ముద్దులు

ఈనాడు లీవాడ లేవాడ లనగా - యెన్న యెనుబది లక్ష గొల్లవీధులను
ముత్యాలు పగడాలు ముంగిళ్ళ నుండు - రత్న మాణిక్యాలు రాసులై యుండు
పెరుగు కడవల వెన్న పేరిన్న నెయ్యి - కలశములుగా నిండి కడమోసియుండు
అన్నమూ పాయసము అమృతాన్నములు - జున్ను మీగడలతో నిలవైయుండు
సంధాన కరణియు సంజీవ కరణి - వలనైన రంభయూర్వసి మేనకాది
సుందరులకు పరగ సౌందర్యమయిన - శ్రీలక్ష్మి ఘనమైన శ్రీ సమూహోలు
నల్ల కలువలకన్న నసకంపుమేను - గొల్ల బాలురతోటి గోపాలకుండు
నంద గోపసుతుండు ఉండనిరవాయె - రెండో వైకుంఠమైయుండె రేపల్లె
చూడ నద్భుతమైన సుఖసన్నిధులు - చూచి యెరగని దా యశోద యిట్లనెను
నాడు మీ యిళ్ళలో నాదు కృష్ణన్న - పాలెల్ల త్రాగెనని పలవించినారు
నిన్న మా యింటిలో నిండుకొనియున్న - వెన్న బాలుడి కడుపు కొన్నారగించె
బల్లిదుడు నీ కొడుకు పడతి వినవమ్మ - కడవలతో వెన్న పాలారగించు
సంతుష్టి బొంది సౌభాగ్య సంపదలు - యిది చూడ చోద్యమే యశోదదేవి
తల్లి నీ కొడుకు యీ తరముగాదోట - తొల్లి యెరుగక మేము దూరితిమి అమ్మ
చిన తప్పులన్నియు కొల్లచేసితివి - వినవె యశోదమ్మ విన్నపంబొకటి
ఘనుడు శ్రీకృష్ణుని సంకల్పమైన - సంపన్నపోట ఇది సాధ్యమ్ముగాదు
బక్క బడుగైనట్టి బ్రాహ్మణోత్తముడు - ముక్కటుకులో రెండు ముడుచుకొనిరాగ
చెట్టబట్టి యతని చెయి తొణుకులాడి - గీర్వాణపతి ఒక గింజ రాలించె
రోయక పొమ్మన్న రోళ్ళరోకళ్ళ - కిందరాలిన నూక గింజేరుమనను
సక్తి జేసుకు వాని సతమారగించి - సత్యవంతున కిచ్చె నిత్యవైభోగం
మిగుల ముప్పందుము మిరియాలబోనం - అధిక పదార్థములు అయత్త పరచు
దుర్యోధనుల విందు దూరుగాచేసి - పక్షపాతముచేత పాండవుల పట్టు
ధూసర అన్నమ్ము దోసవరుగులును - విదురునింటికి బోయి విందారగించె
చాల సౌభాగ్యము సంతుష్టి పొందు - పుణ్యాత్మునీ బట్టి భువనములు మెచ్చు
చాలు పదపద కొడుకు జాణమెరుపులను - యెల్ల దేవతలెరుగుదురశోదదేవి
గొల్లలు గోపులును కొలుచుకొని రాగ - తన నగరికేతెంచె తన సుతుడుతాను
వనితల ఒప్పుగా విందుచేయించి - శ్రీ విష్ణుమూర్తయిన శ్రీ కృష్ణమూర్తి

ఆ విశ్వమూర్తయిన ఈ కృష్ణమూర్తి - ఆ యశోదాదేవి ఆలకించి పిలచె
అన్న రావే కన్న చిన్నారి పొన్న - నాయన్న రావయ్య ననుగన్న తండ్రి
ఘోర మీనయిపోయి సోమకుని జీరి - ఆ వేదముల కాచు అచ్యుతా రావే
ధరణి కుంగిననాడు దయతోడ నెత్తు - కూర్మావతార శ్రీ గోవింద రావే
ధరణి శోధకుడైన దానవుని జీరి - వరాహ రూపయిన శ్రీ వల్లభ రావే
కంబమున వెడలి హిరణ్యా కశ్యపుని గోర - చీరివేసిన నారసింహ రావయ్య
బ్రహ్మచారయిపోయి బలిని యాచించి - భూమి వలగొన్నట్టి వామనా రావే
ఇరువై యొక్క మారు క్షత్రియుల జంపి - వ్రతము నడిపిన పరశురామ రావయ్య
రావణ కుంభ కర్ణాది రాక్షసాంతకుడా - రాజైన దశరథరామ రావయ్య
- గోకులానకు రామకృష్ణమ్మ రావే
వీర వ్రతములు చెఱపి వైరులను గెల్చి - తగవుల బుద్ధావతార రావయ్య
వెలి తురగము నెక్కి సజ్జనులగాచి - కల్యాణ మూర్తివై కలికి రావయ్య
కాళంగి భుజగవర కల్యాణ సంగ - శ్రీరంగ జయరంగ శృంగార రావే
అక్రూర పాంచాలి అంబరిష వరదా - పాండవ కృపవరద పరమాత్మ రావే
సుజ్ఞాన జనవరద సుగ్రీవ మిత్ర - శ్రీబోణి శ్రీవరుడ సుందరుడ రావే
విభీషణ వరద విదురుడీ విందా - విటరాజ.... శ్రీ విభుడ రావయ్య
బృందావన ప్రియుడ భూమి పతిపాలా - నంద నందన గోపనాయకుడ రావే
నారద సనకాది వందన ప్రియుడ - రాధాంగ నాలింగ నాధుడ రావయ్య
రావయ్య బలభద్ర రామకృష్ణమ్మ - ఇనవంశ రత్నాల సోనరావయ్య
గోపికల రవరవలు పొందితివి నీవు - నవనిధానములు నా నగరిగలిగుండు
అన్యాయములుచేయ అచ్యుతా తగవ - పదునాల్గు భువనాల స్వామివే నీవు
నవనీతములు పాలు నాయింట గలవు - పొరుగిళ్ళకే ప్రొద్దుపోకు నాయన్న
యేలయ్య రాజ్యాలు యేలువారలకు - నీలవర్ణుడ నీవు నిందపడరాదు
కంట్రకములేల వైకుంఠ వల్లభుడ - అంట కంటక మనసు అంటినట్లుండు
అంటక పూర్ణ కళలంటినట్లుండు - యింటింటి వారు పొడగంటి మనేరు
దోష మెరుగని వాని దొంగ దొంగనిరి - దొంగిల బోవుటలు దొరతనమె తండ్రి
యిట్టి పుణ్యాత్ముడవు రట్టయితివన్న - పట్ట భద్రుడవయిన పట్టినాయన్న
నరుల నెరుగను నేను నను రవ్వచేసి - తొల్లి యెవ్వరు నాదు తోవయెరుగారు
కోటబోయని చాన అనుచు తన పేరు - ఎల్ల వారికి కల్ల యశోదనయితి
నిండారి నా యెదుట నుండగా జూచి - నిత్య కల్యాణమే నేడు నా యిల్లు

బుద్ధుల మూట నా బుద్ధావతార - ముద్దుల తండ్రి నా ముందరికి రావే
తల్లి వాక్యములా తా నాలకించి - ఉల్లాసమున పొంగి ఉబుకుతూ వచ్చె
అడుగడుగుకును గజ్జెలందియలు మ్రోయ - మొలగంటల పసిడి మువ్వల్లు కదల
కౌస్తుభము పులిగోరు కంఠనిగళమ్ము - ముత్యాల రావిరేక ముందరతూల
ముద్దు గురియుచు తల్లివద్ద గూర్చుండె - పసిడి కలశములతో నుదకంబు దెచ్చి
మువ్వ చాయలు గడిగి మొగమొప్ప గడిగె - కుమారుడైన గోపాల కృష్ణమ్మ కపుడు
పరగ హారతులిచ్చి బహుమతులిచ్చి - యశోద పలుకు విని "యశోదదేవి"
అరయ కృష్ణావతారమయి రాగ మునులు - తపసులు చేసిరి మునులు దేవతలు
కోరి ముప్పయిమూడు కోట్ల దేవతలు - గోవులై నారుసుమి గోపిదేవమ్మ
వెలసి తొంభై తొమ్మిది కోటుల ఋషులు - గోపగోపికలైరి గోపిదేవమ్మ
నాడి మా వద్ద వైకుంఠలోకాన - వేడుకల మముగూడి వేగించువారు
శ్రీబాల గోపాల శృంగారలీల - పుణ్య కథలైనట్టి పుణ్య చరిత్ర
వేదాంగములు చదువ వేదవేదాంగ - యీ యాశ్రమాల బోలిన పుణ్య కథలు
దశకుల అష్టాది దశపురాణాలు - మానితమైన దశమస్కంధమనుడి
పూని యెవ్వారయిన భూలోకమందు - అన్నాను మన చెవుల విన్నమాత్రమున
ఆకాశ పరిగాలి అంతపొడుగైన - దూది నిప్పును గూడి ధూమమైనట్లు
యెన్నగల పాపాలు యెన్నయిన మూగు - అన్నియు నిముషమున హరియించిపోను
శ్రీ గౌతమీగంగ సింధుకావేరి - భాగరథీ గంగ భవనాశి కణ్వ
మణియైన సాగరమణి కన్యకను - కూడలి తీర్థము కుండలానదియు
సప్త గోదావరులు సమస్త నదులు - ఇదిగో స్నానఫలము ఇది సంభవించు
యీ పాట యెవరైన పాడినా విన్న - పుత్ర సంపదగలిగి పుణ్యులయ్యెదరు.

---

# బేరి పండు పాట

శ్రీకాంత వల్లభా దివ్యచారిత్ర - ఏకచిత్తంబునా నిన్ను నే దలతు
అవనిపతి హరికథలు ఆనతిమ్మనిన - వినయమున శుకయోగి వినిపించెనంత
పరీక్షితు వినగ రేపల్లెలోను - హరి బాలలీలలు ఆడేటివేళ
బోయ పెద్ద అనియేటి పణతి వక్కాణ్తి - ఆవిడ ఒకనాడు అడవికేతెంచి
మాగిన మంచి బేరి పండ్లుకోసి - వేగమే గంపకు వెలది తాబట్టి
శిరసునా పెట్టుకొని శృంగారమైనా - అరుదుగా రేపల్లె కమ్ముకోవచ్చి
పండ్లు కొనరే బేరపండ్లు మీరనుచు - ఇండ్లిండ్ల వారినీ యెలమితో బిలచె
నడి వీధిలో గంప నలినాక్షిదింపె - సొమ్ములు హారములు సొలసి పసిండి
బొమ్మలవలె వత్తు పణతులందారు - పచ్చి పగడము సరిపచ్చనో చాయ
అచ్చమైన బేరి చెక్కరో పండు - పండ్లు కొనుక్కుందమని పణతులందారు
యిండ్లిండ్ల వారు తమ ఇండ్లకే జనిరి - కుందనపు బంగారు గొప్ప మెరుగులతో
పొందుగా నవరత్న పుటికెల్లలోను - ముచ్చప్రాలు దెచ్చి ముగుదవడిబోసి
అందరూ పండ్లుగొని అరగంగ జూచి - కొత్త ఫలములు కొనుక్కుని ముచ్చుగాను
ముత్తైదులందరికి ముదముగా బెట్టి - పండ్లుకొని భక్షించి పద్మలోచనలు
ఇండ్లిండ్ల వారు తమ యిండ్లకే జనిరి - ముద్దునా బోయెనా ముద్దుకూతూరూ
పెద్ద హంకాశైన పేరైన పడుచు - ఆ వనిత పండ్లుకొని అరగంగ జూచి
ప్రేమతో చనుదెంచి బలరామకృష్ణు - అట్టట్టె నలుదిక్కులందంది చూచి
చుట్టుచూ గంపకూ చుట్టునందాగి - పద్మాక్షి చెయినున్న పసిడికంకణము
పద్మనాభులు దీసి పండ్లాపెకిచ్చె - పూరింపుచును పండ్లు వడినిండగొని
చప్పరింపుచును - నగధరుడ ఇది మంచి తగవు చేసితివి
నగవార్ని యెరుగవా నాడు మీయమ్మ - రోలు గట్టిన నాటి రోషమ్ము సిగ్గు
నీల వర్ణుడ నీకు మనసందులేద - అల్లదుగో కంసుండు హరిబట్టుమన్న
గొల్లబోయెలవారు కూడివున్నారు - కాటబోయిలవారు కలరు పెక్కండ్రు
ఎలమితో మా మేనమామలున్నారు - బలమికల పట్టింతు బలము కద్దు

మందలోపలికెల్ల మరిపిన్న పెద్ద - మందలో వున్నారు మా మామగారు
జలజాక్షి కంకణం తెచ్చి ఇమ్మనెను - నీకు కంకణ మెద్ది నీ వెవ్వరనుచు
పోకిళ్ళు పోకుమని పొమ్మనీ తోసె - నోరెల్ల తెరచుకొని నుంగాయపడుచు
ఊరెల్ల కటకటా వుండె యేడుస్తు - వూసరించిన శిరసు వుంచి యా బాల
నోట్లోను ఎంగిలి గింజ లుమ్మేసి - ఎంగిలీ తింటివని ఎకసక్కె మాడె
అంగజాగురుడంత అరిగెమందకును - ముద్దునా బోయి నీ ముద్దు సతివచ్చి
గదియించి కూతుర్ని కౌగిటా జేర్చి - నీ తెరవు వచ్చినా నీతు లెవ్వారు
నాతోను చెప్పవే నా ముద్దు పట్టి - మన కృష్ణుడే కాని మరియెవరుకారు
పొరుగూరి నుంచి ఒక బోయతావచ్చి - అరుదుగా తీరపండ్లమ్మగ జూచి
వొప్పుగా నాచేత వున్న కంకణము - పద్మనాభులు దీసి పండ్లాపె కిచ్చె
నోట్లోను యెంగిలీ గింజలుమ్మేసి - యెంగిలీ తింటివని యెకసక్యమాడి
అంగజాగురుడంత అరిగె మందకును - అనుచు కూతురు చెప్ప ఆ గ్రహముతోను
తమతోటి గొల్లలతో చెప్పమన్నారు - మన యింటి పట్టికొక మాట వచ్చింది
మనము యశోదతో మరి చెప్పవలెను - కలిగినవి మన యింటికొని కొనగనచూ
పూని పెట్టగ మనము పోదమందరము - ఆ చిన్న పిల్లకొని అతివలందారూ
శ్రీపతినగరికి శీఘ్రమున వచ్చి - గడపలెల్లా దింపి కాంత యశోద
చరణములపై బడి చెలియలిట్లనిరి - కోపమ్ములేక విను గోపిదేవమ్మ
యీ ప్రొద్దు మా మనవి ఇంతలేదనక - పొరుగూరి నుంచి ఒక బోయతావచ్చి
అరుదుగా తీరపండ్లమ్మగా జూచి - మా చిన్నపడుచేగి మరిపండ్లు కొనగ
మీ చిన్ని కృష్ణమ్మ మెల్లగా వచ్చి - పడుచు కంకణం తీసి పండ్లాపెకిచ్చె
పడుచు నోట్లో యెంగిలి గింజలుమ్మేసి - యెంగిలీ తింటివని యెకసక్యమాడె
అంగజాగురుడంత అరిగె మందకును - పుట్టరే బిడ్డలు భూలోకమందు
ఇట్టి వానిని మేము యెన్నడెరుగాము - కలిమిగలిగితె కుడిచి కట్టవలెగాని
ఎలమి ఇల్లాండ్రతో యెకసక్కెమేల - పేరుగల తన కాంత పెద్దకోడలు
వారికీ ఘనమైన వా రాదబిడ్డ - బెంచనా బోయెను చెల్లెలీ పడుచు
మందనా బోయెను మరదలీ పడుచు - అంకనా బోయెను అల్లుడీ పడుచు
పంకజనాభులు ఎంగిలుమ్మేసి - కూరిమిగ తన పతికుల సతులతోను
నారాయణుడు ఎంత నగుబాటుచేసి - కోమలీ పడుచుల కోడిగంశాయు
అరియున్నా వేణుకల నటూచాయు - చంటిబిడ్డాచేతి చక్కిలాలన్ని
వెంటనే అడుకొని యింటికేవచ్చు - యింతి మా యింటికి వచ్చునా పట్టి

కట్టివేతుము చల్ల కంబమున కనిరి - అని యిట్లు ఇంతులూ ఆడు వాక్యములు
విని యశోదదేవి వారి కిట్లనెను - సతులెల్ల గూడి చల్ల కంబమున గట్టా
అతడు సామాన్యుడా అమరశేఖరుడూ - భూతకి మొదలైన భూరి రాక్షసులా
ప్రాణముల పీల్చెనె పాలతో తాను - మడుగులో కాళింగు పడగలామీద
అడుగులా నాటించి ఆడె తాండవము - గోవర్ధనా గిరిని గోటపై కెత్తి
గోవులను కాచె వైకుంఠ నిలయుండు - అచ్చ బాలురీతి వగుచ్చు గాడనుచు
అక్షయము నిలపె వైకుంఠ నిలయుండు - హరికి ముందే తపము ఆచరించితిరి
హరియిచ్చు మోక్షములు అనుమాన మేల - అపరంజి కంకణాం కనికాదు మేము
చపలాక్షి హరి మహిమ చెప్ప వచ్చితిమి - ప్రియమార పెంచిన బిడ్డలము మేము
దయమరువకా వుండు తల్లివని మ్రొక్కి - వసుధేశ శేషచల వైకుంఠ నిలయా
ఛందముల దురితములు పోదోలుదేవ - అజ్ఞాన కృత దోషమణచి రక్షించు
ఎక్కువగ కృష్ణ నిన్నె మడుగలేదు - చక్కంగ ముత్తయిదు తనమునా కియ్య.

# శ్రీ కృష్ణుని చల్దులు

[ 'కాళింగు మడుగుదగ్గర బోకుమా కృష్ణ'

సృష్టిలో వెలసినట్టి - శ్రీ వాసిష్ఠు తెల్లగోలువా
శ్రీకాంతుని వల్లభులకూ - శ్రీమహిమలు విస్తరింత్రూ
వేడుక రెండే పదములు - ఉభయాకారుండని పాడా
కాళింగమర్దనులకు - ఘనమైన కల్యాణమ్ము
పంచ శతకోటియోజన - విస్తీర్ణమైనా పృథివీ
ఆత్మారక్షించా ఉదయ - మైతిరి రాజీవలోచనులు
చెన్నగ గోపకుమారుల్యా - చేకోలలు చేతనుబట్టుక
శ్రీ కృష్ణా గోవులుగాయను - పోదామా ప్రొద్దునలేచి
అని విన్నపములు సేయగ - అచ్యుతులూ మేలుకాంచ్రీ
అవధరింపుతులేచి - ఆనందమున పొంగి
త్రైలోక్యవల్లభులు - తమతల్లితో అనిరి యిట్లూ
గోవులను కాయవలెను - చాలా ప్రొద్దాయెను మాకూ
అనుచూ తన పట్టి లేపగ - ఆనందామున గోపి
అఖిలాండనాయకులనూ - అంకించీ పిలచే తల్లీ
సకలకల్యాణా నిలయుడ - సకలాగుణ శీలుడ
పరంజ్యోతి తేజోనిలయా - బల్లిదుడ మేల్కొనరో
శ్రీ పరమాకల్యాణుడా - సృష్టికి కర్తవైనా
క్షీరాబ్ధీ శయనుడైనా - తనయుడ మేల్కొనరో
అమి వరదా శుభనిలయుడ - ఆనందసాగరుడా
ఇందిరానంద కరుడా - యదునందన మేలుకొనరో
గ్రాహము తాకిన కొలనా - గజరాజు మకరిచేతా
ఆర్తిచే గొలువ భక్తి - ఆలించివిన్నాదేవ
పాంచాలీ వలువలు వేగా - దుశ్శాసనుడు సభనొలువా
అక్షయంబుగ వలువల - నొసగిన హరి కృష్ణా
పూతకి ప్రాణసంహార - మాకల్లా ఉదయమైతి

క్షత్రీయవర్గము లణచిన - పుత్రూడ మేలుకో
శశధరుడు అర్జునుడు - దిశలెల్ల ద్రుంచవేసి
ఆధారములేక అంతా - వృక్షంబున నుండెనపుడూ
కమలాలోచనులు తమరు - కరుణించి తలచనపుడె
శరణాగతుల రాజ - చయ్యన మేలుకొనరో
మత్స్యావ తారమున - అచ్చాగ అసురుని చీరగ
చొచ్చి వేదములు నిలిపిన - వేదా వేద్యుడ లెమ్మా
కూర్మావ తారమున - కొండపీపున ఆని
అమరూల కమృత మొసగిన - ఆది కూర్మము లెమ్ము
నట్టేడూ సముద్రములు - ధరణిపై కలసీ పార
వసుధా కొమ్మున యెత్తిన - వరహావతారుడా
అదరీ రక్కసులూ తమరు - బెదర స్తంభమున వెడలి
హిరణ్యా కశిపుని చంపు - నరసింహావతారుడ లెమ్మి
బాలప్రాయమున తనరు - బలిచక్రవర్తి నపుడు
మూడే పాదమ్ములు అడిగిన - మురవైరి మేలుకో
కార్తవీర బాహులు వెయ్యీ - ఖడ్గంబున ఖండించి
క్షత్రియ వర్గము గెలిచిన - పరశురామావతారూడా
వాలీ మర్దనుడ - వారధి బంధనుడ
సుగ్రీవ హితుడవైన - సూర్యవంశుడ మేలుకో
సేతూ బంధానుడా - శ్రీ లక్ష్మి వల్లభుడ
రావణవైరి వైన - రఘునందన మేలుకొనరో
గోపీ నందనుడ - గోవర్ధనోద్ధారుడ
గోపికా ప్రాణవల్లభ - గోపాలుడ మేలుకొనరో
హలాయుధమ్ము బూని - అన్ని తీర్థములు తిరిగి
అవలీలగాను వచ్చిన - బలరామావతార లెమ్ము
రుద్రునికి త్రిపురములు - అగ్గాళమయ్యేనంత
మగనాళ్ళ మానము గొన్న - బుద్ధావతారుడ
కాళంగి మర్దనూడ - కౌస్తుభ హారమువేసి
కలియుగ దుష్టుల జంపిన - కలికావతారుడ
అమి వరదా శుభనిలయుడా - ఆనంద యోగనిద్ర

ఎప్పుడు మేల్కొంటిరి - ఇదుగో గోపకుమాళ్ళు
అనుచూ తిరుబోనం దెంచీ - చల్లారబోసెను చల్దీ
దధిచాల శొంఠీ వేసి - మృదువుగా కలిపెను చల్ది
ఓ యమ్మా కలిపెను చల్ది - ఒప్పా చిక్కములోనుంచీ
మృదువైనా పచ్చళ్ళన్నీ - చల్దిపై నుంచెను తల్లి
వాక్కాయ వద్దికాయ - వొప్పైన మామిడికాయ
వూరిన అల్లంతోను - వుసిరీ కాయను వుంచె
చల్లించిన మిరియపు గెలలూ - జన్మపుల పెరుగులతోను
అల్లమ్ము ఆవకాయ - అనేకం వుంచెను తల్లి
చెన్నూ భావించీ చూచి - శిరిపాదములు కడిగీ
ముద్దుతో ఒప్పునట్లూ - ముఖపద్మ మొనరించె
నారికేళపు కురుల - తలదువ్వి పాపిటతీసి - కొప్పూ వొప్పుగ ముడిచే
చేమంతులు చంపాకములు - చెంగల్వలు నడుమనుంచే
అతివీరులైనా మల్లెలు - అనేకం ముడిచెను తల్లీ
వొప్పూగ కమల నేత్రి - ఉభయా భాస్కరులకు
బాగుగా చందనమ్ము - బలచందనం అలదే
కడువొప్పు పాదములకు - గండూ కడియములుంచె
కనకంపు గజ్జెలు గట్టి - ఘనమైన తొడుగులుంచె
మెరుగూ మొలనూళ్ళ బెట్టె - మేలైన సొమ్ములు బెట్టె
అంగుళీయ ముద్రికలు - మురవైరి కొప్పబెట్టె
వజ్రాగోమేధిక పతకం వైడూర్య రత్నాఖచితం
సువర్ణపతకం కృష్ణుని - కంఠమున నుంచెను తల్లీ
పచులేని పచ్చాబొట్టు - బాగుగా దిండే జుట్టీ
ఖమిడీకాదారీ దోపే - తొమ్మండుగురు వెంటా నడువ
బాగుగా మళ్ళీచూచె - బంగారం వొప్పె బిరుదూ
నందూని సుతుడూ వెడలె - గోవులకాతా మనుచు
చిలకాలు పలికేటి మోత - గోవుల కొమ్ముల మోత
గోవుల తరిమెడి మోత - కాంతలు పాడే మోత
కోవిలాలు కూసెటి మోత - పుంజూలు కూసెటి మోత
నెమళ్ళు ఆడెడి మోత - నెమళ్ళు కూసెటి మోత

నాల్గోజామామాయెను పొద్దూ - నాథునికి విన్నాపములు
ఎత్తీ మూడెత్తుల మోత - ఉభయ పార్శ్వములయందు
ఏమీ భాగ్యముగలిగె - ఈమంద జనమువారికి
త్రైలోకదాతా పతికి - తల్లి యశోదాదేవికి
సర్వేశ్వరుడు పట్టినవేణు - సంచారింపుచు విన్న
మాత్రశ్రీ కార్యము - తలచినమోతా
అనుచున్న దేవగణంబులు - గగనమార్గములయందు
పుష్పంబుల వృష్టికురిసెను - పుండరీకాక్షులమీద
యక్షాకిన్నర గరుడ - గంధర్వ విద్యాధరులు
తుంబూరు నారదూలు - స్తుతియించి మిమ్ము గొలువ
చెంగలి గడ్డిమేసి - చేకొనుచు గోధనమంతా
యిందరపతి వద్దకువచ్చె - మందల్ల నడుమనిలిచె
చిటిచిట్టీ లేగాలన్నీ - చెవులు రిక్కించి చూచి
చెలువూనీ జేరవచ్చె - శ్రీ వేణునాదంబులకు
చిక్కంబున చల్దిదింపే - చొక్కంబుగ వెండీవలెను
అగ్రజులు అందీ ముద్దలు - అందంది వేయువారు
పదులేని పచ్చళ్లన్నీ - పుంగ్రాలు ఎగసనదోసుకు
వొప్పైన పచ్చళ్లన్నీ - వేళ్లనడుమను వేయ
బాలచంద్రుని చుట్టు - చాల పరివేషంవలెను
కూడెదరు గోపకుమాళ్ళు - మేలుగా ఒప్పేభక్తి
ప్రభాతసమయా మప్పుడు - భాస్కరులు ఉదయమవగ
బ్రహ్మాండ కోట్లు వెలగ - ప్రభుడూ చలిదారగించె
మవునంబున ఆరగించెను - మధుసూదన హాస్తములకు
పన్నీరు అవధరించెను - త్రైలోక్య వల్లభూడు
పచ్చి పోకలతోను - పండుతెల నాకులతోను
పచ్చకర్పూర విడియం - పరమాత్ము డవధరించె
అమరాంగనలు వచ్చి సంభ్రమమున విమా - నారూఢులై బ్రోవ ఆలంకమధ్యమున
భ్రమతూలై వారలు జూచితె పంచశతకోటి - విభ్రాంతులై కల్పవృక్షముల నీడను
కడుతిన్నగ మళ్లీ జూచి కమలానాథులు వేణు - బట్టెను కాంతలా చిత్తమమరా
మలహారి ఘూర్జరి పురమందున నో చిలుకా - పలికిన మాధవుండు దేశాక్షి భోజగమున.

సావేరీ భూపాలమునా - సరసిజ శ్రీరాగా
సర్వంబున నాదముబుట్టే - సనకాదులు అంజలిబట్ట
సతులూ తమ సుతులను వీడి - సర్వేశ్వరుని తగులుకురాగా
సతులూ తమ పతులను విడచీ - సర్వేశ్వరు తగులుకురాగా
అందారు గొల్లలు గూడి - ఆలోచనలు సేయుచుండ్రీ
పెద్దావాడందరు గొల్ల - పేదరికం తెలిపెను కృష్ణుడు
పండావాడందురు గొల్లా - పాపంపు మాటలాడ
సరిసైనా యిచ్చేగాని - సావంగనోపననెను
బింక్కంపు పరుడో గొల్ల - బిరుదూ పాటించీ చూసీ
సరినిచ్చే కష్టంకంటె - చచ్చుండుట మేలని పలికె
వివేకపరుడో గొల్ల - వివరించి తెలిపెద మీరు
మన మెవ్వరు మన సతులెవ్వరు - మధురాపురి కేగుద మనిరి
తల్లీ తండ్రీ కృష్ణుడు - దాతా దైవము గురువు
అచ్యుతుడె మన కందరికీ - ఆత్మాబంధుడని బలికె
కస్తూరి చుక్కచేది - కన్నులా కాటుక బెట్టీ
కస్తూరి ఒక చెలియా - కలయంగా పూసురువచ్చె
వొచ్చేనని వొక చెలితాను - పెచ్చుగ పోరంతూల
వచ్చేనని ఒక చెలిపేరు - గుచ్చార వేసుకొనుచు
కురులూ కుచములుగదల - బరువేణి అమ్మలు గదల
జలజాక్షి కృష్ణుని జూచి - నిలువూ నిలుమని బలికె
కనుగీటుచు కృష్ణుడు నందన - వనములోపాలకువచ్చీ
కనకామండపమున - కాంతా తెమ్మని బలికె
తెస్తినిదేవర యిది ఒక - పూర్వాజన్మ ఫలమున
దొరకేనని పరుగూనా - వచ్చెచెలి
వెన్నుడి వేణునాదం - చదివీన విన్నా వారికి
సాయుజ్య పదవీగలదు - సంసార భీతితొలగు
ప్రభాత సమయమప్పుడు - భాస్కరూడూ రాగ
ప్రభు నీ చలికోలలు మహిమలు - చదివీన విన్నా వారికి
సాయుజ్య పదవీ గలదు - సంసార భీతీ తొలగు.

---

# కాళంగి మడుగు

కార్యసిద్ధగుచున్న గణనాయకుండా - కరుణాకరా కొలుతు మాకు పటిమిమ్ము
చేతు వందనములు భారతీదేవి - భూదేవి నరసింహుల కొలుస్తు మాకిమ్ము
భూదేవి శ్రీలక్ష్మి పురుషోత్తములనూ - ముదముతో పూజింతు మూడు వేళలను
బ్రహ్మ సరస్వతి చేత వుపదేశమంది - దశ సహస్ర నామముల దేవుని పూజింతు
బాలకృష్ణుని యొక్క ప్రతాపలీల - వినుపించువారలకు విన్నవారలకు
అష్ట అయిశ్వర్యములు చాల గలిగుండు - పుత్ర సంతానమ్ము తాము అడిగినను
ఇలమీద ఇక జన్మమెత్తకే గొప్ప - ఆనంద సాగరము నోలలాడుదురు
దుర్జనుల సాధించి సజ్జనుల నిలిపి - క్షీరాబ్ధి శయనుడే జగమ్మువై బుట్టె
నందగోపుని యింట నారాయణుడాలు - మందతో పెరుగుతూ మరి వొప్పుచుండె
యమునలో ఘనమైన మడుగొకటి కలదు - నీల మేఘపు చాయ ఆ మడుగు జలము
పగడంపు తీగెలను పోకపండులను - వజ్రమ్ములా బోలు వజ్రంపు ఇసుకా
ఆణి ముత్యములబోలు అమరంపు రాళ్లు - చెదరిన కెంపులా సన్నంపుటిసుకా
గోమేధికల చాయ కొమరొప్పుచుండె - మాణిక్యముల కాంతి మరి వెలుగుచుండె
వైడూర్యముల కాంతి అది ఒప్పుచుండె - శృంగారమైనట్టి ఇసుక తిన్నెలను
పచ్చరాళ్ళతోను పగడ రేకులను - మన్మథ ఖచితమై మరి వెలుగుతుండె
ఇంతూలు మొదలైన దేవ కన్యకలు - వాలలాడుచునుంద్రు ఆ మడుగుదరిని
శరీరంలోగల జాడ్యమూలెల్ల - పరిహారమూ చేయునా మడుగు జలము
ఇంత ఒప్పిదమైన ఆ మడుగులోను - కాళింగుడనువాడు కడుపాపజాతి
విషములు కక్కుచు వుండెనే ప్రొద్దు - పన్నెండు శిరసులూ యోజనము పొడవు
పదితాళ్ళ నిలువు పర్వతం వెళుపు - రాహుబట్టిన సూర్యమండలమువలెను
చెదరినట్టే చెదరి కలగునా జలము - పశులా అంతరిక్షమున అడినను
ఆ గాలి సోకితే అవనిపై బడును - జీవాదులవియెల్ల ఆ మడుగుగాలి
సోకితే ప్రాణమ్ము నిలుపంగలేరు - శ్రీకృష్ణరాయులు వ్రేపల్లెనుండి
అసంఖ్యమైనట్టి ఆవుల మేపుచును - గొల్లభామలతోటి గోపాలస్వామి
అక్కడ వేణువును చక్క నూదుచును - కలియెండలగుచున్న కాలమ్మువచ్చె
నదులు చెరువులు కొలని జలములూ ఇంకె - మందల తోలుకొని మధుసూదనుడు
మడుగు చాయకువచ్చి పూరి మేపగను - పద్మనాభుల జూచి బాలురందరును

చేతులు మోడ్చుకొని చేసె విన్నపము - ఇదియేమి శ్రీకృష్ణ యీ మడుగుదరిని
యేమని వస్తిమి తెరవు తప్పితిమి - అనుచు వేగమె బోయి ఆ మందలన్ని
మళ్ళించగా చూచి మాధవుడు పలికె - కుంభిని కదలినవి జలము లన్నియు
నిర్మల ఉదకములు ఎచ్చటాలేవు - జలములు త్రాగుదము జడలికలు దీర
పర ఉపకారుడికి భయమింత లేక - ఆలమందలతోటె నా మడుగు దరికి
త్రాగి నిముషముతడవు నిలువంగలేక - ఆ విషము తలకెక్కి అవనిపై బడెను
నిద్రించగా చూచి నీలవర్ణుండు - మనసులో చింతించి మరి విచారించి
కామధేనువు తలచె కమలనాభూలు - అమృతము తెప్పించి అతి శీఘ్రముగను
మింటనుంచీ కురిసె కామధేనూవు - అంభాయనుచూను అఖిలగోపులునూ
నిద్రలేచినట్లు దిగ్గున్న లేచె - బాలలందరున్ను సగముహూర్తమున
నిద్రమేల్కొనట్టు దిగ్గున్న లేచి - తమతమ కోలలు తమరుచ్చుకొనిరి
తమతమ చిక్కాలు తాముగ్గె కొనిరి - బాల కృష్ణుని జూచి భక్తి మ్రొక్కుచును
అలసి నిద్రిస్తిమీ యీ మడుగుదరిని - ఈ మందలన్నియు కృష్ణుడే మేపె
మరచి నిద్రిస్తిమీ యీ మడుగుదరిని - ఈ మందలన్నియు కృష్ణుడే మేపె
యిందరము నిద్రిస్తి మీ మడుగుదరిని - ఈ మందలన్నియు కృష్ణుడే మేపె
తమతమ వేణువులు తమరూదుకొనుచు - మందతోలుకు నందు మందకేతెంచె
తమవేణువుల ధ్వనిని విని వేగముగను - తావచ్చి యెత్తుకొని వేగ తలలంటి
కస్తూరి మృగనాభి మేను నలుగిడి - గంధ పుటకలి దెచ్చి జలకమ్ములార్చి
మెత్తని వస్త్రాల మేను తళ్లొత్తి - వస్త్రములు కట్టవచ్చిరి
పసుపు సున్నము కలిపి పసిపార వేసి - భమిడి పళ్ళములరసి పంచభక్ష్యములు
బాలలకు వడ్డించ ఆరగింపుచును - అమ్మవినవే నేడు ఈ మందలన్ని
కడుపునిండా మేపె కాళింగుదరినీ - మమ్ములేపాడమ్మ మధుసూదనుడు
మరచి నిద్రిస్తిమి ఆమడుగుదరిని - ఈ మందలన్నియును కృష్ణుడేగాచె
అలసి నిద్రిస్తిమి యామడుగుదరిని - ఈ మందలన్నిటిని కృష్ణుడేగాచె
ఇందరము నిద్రిస్తి మా మడుగుదరిని - ఈ మందలన్నియును కృష్ణుడేగాచె
కోట బోయెదు నవ్వె కొడుకు మాటలకు - పతులే ఆడవు ఆమడుగుదరిని
చీమ దూరగరాని కారడివి అదియు - ఈ పిన్నబాలురు త్రోవ తెరుగుదురా
పోకుండ చెప్పవలె బాలకృష్ణులకు - మనమాట వినకుంటె నందగోపులకు
యశోదతోపోయి యెరిగింతమనిరి - కొడుకు వేణువు విని గోపిదేవమ్మా
యెదురుగా చనుదెంచి యెత్తుకొనివచ్చె - కరముల నయనముల నద్దుకొనుచూను

చెక్కిలి నొక్కియూ అక్కునజేర్చి - ముత్యాల గద్దైపై మురవైరినుంచీ
రత్నాల గద్దైపై రాముణ్ణి ఉంచీ - పాడుచు శిరసంటె పద్మనాభులకు
పన్నీట కస్తూరి నలుగొప్ప నలిచి - గంధమటకలిదెచ్చి జలకంబులార్చి
మెత్తని వస్త్రాల మేని తళ్ళొత్తి - పసుపుసున్నము కలిపి పసిపారవేసి
లావణ్యమైనట్టి పట్టు - పీతాంబరము దెచ్చి పృథివీశుకిచ్చె
ఆభరణమ్ములు తొడిగి పరిమళాలలది - తిరునామమును తీర్చి పుష్పములుముడిచి
భోజనాశాలలా కనకగద్దియల - పళ్ళెములవుంచి
యేవురు బాలల బంతి గూర్చుండి - నడుమనే వెంచేసె నారాయణులు
నిండు చుక్కలలోను చంద్రుడున్నట్టు - శ్రీకృష్ణరాయలూ చెన్నమరుచుండె
అచ్చనావుల నెయ్యి అభిఘరణచేసి - అనుమూల పాయసం అమరవడ్డించె
చూతఫలముల రసము చక్కెరా పాలూ - వడ్డించె బలరామ కృష్ణులా పంక్తి
తేనెతోనిండినవి కదళిఫలమూలూ - వడ్డించె బలరామ కృష్ణులా పంక్తి
వడియలావరుగులు చక్కెరా తేనె - వడ్డించె బలరామ కృష్ణులా పంక్తి
వలపుపప్పులు మంచి కమ్మని నెయ్యి - వడ్డించె బలరామ కృష్ణులా పంక్తి
మేలైనపచ్చళ్లు వూరగాయలును - వడ్డించె బలరామ కృష్ణులా పంక్తి
వద్దువద్దనుచూను వోకిలింపుచును - చాలచాలనుచూనూ అడ్డగింపుచును
నిద్రవచ్చేనని తండ్రిపై ఒరిగి - తండ్రి మూపూపైని తాను నిద్రించె
నందుడు ఎత్తి తన తొడలపై నుంచి - పన్నీరు తెప్పించి నయనములు తుడిచి
అడవులలో తిరిగి గోవులనుమేపి - అలసితివి నా తండ్రి కుడువరా చద్ది
చూతఫలములరసము చక్కెరా తేనె - జుర్రుకోరా కృష్ణ బడలికలుదీర
తేనెతో అద్దినవి ఈకదళిఫలము - లద్దకుంటూ పాలు త్రాగుమో అయ్యా
అని బుజ్జగింపుచూ నందగోపుడు - బొజ్జనిండా కుడిపె పురుషోత్తములకు
కరములు కడిగించి యశోదదేవి - కర్పూర తాంబూలం కాంతునికి ఒసగె
తూగుటుయ్యేలపైన హంసలపాన్పు - పవళింపచేసెను రామకృష్ణులను
గొల్లబోయెదు వచ్చి నందగోపికకు - చేతులుమోడ్చుకొని చేసె విన్నపము
అమ్మ వినుము యశోద విన్నపంబొకటి - విన్నపముజేసేను విని యవధరించు
కాళింగుమడుగుకీ బోయితిమనుచు - బాలురు ఈరీతి పలుకుచున్నారు
అనియిట్లు పలుకగా నందుడూగోపి - మనసులోనే నవ్వి మరి విచారించి
చీమదూరగరాని కారడవియందు - ఈపిన్నబాలురూ త్రోవలెరుగుదురా
యెరిగి యెరుగాకున్న రామకృష్ణులకు - పోకుండ జెప్పేము అని పిడుకొలిపె

కాళింగ సర్పమును అణచి వేటాడా - నారాయణులు తలచి నందాదులతో
శుభనిద్ర సేయగా బాలకృష్ణమ్మ - కొక్కురొకోయనీ కుక్కుటము కూసె
కోళ్లుకుయ్యగ లేచి గోపాలకూలూ - శ్రీకృష్ణరాయలకు విన్నపముచేసె
కోళ్ళుకుయ్యగ తమ కోలలురిత్రాళ్ళూ - యూడె ముంతలు నింప యింటింటివారు
కదలి మందకుజనిరి కరుణాకరూలు - సంపెంగ పువ్వులా సన్నజాజంగీ
సంసారభయమురా మంచివేదాంగీ - లెక్కకు కుంచెడు పాలుయిచ్చేటి
అభిమానపేనుగా అమ్మరావమ్మా - కోడెలతల్లిరా గోవర్ధనమ్మా
పెయ్యలతల్లిరా ప్రెతిమసుందారీ - లేగలతల్లిరా రాగధ్వనులవై రీ
తోయజాక్షీరావె తొలగుభూషణమా - ముందందు మంద రామునిమంద లక్ష్మి
చంద్రశేఖరిరావె చక్కనితల్లి - వాడని పారిజాతపు పూలబంతీ
షోడశకళలుగల సుందరిరమ్మీ - అసలుమధ్యమరావె అచ్యుతులముగ్ధా
తొల్లేటి లక్ష్మిరా తుమ్మెదలగుంపా - దేముల్ల వేరులం నిప్రూలపువ్వా
మురవైరి భాపికము ముదముతోరమ్మీ - నట్టింటియద్దమా నవరత్నమాల
చౌతురభాపికం చక్కరారావే - పండినమామిడి పచ్చన్ని చిలుకా
పాతాళగంగరా భాగీరథిగంగా - గుడిమీది శిఖరమా గోవర్ధనమ్మా
గోకులభూషణం కోడెలాతల్లి - అనితన గోవులను అచ్యుతులు పిలచి
పేరనేపిలచి పెయ్యల కుడువవిడిచె - గుండ లురిత్రాళ్ళను వకచేతబట్టి
తరిపావు కురిత్రాళ్ళు వేసెనచ్యుతులు - ప్రతిబట్టి కృష్ణమ్మ పాలుపితకగనూ
క్షీరసాగరమాయె ప్రేపల్లెవాడ - గుమ్మున పితుకగా చెదరియాపాలూ
నదులైపారునూ నడిమందలోను - భమిడి కాగులతోను పాలకావిళ్ళూ
నవకోటి గొల్లలూ నదికిదెచ్చేరు - ముత్యముల మూకుళ్ళ ముంచియాపాలు
కుదురుగా నింపెను కుండల్లపాలు - కుండలపాల్దెచ్చి కుదుళ్ళనుంచి
హరిదలచి హరిమదన మథనమేజేసి - వేణువునూదిన వెంకటాచలము
పిల్లంగోరుబట్టినా పరమేశ్వరూలు - ఆవులనుగాచిన అచ్యుతూడితడూ
గోవులనుగాచినా గోవిందుడితడూ - బాలులగాచిన బలభద్రుడితడు
మందలాగాచినా మాధవుడితడూ - అనియిట్లు గోపికలు అమృతముతరుమా
కాళింగుడనుసర్ప మణచివేటాడ - మనసులోనే తలచె మరి బాలకృష్ణు
గోవులనుతోలుకొని గోవిందమనము - పోవలెను పొద్దున్న లింగిపడకుండా
తమతల్లి నీలేపె ధరణిపాలకులు - పొద్దెక్కె యశోద చల్దులనుగలపా
తనయునీపలుకులకు తాను హర్షించీ - అనేకవిధములా కలిపెనాచద్దీ

శృంగారమగుచున్న చిక్కమ్ములోను - పూరగాయలతోను పుంచెనాచద్దీ
చక్కిలాలటుకులూ స్వామికనిఉంచె - ముఖమార్జనముచేసి మధుసూదనులు
తీరుగా కస్తూరి తిలకమ్ముదిద్దె - ధరణి తన్నెటివిరుదు తనయెడమకాలూ
గండపెండేరమ్ము కాంతితోనుంచె - కర్ణముల మకరకుండనాలుంచె
అభయహస్తమునా ముద్రికలుమెరయ - అంగుళీకమ్ములూ అందముతొ మెరయా
చెన్నంగోరుచేపట్టు పిల్లంగోరుపట్టి - హస్తమున రత్నకంకణాలుంచె
శతకోటి మన్మధా చెలగి ఇకమీద - మందకదిలించుమని యశోదపలికె
కాళంగిమడుగుకడ పోకుమీకృష్ణా - కాళంగిమడుగులో ఘనమైనపాము
తగిలికరచేనని కాచుకొనియుండు - పశులేచేరవు ఆమడుగుడాయ
పులులు యెలుగులు సింగములు పెక్కుగలవు - పన్నెండు శిరసులా జూచునాపాము
నాలుకలతీటను ఉండునేవేళా - బాలురెవరైనాను వస్తురోయని
దిక్కులు తిరుగాడు చుండునేవేళ - బాలురపొడగన్న పరుగున్నవచ్చు
గోవర్ధనగిరి కొండలామీద - మంద మేపుదువుగాని
ఆవిషము కొరగాదు అందుబోవలదు - అనియిట్లు తనతల్లి బుద్ధులచెప్ప
చెప్పంగభయమాయె నమ్మరోనాకు - పన్నెండు శిరసుల చూచునేపాము
నే నేలపోయెదా మడుగుదగ్గరికీ - ఆదుష్టతనములు శాయ నెన్నటికి
దిక్కులతిరుగాడు చుంటేను అదియు - తగిలి యిక్కడకైన వచ్చునాపాము
ఇక్కడ కృష్ణుడు లేదు లేడనుచు - చెప్పుమీ యశోద సర్పమ్ముతోను
పాముచేతికి నన్ను పట్టివ్వకమ్మా - తలుపులు మూసుకొని ధవళాయతాటి
చప్పుడే కాకుండ దాగివుండేను - అక్కడకు వచ్చునా అమ్మ ఆపాము
ఆకలిఅయినాను అమ్మ ఆపాము - కజ్జాములూతిందు బొజ్జనిండాను
అక్కడకువచ్చునా అమ్మ ఆపాము - వృక్షాములాపైన దాగివుండేనే
అక్కడకు సాధించి వచ్చునా పాము - అలికమ్మ గుడిమీద దాగివుండేను
అక్క డకువచ్చునా అమ్మ ఆపాము - అలికమ్మ మనకెల్ల ఇలవేల్పుగాదా
యెక్కెదననరాదు మొక్కు శ్రీకృష్ణా - గోవర్ధనగిరి కొండెక్కితేనూ
అక్కడికివచ్చునా అమ్మ ఆపాము - అనియిట్లు భయపడు తనయుణ్ణి చూచి
వెఱవకుమి నాతండ్రి యెందునారాదు - కాళంగిమడుగని తలచితెవచ్చు
కాళంగిమడుగని చూచితేవచ్చు - మరియెందు రాదుసుమి మధుసూదనుడా
యెప్పటివలె గోవులను మేపునీవు - అనిచెప్పు తమతల్లి బుద్ధులనువినుచు
బాలలతోగూడి భయపడిపలికే - అమ్మచెప్పిచోటు లందెపోవలెను

తల్లికి సాష్టాంగ దండమర్పించి - తల్లిచేత దీవెనలు తానందుకొనెను
బాలకేళితమునా పరమాత్మ తాను - వేణునాదమ్ము బట్టి
నాదములు లీలా వినోదములుగాను - యీలలు బట్టుచూ నీలవర్ణుండు
యెల్లరి ఆవులా మళ్లించుకొనుచు - చెలికాళ్లతోగూడి శీఘ్రమ్ముకదలీ
గంతువేయుచు బాలచాపల్యముననను - విరళించి సర్వమును వరళించివేతూ
వేసి పడగలపైన యెక్కినిలుచుండు - కెరలించి తనకెదురు వచ్చినావాణ్ణి
తలలు ఛేదించి గరుత్మని కప్పగింతూ - తనపాదపద్మములు శరణన్నవార్ని
వివరించి ఈమడుగు వెళ్ళచూపెడుదూ - గోవులను తోలుకొని గోపాలకులూ
కడుశీఘ్రముగ వెళ్ళి కాళింగుదరికి - కదంబచెట్టుపై కడువేగమెక్కి
చుంచు చక్కగమడచె సూర్యతేజుండు - పీతాంబరము విప్పి బిగుపుగాజుట్టి
చక్కనిహారములు దిద్దుకొనుచూను - సందిట దండలు యెగసానతోసి
ఉంకించి ఆమడుగు నడుపనేదూకె - దూకిన తాకిడికి చెదరి ఆజలము
కలివడగొట్టెను ఇరుదిక్కులానూ - దుమికిన ధ్వనివినీ కాళింగుడదరీ
యెట్టి ప్రతాపుండు ఎట్టివాడనుచు - కలలోను అయినాను తనపేరుతలచి
గడగడవణకుదురు కాళింగుడన్నా - తనగాలి సోకితే చస్తూరు ప్రజలూ
చావకను యెవడిట్లు నడుమనేదూకె - సంశయమ్మూ భయము లింతైనలేక
నాకులముయెరుగకా నడుమనేదూకె - నిప్పులు కక్కుచు నీదుకొనుచూను
మండుతూ కోపమున మరిమీదికెగసె - నాలుకలు గీటుతూ రోజుకొనుచూను
అచ్యుతుల పాదాన తనతోకచుట్టి - శిరసువరకూఎక్కి కరచుచూనుండె
లోకరక్షకుడైన కమలనాథులకు - అదివక్క లీలా వినోదమైయుండె
ఆచెట్టుపైనెక్కి అచ్యుతుడు దూక - ఆబాలలందరూ అంగలార్చుచును
ఇదియేమి శ్రీకృష్ణ మమ్మొదిగవిడిచి - ఈ మడుగులోదూక న్యాయమానీకు
ఈపసులు మాకేల యీమందలేల - నీతోటిదే లోకమని నేలపడిరి
కరచిన పూరెలూ మేయజాలక - కన్నుల భస్మములు కమ్మితేరగనూ
అచ్యుతుడు వుండేటి దిక్కుమొగమౌచు - అడలిచూచుచుండె అపుడు గోవులును
ఆవేళమందలో అపశకునమాయె - పెక్కులుతోచె నందాదులకును
పగలు చుక్కలుపొడిచె గ్రద్దలవియెగిరె - కాకులు మూకలై కూయంగదొడగె
కుడికన్ను అదరెనే యశోదకపుడు - నందగోపుని ఎడమబాహు వపుడదరె
ఆరాటమున కాంత లంతంతనిలువ - ఊరికే కన్నీరు ఉరముపై ప్రాలె
ఎక్కడనందనుడని తల్లడింపుచూ - అకృష్ణ హాకృష్ణయని మూర్ఛపోయె

రోహిణి యశోద కరమునంబట్టి - వెరవనూమని తన్ను మందలింపగను
నాచిన్ని కృష్ణమ్మ నా ముద్దుపట్టి - యేదరి ద్రునిచేత చిక్కుపడితీవో
కంసుడుపంపినా కాలరాక్షసుల - చేజిక్కి మధురకు పోతివో ఇప్పుడు
ఇష్టదేవతలార ఇలవేల్పులార - ఎందున్న నాపట్టి కావరేనేడు
ఓ అంతరిక్షమా ఓ భూమిదేవి - యెందున్న నాపట్టి కావరేనేడు
చప్పుడుకాకుండ చనుదెంచి వచ్చి - నాకనులు యికనెవరు మూతురోయన్నా
అందెలూ కదలగా కుందనాలాతో - నాకెదురుగావచ్చు ననుగన్నతండ్రి
నాకెదురుగారార ననుగన్నకృష్ణ - నాశోకమణచరా ననుగన్నతండ్రి
సంపూర్ణచంద్రునీ బోలునీమోము - కళలెక్కగా నన్ను కరుణించిచూడు
నెరివేణితూలగా కన్నులజలము - కారంగ హడలుచూ తడయకేవచ్చి
పశులుపోయినజాడ పరికించుకొనుచు - బాలల అడుగులు భావించుకొనుచు
యశోద ధరణిని కడునీడ్చుకొనుచు - అత్యంతశోకాన హడలుచూబోయె
రోహిణీ యశోద కరములంబట్టి - ఓడకోడకుమనుచు దిటవుతెల్పుచును
అతనిపరాక్రమంబా బాహుబలిమి - సకలమ్ముతెలసియూ ఇటువంటివేళ
హడలుచూవుండగా చూడనేవచ్చి - వలదనుచు వారించె అయ్యబలభద్రు
ఆ మహేంద్రుడు చెప్ప నా పరాశక్తి - అనురాగములతో తా నాశ్చర్యపడును
బాలుల పలుకులూ గోపు లాలాపం - ఆలకించా మడుగుడాయగా వచ్చి
సర్పము చుట్టుకున్న బాలుణ్ణీ చూచె - చూచి తల్లాడించి మూర్ఛతో పడిరి
విధి యెరిగి కృష్ణయ్య వివేకపరుడా - యెరిగి యీ మడుగులో ఏల దూకితివి
నీ వుండి మాకు ఆపద వచ్చినాను - మమ్ము రక్షింతువు మధుసూదనుడ
మీకు ఆపదవచ్చి మీ రడలుచున్నా - మిమ్ము రక్షింపంగ మేము నేరము
యశోదనందులూ మూర్ఛిల్లి తెలిసి - శోకాన బాలురను చూచి ఇట్లనెను
బాలులారా యీ నీలవర్ణుడూ - యే విధంబున దూకె ఈ మడుగులోను
అమ్మ విను యశోద పశువులను మమ్మూ - దిగవిడిచి శీఘ్రమున తా పారిపోయె
హనుమంతుడీవలె ఆ కొమ్మ నెక్కి - దూకంగ చూచి మే మడలితిమి తల్లి
ఇంచుకైన ఎరుగము ఈ కదంబమునా - కట్టయిన వేతుమూ పట్టుకుందామూ
బుద్ధులూ చెప్పుదుము నీ కడకు వస్తుం - లవలేశమైనాను యెరుగమే తల్లి
కనపడుచున్నాడు బాలకృష్ణమ్మా - సర్పమ్ముతో తాను పెనగులాడుతును
ఇటుచూడు కృష్ణమ్మ ఇటుచూడు మనుచు - అంతంత మూర్ఛలూ కొంత తెలియుచును
యశోద ధరణిచే కఛువిడుకొనుచు - కరములు ఎత్తి తా హడలంగ దొడగె

పామన్న వెరవవే పద్మనాభుడా - యెరిగి యీ మడుగులో యేల దుమికితివి
నీ కర్మ గతివచ్చి నిన్ను తోసెనుగా - అడవులలో తిరిగి దురితము లవన్ని
పారగాదోలి బాలుర గాతువయ్యా - తల్లేల తండ్రేల మధుసూదనుడా
బాలులకు ఆధారమైన శ్రీకృష్ణ - నీ తల్లిదండ్రులా శోకములు మాన్పా
నీ విటు రావయ్యా నీల వర్ణుడా - నా శోకములు మాన్పు నారాయణుడా
పూతకి మొదలైన రాక్షసుల నెల్లా - మదమణచిన శక్తి నేడెందు బోయె
నిండు పున్నమ చంద్రునీ బోలు ముఖము - కళలెత్తగా తన్ను కరుణించి చూడు
జగములోన నీకు సాటిలేదనుచు - పుత్రుడా నిను చూచి మిన్నందుకొంటి
ఆదినారాయణుడు ఆత్మజుండగుచు - కలిగెనని ఆత్మలో కడుపొంగియుంటి
గొడ్డు వీగి కంటి కుమార నిన్నూ - కన్న ఫలములు తనకు కడతేరవాయె
నీలవర్ణుడ నీదు జాతకము చూసీ - పదునాల్గు భువనాల కధిపతివి అనిరి
పుత్రులు పౌత్రులతో బ్రదికెదవనిరీ - పాముచే చత్తువని పలకరెవ్వరును
చెక్కిళ్ళ శ్రీలక్ష్మి చెర్లాడిరాగ - నా తొడలపై నాడు నా ముద్దు చిలుక
ఇట్టి ముద్దు పట్టి యెడబాసి యిపుడూ - తా బోయి మందలో బ్రతుక నేమిటికి
ఈ పశువులు తనకేల యీ మందలేల - ఈ ధనము తనకేల ఈ ధాన్యమేల
ఈ వునికి నా కేల యీ ప్రాణమేలా - ఈ జగము నా కేల యీతనువు లేల
నే నున్న నీ వలె యీ మడుగులోన - ప్రాణములు విడుతునని డాయరాగా
మడుగులో బడుదమని డాయరాగా - బలభద్రుడటువచ్చి వాలించుచుండె
నందాదులూ మందవారందరూను - చెట్లలూ బట్టుకుని చేరంగరాగ
కార్యములు ఎరుగకా హడలుచుండెదరు - ఏమి యెరుగక మీరు అంగలార్చెదరు
ఇక వక్కనిమిషంబు శోధించుమన్నా - కార్యములు సాధించి వచ్చు కృష్ణమ్మ
శాంతమూర్తియైన సర్వేశ్వరూలు - కోపాన సర్పమును విదళించివేసే
చెదరి దూరానబడి కాళింగుడదరి - మండుతూ కోపమున మరిమీది కెగసె
తిరిగి రాగా జూచి చిరునవ్వుతోను - రెండు వేళ్ళను వాని సెలవులూ నొక్కి
వాని దౌడలు బీసి పొడవుగా యెత్తి - గిరగిర ద్రిప్పియూ ధరణిపై గొట్టె
వాని పడగల మీద నెక్కి నిలుచుండి - ఆనందమాడెనే ఆదిదేవుడూ
రాచక్రీడలాడె రామకృష్ణమ్మ - కోనంగి కూతాడె గోవర్ధనూడు
అరవైనాలుగు అడవలను అపుడూ - గతుల గతులకు నాడె కరుణాకరూలు
గంతుగంతుకు పాడె కరుణాకరూలు - సురయక్ష కిన్నర గరుడ గంధర్వ
తుంబురుల నారదుల విధములూ చూపె - హరినాడు ఆడినవి అట్టి నాట్యములు

ఆనందమున నాడె నాది విష్ణుండు - అచ్యుతుడు అడగా అఖిలదేవతలూ
ఆనందమున పొంగి అతని పొగడుదురూ - అచ్యుతుని పాదముల ఘట్టనముచేతా
ప్రాణావస్థకుడాయె కాళింగుడపుడూ - గుడ్లు తేలవేసి గిరగిరా తిరిగి
తరలక శ్రీకంఠగత ప్రాణుడయ్యె - తనలావు దేవుని శక్తి తలపోసి
తను వలసి ఆత్మలో కడువిచారించి - క్షీరాబ్ధిశయనుడే కానలెను ఇతడు
తక్కిన వారలు తన్నణచలేరు - అచ్యుతుడె అవునని ఆత్మలో తలచి
అప్పుడప్పుడు దోచె అపశకునములూ - పేరుగల కాళింగు పెద్ద భార్యకును
పరవశమ్మయిన మేను పరితాపమొందె - ఊరికే కన్నీరు ఉరముపై బడెను
రెండవ సతికినీ నెరికురులు వీడి - మూడవ భార్యకు ముక్కెర జారె
నాలుగోసవతికీ తాను మెడజారె - అయిదవ భార్యకు అధరములు గదల
ఆరవ భార్యకూ అవయవములదరె - ఏడవ భార్యకు ఎడమపక్కదరె
ఎనిమిదో భార్యకు పెనుభుజములదరె - తొమ్మిదో భార్యకు తొడిగాళ్ళుపడి నిలచె
పదియవ భార్యకు పడిమూర్ఛలాయె - హాపతీ హాపతీయని పలవరించు
తెప్పిరిలి మనసుకూ తెలివి దెచ్చుకుని - సుందరి యిట్లనియె సవతులతోను
ఇదియేమొ కాని నేడింత ప్రొద్దాయె - కామరూపుడురాని కారణము ఏమొ
దావాగ్ని మూకలు తర్లిరాగాను - త్రోవలు తప్పిరో తొలగి వుండేరో
పట్టుబడి వుండిరో పగవారిచేతా - గరుతుడిచేత కడు అవస్థలు పొంది
మడుగులోనే మునిగి దాగి వుండేనో - ముప్పును తల్చుకుని మూకవిడి నిలిచే
అప్పుడు బలికిరే సవతులందారు - నిన్న మాపటి జాము నీలాటి పొద్దూ
నీళ్ళల్లో ఒకజాము మునిగెనట్టుంటి - జలకంబులాడి తా కురులార్చుకోగా
కుడినుండి తుమ్మెనూ గుప్పునాయొకతె - అనుమూల పాయసం శారగించగను
అన్నముచేదాయె అతివతనకూను - విడెము పలమారెను వడినడువలేకా
కన్నులుమూసితా కలవరించగను - మంచమునందునా మరుగుతెరవులను
పంచపడమట బల్లి పక్కుమని నవ్వె - మగువవినవే మన మందిరములోను
ఆర్చె ముమ్మారు - ఇంతసందేహమ్ము ఇదియేలనచు
శ్రీమహావిష్ణువును సేవింతుమనిరి - నీలవేణి తూలగా కన్నులంజలమూ
పగడంపు పతకమ్ము బాహుదండలను - గొలుసులూ పతకములు గొప్పదండలును
తడబడుచు నడుచుచూ తడయకవచ్చి - ఏకార్తి పంచార్తి ఉభయకుంభార్తి
బాలకృష్ణుకపుడు పట్టె హారతులూ - పీణంచు బొమ్మంచు వెలయుకరకంచు
ప్రీతితో వెలిగేటి పీతాంబరములూ - వట్టివేళ్ళు వేసేరు పచ్చకురువేళ్ళు

వాసనాగంధముల పసలగలుపుచును - ధవళమ్ములగు వెండి తబుకులాలోను
పచ్చిపోకలు మంచి పండుటాకులునూ - మీగడవెన్నలూ మిసిమిఁదేరగను
కాగినపాలు నెయి కడవలె త్తెదరు - పైటకొంగులుజారి నేల దూలాడ
పూర్ణచంద్రునికన్న ప్రభ వెలుగుచున్న - బాలకృష్ణ నీకు శరణుశరణయ్యా
జయతు సర్వేశ్వరా క్షీరాబ్ధిశయనా - భానుకోటి ప్రభా నాయకుడ శరణు
భక్తవత్సల శరణు పరమకళ్యాణ - భక్తచింతామణి శరణుశరణయ్యా
మత్స్యమై సోమకుని మర్దించి వేగ - వేదములుదెచ్చిన వేద్యుడా శరణు
గిరిని కవ్వముజేసి అమృతము తెచ్చి - అసురులకు ఇచ్చినా అచ్యుతుడ శరణు
వరహావతారమై దనుజు సాధించి - భూమి చక్కగనిల్పు సర్వేశ శరణు
వుక్కుస్తంభములోను వుగ్రుడై వెడలి - దైత్యుజీరినయట్టి నరసింహ శరణు
అదితి గర్భమందు అపుడుజన్మించి - అవనిగొల్చినట్టి వామనుడ శరణు
ఇరువదొక్కమారు క్షత్రియులదునిమి - పరశురాముడవైన పరమాత్మ శరణు
రావణకుంభకర్ణాదులను ద్రుంచి - లంకసాధించినా రాఘవుడ శరణు
త్రిపురములకొరకు బుద్ధుండవై వెలసి - సాధులనుగాచినా సర్వేశ శరణు
కలియుగంబున గల్గు ఖలుల బొలియించ - కల్కిరూపము దాల్చగలస్వామి శరణు
అక్రూరవరదుడా అంబరీషవరద - అజామిళవరదుడా శరణు శరణయ్యా
విభీషణవరద సుగ్రీవవరద - అహల్య ద్రౌపదిరక్షకా శరణు
మాపతి ఎన్నిజన్మల తపము జేసెనో - మీపాదపద్మములు శిరసునాసోక
అతను పుణ్యులు మేము అధికపుణ్యులము - యుగములు నీవుసుమి జగములున్నీవు
అష్టకులపర్వతము లన్నియునునీవు - నదులునదములు నీవు నగములునీవు
మూడుమూర్తులకాది మూర్తియున్నీవు - నీవాడు నీబంటు నీకింకరూడూ
నీ దాసునికి ప్రాణమిచ్చి రక్షించు - నీవు కల్పించినా గుణములేకాని
వేరె గుణములు లేవు వేదాంత వేద్య - బాలప్రాయము నాటిదది పెండ్లిగాదు
నీవు జేయుము పెండ్లి నిక్కముగ మాకు - మంగళ సూత్రములు మాకు దయచేయు
మంగళ ప్రదముగా మేము బ్రదికెదము - నళినమ్ము రేకులా నయనముల స్వామి
మముగాచి కృపతోను మన్నించుమతని - జగదేక వీరుడా దైత్య సంహారా
పురుష భిక్ష పెట్టుము పుండరీకాక్షా - అని యిట్లు భక్తిచే నాగేంద్ర స్త్రీలు
వేడగా తొక్కడము చాలించి నిలచే - మర్దనము చాలించి మహిమీద నిలిచే
చెదరిన ప్రాణములు చేరినంతటను - కలిగిన తలలన్ని ఒనగూర్చుకొనుచు
చేతులెత్తి మొక్కె శ్రీధరుని కపుడు - దేవ దుందుభి మ్రోసె దిక్కులన్నిటను

దేవుని పరాక్రమంబపుడు కీర్తించె - శీఘ్రముగ దెప్పించె శ్రీగంగ జలము
శ్రీకృష్ణు శ్రీపాద పద్మములు గడుగ - అవని యెుక్కడుగుగా గొల్చు పాదములు
అహల్యా శాపము బాపు పాదములు - బలి శిరస్సున మోపినట్టి పాదములు
తన శిరసు నెక్కిన పాదపద్మములు - భమిడి పళ్ళెరములో భక్తితో నుంచి
కాంతలతో కృష్ణు పాదములు గడిగె - పావనమైతిమని పాదతీర్థంబు
పై జల్లి విదలించి పణతులందరికీ - తిరిగి వెరపుతోను వారి పాదములకు
తరుణులతో గూడి దండము బెట్టె - మూడు కాలములందు తపసులు జేసి
మురవైరి మీ మూర్తి పొడగాననైతి - వేద శాస్త్రమ్ములా పురాణములను
తర్క భాష్యమ్మునా మిము జూడనైతి - ఇట్టి శ్రీపాదములు పొడగాంచి యిపుడూ
నేను ధన్యుడనైతి యీ జగమునందు - నాకు సరిరారెవ్వరూ త్రిభువనములలోను
ఉగ్రకోపమ్మునా అజ్ఞానమునను - మనుజుడవని నిన్ను నోకితిని దేవా
అహంకార కోపమిది వుగ్రకోపమ్మ - తెలియకుండా నన్ను పట్టిస్తివి దేవా
తనయుడి తప్పులకు తల్లిదండ్రులూ - ఓర్వంగవలెననుచు పాదములకొరగే
ధవళ ద్వీపంబనగ తన జన్మభూమి - గరుడుల భయముకోడి ఈ మడుగుకొస్తి
ఈ మడుగుదరి వక్క పర్ణశాలందు - అందొక్కవట వృక్షమందు బిలముండె
తమతమరి భాగాలు తాము గొనితెచ్చి - వైనతేయులకిచ్చి బ్రతుకుచుండెదము
ఆ మడుగుదరి వక పర్ణశాలందు - అందొక్క మునివరుడు తపము వర్తించే
గరుడుడా నీవు గజమాంసమూలు - మా సన్నిధిని తిన భవితమ్ము కాదు
అని చెప్ప వినక తా చలముచేసినను - కోపించి ఆ ముని శాపమ్మ నిచ్చే
యెన్నడు ఈ మడుగు దరికి వచ్చినను - పతులు తిరిగి యిటు పడునని శాపం
ఇచ్చేను మునివరుడు భయమందగాను - ముని శాపమున కోడి దరికి రావెరచీ
మడుగులోనే మునిగి వుందునో దేవ - కాళింగుని దయజూచి కమలనాభులు
ఆత్మలో కరుణించి అప్పుడిట్లనెను - మూడులోకముల జీవాళికెల్ల
నీవచ్చినది మొదలు సకలజీవులును - తల్లడిలిపోయినవి జలములులేక
అంత్యకాలమందు హరిపదవి గలిగి - కాళింగు చరిత్ర పాడినా విన్నా
తలచిన నుడివిన్న స్మరియించినాను - సర్పభయములులేవు సర్వేశ్వరాజ్ఞ
తనపాదపద్మములు శిరసునవున్నా - వైనతేయులు మిమ్ము ముట్టవెరతూరు
మిమ్ముముట్టకుండ అజ్ఞయిచ్చితిమి - ఎప్పటిచోటికి చనమునీవన్నా
కట్నాలుతెచ్చిచ్చె కమలనాభులకు - ధవళద్వీపానికి జనెను కాళియుడు
పుష్పగంధములతో పొలుపుమీరగను - ఈరీతిరావేగ నీలవర్ణుండు

కొసరెడివారునూ కూతాడువారు - అందందు ముద్దిడి అందుకొనువారు
కొండిక కృష్ణమ్మ నా ముద్దు చిలుక - కాళియుని విషములు గడచి వచ్చితివా
ఆ మడుగు లోతులకు సర్వభయములకు - కాచిన గంగానమ్మ ఆ తల్లి మహిమ
వేల్పు లెందరి వెంట బడితినీ వెర్రి - నా కృష్ణుడికి తాము వేల్పులే తోడు
దక్కులకు దీములకు గోత్రవేములకు - అలి కమ్మ మొదలైన ఆ వేల్పులకును
ఇంద్రాదులు మొదలుగా సూర్య చంద్రులను - తనయుణ్ణి కాయుమని కోరెయశోద
దురితములు యెన్నడూ రామకృష్ణులకు - పొందకుండా కోరి వేడె యశోద
గోపుల పాదాలడుగు మృత్తిక విభూతు - తెలసి మృత్తిక రక్ష పెట్టిరి వారు
దూదిగింజలతోటి వేముల జిగురు - లవణము బడచి అన్యుని కిచ్చిరి
తల్లి తొడలమీద తా బవ్వళించి - తల్లి భమిడి చెంగుతాబట్టి తీసి
అమ్మ మీరందరూ హడలితిర యేమె - తరుమేను చెందుళ్ళు కప్పుకుని మీరు
అందరూ గూడుకొని హడలితిర యేమె - పాముబట్టూ నాకు మంత్రమ్ము గలదు
నీళ్ళలో మునిగి నే యీతనేరిస్తి - కాళియుని శిక్షించి కడువెళ్ల దోలితి
జలకమ్ములాడుడీ కడువేడ్క తోను - తల్లి తొడలాపైని తాపవ్వళించి
అమ్మ నా కారగించగ పెట్టమనెను - ఒకరొకరి చిక్కాలు పూరగాయలును
ఒకరొకరు వొసగగా ఒనరగై కొనెను - అచ్యుతులు అంతాను సూర్యుడు క్రుంకె
పుట్టలూ పొదలలో తెరువు తెలియకను - యీ రాత్రి నిద్రిస్తు మీ మడుగుదరిని
అనలమ్ము తెలియకా ఆ మందవారు - అతడు హాతసుడనుచు హడలుచూరాగ
చుట్టువార నుంచి మండుచూ వచ్చి - అనలంబు అధికమైన ఆ మందవారు
అప్పుడు పలికిరీ హరికి మొరలిడుచు - ఇదియేమి శ్రీకృష్ణ యీ విచిత్రమ్మూ
ఇదివక్క అనలమ్ము చుట్టుకొనివచ్చె - పాయక మంత్రసాధనమ్మనను
అగ్నిమాయము జేతు కానకుడనెను - భువనమ్ము కుక్షిలో నిలిపినాయట్టు
అనలమ్మనంతాను అవలీలగొనెను - కన్నులు విప్పి శ్రీకృష్ణుని చూచి
కారణ జన్మందు కాచెమనలను - యశోద గర్భాన కృష్ణ రత్నమ్ము
జన్మించి ఉండగా మనకేమి కొదవ - కృష్ణజే కృష్ణజే కృష్ణమ్మజేజే
ఇష్ట సంపదలు మా కిచ్చి రక్షించు - గరుడజే గరుడజే గరుడవాహనుడా
కాళింగ మర్దనా కాచి రక్షించు - శ్రీ చరణార విందములచేత రక్షించు.

---

# కృష్ణ జలక్రీడలు

చెన్నరంగవాసా పన్నగశయన రంగధామ
కన్యలు జలక్రీడా కృష్ణుడు చిన్నెలుగావించి
రేపల్లెనుగలరే చక్కని గోపికస్త్రీలెల్లా
పపునచెలరేగీ మామిడితోపున వ్రేలబడిరి
ఆడుచుపాడుచునూ గుంపులుగూడుక వేడుకలా
చేడెలు యీలాగు బహుజలక్రీడలు మదిదలచి
దేవుని సేవింపా వస్తురు గోపాంగనలెల్లా
చద్దులుగట్టుకునీ వస్తురు స్వామినిసేవింపా
శృంగారించుకునీ వస్తురు శ్రీహరిచూతమనీ
మట్టెలుపిల్లేళ్లూ బొబ్బిలి కాయలు విరసరెలు
చిటికెన బొద్దులునూ వేళ్ళకు చిత్తరించినట్లు
హస్తకడియంబులనూ చేతుల కంకణధారులను
వత్తుల జొకట్లు వేళ్ళకు పచ్చల వుంగ్రాలు
మెచ్చిన కుంటినాలే మెడలను మునుపునతీగలను
చంద్రిక బొగడగనూ ఆణీ ముత్యపు ముంగరలు
కురులునున్నగదువ్వి చక్కనిపాపిడి తీసుకుని
జాజులు ముడుచుకునీ కొప్పులు జారగబెట్టుకొని
కుంకుమ గంధాలూ మేనుకు పొంకముగానలదీ
పాపిటచేర్చుక్కా పగడపు భన్నస్వరములను
పసుపద్దిన చీరె పణతికి భమిడిపూల రవికె
కసములుగల చీరే వొంటికి గుత్తమైన రవికె
ఆవపూల చీరే మెరసెటి అద్దాల రవికె
సెనగపూల చీరే చేడెకు చంద్రకావి రవికె
ముడతలుగల చీరె నిండా మొగ్గలుగల రవికె

అంచులుగల చీరె మంచి అందమైన రవికె
బొమ్మంచుల చీరె పణతికి బొగడపూల రవికె
చలవచేసిన చీరె చక్కగ జవజనాల రవికె
చేడెలు యీలాగూ తమతమ చీరలు రవికలును
శృంగారించుకు అందరు వొక కొలనుకు వచ్చిరి
చేడెలు యీలాగూ పైపయి చల్లులాడుకొనుచూ
మొలబంటాయెను కుతుకబంటిలో ముచ్చటాడుచూను
ఆకథయేలాగో తెలుసుకు నంతట శీఘ్రముగా
శ్రీకృష్ణుడు వచ్చి కొలనుకు చేరుగంటు నిలచి
చిరునవ్వులు నవ్వుచును చేతుల కన్నులు మూసుకుని
వారివారి శివశివ అను జలములలో నున్న ఆడవారి
పోరాయింటికి నీ వోరి నీరజాక్షునీవు
నేరములో గదరా మీ మగవారిట వస్తేను
ఇల్లాళ్ళముగామా మాగురు తెరుగక నీ గుండె
జల్లుమనదు జంకవు నీ వంట జంకించినారు
మిమ్ములనే జూడ మీకును మేనబావగానా
నమ్మరె ఎందుకు దేవర అనియైన నాకుజూడనైనా
వలగొని చిక్కితీరి నీళ్ళలో వాయువులే అదరె
జలములు వెళ్ళి రారే మీమీ వలువలు గట్టుకోరె
మగవారుండగనూ మేమటు మరియూదెంచుదమా
నేమగవాణ్ణటరే బాలుడ యెరుగరటేమీరు
నిన్నెరిగేగాదా బాలుడ నీ కిట దాగితిమి
చాటుకు నేటోతే గొబ్బున మాటికి వెళ్ళిరారే
మాటికినేవస్తే యింతులు వాటము కాదటరే
కొన్నికొన్ని చీరలు రవికలు నచ్చట మూటలుగట్టుకొని
వడిగా చేరువలో చక్కని బొగడకు చిగురికి
వలనల పువ్వుల కాయల కొమ్మల కనబడకుండగను
యిరువుమీద ఒచ్చి కృష్ణుడు మరుగున డాగగనూ
ఇదియేమే ఓ అక్క ఇది విష్ణుమాయగదరే
వెతకిన లేవిచట చీరలు ఏమైపోయినవో

సుడిగాలొకటొచ్చి చీరలు చుట్టుకుపోయినవో
తడబడలేకున్న ఇచ్చట దొంగలువున్నారా
అవునే ఓ యక్కా నీమాటాలాగే. నిజము
మించెను ఓ తల్లీ నేనీ కర్మానికి వస్తే
కొమ్మలార వినరే తనపతి కోపదారికదరే
అమ్మరో నేజెల్లా తనవిభుడంతకు భేరిధుడు
కానీలేవమ్మా ప్రాణముకన్నా ఎక్కువ
మానముపోకుండా ఇకపైమార్గము చూడరే
ఎవరుతీసేరమ్మా, లలన చీర లెవరుతీసేరమ్మా
చెలియ చీర లెవరుతీసేరమ్మా, సఖియా చీర
లెవరుతీసేరమ్మ మగువా చీర లెవరుతీసేరమ్మా
మనవన్నె చీర లెవరుతీసేరమ్మా, చీరెలజాడ మనకెట్లు తెలుసునమ్మ
ఎవరుతీసిరింతలోనె, ఇంతిరో నా పెండ్లినాడు
వివరముగ మావారుతెచ్చిన రవలపేటంచుల చీర
ఎవరుతీసేరమ్మవారు, ఇందరము మనముండగానే
సుందరి దదీమంచి చీరె సెనగపువ్వన్నంచు చీరె
యీాడువచ్చిన తరువాత వాడకేరమ్మని బిలచీ
చాటుగా నావిభుడు తెచ్చిన కోటలో బొమ్మంచు చీరె
అంగనారో వినవమ్మ నే తొలిసమర్తయై యుండగ
పెదబావ తెచ్చిన కొంగిపూలున్నట్టి పట్టు
గంగాసాగరపంచు చీరె, ఎవరుతీసేరమ్మ
నాతి నన్నతడు గూడిన నాటినాతగు మామ తెచ్చిన
పోతపోసిన నిండు జలతారుపూలతో వెలిచెండ్ల చీరె
అక్కరోవినవమ్మ నే నీళ్ళాడినా ఇలువరుసగలిగిన
నిక్కముగ మామరది తెచ్చిన నీలి చంద్రకావి చీరె
వివరముగ మన గణపవరమున విశ్వధాముని సేవనాడు
పొంగుచును మన అత్తతెచ్చిన ముంగివన్నెల రంగుచీరె
అంగనారో రేపల్లె రంగధాముని ప్రతిష్టనాడు
సంగతిగ మన అన్నతెచ్చిన చాల మల్లెపూల చీరె
కొత్తగాను నీవు నేనూ అత్తవారింటికి బోగా

సత్తుగాను మనతండ్రి తెచ్చిన చిత్రవిచిత్రాల చీరె
ఎవరుతీసిరమ్మా, లలనా చీరె లెవరుతీసిరమ్మా
చెలియల చీరె లెవరుతీసిరమ్మా సాఖియ చీర
లెవరుతీసిరమ్మా మగువ చీరె లెవరుతీసిరమ్మ
మన వన్నెచీర లెవరుతీసిరమ్మా చీరలజాడ మనకెట్లు తెలుసునమ్మా

ఆచబోయెడ రారా, ఆవల కూచబోయెడ రారా
మాచబోయెడ రారా తీగ మల్లెబోయెడ రారా
అని యా గోపికలూ తమతమ పెనిమిట్లను బిలువా
కలగలిగున్నాడే కృష్ణుడు కాంతలు పిలువగను
వారిజలోచనుడా కేశవ నీరజనాభ వరే
పూరిజ గుణధామ కేశవ నారాయణ కృష్ణ
డా శంఖచక్ర ధరుడా
చలిపెట్టెను ఇవ్వరా మాతో చలమేలరస్వామీ
కట్టి విడచిన చీరెలు బెట్టులేకా ముట్టుకుంటివ
నీబుద్ధి నెట్లుదోచె పట్టణంబేలిన చంద్రుడు
పట్టువిడచి బెట్టుచాయక మా చీరలిట్లు ఇమ్మనిరీ

కట్టువిడచిన చీరలివ్వరా గోపాల పట్టపగలు అల్లరేమిరా
కట్టువిడచిన చీరలివరా, గట్టిగా మావారువిన్నా
కొట్టిగానీ విడువబోరు పట్టుపడకా పో పోరా
మగడుమంచివాడు కాదురా, మా అత్తమామల,
మనసునీవు, మెప్పించజాలవురా మామనవిచేకొని పోరా
వొంచమా ముడి విప్పబోకూరా, పొంచుండి మమ్మూ
వంచనాలూ చేయబోకురా.

అంచితార్థము లిస్తుమాని మంచి మంచి మాటలాడి
కొంచెపూ పనులాకు మమ్ముకోరి నీవూ ఉండబోకుర
దండమూ బెట్టేము చూడరా, దయతోడమమ్ము
ధరణివేలు యేలుచుండరా.

దొడ్డనాపురిలో వెలసిన దుండగీడు పనులుశాయకు
వెంకటూరాయూనితోను వేడుకాతో పలుకు కేశవ
కన్నివిన్నట్లూ కాంతలు తన్నిట్లాడగనూ
పొన్నమీద నుండి కృష్ణుడు పిల్లికూతకూసే
కూసిన గోపికలూ మెదలకు కూర్చుండిట్లనిరి
మోసమాయెగదవే ఇకపై మూతలు ఏలాగు
మనకింకేటికి సిగ్గు కృష్ణుని మనమే అడుగుదము
అనుచును గోపికలూ పొన్నచెట్టుకి చనుదెంచ్రీ
వకచేతను సిగ్గూ పయ్యెద వకచేతను మూసి
హారిహారి కృష్ణా దిసమొలనున్నా వలువలుయిమ్మనిరి
అక్కరతో మీరు రెండూ హాస్తములను ఎత్తి
మొక్కినగా నివనూ మీమీ చక్కని వలువలనూ
గోపికలంతా రెండూ హాస్తమ్ములు ఎత్తిరమ్మా
శ్రీకృష్ణుడు చీరలు అందివగా శృంగారించుకు వత్తురు రేపల్లె,
పొన్నమీదనుండే కృష్ణుడు కిందికి పడదూకి
తరుణుల వెన్నంటీ కృష్ణుడు తరుముకుబోగాను.

# బృందావన క్రీడలు

శ్రీమద మలబృం దావన విపిన క్రీడను కృష్ణుండూ..........
క్షేమం బలరగ రాతిరి రెండో ఝామున ముదమున నూ..........
మానిత వేణువు నూ....... అమృత సోనలు గురియగ నూ..........
తరులు పల్లవించే........ కొండలు కరిగి సంచరించే........ ..........
సరసులు పొంగి తరంగభంగమున సంభ్రమమున మించే
మొదవులు హారిగనుచూ మీదికి మోములెత్తుకు నీ
కదలక నిలిచెను కర్ణపర్వములుగా చెవులను వినుచు
పాలుద్రావ మరచీ లేగలు కేళిమురళి యలరి
లాలిత శబ్దామృతమును చెవులను గ్రోలుచుండి నిలచే
ఫణిగణములు కూడీ మీదికి ఫణములెత్తి యాడీ
ప్రణుతింపుచు నుండెను తమలోపల పరమ పురుషు వేడీ
సలలితముగ జగమూ చుట్టూ చక్రవాళనగమూ
వలగొని తిరిగె ప్రదక్షిణ మలరగ వెలయుచుండె ముదము
అందము మీరగనూ మరిమరి బృందావనముననూ
మందర మధ్యమ తారశృతులు తమ చందము తప్పకను
సరిగమ పదనిస లా బలుకుచు మురళీనాదమును
విరివిగ మధుర రవమ్ములు వెలయగ వేడుకచే దగనూ
వినుచు గోపసతులూ జేయు పనులు మరచి మతులు
వనజ ధరునిపై కలిగి వెలసిరీ మనసిజరసదృతులు
నందగోపసుతునీ అమందా నందము పెనచుకొని
అందరు నధరామృత ధారలు నోగి విందుల నిడుదమని
ఆ చెలులందరునూ పాలు కాచీ కాచకనూ
కాచినవి యివీ కాచని వవియను క్రమములు తెలియకను
పరగి క్షీరములనూ తోడులు పెట్టీ పెట్టకనూ
వరల దొంతులిడి ఘటములు వుట్ల నుంచి యుంచకను
పడతులు విరహామునా కూళ్ళు కుడిచీ కుడువకనూ
తొడరగ పూవుల దండలు కొప్పున ముడిచీ ముడవకనూ

దొరయ దేహములనూ తొడవులు తొడిగి తొడగకనూ
సరసిజలోచనుపై వాంఛలతో సందడింపుచును
ఇందు ముఖులు గదలి తమతమ మందిరములు వదలి
మందగమనములు మాని నడచిరభిమానములే వదలి
మెడలో హారములూ చిక్కులు వడిన శిరోజములూ
అడరెను శబ్దము ఘల్లుఘల్లునా అడుగుల నందియలు
మదన సరసములురా పయ్యెద లెదలో దిగి జార
పదములు తొట్రిల నడచిరి చెమటలు వదనములను వాఱ
కుచయుగములు గదల ముడిచిన కుంతలములు వదల
రుచిగని చేరిరి యమునానది దరి రూఢిగనున్నటులె
సందడు లాడుచును హరిగోవిందుని వేడుచును
చందన గంధులు నందనందనుని చరితము పాడుచును
కనిరి గోపసుతుని కన్నుల కరువుదీర పూని
వనజాతునికి ప్రదక్షిణ మొనర్చు వనితలుండ ధృతిని
ఇందు ముఖుల పిండుగనుచా నందనందనుండు
ఇందు ముఖుల కిట్లాయెన మరలి యిళ్ళకు పోపొండు
ఇలు వరుసలు ద్రుంపి పతులకు నెలమి సిగ్గుజెప్పి
జలజాతులు వత్తురె చిత్తంబుల జారపనికి జొన్పి
వనితామణులారా జార వాంఛతోరా మేరా?
మనువులు చెడునూ మాటలు వింటే మహిలోపల గనరా
మగడు చూచితే నీ ప్రాణము తెగి చంపును పూనీ
మగువలార మీ రెచ్చట జూడరె జగములో నెవ్వరిని
రూపసిగాడే నీ ధనము రూఢి గూర్చడే నీ
పతి విడుచుట దోషముగాదా ధాత్రిలోన తరుణీ
శ్రీపతి వచనములు విని యా గోప సతీమణులు
ఆ పన్నత నిట్లని రా హరితో నలరి తత్తరముతో
క్షితి పాలుడవీవె మాకు పతిపుత్రులు నీవె
మతి బూనుచు నీ దరికి చేరుటలు మాకు నేరమటవె
మనవి వినుము కృష్ణ మేమీ మదన సుగమోష్ణ
మనగ జాలము కౌగిలింపు మము వనితావరిధిష్ణ

తొగనులుకులు నగిలి మిక్కిలి దగలచేత బొగిలి
వెగడజాల మధరామృత మిడుహారి తగ నీ దయగలిగి
ఎదనొగి దయనెంచి కౌతుక మొదవ కౌగిలించి
మదన కదనములు జరుపకయుండెు మనుదుమె నటియించి
గోపిక లందారూ విరహముతో వగచందరును
(శ్రీ)పతి వెంటను తిరుగుచు నుండగ చూపడి ముందలను
అంతర్ధానమును కృష్ణుడలర భ్రాంతులను
కాంతలు దిరుగుచు నడిగిరి బృందావన భూరుహములను
కేతకి తరులారా తాళకింశుక ఘుటిలులారా
(శ్రీ) తరుణీ కుచకుంకుమ వతుడు పొఅడ మీ వార
చందన మందార పాటల చమరిక జంబీర
నందనందనుని జూచినారె మీ బృందములను జార
బింబ కందరాళ సాల బిల్వమ హింతాల
శంబరరిపు జితుసుందరహారి మీ చాటులనున్నాడా
మాధవపిచు మంద పనసమంగళ మాకంద
మాధవ కృష్ణుని జూచితి రట వె మాటల మీ క్రిందట వె
మొల్లమాతులుంగ లుంగ మల్లికలవంగ
పుల్ల పద్మనేత్రుని జూచితిరే పొదలలో నొనరంగ
కాంచనకర వీర కేసర కదళీ ఖర్జూర
పంచాయుధ జనకుని జూచితిరె పాటవములు మీర
ఓ చెలి యిచ్చటను జూచితె పూచిన పువ్వులను
కోసి కొమ్మకిడె పదాంకములను గోవిందుడు దయను
పెదవి చాల ముద్దు గొనియె మదవతి కిటనిందు
పదములు నాలుగు నెదురుగ నున్నవి పణతి జూడుమిందు
ప్రేతలు హాిజాడ గనుచు వెన్నుండొగి చూడ
చేతో మోదమున నిట్లని వేడిరి స్త్రీలందరు గూడ
పాహిపాహి శౌరీ మన్మథ బాణతాపహారి
దేహంబులు శుష్కితిమి దయ దృష్టింపుము జేరి
చిత్తంబులు దూయ మరుడు క్రొత్తంబులు వేయ
తత్తరమ్ముపడి మూర్ఛిల చాలమ నాదరమ్మ సదయ

సూటిగ చిత్తముల ముందు నాటిన గాయముల
వాటము దప్పక మదనుడు కృష్ణ వైచెను బాణముల
కరుణ జూడు కృష్ణ మరుడు నిర్దయుండు
శరణ జొత్తుము వచ్చి కావవే శరుడు చంద్రముండు
అన్నులు విరహమునా హరిని సన్నుతి సేయగను
వెన్నుడు కనికరమిడి నా కడను ప్రసన్నత నిలువగను
తప్పక కన్నులను కృష్ణుని కప్పురపాటులను
అప్పుడతుక లందఱుగని చుట్టలరిరి మూకగను
కటిని బట్టెనొకతె కట్టిన పుట్టము బట్టెనొకతె
ఎటుబోయితివో కృష్ణా యనుచును యెదుట గదిమె నొకతె
చెట్టబట్టె నొకతె బుగ్గలు పట్టి చిదిమె నొకతె
పట్టుకొనుడి యంచున పూ దీగెను గట్టుదమనె నొకతె
పక్క జెనకె నొకతే చెక్కిలి నొక్కివైచె నొకతె
చిక్కు లిడకుమము కృష్ణా యనుచును సేవించె నొకతె
కరపద్మము లొకతె పదయుగ సరసింబులొకతె
మురహరి బట్టిరి చనగలడనుచును ప్రోల నిలిచె నొకతె
హరిగొని జెనగుచును గోపిక లడగిరి ప్రియమునను
లాలితముగ ఖేల ఘోషస్త్రీల చిత్తముల
పూవిలుతుని పెంజాలి దీర్పను పొలకు డావేళ
అందరి కందఱు నై గోవిందుడు సంధిలను
క్రందుకొనుచు చౌశీతి బంధముల కౌతుక మొదువగను
అమరీ కృష్ణా కేళీ ప్రేతలు సమరతులను జేరి
అమితమైన బ్రహ్మానందంబుల నలరిరి పరవశులై
ఇంద్రియ నిగ్రహాత వెలసెను కృష్ణుడు సంగతిని
ఇంద్రాదులు వేల్పులు పూవానలు యెలమి గురిసిరిలను
యమునా జలకేళి హరితో కమలనయను లాడి
కమలాతులు కృష్ణునిచే నాజ్ఞలు గైకొంచును గూడి
వ్రేపల్లెకు మరలి వచ్చిరి గోపికలూ తరలి
శ్రీపతి కరుణను సకల భాగ్యములు చెలగిరి ధరదొరలి.

# గోవు పాట

గొల్లకృష్ణుడు వేణునాదము - చేతబట్టుకు వూదుకొనుచు - గోవు మంద వెంటనడచి
పొన్నవృక్షము చెంతజేర - గోవులన్ని పొదలదూరి - కలసిమేయుచుండగానూ
పెద్దకాలపు ఆవులార - పేరుపడ్డ మందలార - కపిలయావు దూడల్లార
కర్రియావుదూడరావె - తెల్లయావుపిల్లరావె - బొల్లియావు నీవురావె
కామధేను కల్పతరువా శ్రీలక్ష్మి పేరిందేవి - అన్నపూర్ణ విశాలాక్షి
తెల్లమత్సగోవురావె - నల్లమత్స ఆవురావె - చిన్నిఆవు దూడరావె
శనివారము విష్ణుప్రీతి పేరుపేరున పిలిచితాను బట్టిదట్టి బిగియగట్టి
లేగదూడల - చేతబట్టి శృంగారపు చెంబుపట్టి వెండిత్రాళ్ళు తెచ్చితాను
బందనములు వేయుచూను గోవులుకు పాలుపిదిగి గొల్లభామల మూపులందు
బెట్టివారి యిండ్లకనిపి చెట్టుయెక్కి - వేణునాదము చేతబట్టుచు - వూదుచుండగ
గోవులన్ని పొదలదాటి సకలదిక్కుల మేయుచుండగ తూర్పుదిశకూ కొన్ని వెళ్ళి
గట్లపైని మేయుచుండగ గొప్పనాదము చెవులబడగా అదురుకొంటూ బెదురుకొంటూ
మేతమాని యెదురుచూడగ గాండ్రు గాండ్రు మనుచు వేగమె పెద్దపులియొకడొచ్చినిలిచి
నాదుపొలము పాడుశాయగ నేడువచ్చిన యావులార పోకుపోకుడు మేతమాని
చిక్కినారుగ నాదుచేతికి వారమొక్క జీవయనుగా గొంతువిరచి రక్తమెల్ల
గ్రోలి పొట్టచించివేగమె కొవ్వుదీసి నారదీస్తు దాటిపోవా జూతురేమొ
పారిపోవజూతురేమొ కురుచకొమ్ముల చిన్నయావుల నిడువకొమ్ముల పెద్దయావుల
పేరుబడ్డయావులాను కోట్లకొద్దిగ తిన్నదానను నన్నువిడచి పారిపోతె
వెంటతరిమి చంపివైతును నాదుపొలమూ చేరిమీరు నాదుహారము దొరికినారు
నాదుపేరు వ్యాఘ్రము మాకుమీకు వైరమెందుకు నేనుచెప్పిన మాటదాటక
బుద్ధిగలిగి యుండుమనుచూ బల్కగా నాయావుముందు నిలిచి యనుబల్కుచుండె
పేరుపేరుగ నున్నయావులు వెనుకచేరనిల్వగాను వ్యాఘ్రమా వినుమునాదు
ఒక్కమనవి చిత్తగించు మూడుదినముల కిందట నేను కవలదూడల కన్నదానను
నన్నుపెంచిన దాతలెల్లా పాలుపితుకచుండగాను రెండు దూడలు బెంచుచుంటిని

నాదురాకకు దూడలెల్లా యెదురుచూచును బెంగాతోను శలవుయిచ్చిన పాలుయిచ్చి
మళ్ళివచ్చి నీదు ఆకలి తీర్తుననుచుబల్కగాను నీదుమాటలు నమ్మినేను
వదలివేయను నమ్మనన్ను వ్యాఘ్రమును నేనుగానా అనుచు బల్కుచుండెనూ
సకలదేవతలార వచ్చెద నాదుపుణ్యము ధారబోసెద నాదుకొడుకుల మీదుగాను
సత్యమైన తల్లిదండ్రి తోడునీడలమీద నేను సకలయానలు బెట్టెదాను
సత్యవాక్యము దప్పితేను స్వామిద్రోహము జేసినట్లు పుట్టినింటి వారికెల్లా
అత్తయింటివారికెల్లా కీర్తిసంపద బోయినట్లు కల్లగాదు మాటనమ్ము
బొంకుగాదు మాటనమ్ము శలవుయిచ్చిన వేగవత్తును కోరి మ్రొక్కితి దాపునా.

ఇన్నివిధముల కోరగాను - గొప్పయానలు పెట్టగాను - పెద్దపులికి జాలిగలిగి
యడవిలోనా - యానబెట్టి తప్పితేను ద్రోహమూలు చుట్టిచుట్టి - తరుముకొచ్చి
నిన్నుబట్టి చంపివేతును - గాన వేగమె వెళ్ళినీవు నీదుకొడుకు పాలుయిచ్చి
మళ్ళిరమ్మటంచు చెప్ప - గంతువేయుచు చంగుచంగున - దాటుకొనుచు యింటిముఖమై
దొడ్డిచేరియు కవలదూడల - చేరబిలచి పాలుయిచ్చి - తృప్తిపరచి బిడ్డలార
వేగవెళ్ళెద అడవిలోను - మేయుచుండగ పెద్దపులియొక - టొచ్చిబట్టగ బిడ్డలారు
బుద్ధిగలిగి మసలుచుండుడి - పచ్చిచేనూ మేయబోగా - కాపుచేతిలో చిక్కబోకా
బొందచాటున మేయబోక - పులులనోటి కందబోకా - ఇండ్లలోనా తిరుగబోకా
కర్రదెబ్బలు తినకమీరు - కాపువాడు మేపబోవు - బీళ్ళయందూ నిలచికసువు
కడుపునిండా తినుచుమీరు - దొడ్డికొచ్చి నిద్రజెందుడి - పేరిందేవి మీనాక్షి
ఆదిలక్ష్మి అన్నపూర్ణా - కామధేను కల్పతరువా - పేరుబడ్డా గోవులారా
నాదుకొడుకుల మీరుచూచి - ముందుకొచ్చిన పొడవబోకా వెనుకకొచ్చిన తన్నబోకా
మందజేర్చుక బుద్ధిగలిగి - నపుడేనే వ్యాఘ్రరాజా ఆకలిదీర్పబోయెదా
ఓ గోవులారా నాదుకొడుకుల దయతోజూడుడి తుంగభద్రానదులలోను
స్నానమాడి భక్తిగాను దేవునిపూజించితాను అడవికేగెను - ఓ జనులారా
చూడచోద్యముగాను యుండెనూ - అన్నలారా చిన్నలారా ఆకలిగనుంచుదోషము
వ్యాఘ్రరాజా వేడవచ్చితి - కోపగింపక నన్ను జంపుము - కోటిగోవుల తిన్నదానవు
లక్షరుచులను యెరిగియుండి - సకలన్యాయము తెలిసియుండి - గడువుమీరక వచ్చినేను
బొబ్బలిడినా రావునీవు తెలియజాలను - ఓ వ్యాఘ్రరాజా వేగవచ్చి నన్ను జంపుము
అర్చుకొంటూ హడలుకొంటూ వచ్చి గోవు కాళ్ళకపుడు మ్రొక్కి చెప్పెను వ్యాఘ్రరాజా
తల్లినీవు లక్ష్మిదేవి అన్నమాట దాటనేరవు నిన్నుమించినవారు భువిలో
నీతిపరులా గానలేము నీదుచర్యలు విన్నవారలు చదువువారలు వ్రాయువారలు

యెంతమూర్ఖత ద్రోహులయినా పుణ్యాముబ్బ మోక్షమందేరు ఓ జనులారా తప్పకను
చదువుచుండాడి అనుచుచెప్పి ప్రాణ మొదలెను బ్రహ్మవచ్చెను రుద్రుడొచ్చెను విష్ణు వచ్చెను
యింద్రుడొచ్చెను సకలదేవతలు వచ్చిరి దల్లినీవె మాతవునీవు నిన్నుమించిన
నీతిపరులా యెల్లలోకము అందులేరు నీవుయున్నా గ్రామమందు పంటలుపండు
పూర్తిగను నెలకు మూడు వర్షమూలు సకలజనులు సుఖమునొందెదరు
ఓ గోపులారా నీదుకీర్తిని జెప్పశక్యమా నీదుచరితము చదువువారలు విన్నవారలు
జూచువారలు కైలాసపదవి జేరిసుఖమును వుందురనుచూ
మేముజెప్పినమాటలెల్లా శాశ్వతంబుగ జరుగుననుచును
చెప్పి వారిలోకములకు వెళ్ళినంతట యల్లయావు
మందజేరి బిడ్డలాకు పాలుయిచ్చి సుఖమునుండేను ఓ జనులారా
యెల్లకాలము జదువుచుందూరు అప్పాటిపింత యీాదినంబున జరుగురీతిగనూ.

# గోపికా గీతలు

శ్రీపతి అవుతారం మూర్తిని చిత్తంబున దలతూ
గోపిక గీతలనూ భక్తితో కొనియాడుదు మదినీ
పరముని నీలాద్రీ రమణుని భావంబున నిలిపి
గురుతుగ రచియించీ చెప్పెద గోపిక గీతలనూ
పోంకముతో శుకులూ వుత్తర పుత్రుని కిట్లనియె:
వేడుక వినుమిపుడూ యీ కథ వృత్తాంతం బంతా
పరమాత్ముండైనా కృష్ణుడు వసంత ఋతువందు
సదయుడు గగనమునా పున్నమ చంద్రుని పొడగనెను
వికసిత వదనుండై కృష్ణుడు వింతగ వేడుకతో
ప్రకటితముగ యమునా తటమున పాడుచునుండగను
విని గోపికలంతా చెలగుచు వెలసిన వేడుకలా
మనసుల విభ్రములయి పనులతి మరపున జేయుదురూ
గోవుల లేగల విడచీ అతివలు పరవశులై
గోవుల పాలన్నీ ముట్టరు గురుతెరుగరు మదినీ
గ్రక్కున పాలన్నీ కాంతలు కాచీ కాచకనూ
చక్కని గోపికలూ మమతను సందడి తడబడిరి
పతులను సేవింపా మరచిరి వారిజ లోచనలూ
సరసపు రత్నములూ ముట్టరు సతులందరు భ్రమసీ
కాటుక కన్నులకూ నీటగు నూటులు దప్పుచునూ
మాటికి తలకురులూ ముడువను వాటము దప్పుదురూ
తరుణుల కురులందూ పూవులు తురుముట నెరుగరుగా
సరసాభరణములూ తనువున ధరియించరు చాలా
మేనుల మృగమదమూ గంధము చానలు పూయరుగా
మానముపై వలువా కట్టరు మన్మధ పరవశులై
మామ సహోదరులూ మగడూ మరదులు వలదనగా
ప్రేమతో గోపికలూ వచ్చిరి ప్రియుడగు హరికడకూ
పొలతుల కొందరినీ నాథులు పోనియ్యకయున్నా

నిలువక దేహములూ పొదలుచు నిర్వాణము చనిరీ
అప్పుడు శుకయోగీ మాటలు తప్పక విని రాజు
ఒప్పుతొ సేవించీ మునితో చయ్యన యిట్లనెనూ
జారుండనేకానీ కృష్ణస్వామిని యెరుగరుగా
ఏ రీతిని సఖులూ ముక్తిని యెరిగిరి చెప్పగదే
అనుటయు విని శుకులూ రాజును కనుగొని యిట్లనియె
మునుకొని హరి తలపా జనులకు మోక్షము నిజము సుమీ
పగచే కామముచే భజనాపద్ధతిచే నయినా
తగు భక్తిని జనులూ కృష్ణుని తలచిన ముక్తి సుమీ
కావున మాధవునీ సోకిన కన్నుల గనుగొనినా
పావనగతి గలుగూ అద్భుత పడరాదని పల్కె
మురహరితో పగనూ మూఢులు మోక్షము నెందగనూ
హరికిని ప్రియసఖులయి మోక్షముకరుగుట అద్భుతమె
వచ్చిన గోపికలా కనుగొని వారిజలోచనుడు
మచ్చిక మనసూనా చక్కని మాటల నిట్లనియె
ఇంతులు బానిసలూ వెరవక యిచటికి రాదగునా
సంతసముగ మీరూ మందకు సత్వరమున చనుడూ
కులమున మానమున మగలా కొడుకుల రుచిచెరచీ
నెలతలు పరజనులా కోరుట నిజధర్మముగాదు
పెనిమిటి విడనాడూ రాజది కని దండనజేయూ
తనయులు ప్రియపడరూ జారుని తగిలిన భామలను
మీ పతి తలితండ్రీ సుతులూ మిమ్ముల గానకనూ
తాపముచే దుఃఖపడుదురు త్వరితమె జనుడిపుడూ
వారిజముఖులారా జారుని గోరుట యపకీర్తీ
నారీమణులకునూ మగలను నమ్ముట ధర్మములూ
ఇది యమునానదియు పుష్పల పొదరిండ్లల తరులా
ముదితలు వసియింపా చెల్లదు ముదమున ఒనులొప్ప
ఘనకీర్తన శ్రవణాధ్యాన్నంబున ముక్తులు వారు
హరిహరి పొమ్మన్నా మగువలు అప్పుడె హడలుదురూ
నెలతలు తాపముచే కుందుచు నిట్టూర్పులు నెగడా

జలములు కనుగవలా వొల్కగ శౌరితో నిట్లనిరి
అక్కట క్రూరుడవై పల్కితి హరిహరి మమ్మిపుడూ
నిక్కము భ్రమలన్నీ విడిచిరి నిను నమ్ముటవలనా
పతిపుత్రాదులను బాయుట పంతముగాదనుచూ
సతులకు చెప్పితివో ధర్మము అతిసూక్ష్మముగానూ
పతిపుత్రులనుచూ మూర్తుల పాలించిన రీతి
పతిపుత్రుల వాంఛా మాన్పుట పాలించుట తగదే
పతిపుత్రాదులనూ బాయుట పంతమె మా కిపుడూ
హితవున ఆశలచే నెలకొను సతులను కావగదే
మురళీ రవముననూ తరుణుల మోహితులను జేసీ
అధరామృత మొసగే వనితల సమ్మతి గాపుమిక
మురళీగానము హితమైనా విని శోకవిమోచనలైనట్టి
తరుణులు నిశియందు యుచిత ధర్మమె విడనాడా
తరుణుల కుచములపై నీ పద సరసిజముల నుంచీ
పరుషపు భూమంచూ ననుటకు ప్రాణము వెతపడదూ
అరవిందపురుచులా గెలిచిన అతిచక్కని రూపూ
తరుణులు గనకుంటే వారికి తనువెందుకు చెపుమా
పొందుగ నీకు నాసామీ వందన మొనరించా
ఇందిక సంతసమూ బాయుట అందమె మన కిపుడూ
మీ మహిమను కోరి వచ్చిన మేలగు దాసులనూ
కామము దీర్చకనే విడుచుట కాఠిన్యము గాదే
ఘన విషజలములచే వచ్చిన గాలిని వానలనూ
పనిబడి రక్షించీ మగువల పంపించుట దగదే
ప్రణతావన పదముల్ లక్ష్మికి ప్రాపగు పాదములూ
ఫణిమర్దన నీవూ కుచములపైనిడి కావగదే
మీ పదములు విడిచీ తొలగునె మాకరయుగళములూ
నీ మూర్తిని జూచీ తొలగా నేరవు నయనములూ
నీ పల్కులు వినుచూ బాయను నేరవు కర్ణములూ
శ్రీపతి మీకరముల్ విడువా నోపవు హస్తములూ
మీ అధరామృతమూ గ్రోలక నిల్వదు మాజిహ్వా

శ్రీపతి మీ నగవుల్ రుచిగొని చిత్తము బాయదుగా
కమలకు ప్రియమయినా పదములు ఘట్టిగ నమ్మితిమే
శ్రమపడి మా మొగులా నొల్లము రక్షింపుము కృష్ణా
స్థిరమున వస్త్రెమునా కోరెటి శ్రీరమణా విభుడూ
వరముని పాదములా రజమును శిరసున దాల్తురటే
అత్తలు మామలునూ మొగుడూ వలదనగా వినకా
చిత్తము మీ మీదా వున్నది శ్రీభ్రమము కావగదే
నీ యధరామృతమూ పలుకులు మీ మంగళచర్యా
మా యెడ దయసేయా కుందిన మా బ్రతుకేలాగు
తరుచగు విరహాగ్ని అధరసుధారసమున వేసారి
విరివిగ దయచేయా కుందిన వినుమిది మా మాట
క్రూర వియోగాగ్ని గ్రాగుచు వారిజ మీ పదముల్
చేరితి మిందరమూ మా శుభచారు పదములాన
తియ్యని విల్కాడు మా మతి వ్రయ్యలుగా జేసె
కయ్యానికి నయినా మముగని నెయ్యము గైకొనుము
యశోద బిడ్డడవే లోకాధీశుడు కాగాను
వాసిగ భక్తులనూ యేలియు సనసానుందితిరి
తరుమృగ పక్షులునూ గోవులు మురళీగానముచే
కరుగుచు వినగానే మగువలు కరగక యుండరుగా
తరుణుల విన్నపమూ హరి విని దయతో రాపించీ
పరమా హర్షమునా మగువల పాలించెను విభుడు
చక్కని శశిముఖులూ కృష్ణుని సంభ్రమమున గొలువా
చుక్కలలోనుండూ చంద్రుని సొంపున వేడుకలా
వర యమునానదిలో కోమలి నాలుకపై నిలిచీ
తరుణులతో హరియూ నవ్వుచు దరహాసముతోనూ
వనితల శతములచే వొప్పెడి వనమాలిక మెరయా
వెలయగ కూర్చుండే చక్కని పీతాంబరుడాయె
పరిరంభణములనూ కుచముల కరముల తాడనలా
వరచుంబనములనూ కృష్ణుడు వనితల వలపించే
కరుణామృత రసపూ చూపుల కందర్పుని క్రియలా

యిరవుగ మోహామునా కృష్ణుడు యింతుల వలపించే
పరిపరి రతిగతులా గోప్యపు పల్కుల ముచ్చటలా
సరసాధర రుచులా కృష్ణుడు సతులను గరగించె
నెలతలదా ప్రేమాగనుటకు నీరజలోచనుడు
తొలుతను గనుపడకా మగువల కలసట గలిగించె
హరినప్పుడు గనకా నెలతలు అధికా విరహామునా
మరువక హరిదలచీ కృష్ణుని మహిమలు పొగడెదరూ
శౌరిని గోరుచునూ నెలతలు సరసపు కౌఁగిలి
తీరపు పొదరిండ్లా వెదుకుచు తిరుగుచు పాడుచునూ
పొన్న తరువులార చక్కని పూవుతీగలార
ఎన్నిక తిలుకమున చక్కని వెన్నుని చూపరుగా
మావి గున్నలారా కోకిల తాలి చెన్నలారా
రావులార గనరే చక్కని రావియాకులారా
మకర కుండలములూ ముఖమున మెరసెటి ముంగురులూ
ముక్కున ముత్యమునూ కౌస్తుభ ముత్యపు హారములూ
భుజకీర్తులు తరచూ వింతల భూషణములు మెరయా
త్రిజగన్మోహనుడే వచ్చిన తెలుపవె శ్రీహరినీ
ఘన సారపుతరువా కృష్ణుని కన్నుల గానవుగా
వనరుగబంధుకమా కృష్ణుని కరముతో జూపవుగా
మన్మధకా వనమా జూపవె మన్మధ జనకుణ్ణీ
సన్నజాజిలారా కృష్ణుని సదయతో జూపరుగా
వంశమ కానవచే చక్కని వంశిధరుని హరినీ
అమ్మరో భూదేవి కృష్ణుని అందమె చూపవుగా
చందన తరులారా యశోదనందను గానరుగా
కుందమ కానవచే నూతన కుందన రదనుణ్ణీ
నల్లని కృష్ణునీ పంకజనయన దయాపరునీ
మల్లియ తరులారా మీ పొదమాటున జూడరుగా
అంగజు కంగజుని గరుడ తురంగుని మురహరుని
మంగళ విగ్రహునీ వరముని రంగని జూపరుగా
మవుళి మేఖలాది కలితుని మణిమయ కుండలునీ

లాలిత కస్తూరీ తిలకుని లవంగమా కంటే
మానినీ మన్మధునీ మురళీగాన సుధారసునీ
దేవకి నందనుని జూపవె దివ్య కదళీతరువా
వరకుంకుమ హితునీ మణిగణ పంక్తి విరాజితునీ
ఘనకౌస్తుభ ధరునీ సురుచిర కాంచన మెరుగపుగా
నందుని తనయుణ్ణీ బ్రహ్మానంద ముకుందుణ్ణీ
యిందిర నాయకునీ చూపవె మందారపు తరువా
వర వైకుంఠుణ్ణీ కృష్ణుని వసుదేవాత్మజునీ
పురాణ పురుషుణ్ణీ చూపితె పుణ్యము మీ కబ్బూ
శ్రీనారాయుణ్ణీ శౌరిని శృంగారాంగజునీ
దీన దయాపరునీ చూపవె మాన కపట తరువా
పరమాత్ముని హరినీ అగణిత భాస్కర తేజుణ్ణీ
సురుచిరతర ముఖుని జూపవె వరకిసలయ తరువా
పరిపూర్ణుని విభునీ శంకరపద్మ విభూషితునీ
సరస గుణాకరునీ చూపరె జాజి తరువులారా
హరి నందుని సుతుడూ యిచ్చట ఆడుట గనపడెనా
ముదమున పాటలనూ గ్రక్కున ముకుందు పట్టగదే
హేలావతి జనులా పాయుట కేమిటికని మీరూ
హేలావతులారా గోపాబాలుని జూపగదే
సుఖమని యింతులనూ మెచ్చిన సుందర కృష్ణుణ్ణీ
మొగలి తరువులారా జూచిన ముకుందు జూపరుగా
అందముగల హరిని కృష్ణుని చందము గోరుదుమూ
కరుణను రాడుగదా జూచితె గ్రక్కున జూపగదే
కరుణను రాడుగదా యెరిగితె గ్రక్కున జూపగదే
గోపికలందరునూ తమలో కోరికలే పార
వనజాక్షుని రూపు వేసుకు వనితలు ఆడుదురు
మెరయుచు పూతనయై యొకచెలి మెరయుచు నుండగను
హరినని యొక పొలతి కుచముల నద్దుకు చెలిజూచె
బాలుడ నేననుచూ నొక చెలి పాలకు నేడ్వగనూ
కలుగుచు శకటమనీ ఒక చెలి నెలతను తన్నె సుమీ

వెన్నుడ నే ననుచూ యొక చెలి వెన్నలకై రాఁగా
కన్నయశోదననీ దండను కట్టెను నొక యింతీ
జలజాతుడ ననుచూ యొక చెలి జలములపై జల్లా
నెలతను మాతనుచూ వాక్కున నేర్పును తా జూపె
గోపికలా వేళా ఫణియని గొణుగుతు శయనింపా
గోపాలుడననుచూ నొక చెలి గురుతుగ నాడె సుమీ
వరషము వచ్చెననీ వకచెలి తరుణుల రమ్మనుచూ
గిరి యెత్తెదననుచూ వస్త్రము కరమున వేసికొనె
గిరి దావానలమూ నణచెద సరగున నని యొకతె
యువిదలు కనుగొనగా గగనము మోమున కబళించె
కొమ్మకు పుష్పములూ నేర్పున కోసిన విధమిదుగో
సమ్మతి గనుగొనరే సుందరచరణములా హరిని
సుందరిచూడగదే యిచ్చట సొంపులు కృష్ణునితో
అందముగా చెలినీ ముద్దిడి పొందులు జేసుటలా
కోమలి చూడగదే కృష్ణుడు కూర్చుండినచోటు
భామకు విడెమిచ్చీ మిక్కిలి ప్రేమలు జేసెగదే
తరుణిరో యిదె జాడు కృష్ణుని జాడలు గనుపడెను
సొగసుగ చెలితాను జలముల సొంపున వెడలుటలూ
సుందరి చూడగదే యిచ్చట సొంపులు కృష్ణునికీ
అందముగా చెలినీ ముద్దిడి పొందులు జేసుటలూ
ఈపదములు యెంతో ఋషులకు ఇంపుగ జీవమట
ఈపదపద్మములూ నిత్యము యిందిర పట్టునటా
ఈతావున హరియూ అధరము మాటికి తనకిచ్చె
మాటికి తనకురులా పువ్వులు పాటముగాదురిమె
అని మగువలు బృందావనమున వనజాతుని గనకా
మనముల మాటలునూ క్రీడలు మాధవుపై నిలిపి
చని గోపికలంతా యమునా ఘనపులినమునందూ
వనరుగ కూర్చుండీ యేడ్చిరి ఘనసుస్వరములనూ
అప్పుడు మన్మథుడై హరి వరపీతాంబర ధరుడగుచూ
ఒప్పుగ ప్రసన్నుడై నిలిచెను యువిదలకడ శౌరీ

వచ్చిన మాధవుని కనుగొని వారిజలోచనలూ
అచ్చుగవిని చిరితా(ప్రాణము లొచ్చినదేహములా
ఒకచెలి నిజభక్తి అంజలి వొప్పుతోగావించె
ఒకచెలి ప్రాణేశూ కరములు నుబ్బుతు బట్టెనుమీ
ఒకమానిని ప్రియుని బాహులు నొగి కుచముల జేర్చి
ఒకతరుణి రెప్పావిడకను వుడుగక హరిజూచె
మనమున హరిజూచీ యొకచెలి తనువున పులకింపా
తనకౌగిటిలోనూ సొక్కుతు మునికై వడినుండె
హరిరూపమె జూచీ తీనెలు అలుముకు మదితీర్చి
ను కూడుట తలపెంచి
పాపపువిధియనుచూ దూరెను యేపున వకయింతీ
గిరిధర మముబాసీ చనుటకు చరణములెట్లాడె
గురుతుగ మోహామిదీ యనుచును గుందెను వకయింతీ
ఈశ్వర మిముబాసీ ప్రాణము లిట్లున్నవిగనుకా
సరసముగాదనుచూ వగచెను జలజాక్షీ యొకతె
హరిరూపము జూచీ మగువలు విరహాజ్వరముడిగీ
పరమాత్మనిరూపూ చూచిన భక్తులకై వడిసీ
స్త్రీలందరుగూడీ పయ్యెదచెరగులచేనపుడూ
వెలయుచు పీఠముగా వేసిరి నెలతలు కృష్ణునికీ
వర యోగీశ్వరులా మనముల వసియించెడి శౌరీ
తరుణుల పయ్యెదలా పీటను తా గూర్చునియుండె
సతులందరుగూడీ నవ్వుచు సరసపురూపులను
హరిపదకమలములూ వత్తుచు అతివలు యిట్లనిరీ
కొలిచిన హితజనులా కొందరు కొలుతురు జనవరులూ
కొలిచిన తమ్ముగ్ కొలువాకుండిన కొందరు కొలిచెదరు
కొలిచీకొలువకనూ కొందరు కొలుతురు గోపాలా
అని తను దూరుచునూ పల్కిన హరి బల్కెను మరలా
కొల్చినవారలనూ ఎన్నడు కొలువనివారలునూ
కొలుతురు జ్ఞానులునూ బుధులును గోపికజనులంతా
ననుగొల్చినవాడు యెప్పుడు నారూపమునెంచు

ననుగొలువని వాడు మనమున గనుగానడుకనుకా
ధనమును కోరుటచే లాభ ధనవంతుడగురీతి
ఈరూపుతొనుంశే బుషియని నిక్కము నమ్మితినీ
గోపికజనులారా పలుకుట కూడదు మాకనెను
తగదని చూడకుడే వానికి తప్పులు గైకొనకా
వగలను మారాడే చక్కని వాక్యము లెరుగుదునూ
పాయని శంకలనూ మనముల బాసీ మీతలకూ
దాయనయములచే ప్రతికృతి శాయగనే నేరా
పాయుట తప్పనుచూ మనసున భావింపరె చెలులూ
నేనీ పురుషులలో వాడనని నిక్కము నమ్మితిరీ
మానవబంధువునై వెలసితి ధ్యానము మీ కొసగా
అని హరి పలుకగనూ మగువలు ఘనవిరహముబాసీ
మనసులు బాయుటలూ తాపము మరచిరి రాజేంద్రా
అంతట కృష్ణుండు అనంతమూర్తులతో
లీలార్థము తానూ భ్రమరలీలలు గల్పించె
చతురుడు యన్నారీ జనములు ముదమందా
అతిసుఖమగు రాచమండల మప్పుడు గల్పించె
అంగన లిద్దరిలో నడుమను పొంగుచు హరియుండె
అంగన కిరుగడలా కృష్ణుడు సంగతితో నిలచె
భామల బాహులతో కృష్ణుడు బాహులు సంధించీ
ప్రేమలు బెనగొనగా అలుముకు క్రీడలు సల్పుచును
వనితల యవ్వనము పుష్పపు వాసనదనరంగా
హరి తరుణులు పొగడా తరుణులు కరిరాజనురీతి
తగమృదు తిలకములూ యిడుకొని గరులు భాసింపా
తనువున ధరియించీ కుంకుమ ఘనముగ బూసుకొని
ఘనశిఖిపింఛెములూ యిడి కనకా
కమలాక్షుని చెలులూ విడెములు వైభవములుచేస్తే
శ్రీకుందనరుచులూ ముక్కున చెలగెడు ముత్యములూ
వరవడ్డాణములా కాంతులు బహుదిక్కుల వెలుగా
వీణెలు చేబూనీ పాడుచు వివిధస్వరములనూ

మానుగ ముదముననూ హాయని మగువలు సొక్కుచును
త్రిజగం మీరగనూ కృష్ణుడు త్రిభంగియై వెలగీ
రాజసముగ నిలిచె కృష్ణుడు రమణుల మధ్యమునా
నగవులు నాట్యములూ బెళుకులు నయమగు చూపులునూ
సొగసుగ తాళములు తప్పక సొంపుతో యుదయించె
ఆడిరి సురసతులూ సొంపుతో పాడిరి గంధర్వులూ
కూడిరి కిన్నెరులూ అభయం వేడిరి మునివరులూ
పొలతుల కృష్ణుండూ అంజలి పుటముల పుష్పములా
తావుల జల్లుచునూ సురవిరి దండల నిచ్చుచునూ
అధరామృతరసమూ చూడగ నందరు త్రావుచునూ
మధురపు చూపులునూ కృష్ణుని మహిమలు గోరుచునూ
చెక్కుల చెక్కులను జేర్చి జలములు పులకింపా
గ్రక్కున కౌగిటిలో అదుముకు కలిసిరి గోవిందునీ
మోహాకళల దేర్చి కృష్ణుడు ముగుదల గరగించె
దేహాము యెరుగకనూ సోలిరి దివ్యానందముగా
ఆ వయ్యారములూ చూపులు హాసవిలాసములూ
భూమిన్యాసముతో కృష్ణుడు పొలతులకరగించె
పొలతులు సభజేసీ బంధంబులు నేర్పుతో వేసీ
అలరగ తమయందే మగువల కాత్మారాముండై
బాలుండద్దములో చూచిన ప్రతిమలతో నాడు
పోలిక తరుణులపై కృష్ణుడు పొందికలను జేసె
తారల చంద్రుండూ హాసము దర్పగ నై కొనుచూ
మీరెను భోజనపుకాలము మతిశాయగరాదు
మొరసెను దుందుభులూ పువ్వులు కురిసిరి దేవతలూ
మురిసిరి ఖేచరులూ పాడుచు తిరిగిరి కిన్నెరులూ
సురకన్యలు వినుచూ చిత్రము సొంపుతో నై కొనుచూ
మరచిరి దేహాములూ మరలా మన్మధపరవశులై
తగు హరి మనమునను కూడుకు తరుచుగ నాడుచును
పొంగిరి గోపికలూ పూర్వపు పుణ్యాంబుల మహిమ
భామలు కృష్ణుండూ నదిలో పదిలముగా దిగిరీ

ప్రేమలు మీరంగా అలుముకు క్రీడలు సల్పుచునూ
ఒకరొకరిని చెట్టాపట్టుకు నొయ్యన మునుగుచును
పకపక నవ్వుచును కృష్ణుని బాయక మురియుచునూ
పల్కులు గుల్కుచును మేనున పద్మము లలరగనూ
సుఖమని కుంకుమను పువ్వులు సొంపుగ గూర్చుచునూ
ముఖ పద్మంబులకూ తుమ్మెద మూకలు బెదరుచునూ
కలువలుగోయుచునూ హరిపై కాంతలు వేయుచునూ
వల్లభసతులెల్లా హరిపై జల్లిరి జలములనూ
మెల్లగ హరి చెలులాపైనీ కొల్లలు కొల్లలుగా
కమలంబుల నపుడు హరిపై కమలముఖులు వేయా
వరుసను హరి చెలులా కుచములపై చల్లెను విరులా
చంద్రుని నీడలకూ హాస సమ్మతిగై కొనుచూ
సంతసమున చక్రావాకా సమితిని బోలుచునూ
అప్పుడు జలములనూ వెడలిరి అతివలు కృష్ణుండూ
ఒప్పుగ హస్తములా భూషణములు ఒనరగ ధరియించీ
అంతట గోపికలూ కృష్ణుని అనుమతిగై కొనుచూ
తప్పక చనిరపుడూ మందకు తమతమ గృహములకూ
హరిమాయను జేసీ అతివల పురుషులు తమవద్దా
స్థిరముగగై కొనిరీ వచ్చిన తరుణులు త్రయపడిరీ
అని ముని పల్కగనూ భూపతి విని మోదముతోడా
వినయంబున శుకునీ కనుగొని వినుమని యిట్లనియె
ఘనధర్మమునిలుపా జనముల కావను హరిబుట్టి
తనరగ పరసతులా రతియే ధర్మంబనిచేసె
అనలుడు సర్వమును గైకొను అనలునిరీతిగను
ఘనుల నరేంద్రులునూ చంద్రునికంటె ఘనుడగుట
హరుడును విషవహ్ని గైకొని తెరువున భయపడగా
పనిబడి దావాగ్ని నప్పుడు పట్టిమ్రింగె హరియు
పరమాత్ముండైనా హరికిని పరసతులనుశేమీ
తరుణులు పురుషులునూ జగములు తానై యుండగనూ
హరిపదకమలమ్మును కొలిచీ హరిదాసులు భువినీ

వెరువక కర్మమువిడిచీ విహారింతురు గనుకా
మేలగు గోపికలా కృష్ణుని లీలలు గుదిగూర్చి
నీలాచలపతి నీముత్యపు మాలికగా వేసే
జయనీలాద్రీశా మాధవ సాగరతటవాసా
జయశ్రీగోపాలా మాధవ సజ్జనమందారా
గోపీజనములతో హరికృప గూడుట తురి వెళ్ళా
కోనప్పా గీతలు కథ సమ్మతి జేసెన్
నీలాచలరమణా సద్గుణ నిర్మల శుభకరుణా
పాలయమాం కరుణా శ్రీధర పాలయ శ్రీకృష్ణా
ఇది పాడిన విన్నా యింతులు సిరిసంపదతోనూ
పరభక్తి యుగగ్గీ వరదుని జేరుదురూ.

# భ్రమరగీతలు

శ్రీశైలాధిపునీ - ముదమున - చిత్తంబున దలచీ
వ్యాసుల గొనియాడీ - శుకముని - వల్లభులను దలచీ
యెలమితో గణపతికీ - గురునకు - వందనములు జేసీ
చెలువముతో భ్రమరా - గీతలు - పాటలు జేసెదను
కొందరు గీర్వాణా - భాషల - కొనియాడుదు రెపుడూ
కొందరు తెనుగుననూ - హరినీ - కోర్కెతో పొగడుదురూ
కొందరు గానములా - సరసులు - కోర్కెతో పాడుదురు
కొందరు పాటలుగా - చేతురు - కోమలులకు దెలియ
యే విధముననయినా - కృష్ణుని - భావములో దలచి
సేవయొనర్చిననూ - సుగతికి - చేరుదురది నిజమూ
వేదమ్ములు చదివీ - యాగము - లాదరణతో జేసీ
పోదురు సద్గతికీ - విప్రులు - పూజ్యులు మహనీయులూ
పరమానందమునా - పణతులు - పాటల నాటలనూ
హరి భజనము జేసీ - సద్గతి - కరుగుచునుండెదరూ
అది గావున నెపుడూ - కృప - సుదుతులపై నుండూ
వదలక పాటలచే - భక్తిని - వారికి దెల్పెదనూ
వేదము శాస్త్రములూ - చదివియు - వాదము చేసిననూ
మోక్షకామికానీ - నరునకు - ముక్తి పొసగ దెపుడూ
యీ కథ సూతమునీ - రాజున - కేపుతో నెరుగించే
జోకతో వీక్షించీ - తెలిపెద - సూటిగ వివరించీ
అభిమన్యాసుతుడూ - శాపభ - యమ్మున శుకుజూచి
కృష్ణ గుణామృత పా - నుండై - వినుపింపుము యన్నా
రాజును కనుగొనీ - శుకయోగీ - జనకుని మ్రొక్కి
తెలిపెద వినుమనీ - యిట్లనె - ను కంసుని చంపి
గురువుల వద్దికినీ - వరములు - కోరను వేడుకతో
కాశీపురి జేరి - సాందిపు - డనియెటి విప్రునికి
భక్తితో వందనమ్మూ - జేసీ - సకల శాస్త్రమ్ములూనూ

సకల వేదములూ - విద్యలు - సకలము తానేర్చి
గురుదక్షిణ లిపుడూ - కోరుము - గురువర్యా యనిన
అంతట శిష్యునితో - గురువు - ఆనతిచ్చె నిటులా
మృతిబొందిన సుతునీ - యిమ్మని - కోరగ తక్షణమె
గురుపుత్రుని దెచ్చి - యివ్వగ - సంతోషమునా
బహుదీవెనలిచ్చీ - పంపిరి - మధురా పట్నముకూ
మధురాపట్నములో - కృష్ణుడు - చంద్రకాంత శిలలా
పున్నమవెన్నెలలో - స్వామి - కొలువు శేయుచుండీ
గోపికలను దలచీ - మదిలో - సంతాపము నొందీ
నాపై చిత్తములూ - యిడుకొని - నా రాకకై గోరీ
నా పేరు దలచీ - గోపికలు - సన్నేమనియెదరో
దూరుదురో మదిలో - చాల - దుఃఖము నొందెదరో
క్రూరుండనియెదరో - నే నప - కీర్తికి పాలయితి
యెంత జాలిపడిరో - గృహముల - యెట్లు వసించెదరో
ఇంతులు ప్రాణములూ - తనువుల - నేక్రియ నిల్పెదరో
అనిమది చింతించీ - యుద్ధవు - కనుగొని యేకాంతమునా
కనుగొని కృష్ణుండు - పలికెను - పరితాపముతోను
యిచటికి నే వచ్చి - కాలం - బెంతో గడువాయె
అచటను గోపికలూ - ప్రాణము - లాపుట యే పగిదో
నే గోవుల వెంటా - వకపగ - లేగితె కల్పములై
రాగల మార్గములో - కాచురు - రాజీవాననలూ
నే నారణ్యములో - పదముల - నూని నడువగానూ
పూనికరములచే - వొత్తుచు - పొలతులు దుఃఖింతురూ
శీతల వస్తువులూ - పణతుల - చేతుల ధరియించీ
భీతులు దిగనాడీ - ప్రేతలు - నా కెదురుగ వత్తు
చిగురాకుచే బూని - వకసఖ - సొగసుగ విసరుచునూ
శ్రీగంధము మేనా - వకసఖ - అలదుచుండు నెపుడూ
వకతె విడములిచ్చు - వేరొక - తె పూలు దురుమూ
వకతెలలాటమునా - తిలకం - బొప్పున తా బెట్టు
సంచార శ్రమలూ - బాయను - సఖియలు యిరుగడలా

యెంచ నలవిగానీ - పరిచ - ర్యలు జేసెదరూ
సంధ్యాకాలమునా - తమతమ - సంకేతపు చోట్లా
సతిసుతులను విడచీ - నా రాకలె - గోరుచుందురు సుమ్మీ
తరుణుల పయ్యెదలూ - నేర్పున - తల్పం బొనరించీ
మురయుచు నా కథలూ - చెప్పుచు - ముచ్చట లాడుచునూ
నిద్రాహారములూ - యెరుగక - నీరజలోచనలూ
మద్రూపంబుగ నీ - సొక్కుచు - మమతల జిక్కుదురూ
నా పేరేగాని - వక తెకు - నాలుక చొరకుండూ
చూపులు నాపైనీ - వుంతురు - సుదతులు వేడుకలా
వారిజలోచనలూ - మచ్చిక - లారయ సొక్కిననూ
చారుగుణాకరులా - గుండెలు - ఝుల్లు ఝుల్లు మనెనూ
కడువేడుకతోనూ - మురళీ - గానము గావింపా
నడిరేయిని లేచీ - వత్తురు - పణతులు ననుజూడా
అంగనలను జూచీ - పొమ్మని - వారించితె బెదరీ
తారలవలె భువికీ - వ్రాలిరి - తరుణులు తాపమునా
ఆ తాపము దీరా - వారల - అంగజు క్రీడలను
చేతోమోదమునా - బహువిధ - చేష్టలు జరిగిస్తీ
తనువులు నిలచుటకై - నే నిటు - తొలిగిన తాపమునా
కనుగొనలేకపుడూ - తిరుగుచు - కాంతలు వెదకుదురూ
ననుపేర్కొని తరులా - అడుగుచు - నానా భావములా
పణతులు గుమిగూడి - యేడ్వగ - ప్రత్యక్షంబయితీ
కూడుకు వారలతో - రాచ - క్రీడను సల్పిననూ
పాడుచు పురసతులూ - బంధా - లూడగ సొక్కుదురూ
యాదవాంగన లెల్లా - మా కిటు - దాసీలై యుండిరీ
వారిజలోచనలా - గావక - నేనిటు వంచిస్తీ
పతిసుత హితబంధూ - గురువుల - తలిదండ్రుల విడచీ
గతియని నను నమ్మినా - వ్రేత - కాంతలు యేమైరో
నే నతికఠినుడనై - వారల - గాకయుంటినిగా
భువిలోనావంటీ - కరుణా - హీనుని గంటివే
అనుదినమున నాకూ - భయ - లజ్జలు మదినీగన్పింపా

వనితలగని చనువు - జేసి - ముందు వెనుక వత్తూ
తలవంచీ పగిదీ - కన్నీ - రొలయగ బల్కినను
వెలవెల పోవుచును - యుద్ధవు - డలివేణుల దలచే
అజరుద్రాదులునూ - మనమున - నరయగ లేనట్టి
బ్రహ్మాండ నాయకుడు - వ్రేతల - కుపరతంత్రుండయ్యె
ఔరా వీరి భాగ్యం - బెన్నగ - నలువకు శక్యంబె
దేవతలు మునులూ - పొందగ - లేరి రీతులనూ
అని మదిచింతించీ - వారితో - అనియెను యుద్ధవుడూ
విని యవివేకములా - అప్పుడు - వేడుకతోడుతనూ
జేయదుకులనాథా - కరుణా - జయమయ సర్వేశా
జయలక్ష్మి రమణా - కేశవ - దానవాత్సల్యనిధీ
సర్వోత్తమమిమ్మూ - శివసనక - నమహేంద్రాదులునూ
గీర్వాణులు రుషులూ - పొందగ - లేరిరీతులనూ
ఆ పరమేశ్వరుడూ - భూమిని - నీవగిదిని జన్మించీ
గోపికలకును వశుడై - యుండుట - గొబ్బున చెప్పగదే
పరమ పదమునందూ - సురులూ - పరివేష్టింపగనూ
పరుడని నివశించీ - పంకజ - నాభపణతులకీవిట్లు
ప్రత్యక్షంబయి యుంటివీ - అదివిని చిరునవ్వూ - మోమున అంకురింపగానూ
వినుమో యుద్ధవుడా - అని హరి - వినిపింపగ దొడగె
మూడు మూర్తులు దాల్చి - అగణిత - గుణగణ పూర్ణుడనయి
అమరుల కాశ్రయనీ - యుడనయి - సాధుల రక్షించీ
ధర్మము సంస్థాపన - శాయా - బాధకులను జెరుపా
పుట్టితి బ్రహ్మాదులు - పొగడా - నామాదీవిభవం
బుల నరులకంత - రాత్మనై - మెలగుచు తిర్గుచునూ
యతిగమనాదులకై - యెపుడూ - వెనుకటి వారలునూ
నను గనుగొని జీవింతురూ - సర్భావ - తారముతో అందరినేలెదనూ
మాకు పర్వతముచే - దానికి - జోకదుసులభాత్మా
యే కాలమునందూ - కలుగదు - యే రూపంబుననూ
అందు పరత్వముచే - అజరు - ద్రాదులు గనలేరూ
వుందును సులభుడనై - ముక్తిని - పొందెటి జీవముకూ

కులవిద్యైశ్వర్యా - దులు - కలవని మురశేటి
తలచెటి కఠినులకూ - యెప్పుడు - సులభుడగానుసుమీ
నన్నే నమ్ముకు నీ - అన్యుల - నెన్నక ననుగొలచీ
వున్న జనులకేనూ - యుద్ధవ - యెప్పుడు ఆశ్రితుడ
లోకము లెన్నకనూ - నన్నా లోకించె జనులకునూ
యే కొదువలు లేవూ - కరుణతో - నా లోకమందు
చిక్కను శిరికయినా - యోగుల చిత్తమందునైనా
చిక్కితి వ్రేతలకూ - యెప్పుడు - సిద్ధంబని నమ్మూ
అనివిని యుద్ధవుడూ - మ్రొక్క - హరి నా మొర వినుమీ
నినుజేరెటి గతులూ - నాకూ - నీరజాక్షదెల్పూ
నంద తనయుడపుడూ - వినుమని - తా నానందముతో బల్కె
మూల ప్రకృతితో - యిరువై - నాలుగు తత్వములు
చాల బెనుచుకొన్నా - విశ్వమె - సత్వముగా యుండూ
దేహ మనిత్యమని - లెన్సగ - తెలియుము నీ మదిలో
మోహం తెగగోయూ - దేహమె - సచరాయువు ధృతులూ
దేహంబది చెడుగానీ - ఆత్మకు - చేటులేదుసుమ్మీ
మృతుడు చిన్మయుడు - ఆనందమయు డమలహృదబ్జుండూ
జ్ఞానాతుండగుచూ - మత్సేషం - బగు జీవుండూ
దారువందు జేరీ - వెలిగెటి - దహనునికైవడినీ
వేరని దేహాత్మా - భేదము - వెతికి కనగవలయూ
యీ యాత్మ నాదీ - వాసన - లెప్పుడు గలిగుండూ
మాయతగిలి నేనూ - నాదని - మమతను జేరుచుండూ
యెప్పుడు ననుగతిగా - తలచునొ - అప్పుడె విడిపోనూ
చప్పుడుగాకుండా - అవిద్య - నంభవాదుల్టూ
కామక్రోధాదీ - అరిష - డ్వర్గము ఖండించీ
పామరంబు విడచీ - నిర్మల - భావంబున వుండూ
నాకు జన్మకర్మా - హేతువ - నా సంకల్పమనే
మోదముతో దెలసీ - యెవ్వడు - ముక్తిని జెందుసుమీ
భూతదయాపరులై - పొంగి - సుధారసంబు విడచీ
నాతో క్రీడించీ - జనములు - నన్నే చేరుదురూ

వినయ వివేకములూ - కలిగీ - విప్రుల గోవులనూ
సకలమయిన జనులూ - సమముగ - గనుగొనవలెనుసుమీ
నను సకలముబొందె - కనుగొన - నాయందేనిలచే
అకలంకాయని - యెటువలె - కలుగుదు వానికినీ
కల్పాంతమునందూ - నాలో - కలసిన భూతములా
కల్పాదిని నేనూ దయచే - కల్పింపుచునుందూ
కర్మము కనిపెట్టీ - వారల - కల్పింపుదుచేతా
నర్మిలి నన్నొకటి - అంటదు - ననలసాక్షిసుమ్మీ
నను సురులును రుషులూ - యెరుగరు - నానాభావములా
వినివారికినే - యీపగి - దిని గాంచితినీ
యెవ్వరు ననుగతిగా కోరుదురా ఘనునీ
నివ్వాటిల్లంగనూ - అఘములు - నేర్పున విదళింతూ
అజరుద్రాదులునూ - నా గర్భంబున జనియించీ
నిజము దెలియలేకా - భ్రమచే - నేరముచేయుదురు
మచ్చాత శరములచే - మొదలుగ - వారి వికారములూ
సంహారము సేయుటా - యుద్ధవ - మదినెరుగుదువుగదా
జ్ఞానైశ్వర్యములూ - కలవని - పూనికగల రుషులూ
పూజితులగు సురులూ - కాంచన - భూధర సంయమ్ములై
దీనులు భక్తులునై - వుండిన - జ్ఞానులె నా ప్రియులూ
నానావిధములనూ - వారికి - నేనే ప్రీతుడనూ
యెప్పుడు తనుతానూ - రోసునో - అప్పుడె వెనువెంటా
కపటముడిగి తిరిగీ - కాతును - కంటికి రెప్పవలే
యితర చింతలేకా - మదిలో - యెవ్వడు ననుదలచూ
అతనికి ప్రసన్నమై - క్షేమం - బరయుచు నుండెదను
తొలగక యెపుడైనా - భక్తిని - తలచిన మాత్రమునా
వలబడి తిరుగుదునూ - వెర్రి - వానివలెను నేనూ
నీచాధముడైనా - యితరము - వదిలీ తలచిననూ
మదినుంచినవారే - సాధు - మహనీయ్యు గుణుండూ
సతిసుత హితులయినా - కులహీ - నులు చండాలులయినా
నేర్పున పట్టిన గతులు - ఇస్తూ - భూమ్యాద్యష్టకము

భవఘోరి శరీ - రంబు - మామకదేహంబూ
జీవ సమాశ్రిత పరత - త్వమునూ - బహుజన్మాంత్రమునందూ
సర్వము బ్రహ్మా ధీ - న మగుచు - బహుకాలంబునకూ
వొక పండితు డుదయించె - జ్ఞానియె నా కాత్మా
పరమజ్ఞానులైనా - ప్రియులూ - జ్ఞానుడ నేనుసుమీ
యుద్ధవ జ్ఞానమె దు - ర్లభమూ - జ్ఞానమె మోక్షమని
పెద్దలు వినుతిని సేయు - చుంద్రు - జ్ఞానంబులకన్నా
పావనమయినది లే - దుసుమీ - పరసంగము విడచి
నేననిపల్కగ విదిత - ములై - కల కర్మములెల్లా
సేయగ తొలగును బం - ధములూ - కాయశోషణంబూ
కర్మముచాయక గా - దుసుమీ - కాయము శోషిల్ల
కర్మము చెడకున్నా - విషయము - కాంక్షింపుచునుండూ
ధృతివారితమైనా - దెల్పిన - తుద నాశనమగును
నిలువక కర్మేంద్రి - యములను - నియతితో నియమించీ
సూత్రంబందున మణులూ - తగిలిన - చొప్పున నాయందే
ధాత్రీధరులు - తగిలియుందురు - జ్ఞాన సర్వమయులు
పరహింసలు మాను - వారీ - పగిదినటయిలలో
పరసతులను గవయ - తలచకు - పరధన మంటకుమీ
బూటక సుఖములచే - వనితలు - కూటమెగోడుదురూ
పాటింపుచు దేహం - అజం - ఖాల బడనియకూ
యండమావులు గనుగొనీ - నీరను - చుండి చెడినరీతి
మెండుగ సంసారం - బందున - యుండిన నష్టములూ
యీతనువికరాదూ - కానక - పాతరలాడిననూ
యితరచింత విడచి - యెప్పుడు - నాతో కలసుండూ
రోషము కనబోకూ - కనినా - దోషంబనుచుండూ
వేషంబులు మాని - లోకుల - దుర్భాషలు ఆడకుమీ
క్రిమి మూత్ర పురీ - షలచే - అమితార్థంబయి
భ్రమతను బొందించూ - దేహపు - ప్రజ్ఞల రోయుదురూ
యింపని భ్రమయకుమీ - కుసుమం - బిది యవ్వనమనకా
సంపద సత్యంబ - విద్య - చంచల మాయుష్యం

దార ధనాది సుతా - తగులం - బులు మాని జ్ఞానగుణ
సంపూర్ణుడవై యుండూ - జననా - దుల నావల్లనెగా
బుధులు నను భజింపుచునూ - అన్యం - కనుగొన కుండుదురూ
నాయందున చిత్తం - ప్రాణా - లాయత్తముచేసీ
జీవులు నన్నూ చేరేటి - చిత్తం - బెరుగుదురూ పృథ్వి
సర్వవస్తువులందు - నేనూ - వసియింతునుగానీ
నేగాని విశేషవ్యాప్తి - లేదుసుమీ - నళినీదళగతమైన
జలముల కిరణములుం - డుగతి - నిలువదు వకచోటా
మతి చంచలమైనది - మనసూ - శిక్షించకయున్నా
వుత్తమగతి గలుగా - నేరదు - యుద్ధవ యిదినిజమూ
బుద్ధేంద్రియ హృదయ - ముల న - త్పురుషులు నియమించీ
వుద్ధవ విహరించీ - బహుభయ - మున నుండుదురుసుమీ
విశ్వములో నేను - నాలో - విశ్వంబయి వుండూ
విశ్వమునేగాని - తలచిన - విశ్వము నేనగుదూ
సంగంబుల నెల్లా - మదిని - విసర్జన మొనరించీ
సంగతిగా నిర్వరుడవై - సకల - మందుగనుమీ
మత్పరుడవుగమ్మీ - యుద్ధవ - మాయత్నమె నేయుమీ
మత్పురికేగెదవూ - లెస్సగ - మా భక్తుడగమ్మీ
యుపవాస వ్రతశీ - లాజప - యోగాభ్యాసములా
స్నానసంధ్యా ద్వ్యాపా - సనముల - నేను దొరకనుమ్మీ
నేదానక్రియలా - యజ్ఞా - తపముల దొరకతానుమీ
పొదుకొన్న భక్తిచేతా - తనూ - భవ్యుడనై యుందు
త్రిగుణాతీతుండై - సమతను దిగనాడి
తగినాయపచార - భక్తిని - తలచిన నను జేరు
యింద్రియముల గెలచి - యిందున - యెవ్వడు సముడయిన
యెవ్వడయిన నరుడు - భక్తిని - తలచినను జేరు
ఆసరి ప్రాకృతుడనై - యుండిన - అపరాధములు నేను
మీరినభక్తుండూ - అయితే - చేరును నను నిజము
ఉద్వేగముతోను - తాను - భూతదయాపరుడై
యుండిన ముక్తి గలుగును - సుమ్మీ - ఉద్ధవుడా నమ్మూ

పురుషోత్తము డనుచూ - నను తమ - బుద్ధులదలపోసీ
పురుషులు కృతకృత్యులై - నను - బొంది సుఖంత్రూ
సాత్వికభోజనము చేయుచు - సత్కా - లక్షేపము జర్పుచునూ
సద్బుద్ధిని నడువూ - బాలుడు - బొమ్మలనూ
త్రిప్పు పగిది సర్వభూమి - జాలము - పదపడి త్రిప్పుదునూ
మాయలుయేల వేరె - దెల్ప - గావుమి ననుయనుచు
మీ చరణము పట్టితినని - యెవడూ - కోరునో దాసునిగా
కరుణతో బ్రోతును యె - ల్లప్పుడూ - కనుము ఉద్ధవూద
అప్రజ్ఞుడ నసమర్థుడనూ - స్వామి - మీరు జెప్పినట్లా
పోవతరమె అని మది జిం - తించూ - యుద్ధవుగనుగొని
కారుణ్యముతో బల్కెను - కంసారి - సఖుడౌ యిష్టుడవూ
బుధుడౌ శాంతుడవూ - అన్నియు - జెప్పెద నీశోకం
అన్నియు దిగనాడీ - నన్నే - నమ్మకునీ వున్నా
నిన్నెప్పుడుగాతూ - వెరువక - యుడుగుమి దుఃఖంబూ
విను యుద్ధవ యొకటీ - వుత్తమ - గుహ్యామయిన అర్థం
స్వస్థాచిత్తముతో - వినుమని - చెవిలోపల బల్కె
తగుభక్తినసూయా - రహితులు - తగరే అర్థముకూ
కపటముతోవారు - యెరుగక - శోలగకనేయుంద్రూ
నిర్మలమతియైనా - భక్తిని - నను ప్రార్థించిననూ
ధర్మము కృపజేసీ - వారల - తరియింపాజేతూ
దండిగజెప్పెదనూ - శృతులం - దుండు మార్గమూలూ
పండితులకు గానీ - తెలియదు - పరమార్థంబిదియూ
యిట్టీ మార్గములూ - గోపిక - లేపగదినిగనిరో
నానొమ్ములు నన్నూ - యుద్ధవ - కొనదగుదురుసుమ్మీ
గోపికలని నీకూ - మదిలో - కొంచెము దోచెనుగా
చూపుమి సురలందూ - మునులును - సుదతుల సరిరారూ
చింత యింతనియేటి - గోపిక - చిత్తము దనకిచ్చి
సంతతముగ తన్నూ - జూడగ - సాగినడువగాను
అంతట మొగవారు - యెదురుగ - అడ్డంవచ్చినను
చింతింపుచు వారు - ముక్తిని - జెందుదురాతుణమూ

విడువ వశముగానీ - గోపుల - వృద్ధుల పతి సుతులా
విడచితన్ను నమ్మి - యుండిన - యువిదల విడచుదునా
సరసిజలోచనలా - యుద్ధవ - సంప్రీతినిగనుమా
సత్క్రితుశతములనూ - అరసిన - వకపరి యాత్రాంతమునా
సరితూగగ లేకా - రోయని - చదువులు వినలేకా
శరణాగతులకునై - సమస్తము - లెరిగి సమర్పించీ
చిరకీర్తి నిబంధనా - అతి గౌ - రవమును వినవే
పావన విను నేనూ - తిరుగుదు - భక్తుల వెనువెంటా
గోపుల వెనువెంటా - తిరిగెడి - కోడెల రీతులనూ
నాప్రాణులు సుమ్మీ - వారలు - నా దేహమెసుమ్మీ
యుద్ధవ చోద్యముగా - దిదినమూ - నానా రూపములా
బొందరు ఆకారమ్మే - వొకటీ - చేకొని భక్తులకూ
యెప్పుడు క్షేమంబై - వుందూ - సేవలవకయున్న
వనితలు జీవితనిస్పృహా - లై పో - వగ దలచిననూ
ఆదుర్బల స్త్రీవధ ప్రా - ప్తించూ - గణుతించినగలదే
సర్వోఘములను నిస్పృహా - లైనా - ప్రాణద్రోహి అయినా
పాపికి ఫలమూ ఇంచుక - లేదూ - అందుకొరకెగానీ
కాముకుడని నను దల - వకుమీ - పొందుగ ననుదలచీ
పొమ్మిక నందవ్రజముల - కూ మా - తల్లిదండ్రులయినా
యశోదా నందు - ల గను - గొని చేతులు మొగిడ్చియూ
మ్రుమ్మాటికి కృష్ణుడు - తమకు - మ్రొక్కెను యనిదెల్పూ
రాగలడని దెల్పూ - నాపై - రాగం వుంచుమనూ
వేగమె పొమ్మికను - వనితల - వేడుకగని నీవూ
సందేహాము మానీ - వుండుం - డరవిందాననలార
బృందావనములకే - వచ్చెద - వేడుకమిముజూడా
మీరూ మేమనుచూ - భేదం - బారయ లేదుసుమీ
నారాయణుడనుమీ - నా యీా - తనువే మీదనుమీ
యీారీతి నేకాంతా - ర్థము సా - రెకు వినుపించీ
దూరము సాగనంపీ - నిలచెను - తోయజనేత్రుండూ
నిలచిన హరిజూా - చీ యుద్ధవు - డంఘ్రులపై బడ్డా

వినయముతో నెత్తి - కౌగిట - వేడుక జేర్చుకొానెనే
శ్రీకృష్ణా శలవే - మాకూ - దూరము బోవలెనూ
యెప్పుడు మీ మదినీ - మమ్ము - వేడుకతో వుంచూ
అప్పుడు యుద్ధవుడూ - కృష్ణుని - యనుమతి గనుగొానుచూ
వొప్పుతొా వచ్చెనుగా - పురములు - నదులు గిరులుదాటీ
పోకమ్రాకులూ పనస - తరువులూ - మామిళ్ళనుదాటీ
అందముగా సూర్యా - అస్తమయ - కాాలమునకూ
నందగృహముజేరే - పరమా - నందముతోడుతనూ
నందుడు యెదురేగీ - కౌగిట - నలదుకు నుద్ధవునీ
మా పాలింటికీ - కృష్ణుని - వలెను వచ్చినావూ
క్షేమమె మా సుతుడూ - యుద్ధన - చేతో మోదంబే
మిత్రుడు వసుదేవూ - మఱి - బలరామకృష్ణులూనూ
జననీ జనకులనూ - మమ్ము - చాలగ యెడబాసీ
వినయముగల గోపాలుడు - మమ్ము - వెన్నడు దలచునటే
యెన్నడు కృష్ణుండూ - రాగల - డీ పల్లెకు జెపుమా
ఆ వేడుకనూ మా - కన్నుల - నెన్నడు జూచెదమో
గోపికలందరునూ - తమలో - నోపక కొాండెములూ
దాపక చెప్పిననూ - సొాక్కుచు - తన పదముల కొారుగూ
అంతట కోపమునా - దధికల - శముకూలగ దన్నిననూ
పాపకర్మినై నేను - రోలను - పట్టి కట్టితినిగా
బ్రహ్మేంద్రాదులు గననీ - స్వామీ - నాచే కట్లుబడీ
విప్పగ నన్నే బ్రతిమాలూ - ఆ - దయాపరుడూ మమ్ము
దిగనాడిన వెనుక - యీా దే - హంబులతో వున్నా
మే మెంతో కఠినులమూ - ఉద్ధవ - ఎంచిచూడగాను
అనుచూ యశోదాదేవి - ప్రేమతో - కనుల నీరు విడువవా
యుద్ధవుడా జననీజన - కులతో - డను యిట్లనియెను
వగవకండి మీరూ - మీ పద - యుగములు గనుగొానగా
నగధరుడేతెంచూ - సత్యము - నమ్మడి నా మాట
మీకును మ్రొక్కితినీ - వేగమె - మిము జూడగవత్తూ
మీ పదముల ఆ నా నా - మది రే - పల్లెలోను వుండూ

యీ విధమున మమ్మూ - పెంచే - మిత్రులేరి చెపుమా
మీరే తలిదండ్రుల్ - మాకూ - మీ కన్నా ప్రియులూ
యీ ధరణిని గలరే - తలచిన - ధర్మ సీలులారా
కలిగిన మీవంటి - సత్కుల - గర్భమందు యెపుడూ
కలుగవలెను మేమూ - పదివేల - జన్మంబులకయినా
అని హరి బల్కిరనీ - యుద్ధవు - డనగా వారలతో
సంతోషించిరి - నందయశోదలు - గొల్ల బృందమంతా
చను మొనలను పాలు కురియుచు - కన్నీరును జారా
నందనుకై జూచి యశో - దానం - దముతో బల్కెను
వారూ యిరువురునూ - వుత్తమ - పురుషులు సుమ్మండీ
కారుణ్యముతో భువినీ - సాధుల - కావగబుట్టె సుమా
క్రూరుల దునుమాడీ - ధర్మము - కూరిమితో నిల్పి
చేరికతో వచ్చి - వుందురు - శీలగుణముతోనూ
వారికి జన్మములూ - కర్మము - లారయబూటకమూ
మనము కృతార్థులమూ - యిది మన - పూర్వ పుణ్యఫలమూ
శోభిల్లుచు వారూ - అంతట - జ్యోతిచందముననూ
భూతకోటియందూ - నంతట - యీ హరియే యుండు
జననీ జనకాది - దారా - పుత్రాది బాంధవ
శత్రువులూ అతనికిలే - లెవ్వరు - ప్రియులు అ ప్రియులూ
వారికి కారణములూ - వారే - నిత్యధ్యానంబూ
మనమున నిలిపి - సుతాదులతో - కృత్యంబులు సల్పి
యిట కృతకృత్యులైరి - సుమండీ - పుణ్యశీలులారా
దేవకీ నోదార్చి - యట పది - దినము లుండవలసె
పావనమతులారా - నిలచితె - పరుగున వచ్చెదనూ
అని హరి బల్కిరనీ - యుద్ధవు - డనియెను వారలతో
విని సంతోషించీ - యిచ్చిరి - వేలకొలది కానుకలూ
ఆ రేయిని గడిపీ - అరుణో - దయముననే లేచీ
స్నాన సంధ్య విధులూ - జపములు - పూనికతో దీర్చి
అతివేడుకతోనూ - రేపల్లె - వీధిలోన నిలచే
గొల్లసతులు గనిరీ - ఆ రాజీ - వాతులనుటను

నిర్మల రాకేందూ - ముఖునీ - ఆజానుస్థిత బాహుని
అలఘుం డెవ్వడొ - మన కృష్ణు - పగిదిని మనమున దోచెనుగా
అని మగువలు తమలో - హరి సఖు - డని తెలిసిట్లనిరీ
మే మెరుగుదుము సుమ్మీ - కృష్ణుని - మిత్రుడవని నిన్నూ
ప్రేమతో నిన్ను - జననీజనకుల - క్షేమమరయ బనిపె
మేలుమేలు శౌరీ - వారల - మీద నయిన నెపుడూ
మాలిమి మరువడులే - మనమున - మము మరచెనుగానీ
మునివరులకు నయినా - బాంధవ - సఖ్యం విడువతరము గాదూ
వుద్దవ సఖ్యములూ - పనిదీ - రిన వెనుకాయేలా
ఆలాపములూ మీ - రేలా - బల్కితిరీ అని మగువలు
తమలో తమిరిట్లాడు - చుండగా - అందొక గోపికకూ
హరి పదారవిందము - పై మది - గలి గరిగెను కడకూ
కని వానిని కృష్ణుం - డని పిన - నాడని భావించీ
ఘనముగ నన్యాపదే - శమ్మున - గని దానితోడ బల్కె
భ్రమరాదుష్ట సఖా - ముట్టకు - మా పాదాబ్జమ్ములూ
మమునంటిన నీకూ - ఫలమే - మాత్రము లేదుసుమీ
కోమలనగరా స్త్రీ - కుచకుం - కుమచిహ్నితమయినా
హరిదామ సుమంబూ - నందు - మకరందము గ్రోలా
నా హరి నిను మన్నించును - గామము - పురగృహములయందూ
వక పూవందుర సమానీ - పోయి - మరి వక పూరసమానుగతీ
అకటానీపగిదీ - ఆ మా - ప్రాణేశుని కబ్బా
మాయధరము గ్రోలీ - పానం - బవతల గల్పించీ
నమ్మించీ యవ్వనమూ - కొనితా - నన్యాసక్తుండయ్యె
భృంగా కృష్ణుండూ - సజ్జన - పూజ్యుండని మాతో
సంగీతం జేసేవూ - అతనీ - సఖ్యం బెరుగమశే
మును పెరుగనియట్టీ - నగరా - వనితల ముందరనూ
వినుపించిన వా - నీ నానా - విధముల పొగడుదురూ
కపటంబున బుట్టీ - భ్రమరా - కపటంబున బెరిగీ
కపటంబున మెలగీ - కృష్ణుని - కనియే బ్రమతురశే
వాలి నొకమ్మునను - వేటల - వాని పగిది జంపె.

సోలుచునూ గోరీ - వచ్చిన - సుదతి ముక్కు గోసె
పరమోదారుండై - నమ్మిన - బలినీ బంధించె
వరముగాదె విడువా - జన్మాం - తర వాసనతో నిపుడె
తరుణుల వేచుటకై - యీ యన - తారము ధరియించె
మెలగుచుండు నెపుడూ - అబలల - తెరువులు వెదకుచునూ
మమ్మును వలపించి - ప్రథమం - మా సిగ్గులు దీసీ
సమ్మతితో మధురా - నగరపు - సతుల వెంటనరిగే
సమదాళీశ్వరమా - కృష్ణుని - సద్రూపమెగన్నా
భ్రమతురు రుషులయినా - లలనల - పాపము నే నొల్లా
పౌఘళి తనకు దగూ - సుందరు - లుండగ దయచేతా
బాయక మెలగుచునూ - శౌరి కృపా - జలధికి మేమూ
మధుపాకల నయినా - యిటువలె - మమ్మునదిగనాడీ
మధువై రేగుననీ - యెరుగక - మాయబడితిమకటా
యెరిగి వున్ననాడే - అతని - చరణంబుల కొదిగీ
కోరగల సౌఖ్యములూ - యిడుమని - భృంగా బ్రతుకమశే
తానెడబాసెననీ - సర్వం - బని మదిస్తాపించీ
జానకినలములో - త్రోచిన - సిరసుడు గాడటవే
యిందిందిర వినవే - కరుణా - హీనుని యెవగిదీ
బొందెనో జయలక్ష్మి - తెలియగ - బోధింతము రావే
యిటువలె నిర్మోహి - శ్రీసా - శ్రీహరితో నీకూ
యెటువలె సఖ్యములూ - ఆయెనో - యెరిగింపవె భ్రమరా
రేయుబద్దనూతా - వడగల - రేపగలను దెలసీ
నీ యుపదేశంబు - చాలును - బోవె కీటకంబా
చాలే మధుపమ్మా - నీ ప్రియు - సఖ్యం బిపాటీ
యేలమమ్ము విడచీ - ధార్మికు - లేమని దెల్పుదురూ
పన్నగ మింటికినీ - యెగసే - పతులయినగానీ
తన్నొకమారయినా - వీనుల - విన్నా తేమంటే
వేటకాని బెదరూ - అహర్నిశం - వేటు వినియు చెదర
నాటుకు నొక బాణం - వేళీ - నమ్మి చెడినభంగి
హరిదిలోచనలా - హరిమా - ఆలాపంబువినీ

హరికి మనోభీష్టకులై - ప్రియుడని - కాదేకని మధుపా
తలిదండ్రుల సుతులా - భర్తల - పశిబాలల విడచీ
చెంతజేరుమమ్మూ - విరహా - గ్నిని దోతురశే
మము విరహాంబుధిలో - ద్రోయగ - మనసున దలపోసే
బ్రతుకతరముగానీ - మచ్చిక - లమర సేయనేలా
పుట్టుక మొదలుకొనీ - మమ్ము - బుజ్జగించి యెంతో
గుట్టుగుణము జెరపీ - మధుపా - గోవిందుడు జనెనే
చేలములటు విడచీ - జలముల - వాలలాడుచుండ
తాళిమితో వచ్చీ - పటముల - తా నెత్తుకు జనెనే
తరువుమీద నెక్కీ - కృష్ణుడు - తొలగక కూర్చున్నా
తరుణుల మందరమూ - జలములో - తల్లడపడి నిలువ
కోకలు యిమ్మన్నా - వచ్చిటు - చేకొమ్మని బల్కే
మాకు నలవిగానీ - వచ్చిన - మా మానములన్నీ
చేకొని చూరగొనీ - మామా - చేతులెత్తి మ్రొక్క
గయికొని అవియిచ్చీ - మమ్మున - కరుగజేసి బంపె
యమునాతీరమునా - తానూ - అతిమోదముగానూ
గీతము బాడిననూ - భ్రమరా - పనులన్నియు విడచీ
తలిదండ్రుల సుతులా - పతులను - తొలగగ ద్రోచుకొనీ
వలపున తను జూచీ - వచ్చిన - వనితల మముజూచీ
పరుష భాషణములూ - నర్మం - పలుకుచు మా మనసూ
విరిచివేసి యెంతో - వెతపడ - వేడ్కతో నోదార్చె
కరుణాలోకములా - మతి - వాక్పరి రంభణములచే
పరితాపము దీరా - జేయుచు - పల్కుచు మా మనసూ
గీర్వాణులు మెచ్చా - రాచ - క్రీడయు దాల్చిననూ
సర్వం తలపోసీ - మా మది - షట్పద యిటు నిలచె
యెంతో కఠినులమై - యుంటిమి - యింతకాల మతనీ
మన్మథు తండ్రి మముచెడ - బాసెతె - యింతులు సయితురశే
మా దేహంబులపై - మమతలు - మాని విడువబోతే
తా దయచేసునహో - అని వొక - రాగం బుదయించె
అరసి వాని పేరూ - రూపం - యెరుగ విన్నకన్నా

నరు లుమ్మెంతగాయా - తిన్న - తైరుగ రాదు తనువూ
వాని పేరెకాని - వేరొక - వార్తాడదు జింహ్వా
వాని రూపెగాని - కానగ - నోచవు మా కళ్ళు
యీ విరహానలమూ - ఆర్పక - యే విధమున నయినా
మాబిభుడూ రాకా - మధుపా - మావశ మగునటవే
తగవిది గాదనుచూ - పుష్పాం - ధయ నీ సఖుతోడా
నగవుకాయకుండా - పదముల - బడి నయముగ దెల్పూ
కాంచన రత్నమయా - సౌధా - గృహములె మాయిళ్ళూ
రాజధాని యగునె - భ్రమరా - హరికీ రేపల్లె
సుఃఖిత పుష్పలతా - వనమే - హరికీ మాయడవీ
తురగ గజంబులజే - గోపులు - అరవిందాతుడికీ
మాపాలి భ్రమలూ - దీర్పగ - సరోజాతుడటవే
మాపయి చిత్తములూ - కృష్ణుని - కీపగిదినివుండూ
పృధ్వినధిపులెల్లా - నూతన - ప్రియులే కారటవే
మధుపాజూచేమూ - హరినీ - మా కన్నులనిండా
అని మరి అనేకా - విధముల - హరిమీదనె కాంతు
మరుమాటలు వినుచూ - నుద్ధవు - డనియెను వారలతో
యేమీ చెప్పకుడీ - ఆ హరి - యనురాగంబులకుం
ఓ సరసిజాతీ - యేనుగ - దోమవానినుండీ
జపదాన వ్రతము - లందున - స్వాధ్యాయ తపంబులనూ
నిపుణులు గోరిననూ - మనసున - నిలుపగలేనట్టి
పరమాత్మని పయినీ - మీరలు - పడుదురె ధ్యాన్నములూ
నిరతము మీ మదిలో - యెప్పుడు - నిలుపుట చిత్రంబె
సరసిజ గర్భాది - మునులను - సరకుకాయకున్నా
పరదయివంబిట్లు - మీతో - మెలగుట చోద్యంబె
యేమినోము ఫలమో - మీకిది - యేమితపము ఫలమో
ఆ మాధవుని కృపా - రసము - నరయరాదు మాకూ
ఆమహామహుండూ - యెప్పుడు - అంతఃకరణమునా
మమ్మచ్చట విడచీ - వేరొక - ఏమికాయలేదూ
ఆపరమాత్ముండు మీ - మీతో - అంటి రమించుటలూ

కాముకుడని తలపో - వగవను - కారుణ్యముసుండీ
పర్వాత్మకుడయినా - హరికి - సఖియలనుచు వేరా
సర్వజగంబతనీ - దేహము - సత్యంబనుకొండీ
దేహసుఖంబులచే - వుండే - మోహంవిడువండీ
పూజలు సేయుచునూ - చిదా - నందము గనుగొనుడీ
ననుమీకడకిపుడూ - పంపిన - ఘనుడాడినమాట
వినుడన్నియు మీరు - వగవక - వనజాతులారా
నారీమణులారా - నాతో - చెలగితిమీ యనుచూ
నీరజాతులారా - హరి బ - ల్కు మాటలన్ని వినుడీ
యాదవచెలులారా - యేను మీ - కార్యములకు నెల్లా
నీరజముఖులారా - మీకును - నేను వేరుగాను
కలశములకు మృత్తూ - యేగతి - కారణమగుచుండూ
నిలుపలేరు గాని - నను యీ - పగిది జగమునందూ
కలగని మేల్కొన్నా - సర్వం - కల్లని మదిలోనూ
తలచుపగిది మదినీ - విశ్వము - తలతురు సత్యమనీ
మాయాతీతుడనై - లీలకు - మాయతోడగూడి
సేయుదు వింతలునూ - వొక్కటి - చెందదు నను నిజమూ
పుడమి నీ జలరాసీ - నదులను - విడువదు సద్భక్తి
కడువేడ్కల మీకూ - కలుగును - కారణంబు వినుడీ
వరములు యీడేరే - అక - ల్ప శతంబులమీకూ
చపలనయనలారా - కలుగవు - జన్మ జాలగతులూ
మీ కృతార్థతకునూ - కడగన - మాకు నలవిగాదూ
పైతలపుల మానీ - ఆత్మను - క్రీడింపుండికనూ
అన నింతేగాదూ - కృష్ణుడు - మిము జూడగవచ్చూ
మనసు కుదుర్చుకునీ - తథ్యం - బని తెలియుం డిటుపైనీ
యేదేశమునున్నా - మెలగుచు - యెందరితోనున్నా
యీ దేహము మీదే - శేషం - బిది సత్యముసుండీ
వుగిదలు జవ్వననూ - వల్ల - భు లుండిన చిత్తమునా
అతియనురాగమునా - వుందురు - అదిగావున నిపుడూ
దూరంబునవున్నా - చేరువ - వారికంటె ప్రీతి

మీరలు మామీదా - అనురా - గము లేక కోపము శాయంగా
కోరికనిలచితిమీ - అది దో - షంబనకా క్షమియించీ
యువిదలార ప్రీతి - పుంచితె - యిదిగో వచ్చెదనూ
అని హరి బల్కిరనీ - పుద్ధవు - డనియెను వారలతో
వినిపించిన సంతో - షించిరి - మనములు వుప్పొంగా
అపు డుద్ధవుఁజూచీ - సుందరు - లతిరభసంబుననూ
చపలిత కృష్ణగుణా - చేష్టల - నందిత మానసులై
యెచ్చట నున్నాడే - హరియిట - కెన్నడు జనుదెంచూ
సమ్మతినుండేమా - మధురా - నతు లద్ధమురారే
యేకాంతమ్మునను - పుద్ధవ - యేమనితలపోయూ
రాకాచంద్రికలూ - మాతో - రవములుసేయుటలూ
యిలవరుసలు విడచీ - హృదయే - శుల సిగ్గులన్ని యణచీ
కులమువారి రోసి - వృద్ధుల - గురుల ధిక్కరించీ
వెలికి వెరువులేకా - తలిదం - డ్రుల రుచిమానీ
వలశి తన్ను నమ్మి - యుండిన - యువిదల విడుచుదురా
తనుబాశిక మేము - ముదమున - తాళగలేమనుమీ
వినినంతనుముందే - కార్యం - వికశించేననుమీ
చిత్తం బింతటనూ - యిక్కడ - చిక్కదనుచు దెలువూ
చిత్తము చెదిరిననూ - ప్రాణము - శీఘ్రమె చెదురుననూ
ప్రాణము చెదిరిననూ - అంతట - ప్రాణవిభుడెవచ్చు
ప్రాణులెల్లదూరా - యిటువలె - ప్రాభవంబునందూ
తనుబాశిక మేమూ - ముదమున - తాళగలేమనుమీ
ఘనమగు నపకీర్తి - పొలగు - తనకిది దగదనుమీ
ఆశ్రిత వత్సలుడూ - ప్రియుడూ - ఆ పరాత్పరుండూ
ఆకృపాంబుధి తన్ను - గను - నా ఆశ్రితజనులానూ
పల్కులు సత్యత - నిల్పుమనూ - ఆ పరాత్పరు నీవూ
మమ్మిసమయమునా - కావగ - మాని నతనుజేరీ
నమ్మగలుగు జనులూ - ముమ్మా - టికి తేరనుమీ
తగలరు ముని మగువల్ - విభుడని - తగులదు తను లక్ష్మి
తగిలిన మమువిడిచీ - కృష్ణుడు - తగవుదప్పెగనుకా

మరచితిరే దానీ - పయిన - మక్కువలుంచుటలూ
యెరిగిరాకున్నా - అబలల - మేమిశాయగలమూ
విభుడూ రేపల్లే - వీధుల - వేడుకతోరాగా
శుభదంబయినట్టు - కన్నుల - జూతుమె వొకనాడు
నందసుతుడు మాతో - దయతో - నవ్వుచు భాషింపా
విందుమె మేమెల్లా - మామా - వీనుల పండుగుగా
తనువులు పులకింపా - మమ్మున - దయితుడు దాకిననూ
పెనసి కౌంగలింపా - ప్రియములు - గలుగునె వొకనాడూ
తలచూనపె భర్తా - మమ్మున - గలశిన తెరగెల్లా
జలజభవుండిటశూ - నాథుని - చేరగదెచ్చునశే
మాదేహప్రాణా - యవ్వన - మానంబులు విడచీ
శ్రీధర మిముబాసీ - మేమి - చ్చట యుండతగునె దెల్పూ
మాదేహము చెమటా - యొదిగిన - మాత్రమె గనలేకా
వేదనపడి తుడచీ - వినరే - మీదయ యెటుబోయె
యెటుబోవూనంచూ - మము - మీ కౌగిట నుంచీనా
వనితల మముబాసీ - మీరట - యుండదగునా
దామీ మారజనక మిమ్ము - చూడని - మానుషత్వమేలా
సూర్యచ్ఛాయ బోలు మిమ్ము - చూడని - చూడ్కుల ఫలమేమీ
నాథా మీ కథలూ - వినని - కర్ణములవియేలా
శ్రీధర మీ అధరం - జానని - జిహ్వాల ఫలమేమీ
కృష్ణరామ నాథా - కేశవ - అచ్యుత గోవిందా
విష్ణో జగధీశా - దీనుల - విడువక కావగదే
అని గోపికలెల్లా - నిశ్చే - ష్టిత చంచలులై.
తనువులు దూలగనూ - వగచిరి - ప్రణుత స్వరములనూ
వగచిన యుద్ధవుడు - వారల - వసుదేవాత్మజునీ
తగిన సుఖములన్నీ - దెల్పుచు - తాపము దీర్చుచునూ
వినువారికి గల్గూ - ప్రీతియు - చేతోమోదంబు
జలజాతాక్షునికీ - మీకును - గల్గు తారతమ్యం
తలిదండ్రుల బాసీ - మీతో - తగిలి యింతకాలం
మెలగుట సరిగానీ - వారల - కొలచి యుండరాదా

అజరుద్రాదులకూ - కారణ - మగు సర్వేశ్వరుడూ
తిరిగీ యుద్ధపుండూ - మధురా - పురముకు జనుదెంచె
వారు సమర్పించీ - నా నూ - తన వస్త్రాభరణములూ
శౌరికి కానుకగా - యిచ్చెను - బహుసంతోషముతో
బలరాముల కచటా - వింతగ - బహు భూషణములునూ
యిచ్చుచు వేశ్వేరా - నుతిజే - యుచు నుండె స్థిరముగ
యుగ్రసేను సరశీతో రా - యువిదలు - బంపిన వస్త్రాభరణాలూ
ఘనమగు - విందులూ సమర్పించీ
అందరు ఆనందా - సాగర - మున నుండిరియిట్లూ
యీకథ శుకయోగీ - రాజున - కీవిధమునదెలిపె
దవళా చలమునునూ - భ్రమరా - గీతయు రచియించె
లోకఖ్యాతిగనూ - ప్రతి వా - దిభయంకార
వేదాంతాచార్యుండు - వేదా - ద్రీశునకూ మదిలో
విస్తారముగాను - భేదము - లేకుండా హరికీ
భూరిప్రతాపమునా - యిది పా - డినవిన్నా యువిదల కందరికీ
ఆయదువంశజుడూ - అధికపు - సంపదలూ శుభముల్
మితిలేకుండగ - కృష్ణుడు - ఇచ్చును సతిపతులకున్నూ.

---

# చిలుక రాయభారము

ప్రాణాపాదంబైన పంచావన్నెల చిలుకారావే - తనావిభుని తోడితేవె
తన్నాడీస్టి మాటలన్నీ మొన్నవింటివా - మేనమామకొడుకు కీర్తిగా
తనుపంతమాడేనూ - తన్నేగాని పెండ్లి ఆడననుచూ పట్టుపట్టెనే
విప్రుని బంపితీ కబురు తెలియాదాయె చిలుకారో
ఏవిధమ్మునైన తన విభుని తోడితేవే
భీష్మని కొమారుడు పంతాముతో పట్టుబట్టెనే
శిశుపాలునికిచ్చి పెండ్లిచేతూనానుచుబల్కెనే
తా పెద్దకొడుకాని యెదురూగ తానిలచి పలికేనూ
తాబట్టినా కుందేటికి మూడే కాళ్ళానునూ
కమలనాభుని పొందు యెన్నాడు కన్నూలగందూనూ
కరుణాకటాక్షులూ యెన్నాడు తన్ను మోహించునో
పరమాదయాళూడు వచ్చి తనా యెదుట నిలచునా
కరుణాతో నన్నూ పెండ్లాడునా
గారవించునా గౌరీదేవిని తాను పూజించి నగరీకిరాగానూ
కనకారత్నమువాలె తాళిపట్టేడ గట్టెదా
మునులెల్ల దీవించ ముత్యాల తలంబ్రాలుబోసెరా
సురలెల్లదీవించ మంగళసూత్రము గట్టెరా
ఘనులెల్ల దీవించ కంకాణమ్ములు చేతగట్టేరా
విదర్భాదేశమువారు విచిత్రపడి తన్నుజూతురా
సిగ్గూపొడి శిశుపాలూడు తన తలా వంచూనా
వెరవాకుమనిజెప్పి వెన్నూడు తనచెట్టబట్టూనా
రుక్మాంగుని పంతాములన్నీ వడిగా చొక్కూనా
కరుణాతో శౌరి పెండ్లాడూనా
వగవాకెవోయక్క వైకుంఠధాములూ వచ్చూనూ

వచ్చినక్షణములో మెప్పైన వరమూలూ యిచ్చేవా
మెచ్చినాకందేలూ గట్టేవా
ఆలాగే ఆదిదేవూలు మమ్మాదరించితే
ఘనమైన వజ్రాల యందెలు కాళ్ళాకుగట్టేనూ
ఎఱ్ఱన్నిముక్కూకి వెండిభమిడి పొదిగేనూ
పచ్చని రెక్కలకు హెచ్చైన ముత్యాలూ గుచ్చేనుం
పుట్టించి పట్టాభద్రూల కిల్లాడశాయవే
ఇంకొక్కజన్మాన రాజాధిరాజూలా పట్టిపి
కొడుకూలు కోడళ్ళు అల్లుళ్ళు ఆడబిడ్డాలూ
మనమాలు సకలాసంపదలు కలుగా కోరేనే
అది యేమెవోయక్క అందూకు నేనాసిస్తినా
ఘట్టిగవైకుంఠ పురమందు తనకిల్లూగట్టావే
ఎన్నాడు తన్నేడాశాయకూ
అక్కారో జూడుమనిజెప్పి గోపూరామెక్కేనూ
దిక్కూలు దీవూలు నాలుగురాజ్యాలు జూసేనూ
దక్షిణాభూమంతా తప్పాక తలయెత్తి జూసేనూ
ద్వారాకాపురమందు కనకగోపూరాలూ జూసేనూ
అభిషేకపూజాలు చేసేటివారినీ జూసేనూ
నవ్వూచూ వచ్చేటి నల్లాబిళ్ళలవారిని జూసేనూ
జారూగావచ్చేటి పచ్చాబిళ్ళలవారిని జూసేనూ
బలరాముడు మొదలగు ఘనమైన దొరలాను జూసేనూ
ఆ వెనుకవచ్చేటి - ద్వారపాలకూలనూజూసేను
యెక్కువాగుఱ్ఱాలు యేనుగులూ కదుపూలా జూసేనూ
ఆ వెనుకవచ్చేటి విప్రపాలకూలానూ జూసేను
శృంగారవనమూలూ శ్రీకృష్ణులూ పొగడా జూసేను
వేగామె గోపూరముదిగి చిలుకతావచ్చేనూ
ప్రదక్షిణములుజేసి పాదాపద్మముల కొరిగేనూ
వసుదేవనందనుడ వచ్చి రమణినిచేకోనూ
చేరూనులగ్నామురమ్మాని కృష్ణునితోజెప్పేనూ
వేగమేగోపూరముదిగి చిలుకాతావచ్చెనూ

అక్కారో నాకింతచక్కెరబెట్టావె జెప్పేను
నీనాకటధారుడూ యేవంక వచ్చునోజూచితీ
చక్కెరబెట్టేను వుక్కెరబెట్టేనూ చిలుకారో
చల్లని నా ప్రాణనాధుని పొడగంటివా
అందెలుగట్టేను మువ్వాలుగట్టేను చిలుకారో
ఆనందకృష్ణమ్మ ముచ్చాటలన్నీ వింటివా
గంధాముబూసేనూ పువ్వాలుముడిచేను చిలుకారో
పుండారికాక్షూలు యేవంకవచ్చారో జెప్పావే
అక్కారో జూడుమని నేజెప్పి గోపూరమెక్కితీ
దిక్కూలూదీవులూ నాలుగురాజ్యాలు జూచితి
దక్షిణభూమితప్పాక తలయెత్తి జూసితి
ద్వారకాపురములో కనగగోపూరాలకు మ్రొక్కితి
అభిషేక పూజాలు జేసేటివారిని జూసితి
నవ్వూచువచ్చేటి నల్లబిళ్ళల వారినిజూసితీ
బారూగవచ్చేటి పచ్చబిళ్ళలవారిని జూసితీ
బలరాముడు మొదలైన ఘనమైన దొరలనుజూసితీ
ఆ వెనుకవచ్చేటి ద్వారపాలకులాను జూసితీ
ఆ వెనుకవచ్చేటి ద్వారపారకూలనూ జూసితీ
శృంగారవనమూలు శ్రీకృష్ణుడూ పొ - గడజూసితి
వేగామెగోపూరంముదిగి అక్కారోవాలితీ
వసుదేవనందనుడ వచ్చీ రమణినిచేకొనూ
చేరూనులగ్నాము రమ్మాని కృష్ణునితోజెప్పితీ
రూపించి నీవిభుని రూపమంతా నేను జెప్పేనూ
అలయాక సొలయాక భక్తితోగూర్చుండి వినావే
అందమయినామంచి నీలవర్ణుని శిఖాపై నీ
పొందూగజుట్టేను పారితాపూల బంతూలూ
మంచీకిరీటాము మకర కుండాలములు బెట్టేను
వెలలేని వజ్రాలపోగూలు పెట్టేనువెన్నూడూ
బావిలీముత్యాలు నీలాలపోగూలు నీటూగా
కట్టెను పీతాంబ్రాము వల్లెవాటూగా కృష్ణులూ

అద్దగిపూంచెక్కిళ్ళు ముద్దూలుగారూనూ అక్కారో
కలువా రేకులవంటి కన్నూలాతీరే అక్కారో
మన్మాథూనిచేతి సింగణివిళ్ళు కనుబొమ్మాలూ
పంచారత్నమువంటి బంతులతీరే పలువరుసా
అరటిబోదెలవంటీ చక్కానితొడలే అక్కారో
చెరకుకోలలవంటి చక్కానిచేతులే అక్కారో
యెగుభుజమ్ములతీరు యెంతవింతలుగారె అక్కారో
ఘుమఘుమామనియేటి కుంకుమపరిమళములలద్దీరీ
సందీటిదండాలు జతలా తా వేజూలూ మెరయాగా
పచ్చాలకడియాలు ముందార ముత్యాలమురుగూలూ
చిత్రాజు తండ్రికి ముత్యాలకంఠమాలందామూ
ఘంటాలమొలత్రాడు జమిలీఘంటలు మోలమ్రోయగా
చందమామతోనూ సరసములాడూచు కదలేనూ
ఈడుగాపాడూచు కదలేనూ
ఈడుగాపాడూచూ ఇరువంక చామరాలెయ్యాగా
ఆకూలూపోకాలూ అతివాలుమడిచియ్యాగా
మడుపులంది కొలువూలో చిన్నారినవ్వూలూనవ్వూతూ
వాసవాదులకైన వర్ణించిపొగడా వశమాటే
హరివాసుదేవుడో యెవ్వారోగానీ తెలియాదూ
నా కన్నులకుజూడ వెన్నెలవలెనున్నాడూ
రూపించి నీవిభుని రూపమెంచామాతరమటే
చిలుకాపలుకగ రుక్మిణి తనమాదిమరచేను
కన్నూలూమూయూచు మెల్లిగామూర్ఛాలు బొందెను
రుక్మిణీని జూచి చిలుకా కిలకిలనవ్వేనూ
అక్కారో యిటువంటిమాటలకెవరైనా భ్రమసేరా
చెలికత్తెలందారూ గుంపూలుగూడుక నవ్వారా
కన్నావిన్నావారందారూ కేకాలువేయరా
ననుగన్నతల్లి యిదినీకు బుద్ధిగాదమ్మారో
చిలుకారో యేమాని జెప్పూదు ఇక నేతాళానూ
శ్రీకృష్ణరాయూలు కోటవాకిలిదాటి వచ్చేరా

రుక్మాంగుని నగరిలో విడుదూలు నిలుతూరా
పప్పూచాలా ఒప్పూగ కూరాలూ నేతూలూ
తెప్పాలూగా నా విభునికి అప్పాలు దెత్తూరా
అంతాట గోపాలకృష్ణమ్మ వాకిటనిలచూను
కళ్యాణివగవాకె ప్రాణనాధూడు వచ్చేను
వ్రతమూలు పణతిరో నీకూ చేకూడెను
వారిజనాభూలు వనితారో నీసొమ్ములాయేను
కలకంఠూడు నీగుణమూలు మెల్లీగా మెచ్చూను
సీతాంగన నాడూ అశోకావృక్షాము క్రిందాను
చింతింపుచుండాగ హనుమంతారాయూలూ వచ్చీరి
ఆనావాలూ తెచ్చి అతివాశోకము తాను మాన్పేను
అలాగే తనవిభునీ తెచ్చీ తనప్రాణా మిస్తీపి
చిలుకారమ్మాని అక్కూనా ముక్కూజేర్చేను
చిలుకారమ్మాని భమిడీ పంజరములో నుంచేను
చెరుకూలు ఫలమూలు తెచ్చి చిలుకాకిచ్చేను
భీష్మకమహారాజు అంతఃపురమ్ములో కొచ్చేను
పేరంటాళ్ళ ల్లార కన్యాకు శృంగారించూడీ
సంపెంగ తైలాన సొంపూతో శిరసూ అంటీరి
గంధాము ఆటకాలిబెట్టి జలకములార్చిరీ
సోగాకన్నుల మంచి తీరుగా గాటుకా దీర్చిరీ
తీరుగా కస్తూరి దిలకమూ నుదుటదీర్చిరీ
ఘుమఘూమా మనియేటి కుంకుమా పరిమళము దలదీరి
పసిడిపువ్వులచీరె మొలకబోసీ వేగగట్టిరీ
చిత్తార తల్లీకి ముత్యాల రవికా తొడిగిరీ
ముత్యాల ముడిమీద రత్నాలరవ్వ దాపిరీ
యెక్కువైనా మంచీ యేడువారపు సొమ్ము లుంచిరీ
శృంగారించూకు రుక్మిణిని దోడూకు కదలీరి
గౌరిదేవీ పూజ ఘనమూగచేయా రుక్మిణి
శ్రీకృష్ణమూర్తిని దలచూచు పార్వతికి మ్రొక్కుచూ

దేశాధిరాజూలు జూడాగ కోవెలకు వెళ్ళేను
గౌరిదేవిని దెచ్చి కనకంపు గద్దెపై నుంచిరీ
అతిభక్తితోడూత దేవిని పూజింపదొడగేనూ.

## పద్యము

ఉ॥ నమ్మితి నా మనంబున సనాతనులైన యుమా మహేశులన్
మిమ్ము బురాణదంపతుల మేలు భజింతుగదమ్మ మేటి పె
ద్దమ్మ దయాంబురాశివి గదమ్మ హరింబతి జేయుమమ్మ ని
న్నమ్మిన వారికెన్నటికి నాశములేదు గదమ్మ యీశ్వరీ.

అకూలు పోకాలు రుక్మిణిదోసిట బోసిరీ
మల్లేల మొల్లాల రుక్మిణిదేవిని పూజించేను
భక్తి సాష్టాంగ దండాము గౌరీకి బెట్టేనూ
తిరిగి మళ్ళెనువేగ రాజూలానందరిని జూచూచూ
శ్రీకృష్ణరాయూలు కానరాకాపోయె చిలుకారో
ఈ ఘణముదప్పితె శిశుపాలుని పాలు అవుదూనె
అని రుక్మిణీ తాను చింతించి నడచూచురాగాను
దేశాధి రాజులు చూచీ మూర్ఛాలుజెందిరీ
పొంగూచును శిశుపాలుడు నవ్వూచు నిలచేనూ
దేశాధి రాజులకు వర్ణించతరమూగాకానూ
భీష్మక మహారాజు రుక్మాంగుడూ జూచుచుండగా
శ్రీకృష్ణరాయూలు వేతెంచి దేవిని దీసూక
బంగారు రథముపై రుక్మిణిని యుంచూకుకదలేనూ
రథముబూచీ శిశుపాలుడు తన తాలవంచేనూ
శంఖాము పూరించి శ్రీకృష్ణరాయూలు కదలీరీ
వెనుకా ముందార పదివేల రాజూలూ రాగాను
అంచంచాలల అడుగూలుబెట్టుచూ నడచూచూ
రాజూల నామముల గుచ్చి రుక్మిణితో జెప్పుచూ
కంచు రథమూ యెక్కి కాంతారో మీ యన్న వచ్చేనే

వాడి మీసము నేను గొరిగి పంపింతూను జూడూమీ
వెండిరథమూ యెక్కి శిశుపాలుడూ వచ్చె జూడుమీ
దేశాధి రాజులు చూడాగ వీని తల తుంతూనూ
దశదిశల రాజూలు గెలవలేక వారు నిలిచీరీ
అర్థాణమ గొరుగాగ రుక్మాంగుడూ తాను నడవగా
బలరాముడూ వచ్చి సేనలందర పారదోలేను
సభరాజులా జూచి శిశుపాలుడూ తాను బలికేను.

## కీర్తన

ఏమయ్యా సఖులార మిమునమ్మి జవరాలిగోలుపోతీ
నాభామనీదెచ్చి నాకియ్యకున్నాను ప్రాణములు నిలుపలేను
సతినియోడి ప్రాణధారణము కంటెను భూమిపై వ్రాలుటామేలూ
నాసతిని యెత్తుకొనిపోవుచూనున్నాడు వీడెండసామంతుడో దైవమా
చుట్టుకొనిమీరుండ గొల్లవాడెచటుండివచ్చి యెత్తుకుపోయెనో
మితిలేని గోపకాంతలుయుండగా తాను క్రోవ్వేనే గోపాలుడూ
కలకాలంబూని యొకపండు పండితే చిలుకావిధంబాయెను
ఏమయ్యా సఖులార మిమునమ్మి జవరాలిగోలుపోతీ.

అనిశిశుపాలుడూ దుఃఖించుతూతాను - మళ్ళేను
అప్సరసలాడాగ పుష్పాలవానాగురిసేను
ద్వారకాపురమందు నగరివాకిటా నిలచీరీ
ఎదురూగ సేసాలుజల్లిరి హారతులిచ్చిరీ
రుక్మిణీదేవిని అంతఃపురమ్ములోనుంచీరీ
దిక్కూలవారిని దేవూనిపెండ్లికి రమ్మానీ
యెల్లుండిలగ్నాము రమ్మాని శుభలేఖవ్రాసిరీ
కరకంటుడప్పూడు గౌరితోకూడి వచ్చేను
పద్మాసంభవుడు సారస్వతీతోగూడి వచ్చేను
చెలికత్తెలందరు వీణెలు పుస్తాకంబూలతో
కొల్లాలుకా బళ్ళ ధనమూలు పట్టూకువచ్చీరీ

చక్కాగాద్వారకాపురమంత రాజూలునిండిరి
భీష్మాకమహారాజు తనసతితోగూడ వచ్చేను
అంతఃపురమూలో కాంతాలందారు గూడూకా
సంపెంగతైలాన సొంపుతోశిరస్సూ అంటిరి
గందామూ అటకాలి పన్నీటజలకాములార్చిరి
కురులూచిక్కులుదీసి పువ్వూలు మల్లెలుముడిచిరి
సోగాకన్నుల మంచితీరైనా కాటూకాదిర్చిరి
తీరైనా కస్తూరీతిలకాము నుదుటానుదిర్చిరి
పట్టుపీతాంబ్రాము మొలకబోసి వేగగట్టిరి
వైభోగచెలియాకు వైడూర్యపు రవికాదొడగిరి
ముత్యాలముడిమీద రత్నాలరవ్వాలుదాపిరి
యెక్కూవైన యేడూవారాల సొమ్మూలనుంచిరి
ఘుమఘుమమనియేటి కుంకూమపరిమళము లలదిరి
గౌరీదేవినిదెచ్చి కనకంపుగద్దెపై నుంచిరి
ఆకూలుపోకాలు రుక్మిణిదోసిట బోసిరి
మల్లెలుమొగ్గాలు రుక్మిణి పూజింపుచుండేను
నాడు అచ్యూతుని విభునిగాను గోరితి
కొడుకూల కూతుళ్ళ నిమ్మానిగౌరికి మ్రొక్కేనూ
నవ్వూచుసరస్వాతి రుక్మిణితో బలికేను
విప్రునిబంపి మా కృష్ణుని చేరగొంటివి
అనివారు బలుకాగ నవ్వూచుతాలా వంచేను
భీష్మాకమహారాజు అంతఃపురములోకి వచ్చేను
కన్యాను దోడూక రమ్మాని వారితోజెప్పేను
తలంబ్రాలుబోసి కన్యాను గంపాలోనుంచిరి
భీష్మాకమహారాజు తనసాతిగూడి నిలచేను
శ్రీకృష్ణమూర్తికి కాళ్ళుగడిగి ధారబోసేను
రుక్మిణిదేవిని ప్రీతిగసామార్పించెనూ
అప్సరసలాడాగ దుందుభులుమ్రోయగ కృష్ణుడూ
రుక్మిణిదేవిని కళ్యాణమాడెను
ఘనముగా వచ్చినవారిని వరుసతోకట్నాలిచ్చిరి

సతులానుగూడూక సంతోషమునను వెళ్ళిరి
శిగ్గుపాడి శిశుపాలూడు తన తాలవంచేనూ
వెరవాకుమనిచెప్పి గట్టిగతనచెయ్యి బట్టెనూ
రుక్మాంగుడి పంతాములన్నివడిగా సొక్కెనూ
గుంపూలుగూడుకు పేరంటాండ్రూ సొంపుతో
పాడూతువచ్చి కళ్ళు చేతాబట్టూక
పంకజనాభూలమీద సుంకూలు జెరిగిరి
అచ్చాటనాగవల్లి అమరాజేసిరి
నాగవల్లికుత్తిగంటూ మెడనుగట్టిరి
తల్లికి దండ్రికి రుక్మిణిదేవి మ్రొక్కెను
కన్నీరు దెచ్చుకొని కౌగలించి ఫారుబలికిరి
కన్నతల్లిని నీవు వగవాగ నేటికమ్మారో
మేము ధన్యూలమైతిమి కృష్ణూ డళ్లూడుగాను
కన్నతల్లికి మ్రొక్కి కన్నీరుదెచ్చూక వగచేనూ
కన్నతల్లివినీవు వగవాకె ధన్యులమైతీమి
అనిచెప్పి కన్యాకు తమరు తమపట్నమునకు వెళ్ళిరి
రుక్మిణినిగూడుక సంతోషమ్మూన యుండిరి
ఈపాటయెవరైన పాడినవిన్నాను కృష్ణూలూ
అష్టైశ్వర్యములు ఇష్టసంపదలూ యిచ్చూను
కన్యకలు యీపాట పాడినవిన్నా వారికి
కళ్యాణమౌనని రుక్మిణి తానుబలికేను.

# రుక్మిణీదేవి సారె

సెలవిచ్చి మాయమ్మ సెలవిచ్చినామమ్మా - చెలగి మీ అత్తింట్లో బుద్ధిగనుండమ్మా
యెవ్వరేమాడిన యెదురాడకమ్మా - వీధిలో నిలుచుండి కురులిప్పకమ్మ
పలుమారు పలుదెరచి నవ్వబోకమ్మా - పరమాత్మతోగూడి వెలుగు మాయమ్మ
వారినికాదని పువులు ముడవబోకమ్మ - పెద్దలగురుతెరిగి నడుపుమాయమ్మ
ఆకలిగాపుంటేను అడుగబోకమ్మా - అత్తగారితోపోరు చేయబోకమ్మ
నాతోటిచేసిన మంకుబోరెల్ల - యెరుగని అత్తింట్లో చేయబోకమ్మ
నెలవంటి బాలుడు నీలమేఘమురీతి - నెలతరో యెడబాయకుండు మాయమ్మ
తేరుచుక్కలబొట్టు పంపించెగాని - వారానికొకసొమ్ము అంపించెకాని
మాయమ్మ లక్ష్మిదేవి.

ఇంటిచంద్రుడు ఇంటిపైనుండు - యింటిపయినుండు నీకంటిపయినుండు
కలువపూచితె కొలనిలోనుండు - కన్నవారువర్ధిల్ల పెంచితిమిమెండు
అత్తమనకెన్నడు యెదురాడదమ్మ - యిన్నాళ్ళవలె కోప ముంచబోకమ్మ
నీవు యేమన్నాను మేమువిన్నాము - అత్తవారింట యేమనబోకుమమ్మా
బొమ్మరిండ్లున్నావి బొమ్మలున్నావి - బొమ్మలకుపెట్టేటి సొమ్ములున్నావి
అమ్మ ఆడేటి పువులతోటలున్నావి - సమ్మతిగమీరొచ్చి ఆడుకొండమ్మ
లక్ష్మి అత్తిల్లుపోయెను అనుచు - లక్ష్మిమామీద అమ్మదయవుంచు
వెంటనే లక్ష్మి సంతోషమనుచు - పుట్టిపెరిగినది మననోము ఫలమనుచు.

కట్నముగ యిస్తాము కామాక్షివనము - పట్నములో వుండేటి పట్టుచీరెలును
కలువరేకుల చీరె ఘనమైన చీరె - చెలియలు మెచ్చేటి చీరలంపేను
బంగాళరవపట్టు పంపించెనమ్మ - శృంగారముగ నీవు చేకొందువమ్మ
పడకటింటికి తగిన సామానుజేర్చి - వడివడిగ బంపేను వసుధలోనమ్మ
కన్నపుత్రియ త్తిల్లు పోయెను అనుచు - గారాబుకూతుర్ని కౌగిటజేర్చి
చెక్కిళ్ళు ముద్దులు మక్కువతో బెట్టి - చక్కగను నీతులను చెప్పి పంపేను.

అరటాకు వంటిది ఆడజన్మంబు - సుభద్రనెత్తుగా జూచికోవమ్మా
లక్ష్మియనగ పేరు బెట్టినామమ్మ - గోత్రాని కొకబిడ్డ పుట్టిందిఅమ్మ
చేయనిశృంగార మాయెనే మనకు - చూచి సంతోషింపు మాయమ్మ నీవు
పదహారువేల గోపస్త్రీలలోను - కులశ్రేష్టమయిన శ్రీలక్ష్మిదేవమ్మ
పూబోడులతోను వెలిగితిరిగింది - పువ్వులు తోటలో ఆడుకున్నాది
శిరముననుంచి శ్రీలక్ష్మిగజూచి - ముందుగాజూచి శ్రీలక్ష్మిగనెంచు
యేండ్లుకొంచెముగాని యౌవనములేదు - యేవిధమయినాను గాపాడుకొండి
వండను యెరుగదు వడ్డింపనెరుగదు - నిండు పరుపుమీద పండనెరుగదు
మాయమ్మలక్ష్మిదేవిని అమ్మ అదరించూ - మాయమ్మ.

హోమభాగంబున నుంచెదను నేను - జగతిలో వొకటి చెప్పగలేదు
ఆమెను దండింప వలదటయనుచు - అయిన పెద్దలు వినగలిగితేచాలు
ఆనతిచ్చి పంపండి ప్రొద్దుపోయేను - యేడుతిరుమల కొండ సేవించవలెను
ద్వారకపురిపట్నం పోయిచేరవలెను - యెదురుకోలవారు యెదురుగరాగ
లక్ష్మినితోడుకొని వచ్చేటపుడును - కంచుదివిటీలవారు వెలుపట్టగాను
కామధేనువులెల్ల కదలి మెదలగను - పన్నిద్దరాళ్వార్లు సన్నుతులుచేయను
మాయమ్మ - లక్ష్మిదేవమ్మ స్థళమువకురావమ్మా.

వాడెత్తె మేరుగిరి ఆపుదామనుచు - కూడవచ్చిరియెంతో సంతోషమనుచు
అంతటహరిబాల దిగ్గునలేచి - పీతాంబరము దివికొంగుజార
అందరిటుపోయిరి తొత్తులిటపోయిరి - పాలకీపట్టెటి బోయలిటుపోయిరి
మాయత్త యల్లమ్మ చూచిపోవమ్మ - పట్టంపుదేవిగానుండు మాయమ్మ
రామరాముని ధ్యానంబు చేయనోయమ్మ - కొత్తగయెంచినీవు కొదవుంచకమ్మ
హరివద్దకలసి మెలగియుండుమోయమ్మ - మాయమ్మ లక్ష్మిదేవమ్మా.

# లక్ష్మీదేవి సొగటాలాట

శ్రీవెంకటపతి చిత్తముదలతూ - శ్రీలక్ష్మిని నే మనసునదలతూ
చేతులుముడుచుకు సరస్వతిదలతూ - వనజోదరు నీ పాదములదలతూ
నీరజభౌని భక్తుల్లారా - వాక్కుతో సర్వతినేవర్ణిస్తూ
జయతూ శ్రీవెంకటగిరిపతికి - జయతూ మమ్మేలిన ఆ స్వామికి
పంచాశంభుడ నీకే జయతు - పరగామమ్మేలిన ఓస్వామీ
గుజ్జారీరూపున శాబోయీ ముదముతో మూ - డూ అడుగూలడిగీ
బలికిశిరసు పాదములిడినా పరమాత్మ నీకేజయతూ
జనకునికూతురు జానకిదేవి - దేశాయీలు మిమ్మునబొగడ
నిమిషమ్మున పెండ్లి ఆడిన - నీలవర్ణుడ నీకేజయతు
కలికీకాంతల అభిమానమ్ము ఘనముగ మీరటుకొల్లలుగొంటిరి
కలికావతారుడ మమ్ము కరుణించుమి కరుణానిధీ
కలకలనవ్వుచు కమలనాథుడు - కంబుజాక్షితో యిట్లనిపల్కె
పొడిచినప్రొద్దూ పోవలెమనకూ - వేడుకజూదంబాడుదురమ్మ
అనుచును దననాధుడుబిలువా - హర్షించెనుగా లక్ష్మిదేవి
గజవరదుని కరములుబట్టి నగరాంగణపు నగరికిజనిరీ
చతురంగపు శాలల్లోను - చిరిచాపలు శ్రీహర్షంబరిచిరి
సతిపతులంతట సంతోషమ్మున - గూర్చిండిరిగా పరుపులమీద
వెండితోజేసిన సొగటాలేమొ వెన్నుడుతానూ దెప్పించె
రత్నాల సొగటాలేమొ లక్ష్మికాంతుడు దెప్పించె
బంగారుసొగటాల్పావి పద్మనాభుడు బరిపించె
ముందరపందెము నాదోయనుచును మురియుచు శ్రీకృష్ణుడుబల్కె
అతివాతోను అడగవచ్చి - ఆభరణమ్ములు సొమ్ములుబెట్టె
నేర్పూతో మెడనూళ్ళుబెట్టె - మేలయినాపతకంబెట్టె
యురమున యుత్తరజంధ్యంవేసె - మొలానూళ్ళు మ్రోయుచునుండే
మోహానాధారునికపుడూ - ఆదియగు దేవుండపుడూ అందేలు పాదములాబెట్టే
వక్షస్థలమూనా వనమాలా - అచ్యుతూడూ తా ధరియించె
చెక్కిట కుండాలములు ధగధగలాడుచు మెరయాగాన్నూ

ధగధగలాడే ముత్యపుపోగులు చెలువుడికర్ణము మెరయగాను
ముద్దుముఖమ్మున ముత్యపుతిరుమణి చక్కగతానూ ధరియించె
నెలవంకాబోలు నెన్నుదురూ మీదను చంద్రావంకా తిలకందీర్చె
పికిలీపించం తలకూజుట్టీ - పీతాంబ్రం పయినీగప్పె
వన్నెకాడే కల్కీ కృష్ణుడు - వల్లెవాటొప్పుగవేసె
సొక్కుచుసోలుచు వేణునాదం - చక్కగాను హరియూబట్టె
కన్నులుగీటుచు సన్నలుజేయుచు సారెకు తాండవమాడుచునూ
దేవేంద్రాది దేవతులెల్లా దేవాదేవుని చూడావత్తురూ
అక్రూరుడు మొదలగు హరి దాసులు - భక్తితోతుత భోగాపదులు
పద్మనాభుని జూడావత్తురు - నాతులారా నాథుని కొల్వరు నప్పుడు రారేకొమ్మలారా
యిట్టిదేవిని హాయలు అంతా - అప్పుడయినా జూచీతిరిగా
అంతటనూ ఆలక్ష్మిదేవీ ఆభరణమ్ములు సొమ్ములుపెట్టె
నేర్పుతో మెడనూళ్ళాబెట్టె - మేలైనపతకంబెట్టె
పచ్చలకెంపుల బన్నసరముల మెడనిండాదిగావేసె
చిన్నియ్యాకుచముల నడుమను - చెన్నమరిన చంద్రహారంబెట్టె
రత్నాలుదాపిన రవికాదొడిగె - ఆభరణమ్ములు సొమ్ములుబెట్టె
నాసికమ్మున ముక్కెరబెట్టె - నవరత్నముల గీలించిన
నవవడ్డాణం నడుముకుబెట్టె - పాదాలభూషణాలువుంచె
పద్మానాభుల దేవీగనుక - కంకాణములు సూడీగములు
మురుగులయినా కరములనుంచె - చక్కనగు సందిటదండలుబెట్టె
సర్వేశ్వరుల దేవీకనుకా - సంపెంగతయిలంరాచీ
సవరకబెట్టి కొప్పిడె ఆ - కొప్పూమీద నవరత్నాల
కొప్పూగొలుసులు లక్ష్మిబెట్టె - ముద్దూముఖమ్మున ముత్యపుతిరుమణి
ముద్దులుగుల్కగ తానూబెట్టె
చక్కనాగు నుదుటిమీదను చంద్రావంకా తిలకందీర్చె
పణతీతన పాపిటినడుమను బంగారంపు చూచుకముంచె
కలికీ తన కన్నులమీదను నిగనిగకాటుక మెరయగనూ
తిత్తిగతీవంచా అదిచక్కూపగడా అచ్చరిక అచ్చోగ
అతిభారయనుచు - జవ్వనుచూ జూదనుచూ - సారికపలుమారు
బలువయినా పందెమూలు బద్మానాభులదేవి వేసె

ఆటలతోవారు ప్రొద్దూబుచ్చుచూ - నుండగనూ ఆ పాపకర్ముడు
పాండుసుతులకూ ఘాతకుడు ఆ - ప్రబలద్రోహుడు దుశ్శాసనుడు
ద్రౌపదీని తా సభలోపలను - వలువాలిమ్మని విప్పాగానూ
అన్నానాకూ నీవేదిక్కూ అనుచూ - అప్పుడు ద్రౌపదిబల్కె
ద్రౌపదివల్కులు కృష్ణునికెంతో - నాదంవలెనూ వినచ్చెను
అభయమనుచూ పాచికలేయా - కోట్లపొడుగున చీరెలుపడెనూ
మేట్లుకొలదీ రవికెలు పడెనూ - కట్టలేకను ద్రౌపదిదేవి
విప్పాలేకను దుశ్శాసనుడు - స్వామిమహిమా యిదియనిదలచీ
యిచ్చెటివాడు అచ్యుతుడుండగ - విప్పగనెవ్వరితరమయ్యా
చుక్కలపొడుగున రాసులుచీరలు - చొక్కమైన రవికలజోళ్లు
కొలువుకూటమున కలవారెల్ల - పట్టుచీరెలు బంగరురవికెలు
కట్టూకునిరే నీరజాక్షులు - పంకాజానాథుండయినట్టి
శ్రీకృష్ణుండూ పక్కానవ్వే - నాథుడనీవూ నవ్వినవిధము
నాకెరుగించుమి ఓశ్రీకృష్ణా - నీరజనాథుడ
నవ్వినవిధము - నీతితోడుత నెరిగించూ
కమలనాథుడ నీతోనేను - బొంకిపాచిక వైచితినా
భువననాథుడ నవ్వినవిధమూ బొంకకనాతో నెరిగించు
నాతిరూపూనల్లనిదాని - నాకూతగదని నవ్వితిరా
వనితావరుసవచ్చినదాని - వలచుటతగదని నవ్వితిరా
పదహార్వేల మగువలలోపల - వణతీతగదని నవ్వితిరా
రుక్మిణిమొదలగు పట్నపుదేవికి - పొంకముగాపువుదెచ్చిస్తే
పంకాజాక్షి సత్యాభామా - పల్కాని అందుకునవ్వితిరా
హరిమీరూ అచ్చటికేగి - ఆ భామాకోపందీర్చి
వేళ్ళతోనె వృక్షుందెచ్చి - వేశినందుకు నవ్వితిరా
యెల్లసతులలో కెక్కూవయినా - రుక్మిణికి వరమూలియ్యా
పెక్కూవిధమ్ముల ప్రియములనొందిన - మక్కువలకూ నవ్వితిరా
ద్రిమ్మరిగాడవు నీవూ - సతులను దిట్టావయి చెట్టాబట్టీ
చెంచూబిడ్డల చెలువముతో - దెచ్చినచందంగాదుసుమీ
హెచ్చవునా నీవూసతులను - తచ్చనశాయకు హోరీకృష్ణా
తచ్చనగాడవు నీవూ కృష్ణా - హెచ్చులుశాయక నేలుదువా

యెన్ని నేర్చుకుంటేనీపూ - యింతులనెల్లా చేపట్టీ
లోకమ్ములు అన్ని పాదునబట్టీ - మ్రోయుదువా ఓ శ్రీకృష్ణా
జారగుణంబులు చోరతనంబులు - యెన్ని నేర్చెనో మీయన్న
అనుచూ ఆ లక్ష్మీదేవి అపుడు - అచ్యుతులనూ తా డాయగవచ్చీ
చిరునవ్వొలయగ నవ్వుచూనూ - మురయుచు శ్రీకృష్ణునికొంగూబట్టె
ముత్యాలహారములు మెరయా - మురహరుడూ ఆ ముదితతోనపల్కె
పతికొంగూలు బట్టినవారికి - తప్పులులేవా ధరణీలోపల
నాకొంగూలనుమీరు బట్టితే - మీకు నేరములు యేమయినగలవా
నేడుగాదె నీకొంగూబట్టి - బహుకాలం ఆయెనేలక్ష్మి
తరుణీ నాదగు చిటికెనబట్టి - తరుణులచేతా పూజలుగొంటివి
గోవిందూలా లక్ష్మీవని - కోరికలన్ని యడుగుదుర్గూ
పురుషోత్తములాదేవీ - వానిభూమెల్లానిను వేడూకొంద్రూ
చిక్కితీ నీచేతాయనుచు - చిరునవ్వులునవ్వుచునూ
పక్కూన హరి చెక్కిలినొక్కి - మురయుచుముదితను ముద్దిడె
నవ్విన పురుషుని బందెనబెడుదుర - యేలోకమునందయినా స్త్రీలు
నాతిరోనన్నూ బందెనబెడితివి - నేడూనాకు కానుకవచ్చు
నాతిరోనేనూ నవ్వినవిధమూ - కోమలి నీకెరిగించెదవినవే
నా సహోదరీ పరమపావని - బహుపతివ్రతా ద్రౌపదిదేవి
రాజులసభలో నుండాగానూ - పరమద్రోహుడూ దుశ్శాసనుడూ
వలువలిప్పగా దుఃఖంబొంది - అతుయముగాను వలువాలిమ్మని ఆద్రౌపదియు మమ్ముదలచే
అతుయముగా వలువాలపుడూ- ఆ సతికిచ్చీ నేనవ్వితినీ
ఇంతేగాని యింతిరో నాపయి - నెపములెంచగా దగునూనీకు
సుఖముగాను పోదమునము - అంతఃపురమునకనుచూ లేచె
ఆదిలక్ష్మి శ్రీవిష్ణుమూర్తి - పరమసంతోషముగనుండ్రీ
యీపాటపాడి విన్నా యింతులాకు సంపదలును - అష్టసౌపుత్రులుగలిగి
పరమాత్ములపయి భోగమ్ముపణతులు - యెవ్వరుపాడినవిన్నా
యిహాపరసౌఖ్యం కృష్ణుండిచ్చు.

# రుక్మిణీదేవి వేవిళ్లు

శ్రీరుక్మిణీదేవి గోపాలకృష్ణమ్మ - సిరులు - మాకిచ్చుననుచూ
కారుణ్యమున మేము విన్నవించామని - కల్యాణవార్తలన్ని
శిశుపాలుని గొల్చినట్టి యారాజుల - శ్రీకృష్ణుడే గెలిచెను
కుశలముగ రాజుల సముద్రునితో కూడె - కోమలి కడకుతాను
గొంతియా పట్టాణి భీష్మకుల కూరిమి - కూతురు శ్రీరుక్మిణీ
దండిగా పెళ్ళాడి ద్వారకాపట్నాన - తానుభోగింపుచుండె
ఏవేళలందనక యేగడియలందనక - ఎడబాయలేక కూడి
సర్వదావుండిరి తమదంపతులు తమ - తమలోకమున వుండిరి
పశుములు నెలదాటి పదమూడు - నాళ్లాయె పెట్టినా తిట్టుకొనునూ
చిన్నిచక్కని ముద్దు చేడెయ్యకి - గర్భచిన్నెల్లు కనిపించెనూ
వేవిళ్ళు తరుచాయె వాచవికి - పచ్చళ్ళుతేరమ్మ యీకొమ్మకూ
గుట్టుతెలియదుగాని యెన్నినాళ్లాయెనో - కొమ్మ కొన్నాళ్ళకిపుడూ
పూవులనుపూచేటి తీగవంటిది మేను - పదునెక్కినంత వదుల
నెలతలందరు కూడి గుసగుసలాడగా - నెలలు రెండాయెసతికి
మూడులోకాలకూ మాటల్లు అందగా - మూడునెలలాయెసతికి
వేడుకగు నూగారుల సిరులొప్పుచుండగా - వెలది రుక్మిణీదేవికి
ఏరుపడి శృంగారవతి చూచు కమ్ములునుమంత - నలుపెక్కెను
అందారు బంధువులు ఆనందమొందగా - అయిదునెలలాయె సతికి
గౌరూను సరస్వతీ ప్రబలు అరుంధతీ - గంగమొదలయిన సతులు
రారమ్మపోదాము అమ్మరో - రుక్మిణీరమణినీ చూడవలెనూ
దూరమాపోదాము నూపొడుముతో - చద్ది నీవు చేయించవమ్మా
చారలేనీ సన్నబియ్యపూ అన్నాన - చద్ది వక్కటి కలుపుమూ
పుల్లన్ని పెరుగోసి సొంఠిపొడుములువేసి - పెరుగుచద్దొకటి కలుపూ
నిమ్మపండ్లారసము ఇంగువతో - ఒకచద్ది నీవుకలిపించవమ్మ

# రుక్మిణీదేవి సీమంతము

శ్రీకృష్ణుని రాణికిని శ్రీరుక్మిణి దేవికినీ
ఇంతికి గర్భపు చిన్నెలు వింతలుగా నైకొానెనూ
ఓకిలింతలు ఘనమాయెను శ్రీకాంతుని రాణికినీ
చేకొని గోడల మృత్తిక భక్షించుచు నుండే
అన్నము యించుక తినదూ ఆకలి పలుమారనదూ
పట్టెడి దర్బెడి నైకొని నెలతరొా ప్రొద్దులుబుచ్చూ
శుభకంఠము సన్నమాయెను శుభకోమలాంగికి నపుడూ
స్వారపు ఫలములు మీదనే కోరిక లగ్గలమాయె
ఆవులింతలు ఘనమాయెను శ్రీకాన్తునిరాణికినీ
పణతీ పట్టెమంచమ్ముపై పలుమారూ పవళించూ
ఆ చందముగని చెలులూ యింతికి తామిట్లనిరీ
నీవున్నా విధములు మరి మా కేమీ తెలిసుండవు
అన్నము నించుక తినవూ ఆకలి పలుమారనవూ
పట్టెడి దర్బెడి నైకొని నెలతరొా ప్రొద్దులు బుత్తు
శుభకంఠము సన్నమాయెను శ్రీలక్ష్మిరో నీకూ
శ్రీకృష్ణుడు విన్నా మరి కోపించునో యేమనునో
ముగుద నీవు నీళ్ళోసుకుమునుకొని మూడు నెలలాయె
ఇంతికి గర్భము నిజమని యెంతో సంతోషింప్రచీ
ఎంతో సంతోషించి యశోదకు నెరిగిం్రచి
మీ కోడలి విధములు మరి మా కేమని తెలిసుండవు
అన్నము నించుక తినదూ ఆకలి పలుమారనదూ
పట్టెడి దర్బడి నైకొని నెలతరొా ప్రొద్దులుబుచ్చూ
శుభకంఠము సన్నమాయెను శుభకోమలాంగికి నిపుడూ
స్వారపు ఫలములు మీదనె కోరిక లగ్గలమాయే
ఆ పలుకులు విని దేవకి యెంతో సంతోషించె
తనముద్దు కోడలినీ తనదగ్గఱ బిలుచుకొని
కుచముల చందము కుల గిరులూ హేమకలశమ్ములబోలూ

బింబము పాండురవర్ణము బోలున్నది నిజమనెనూ
కావలసిన వస్తువులూ ప్రేమతో తా దెప్పించి
కావలసిన వస్తువులూ చేయమని చెలులకు జెప్పే
అంతట జెలులతో రుక్మిణి బంగరుమేడల కేగె
సంపెంగ తైలము రుక్మిణిదేవికి నీకారనంట్రి
గంధమూ కస్తూరి కాంతకు నలుగులుబెట్టి
సుగంధ జలముల రుక్మిణిదేవికి జలకములార్చి
నిండు కన్నెతళ్ళొత్తిరి నీరజాక్షికి వేడుకతో
బంగరుపట్టు పీతాంబరము కట్టనిచ్చిరి వేడుకలా
సకియకుతల కురులార్చిరి సంపెంగా విరులునూ
బంగరు మొగలిరేకులతో పట్టుసవరముతో కొప్పిడి
ఇరుగడలా సూర్యాచంద్రాదు లనమరగనిలిపి
అరచంద్రా ముత్యాలాబొట్టు మెరయగా బెట్రి
కేళించిన ఆణిముత్యాలా బావిలీలలు మెరయగనూ
శశిపువ్వ మరగనుంచెను చంద్రవదన వేడుకతో
మూపున తీగెలు బెట్టెను ముద్దరాలు వేడుకలా
ఒడ్డాణంబులు బెట్టెను వైడూర్యంబులు వెలుగా
ఒత్తులు భుజకీర్తులు సందెటిదండలు వెలుగా
పాదంబున యందెలుపాంజే పట్టమ్మలు మెరయగనూ
నెలమడుగు పిల్లేళ్ళు నవముద్రికలు మ్రోయగనూ
చిటికెన బొద్దులు బెట్టెను శ్రీరుక్మిణి తన వ్రేళ్ళ
పంచరత్నంబుల బటువులు పంకజాక్షి ధరియించి
కస్తురి తిలకము దీర్చెను కమలాక్షి తనసుదుటా
సోగకన్నులను సన్నపు కాటుకల మరగదీర్చే
జేదెకు చంద్రకాపీరవికె దొడగిరి వేడుకతో
శృంగారంబులు జేసిరి శ్రీరుక్మిణిదేవికినీ
అంగనముందర బంగరు పళ్ళెరంబులు దెచ్చుంచి
దివ్యాన్నంబులు పెక్కూ పిండివంటలు కూరగాయలనూ
పచ్చళ్ళు మొదలైనా పంచభక్ష్య పరమాన్నములూ
దధి మధుఘృత సూపంబులు వడ్డించిరి యింతులునూ

ఆ దధిఘృత సూపంబులు వడ్డించిరి పణతులునూ
ఆరగించి శ్రీరుక్మిణీ హస్తంబు గడుకుకొని
శ్రీకృష్ణుడు యుండేటి చిత్తరు మేడలకేగె
ఇరుగడలా ముత్యాలా చిత్తరవూ పనిళ్ళూ
ఇరుగడలా రత్నాలా చిత్తరువుల కిటికీలు
బంగరుపట్టువస్త్రముదెచ్చి పానుపుపై పక్కగావించి
పారిజాత కుసుమంబులు పానుపుపై పరపించి
పవళించెను శ్రీరుక్మిణీ పంకజాక్షి వేడుకతో
అతివలు యిద్దరుగూడుక ఆకులు మడిచియ్యగనూ
పతుణలు యిద్దరుగూడుక పాదంబులుబట్టగనూ
వనితలు యిద్దరుగూడుక వీవనలువిసరగనూ
ఇందుముఖులెల్లాగూడుక తమకొలువులు శాయగనూ
పవళించెను శ్రీరుక్మిణిపంకజాక్షి వేడుకతో
అంతటవసుదేవుడు తనసఖిడాయగ యేతెంచి
మరి ఆరునెలలాయెనా –.మన రుక్మిణిదేవికిని
చెలియకు సీమంతంబులు సేయగవలెననిపలికే
శ్రీకృష్ణుడుయేడనుచూ అడిగెను వసుదేవుండూ
ఆరునెలలాయెను కృష్ణుడు అంగటికేరాలేదు
ఏవేళా శ్రీకృష్ణుండు వేలాస్త్రీలతోనుండూ
పదియారువేలా కృష్ణుడులోలుండై తిరుగుచూనుండూ
ఒప్పదు యిది నామనసుకు వొప్పదనుచు తాబలికే
ఆ పలుకులువిని జనులూ అతిభయపడుతూవెళ్ళీ
రాజనగరూలన్నీ వెదకిరి రామకృష్ణులనపుడు
సత్యాంగనతో కృష్ణుడు సరసమాడుచునుండగనూ
స్తంభాలచాటునిలచి కనుసంజ్ఞలు సేయుదురూ
కనుసంజ్ఞలవారికినీ చెయిసంజ్ఞలు జెప్పవే
భామామణిరో సత్యభామామణిరో వినవే
మనభక్తుడు అక్రూరుడు మనకు విందులమరించె
ఆరగించివచ్చేనే అతిశీఘ్రంబున నేనూ
మజ్జనభోజనంబులకే సజ్జపరుచుకు యుండుమనేనూ

ఆ పలుకులువిని చెలియాపతిముఖమే తాజూచి
వేగపోయిరాకృష్ణా వేగపోయి రమ్మనెనూ
తనసతి పలుకులకూ చాలాసంతోషించి
శృంగారములు ఆయెను శ్రీకృష్ణుడు వేడుకతో
చీనిచీనాంబరము గట్టెను దివ్యమైన సొమ్ములుబెట్టే
శిరసున రత్నకిరీటము ధగధగ మెరయగనుంచే
వక్షమున శ్రీతులసీ వనమాలిక ధరియించి
కౌస్తుభమణి పతకము కర్ణకుండలములుబెట్టె
శంఖచక్రవనపద్మములు అంబుజచతుర్భుజ సఖుడూ
బంగరుపువ్వుల శాలువవల్లెవాటుగావేసె
ఉరమున బంగారూవుత్తర జంజెముపేసే
చిలుకచేతబట్టుకొని పలికించుకుంటూను
వేణునాదముల నానన్దముగా నూదుచునూ
నాదములువిని గోవులు గోపాలకులేతెంచి
ధిక్కరింపుచు తనచెవులాడిక్కరింపుచు వింటూను
నవ్వుచుగోవుల శిరసులుదువ్వుచు గోపాలుండూ
వచ్చి తండ్రికిమ్రొక్కెను వనజాతుడు వేడుకతో
పాదపద్మంబునున్నా తనయుని దీవించి
ఆలింగనంబులు జేసుకొని అంబుజాతునకిట్లనెనూ
ఏమిరకృష్ణా యెన్నడు యింటికీరావూ
ఆరునెలలాయెను నీవు నా అంగటికేరాలేదూ
వేడుకతో కొమాళ్ళగనియెటివేళలాయెరా నాతండ్రి
బాలుడవై తిరిగేవు గోపాలకులనుకూడి
తండ్రిచేత శ్రీకృష్ణుడు తగు దేవెనలందుకొని
వచ్చితల్లికి మ్రొక్కెను వనజాతుడు వేడుకతొ
పాదపద్మంబులనున్నా తనయునిదీవించి
ఆలిఙ్గనంబులు చేసుకొని అంబుజాతియిట్లనెనూ
ఏమిరకృష్ణా యెన్నడు యింటికిరావూ
ఆరునెలలాయెను నీవు నా అంగటికేరాలేదూ
వేడుకతో కొమాళ్ళను గనియేటి వేళలాయెరా నా తండ్రీ

బాలుడవై తిరిగేవూ గోపాలకులనుగూడి
తల్లిచేత శ్రీకృష్ణుడు తగుదీవెనలందుకునీ
మేలిమైన కనకంపూ మేడలందరికేతెంచే
అంతట సత్యాంగన తనకాంత చెలినిబిలుచుకో
అతివరో వినవే కృష్ణుడు యెచ్చటికేగెనో తానూ
అక్రూరుని యింటికి విందుఆరగించవలెనానీ
అక్కరో కృష్ణుడు యెక్కడికేగెనో తాను
హరి ఎక్కడనున్నాడో ఆ వృత్తాంతము దెలియా
అతి వేగమ్మున రమ్మనిచెప్పిపంపెను చెలితానూ
సత్యాంగనబంపిన చెలియా సరగునతానేతెంచీ
మేలిమైన కనకంపూ మేడలదరికేతెంచే
ఇరుగడలా ముత్యాలాచిత్తరవుల కిటికీలూ
బంగరుకిటికీల చాటునదాగెను చెలితానూ
అంతట శ్రీకృష్ణుడు తనసతి డాయగనేతెంచే
నిద్రించియున్నట్టి నీరజాక్షిని పొడగనెనూ
స్త్రీలకు ముఖశృంగారము యెదముత్యమ్ములుగలవా
భూషణములు గలవింకాభన్న స్వరములుగలవూ
స్త్రీలకుముఖశృంగారము చూడను తానెన్నడునూ
అతివముఖమున చెమటని హరితానపుడుదెలసీ
తాగప్పిన బంగారూశాలూవచెంగున దుడిచే
హరిచెమటలు దుడువగానే అతివతాను మేల్కొనెనూ
అపరాధము అని కృష్ణునిపాదములకే యొరిగే
నవరత్నపు సింహాసనమున కృష్ణుని పాదములు తా గడిగే
పాదతీర్థములు తానూ పైజల్లుకొనెనూ
దీవనలను పుచ్చుకొని విసరెను తనపతికపుడు
పతితామోహమ్మున అతివముఖము తాజూచి
పసిడిచలాకైనట్టి తరళనేత్రిజూచీ
ఇన్నాళ్లావలెగాదె ఇంతిరోనీకనియాడీ
నడుమేపొడుగైయున్నది విడువకయిదియేమనెనూ
అని కృష్ణుడు బలుకగనూ వినిరుక్మిణి సిగ్గునను
తలవంచుకొని యున్నట్టి సతికరములు తాబట్టి

గంధమ్ము కస్తూరి కలపముగాగను జేసి
ముగుదదొడగిన ముత్యాలరవికా ముళ్ళను తావిప్పె
మేన గంధము అలదుచును మేనగోటజల్లుచును
ఇన్నాళ్ళువలెగాదె ఇంతిరో నీ కుచగిరులు
హేమకలశంబులబోలె వింతై యున్నవి యేమే
అని కృష్ణుడు పలుకగను విని రుక్మిణి సిగ్గునను
తలవంచుకొని యున్నట్టి సతికరములుతాబట్టి
గంధమ్ముకస్తూరి కలపముగాగను జేసే
నాతిరో నీ నాకరములుయెరుపేమని యడిగే
అనికృష్ణుడు పలుకగను విని రుక్మిణినవ్వుచును
కస్తురికన్నా యెరుపూ కమలనాథా మీకరమూ
కస్తురికన్నా యెరుపని కడుహాస్యము చేయుదువా
తాజన్మించేటప్పుడు మధురలోపల నింకా
తల్లితండ్రికి వేసిన సంకిళ్ళప్పుడు వీడె
పుట్టితి యీధరలోపల పురుషుండనై మీకొఱకూ
కష్టజాతులకూనెల్లా గతులెల్లా గనపడగా
తమతండ్రి వసుదేవుడు తనతోడుకురాగాను
వ్రేపల్లెవాకిటనూ యశోదాకడనున్నా
యోగమాయని తెమ్మని తాబంపును చెలితానూ
రావిచెట్టప్పుడు గదలెను గార్ధభమప్పుడు గూసే
కాపున్న వారంత కంసుని కెటిగించిరిగా
అమాటలు విని కంసుడు ప్రాణములు మూర్ఛిల్లె
తాబడ్డామూర్ఛలు తనలోనె తెలుసుకొని
తలముడి వీడిపోగాను ఖడ్గముచేబట్టుకొని
పురిటింటికి జేరగతావచ్చెను కంసుండపుడూ
వచ్చిన కంసునిజూచి వసుదేవకిట్లనెను
అన్నరో వినరొయిది ఆడుచిన్నదిగదరా
మగశిశువూకాదుగదా నినువధియించే కొఱకూ
అని చన్నున బాలిచ్చుచూ కరమున నద్దూకొనుచూ
అంతటనే కంసుడు తా బాలిక చెయిపట్టీడ్చె

గిరగిరద్రిప్పాకాశము పొడుగున యెగురవేసే
త్రుళ్ళకురాయోరి కంసా యేల త్రుళ్ళేవురయికను
నినుజంపెడివైరీ ద్రేపల్లెలో పెరిగేను
ఆపలుకులువిని కంసుని ప్రాణమ్ము మూర్ఛిల్లె
కొంతతడవుకా మూర్ఛా గొనితానప్పుడు దెలిసే
పన్నుగ యేడుగురునిజంపితి పాపము నొడిగట్టుకుంటి
ప్రాణమ్ములకేనోడితినని కంసుడుతా వెడలే
అక్కడవెడలీ కంసుడు తననగరికేతెంచె
పూతకినప్పుడు బంపెను భూకల్పుని జంపా
చన్నున విషముంచటకు చనుదెంచెను పూతాకి
ద్రేపల్లెవాకిటనూ యశోదాకడనున్నా
ఉయ్యాలలోనున్నా చిన్నికృష్ణమ్మను జూచెను
రావోయీ నందకుమారా రావోయీ రత్నకుమారా
రావోయి రాజులహంసా రమ్మనగ పూతకి
ఆపలుకులు విని కృష్ణుండు అతివేగమ్మున వచ్చే
ఒక్క గుక్కకే పూతకి విషములు గ్రుక్కిటబట్టె
రెండో గ్రుక్కకు పూతకి రక్తము గ్రుక్కిటబట్టె
మూడో గ్రుక్కకు పూతకి ప్రాణము గ్రుక్కిటబట్టె
గుటకగుటకలని మూడూ గుటకలుగా దిగమ్రింగే
పెనుకొండావలె పూతకి పెరటింటిలోబడెనూ
కొట్టివేసిరీ పూతకినీ గొడ్డాళ్ళా పారలతో
రాసులుగా పోయించీ ద్రేపల్లె వాకిటనూ
పచ్చన్నముదెచ్చియో బాలునికి దిగదుడచీ
బాలింతకుబోసిరె పర్వతమ్ములా పొడవూ
యెఱ్ఱన్నముదెచ్చియో బాలునికి దిగదుడిచి
చూలింతకు బోతూరే చుక్కల్లా పొడవూనా
కంసుడు బంపిన పూతకి కడువేగమ్మున జచ్చే
దండిగ కంసుడు బంపెను రక్కసుణ్ణీవేగా
బండిరూపమై వచ్చే గుండెవిరగ దన్నితిననెనూ
పశువుల బ్రాపకులగాచగ బకుణ్ణీ జీరితినసెనూ.

పాలదొంగిల తన తల్లి రోలగట్టేను ముద్దులనూ
రోలీడ్చుకొని మద్దులనూ కూలగదన్ని తిననెనూ
పక్షులు అంతరిక్షమ్మున పోవుచునుండగ జూచీ
ఆగాలీ సోకినను ప్రాణమ్ములు మూర్ఛిల్లు
అటువంటి కాళిందిలో అవలీలగ దిగనురికి
కాళింగుని శిరసునను కడు నాట్యముచేయుదునే
కంటకి దుండగిడానీ కాళింగుని తన్నపుడూ
కాళింగుని సతులంతా కడువేగమ్మునవచ్చి
కానుకలిచ్చేము మేమూ కడువేగ నాథునివదలూ
మాకు పెండ్లిశాయవె మా ప్రాణవల్లభునకూ
ప్రాణమిచ్చి కావవే భక్తవత్సలాయనుచూ
నీవుజేసిన దీపెండ్లి నిక్కమ్మూ భద్రమూ
చిన్ననాటిదీ పెండ్లి మరి పెండ్లిగాదని పలికె
కాళింగుని మదమణచి కడువేగమ్ముగ అతనీ
వారధిబొమ్మని ద్వీపాంతమ్ములు బంపితిననెను.

దేవదేవ మీ మహాత్మ్యము తెలసీదెలియక నేను
తెలసీ మీ పాదసేవలు గోరితిననెనూ
ఆపలుకులు విని మీకడ కంపితినే విప్రుణ్ణి
నాతిరోనీకేమైనా మనసులు కలిగున్నాను
నాగలోకమంతా సాధించి తెచ్చేనే
ఇంతిరో నీకేమైనా కోరికలుంటే జెపుమా
ఇంద్రలోకమంతాను సాధించితెచ్చెనే
ముందు రామావతారములో మునుపడిగిన కోరికలూ
తమ్ముని యడవులకిచ్చి చంపబంపితిరీ మీరనెనూ
నాకేమి కోరికలు లోకేశ్వరనాకిపుడూ
రాత్రిపగలు గూడుండుట మీతోడనె కోరికలు
సతిపతు లిద్దరుగూడుక సంతోషమ్మున యుంద్రీ
నిద్రించెను శ్రీకృష్ణుడు నీరజాక్షితోగూడా
సత్యాంగన బంపినచెలి సరగునత్తా చనుదెంచే
ముడిచిన పువ్వులుజారగ అలదిన గంధము చెమర్చా

బెదరిన అల లేడిపిల్లావలె వచ్చితివేమే
ఏమికార్యమ్ములు నేడూ యిందీవారాక్షిరో
నాతోటిజెప్పావే నాతోడునీడారో
అక్కరో వినవమ్మా మనకిక యెక్కడి సంసారములే
చక్రధరుడున్నాడే అక్క రుక్మిణి నగరాన
ఉన్నాడే శ్రీకృష్ణుడు వుభయమ్మాలాతోను
ఆపలుకులు విని చెలియకు ప్రాణమ్ములు మూర్ఛిల్లె
గొంతతడవుదా మూర్ఛాకొని తానప్పుడుదెలసే
ఎంతధర్మావతి రుక్మిణి అని లోకులు యెన్నుదురూ
నాకుదెలుసును రుక్మిణినైజము లప్పలుకులునూ
మత్తిల్లి శ్రీకృష్ణుడు మందుల లోపలికిచ్చి
మత్తై మామీద భ్రమలూ మరచెనె గోపాలుండూ
పున్నమ వెన్నెలకాయగ పొన్నల గున్నలనీడా
తిన్నస్వరమున్న నప్పుడు కిన్నెరమీటుచు మెరయా
కలకంఠుడు తనతోడా అలసిమెలసున్నట్లు
కలగన్నట్టాయగదే అలనాటి ప్రేమలనూ
అతిదుఃఖమ్ముతో భామా భూషనమ్ములు సళ్ళించి
మైలవస్త్రమ్ములుగట్టెను మత్సరంబులాతోను
పూరింటిలో నొక్కా కీలడుగు మంచముసా
అలంకార గృహములకేగీ పవళించెను సత్యాంగాన
అక్కడ రుక్మిణి నగరిలో అతివలందరునుగూడీ
కనకకసువులూ దుడచిరి కలయ గస్తురిజల్లిరి
ముత్యాల ముగ్గులుబెట్టిరి మందగమన లందముతో
రాజరాజ్యములానుంచి రాజఋషులూ దేవఋషులూ
తొల్లయిన బ్రహ్మఋషులూ భూపతులు యేతెంచిరి
హోమగుండంబులు త్రవ్విరి యొప్పుగ విప్రులు తమరూ
ఘృతమున కుండలు నిలిపిరి కడువేడుకతోడుతను
సన్నబియ్యపా గోనెలు రాసులుగా బోయించి
శ్రీకృష్ణుడు యేడనుచూ అడిగెను వసుదేవుండు
ఏ వేళా శ్రీకృష్ణుడు వేలా స్త్రీలతోనుండు

ప్రియముతో పిన్నల పెద్దల పిలిపిస్తివి యపకీర్తి
బాలునితో సంసారము చేయుట యిది తప్పనెనూ
ఆ పలుకులు విని చెలులూ అతి భయపడుచును వెళ్ళి
మేలిమైన కనకంపూ మేడలదరి కేతెంచి
లేపిరి కృష్ణా లెమ్మని చెలులందరు లేపగనూ
కండ్లు నులుముచును లేచెను కడువేడుకతోను
చప్పుడుగాకుండా తన సతిడాయకు యేతెంచి
తొడచరిచి తన సతినీ లే లెమ్మనుచును లేపే
సిరులొలికే ముఖమునను చెలువారగ లేవినీ
దబదబ నడచిన రుక్మిణి చూచియో మా కృష్ణుండు
నాతిరొ స్త్రీలకు నెల్లా మెల్లగ నడువగవలెను
గర్భిణి స్త్రీలకు నెల్లా కదలక నడువగవలెనూ
కొడుకూ కోడలు యిద్దరు మేడమెట్లు దిగిరాగా
కన్నుల పండువలాయెను వసుదేవుడు దేవకికీ
పరిచారుల బిలపించి సవతుల తోడి తెమ్మనెనూ
ఆ పలుకులు విని చెలులూ ఆనందము పడుతూను
అక్కడ వెడలీ చెలులూ అతి సంభ్రముతోడుతను
సత్యాంగన అయినట్టి సత్యాంగన నగరికి వెళ్ళి
అక్కరో వినవమ్మా మన అక్కకు సీమంతములూ
సేయగవలెనని కృష్ణులు మిమురాబంపెను వేగా
అక్రూరుని నగరికి విందులు అరగింతమని వెళ్ళి
మము బొంకించి యిప్పుడు వనజాతుడు తా వెళ్ళే
అటువంటి శ్రీకృష్ణులు అతడేలా రాబంపూ
అక్క రుక్మిణి బంపిందని పలికెను సత్యాంగన తానూ
కోమలి కృష్ణుని మీదను కోపించి రానసెనూ
నీవు రాకుంటే మేలని తరుణులు నవ్వుచు జనిరీ
అక్కడ వెడలీ చెలులూ అతిసంభ్రము తోడుతనూ
రాధాంగనయైనట్టి రాధాంగన నగరికి వెళ్ళి
అక్కరో వినవమ్మా మన అక్కకు సీమంతములూ
సేయగవలెనని కృష్ణుడుమిము రాబంపెను వేగా

ఆ పలుకులు విని రాధా ఆనందముతోడుతను
పలువిధ భూషణములు తా శృంగారించెను వేగా
అక్కడ వెడలీ చెలులూ అతిసంభ్రముతోడు తనూ
భద్రాంగనయైనట్టి భద్రాంగన నగరికివెళ్ళి
అక్కరో వినవమ్మా మన అక్కకు సీమంతములూ
సేయగవలెనని కృష్ణుడు మిము రాబంపెను వేగా
ఆ పలుకులు విని చెలియా అతిసంభ్రమము తోడుతనూ
అతివతనాభరణమ్ములు వేగా యలంకరించుకొనీ
జిలుగు బంగరూపోకా చీరె గట్టెను వేడుకతో.

అక్కడ వెడలి చెలులూ అతి సంభ్రముతోడుతనూ
మిత్రయైనట్టి మిత్రవింద నగరికి వెళ్ళే
అక్కరో వినవమ్మా మన అక్కకు సీమంతములూ
సేయగవలెనని కృష్ణుడు మిమురాబంపెను వేగా
అక్కడ వెడలీ చెలులూ జాంబవతి నగరికివెళ్ళి
అక్కరో వినవమ్మ మన అక్కకు సీమంతములూ
సేయగవలెనని కృష్ణుడు మిమురాబంపెను వేగా
అక్కడ వెడలీ చెలులూ కాళిందీనగరికి వచ్చిరీ
అక్కరో వినవమ్మ మన అక్కకు సీమంతములూ
సేయగవలెనని కృష్ణుడు మిమురాబంపెను వేగా
అక్కడ వెడలీ చెలులూ సూదంతీనగరికి వెళ్ళి
అక్కరో వినవమ్మా మన అక్కకు సీమంతములూ
సేయగవలెనని కృష్ణుడు మిమురాబంపెను వేగా
అక్కడ వెడలి చెలులూ అతిసంభ్రమము తోడుతనూ
పదియారువేలు స్త్రీలకు చెప్పిరి వేడుకతోను
అక్కలార వినరే మన అక్కకు సీమంతములూ
సేయగవలెనని కృష్ణుడు మిమురాబంపెను వేగా
ఆడేటి సొగటాలూ అతివలు దెస్తామనిరి
అతివలు యాభరణంబులు యలంకరించుకొని వేగా
జిలుగు బందరూపోకా చీరెలు గట్టిరి వేడుకతో
పలువిధ భూషణములు సొగసుగ శృంగారించిరీ

పండ్లు ఫలమ్ములు బంగరు పళ్లెరముల నుంచుకొని
కదలిరి పదియారువేలూ కడువేడుకతోడుతనూ.

కృష్ణుని పట్టపురాణులు పదియారువేలారుగురూ
నడువగ రజముల ధూళి దినకరుకలయగ గప్పె
పగలే అస్తామయమూ ఆయెను యిదియేమనెనూ
ఆశ్చర్యములు బడుచు ఆకాశములు జూచిరీ
కృష్ణుని పట్టపురాణులు పదియారువేలారుగురూ
నడవగ రజముల ధూళి దినకరుకలయగ గప్పె
సీమంతపు హోమమ్ములు వేల్చేటి చోటికిని
కదలిరి పదియారువేలూ కడువేడుక తోడుతనూ
శ్రీకృష్ణుడు శ్రీరుక్మిణి జలకమునాడగనూ
గంధమ్మూ కస్తూరికాంతకు నలుగిడుదురూ
సుగంధి జలముల రుక్మిణిదేవికి జలకములార్చి
నిండువన్నె తళ్కొత్తిరి నీరజాక్షికి వేడుకతో
బంగరు పట్టుపీతాంబ్రము కట్టనిచ్చిరి వేడుకాలా
సఖియకు తలకురులార్చిరి సంపెంగా విరులాను
బంగరు మొగలిరేకుల పట్టుసవరపు కొప్పిడిరీ
ఇరుగడలా సూర్యచంద్రాదుల నమరగనిలిపి
హరిశ్చంద్రా ముత్యాలా బొట్టును మెరయగనుంచిరీ
కేళించిన ముత్యాలూ బావిలీలు మెరయగను
శశిపువ్వు మరగనుంచెను చంద్రవదన వేడుకతో
మూపున తీగెలు బెట్టెను ముగ్దరాలు వేడుకలా
ఒడ్డానమ్ములు బెట్టె వైడూర్యములు మెరయా
ఒత్తులు భుజకీర్తులు బెట్టె వైడూర్యములు మెరయా
పాదమునందెలు బెట్టెను పాయపట్టములు మెరయా
నెమలడుగుల పిల్లాళ్లూ నవముద్రికలు మ్రోయగను
చిటికెన బొద్దులు బెట్టెను శ్రీరుక్మిణి తన వ్రేళ్ళా
పంచరత్నముల భటువులు పంకజాక్షిధరియించి
కస్తురితిలకముదీర్చెను కమలాక్షి తన నుదుటా
సోగకన్నులా సన్నపుకాటుకలమరగదీర్చి

చేడెకుచంద్రాకాపీ రవికెదొడగరి వేడుకతో
శృంగారమ్ములు జేసిరి శ్రీరుక్మిణిదేవికినీ
సీమ న్తపుపీటలపై గూర్చుండా తమరున్నిరీ
పండ్లుఫలమ్ములు రుక్మిణివడినింపిరి సవతులునూ
హాస్యంబుల వారెల్లాహాస్యమ్ములు చేయుచును
పరిహాస్యంబులవారూ గోపాలునితమరపుడూ
మంగళహారతులిచ్చిరి మగువలు గోపాలునికీ.

అంగనాలుముద్దు శృంగారమిదినీకు - సంగాతిగాయెంతో రంగామునా
కొంగుబట్టి చిన్నా గోపికాలిండ్లాలో - దొంగతనము సేయూదువౌరా శ్రీకృష్ణా
॥మంగాళం జయ మంగళం॥

అంచియానావాలూ పొంచియిల్లుజొచ్చి - అతివరో ఇదిగో నేననుచూవచ్చి
మంచిపాలాకడవా అంచూనోటాబట్టి - వంచుకాత్రాగినా వరదూడవౌకృష్ణా
॥మంగాళం జయ మంగాళం॥

పాలుమీగాడంతా చాలామూతికిరాసి - వేలూజూపిదానీ గేలిజేసీ
చూలునిల్పిచిన్ని బాలూడుగలదానీ - కోలాహాలముసేయు గోపాలశ్రీకృష్ణా
॥మంగాళం జయ మంగళం॥

ఇల్లూజొచ్చి గొల్లాయింతులావై పూల చెండ్లూవేసిపాలిండ్లుబట్టి
కండ్లాచూపివెన్నా కడవాలన్ని బురుగూ - దొండ్లాబొడిచే దొంగావురా కృష్ణా
॥మంగాళం జయ మంగళం॥

పీటాలెత్తుబెట్టి పెరుగుకుండకుచిన్ని తూటూబొడచీ క్రిందాదోసిలొగ్గి
సూటిగానూగూడి సుదతూలయిండ్లాలో నేవైనాతీరాద్ది నిలయుడందురు కృష్ణా
॥మంగాళం జయ మంళళం॥

రాజూకేళులచేరమణుల గొందరనీ బంధించి వనమందూదిరుగుచునూ
వాసీగానుగూడి వలువాలు కొందరిని మోసబుచ్చినట్టి ముద్దులా శ్రీకృష్ణా
॥మంగాళం జయ మంళళం॥

చెట్లాలోపలనిలచీ బొట్టైకోకలుమూసి చెట్టెక్కిచిటారికొమ్మ కేగి
అట్టైరమ్మనిపిలచీ అతివాల నీవపుడు కొట్లాకోర్చినట్టి గోపాలశ్రీకృష్ణా
॥మంగాళం జయ మంళళం॥

మంగళహారతులిచ్చిరి మగువాలు గోపాలునికి
సత్రాజిత్తు పుత్రిక సత్యాంగనయేదనిరీ
కోమలి శ్రీకృష్ణునిపై గోపించి రానననెను
కొడుకూ ఒక్కడెగానీ కోడళ్ళూ పెక్కండ్రు
నగధరుని శృంగారము నగరంతానిండినది
ఇందరుయింతులలోపల రూపసియెవరనిపలికే
నెమలైనా కొప్పూదీ నెమలీపురికుంచాదీ
వెనుకకు బంగారూ చిత్తరువులుగలిగినదీ
తనభారపు పలుకులకూ తరుణిలోనై యుండూ
కోమలి రుక్మిణి చక్కనిదనిపలికెను కృష్ణుండు
ధనటంకంబులు గొన్ని ఘనరత్నంబులుగొన్ని
బంగరుతబుకులతోను పంచిబెట్టించెను రాజూ
కన్యాదానంబులుకూ కడులేనివస్తువలూ
బంగరుతబుకులతోను పంచిబెట్టించెను రాజూ
భూదానంబులుకొన్ని గోదానంబులుకొన్ని
వేడుకతో వసుదేవుడు చేయించెనుతానపుడు
వచ్చినవారికినెల్లా పాకంబులుచేయించె
అప్పమ్ములు అతిరసములు వొప్పుగవటిచిటిబూర్లూ
గొప్పప్పడమ్ములు మొదలుగవండెను దేవకిదేవి
వెన్నప్పమ్ములు మంచి మనుగుపూవులతోను
వచ్చినవారికినెల్లా పాకంబులుజేయించె
ఎల్లరాజ్యంబులనుంచీ యేతెంచిరీ భూపతులూ
వేడుకతో గోపాలునిబంతులు సాదించిరిగా
దివ్యాన్నమ్ములు పెక్కుపిండివంటలు కూరగాయలను
పచ్చళ్ళూమొదలైనా పంచభక్ష్య పరమాన్నములూ
దధిమధుఘృత సూపమ్ములు వడ్డించిరి యింతులునూ
ఆరగించివారెల్లా హస్తంబులు గడుగుకొనీ
పాలునెయ్యి స్తంభములా మేడలోకేతెంచ్రీ
చిరిచాపలుమంచి రత్నకంబళ్ళు బరిపించ్రీ
సవతులనందరినీ తాగూర్చుండగ నియమించె

కర్పూరపు పీడెమ్ములు కాంతలకు యిప్పించే
మణిరత్నంబులుకొన్ని మణిహారంబులుకొన్ని
మేలిమైన చీరెలతో కట్నములుయిప్పించె
కట్నంబులు అందుకొని కాంతలుసంతోషమునా
పుత్రుడుగలిగిననాటికి అక్కరొవత్తుము అనిరీ
సీమంతముజూడగను కన్నుల కరువులుదీరే
సంతోషంబులుమాకు సెలవులు యొసగవె యనిరీ
సెలవులు పుచ్చుకొని చెలులూ ఆనందముతోడుతనూ
అందరుగూడుక తమతమ గృహములకే చనుదెంచ్రీ
పంకజాక్షి రుక్మిణి తనపతికడకూ జనుదెంచె
సత్రాజిత్తుని పుత్రిక సత్యాంగన యలిగినది
పచ్చలపతకము లిచ్చెద పరమాత్మా మీకనెను
భామామణిరో సత్యాభామకు అలకలు దీరవు
పాషాణము ఆసత్యాభామామణి కోపమూ
భామకు అలకలుదీర్చా అది నాతరమేగాదు
నక్షత్రాకంఠమాలా సగము శృంగారముదీసి
పంకజాక్షి రుక్మిణి తన పతిచేతికినందిచ్చె
మెచ్చుచుకోమలి గుణములు నవ్వుచు గోపాలుండు
పాలునెయ్యి స్తంభాలా మేడలదరికేతెంచె
తాళాలుతప్పెట్లూ దరువులు మ్రోయగలేదు
అలిగినదో సత్యాంగనయనుచును గోపాలుండు
కీరములే పలుకావూ కోవిలలేకుయ్యావూ
హంసలు అందందాడవు అనుచును గోపాలుండు
శృంగారము వెయి బళ్ళానమర్చగ శ్రీకృష్ణుండు
అతివను వెదకాదొడగెను మధుసూదనుడప్పుడు
ఇంతులార మిమ్మేలేటి యింతేదని యడిగినను
తరుణి యెక్కడకుపోయెనో యని పలికిరి చెలులంతా
ఇందరు ఇంతులనేలుట యిదికీడనే కృష్ణుండూ
అతివుగ్రుండై కృష్ణుడు అతివుగ్రుండై బలికే
ఆ పలుకులు వినిచెలులూ అతిభయపడుచూవచ్చి

వాచానామే మెరుగము చెయిసంజ్ఞలచూపించే
పూరింటిలో నొక్కా కీలడుగూమంచముపై
అలకగృహంబునకేగి సత్యాంగన బవళించే
తలుపుక్రిందా పామాయీ సర్వేశ్వరుడు తావెళ్ళే
ఇంతిచేతి వీవను పుచ్చుకతానేవిసరే
ఇందాకాలేని వింతా యీ వింతావాసనలు
వింతవాసనలకు ముసుగుతొలగించి తాజూచే
హరియనితెలసీ భామామళ్ళీ ముసుగులుబెట్టె
యింకన్నా రుక్మిణికి యేమి చనువుయిచ్చేనే
పదిమందిదాసీలే పణతి రుక్మిణీ నగరా
పదివేలదాసీలే పంకజాక్షినీ నగరా
నవరత్న భూషణములు నాతిరో నీ గడపలకు
కోమలిరుక్మిణిదేవికి భూషణమ్ములుసహాలేవే
బంగారపు మేడలే పసిడిమిద్దెలేకొన్ని
సర్వరాజ వైభోగముసతి నీవాడనె నేను
మంగళవతులైనట్టి మగువులకెల్లానిపుడు
శృంగారము యెన్నడును చెదిరుండగరాదనెను
కలువరేకులచోలెటి కలికియే నీ కన్నులకు
కాటుకకన్నులనీరుగారుట యిదియేమనెను
ఆ పలుకులువిని చెలియా అతి దుఃఖమ్మునబలికె
అక్రూరుని నగరికి విందులు అరగింతుమని వెళ్ళి
మముబొంకించివేగ వనజాక్షామీరువెళ్ళి
అక్రూరడెసతియాయెన అతివేగంబున మీకు
అక్రూరునిగని యాతని నడుమెక్కడ - నడిగితిరో
ముందుగ చెలులకు లంచముయివ్వకనే మోసపోతి
ఏకాంతపు గృహములకు యేగిరి మీరనెనూ
పచ్చలపతకముదెస్తిని పంకజాక్షిరో జూడే
అందుకొని ఆ భామా ఆనందముబడుచునూ
సతిపతులిద్దరుగూడుక సంతోషమునసుంద్రీ
నిద్రించెను శ్రీకృష్ణుడు నీరజాక్షియు వేడుకతో

అక్కడ వసుదేవకి తన ఆత్మచెలుల బిలుచుకొని
కాంతరో మన రుక్మిణికీ నవమాసములు నిండే
శ్రీకృష్ణుడు లేడాయెను తోడుకరమ్మనిపలికే
సత్యభామ నగరికినిసరగున తమ రేతెంచీ
నిద్రించియున్నట్టి నీరజాక్షుని పొడగాంచీ.

## మేలుకొలుపులు

బంగారుచెంబుతో పన్నీరుపట్టూక పణతిరుక్మిణివచ్చే మేలుకో
రంగైనపావలూ కెంగేలబూనూక రమణిసత్యాతోను మేలుకో

దంతాకాష్ఠము బూనీ తామారాసాఊ నూదంలీ వచ్చినదయ్యా మేలుకో
అంతాకుమున్నూ రూమాలాబట్టుక జాంబావంతుని సుతవచ్చే మేలుకో

అందామైనా నిలుపుటద్దామూగొని మిత్రావిందా వచ్చినదయ్యా మేలుకో
పొందుగాకస్తూరీ బరిణాబట్టుక కాళిందీవచ్చినదయ్యా మేలుకో

నూటిగా నీపైనీ పాటలు బాడుతూ సూభద్రా వచ్చినదయ్యా మేలుకో
వాలాయముగ తాంబూలము బట్టుకా రాధా వచ్చినదయ్యా మేలుకో

ముదమూతో వీణె వాయింపుచూ శ్రీలక్ష్మి వచ్చినదయ్యా మేలుకో
పదియారూవేలా గోపికలెల్లా సొగటాలా పాళిదెచ్చున్నారూ మేలుకో

మేలుకో యశోదా నందాకుమారా మేలుకో శ్రీకృష్ణా మేలుకో
మేలుకో దయతోడా వేళాగావచ్చేను తెల్లవారవచ్చే మేలుకో.

అని కాంతలు లేపగనూ విని కృష్ణుడు వేడుకతో
కాంతలవద్దకు వచ్చెను కడుసంభ్రమము తోడుతను
శ్రీరుక్మిణి నీళ్ళాడగ వేళాయెను శ్రీకృష్ణా
వసుదేవుడు దేవకి మిముఠాబంపెను మమ్మనెను
సంతోషమ్మున కృష్ణు సతికైనను చెప్పకను
ఆనందమున కృష్ణుడు అతివేగమున వచ్చే

నవమాసములు నిండెను నాతి శ్రీరుక్మిణికి
పంకజాక్షి రుక్మిణికి బాలుడు తానుదయించే
దశదినమ్ములు గడచెను దేవకి మజ్జనమార్చే
పగడుమీద భారసాల చేసెనె వసుదేవుండూ
మన్మధుడనుచును వారూ మరి నామమునునిచిరిగా
భూదానమ్ములు కొన్ని గోదానమ్ములు కొన్ని
అశ్వదానములు కొన్ని వరుసగ జేసెను రాజూ
కన్యాదానమ్ములకూ కడులేనీ వస్తువులు
బంగరు తబుకులతోను పంచి పెట్టించెనె రాజూ
వచ్చిన వారందరికీ పాకంబులు జేయించే
అప్పమ్ములు అతిరసమ్ములు వొప్పుగ వటిచిటి బూరెలు
గొప్పడమ్ములు మొదలుగ వండెను దేవకిదేవి
వెన్ననురుగు వెన్నప్పము మణుగు పుప్పులాతోనూ
వేడుకతో గోపాలుని బంతులనూ వడ్డించ్రీ
దివ్యాన్నమ్ములు పెక్కూ పిండివంటలు కూరగాయలను
పచ్చళ్లూ మొదలయినా పంచభక్ష్య పరమాన్నములు
ధధి మధుఘృత సూపమ్ములు వడ్డించిరి యింతులును
ఆ ధధిఘృత సూపమ్ములు వడ్డించిరి యింతులును
ఆరగించి వారెల్ల హ_స్తములూ గడుగుకొనీ
కర్పూరపు వీడెములు కడువేడుకతొ నిచ్చిరిగా
అతిసంభ్రమము తోడుతను అందరు తమ గృహములకేతెంచ్రీ
శ్రీరుక్మిణి సీమంతము పాడినవారికి నెల్లా
విన్నవారికి నెల్లా విష్ణులోకమూ గద్దనెను
శ్రీరుక్మిణి సీమంతము పాడిన విన్నాగానీ
స్త్రీలకు పుత్రులు గలుగుదురని శ్రీకృష్ణుడు తా బలికే.

---

# సత్యభామ సరసము

వసుదేవదేవకీ వరపుత్రుడనగ - వర్తించు గోపికా వల్లభు చరిత్ర
అరవిందనాభుడికి అర్ధాంగి లక్ష్మి - సత్యభామాదేవి సరసముగ నాడె
పిలిపించి చిరునవ్వు తళుకు మొగమునను - పనులానతిచ్చెనే పరమాత్మదేవి
అలకరే పుయ్యరే అరుగుల్ల మీద - చిలకరే కస్తూరి శీఘ్రంబుగాను
నున్నగా కసువూడ్చి పన్నీరు జల్లీ - కనకంపుగడపలా పన్నీరుజల్లీ
ముత్యాల ముగ్గులూ పెట్టేటివారు - రత్నాల రంగవల్లి రాసేటివారు
మాణిక్యపుం దివ్వె పెట్టేటివారు - మకరతోరణాలు కట్టేటివారు
సూత్రాన సున్నంబు ధవళించువారు - పచ్చాకు పందిళ్ళు వేసేటివారు
పసుపుటాకులు దళ్ళు కట్టేటివారు - కట్టభూపానగర కట్టేటివారు
పసుపుల్ల పూతలూ పూసేటివారు - యెన్నిక తెలనాకు వాడేటివారు
పచ్చనిపాదాలు వొత్తేటివారు - రత్నాలు స్తంభాలు యెత్తేటివారు
కస్తూరి వాసనలు కలిపేటివారు చిప్పల్ల - శ్రీగంధం తీసేటివారు
వారిజలోచనుడు వారిళ్ళకడకు - వరుస దినముల వారు వచ్చుటయు నెరిగి
పచ్చంగవేసిన పందిళ్లుమెరయ - నిలువుటద్దము తెచ్చి మెరుగుతుడిపించి
మేలయిన కస్తూరి మెదిపేటివారు - యేడు నిలువుల భమిడి మేడలోపలను
భమిడి తరికోళ్ళదే పట్టిమంచమ్ము - హంసతూలిక పాన్పు పట్టుజాలారు
అచ్యుతులు కూర్చుండ నమరినపాన్పునా - శృంగారరాయుడీ చంగల్వ పాన్పు
బంగారు జలపోత పాన్పునాపరచీ
పొగడలు బొగడలు బొండు మల్లెలనూ - ఆ మంచి పాన్పునా అవి చాలపరచె
పొద్దున్న పూచినా పొన్నపువ్వుల్లూ - ఆ మంచి పాన్పున అవి చాలపరచి
ఝూమయి పూసినా జాజిపువ్వుల్లూ - ఆ మంచి పాన్పున అవి చాలపరచె
అప్పుడేపూశాయి అచ్చుమల్లెలు - ఆ మంచి పాన్పున అవి చాలపరచి
ఘడియలో పూసినవి కనకాంబరాలు - ఆ మంచి పాన్పున అవి చాలపరచి
నిత్యమూ పూశాయి నీలాంబరాలు - ఆ మంచి పాన్పున యవి చాలబరచి

నాగలోకానున్న నల్లకలువలూ - ఆ మంచి పాన్పున యవి చాలబరచి
ప్రొద్దోయి పూశాయి బొండుమల్లెలు - ఆ మంచి పాన్పున అవి చాలబరచి
మధ్యాహ్నం పూశాయి మంకెన్నపూలూ - ఆ మంచి పాన్పున అవి చాలబరచి
ఝూమాయె పూశాయి సన్నజాజుల్లూ - ఆ మంచి పాన్పున అవి చాలబరచి
తొడిమెతో పూసినవి కేతకీపువ్వులు - ఆ మంచి పాన్పున అవి చాలబరచి
పందిళ్ళపూశాయి బంతిపువ్వుల్లు - ఆ మంచి పాన్పున అవి చాలబరచి
నిత్యమూపూశాయి నిత్యమల్లెలు - ఆ మంచి పాన్పున అవి చాలబరచి
జాజి విరజాజి సహస్రమల్లెలును - పారుజాతమ్ములు బాగుగాపూచె
ఘనముగాపూసినవి గన్నేరుపూలు - ఆ మంచి పాన్పున అవి చాలబరచి
బాగుగాపూసినవి శీమంతి పువ్వులూ - ఆ మంచి పానుపున అవి చాలబరచి
పందిట పూసినవి పారుజాతములు - ఆ మంచి పాన్పున అవి చాలబరచి
వాసనగల మంచి అనాసపువ్వులు - ఆ మంచి పాన్పున అవి చాలబరచి
ఘుమ్మ ఘుమ్మనియేటి గులాబిపువ్వులు - ఆ మంచి పాన్పున యవి చాలబరచి
పరిమెళముగల మంచి పచ్చచామంతి - ఆ మంచి పాన్పున అవి చాలబరచి
యెన్నికయైనట్టి యెర్రచామంతి - ఆ మంచి పాన్పున అవి చాలబరచి
తెల్లని రేకుల తెల్లచామంతి - ఆ మంచి పాన్పున అవి చాలబరచి
వరుసతో పూసినవి వకుళ పుష్పములు - ఆ మంచి పాన్పున అవి చాలబరచి
వట్టి వ్రేళ్ళుసురటి ముత్యాల సురటి - ఆ మంచి పాన్పున యవి చాలబరచి
పన్నీరు కలయట్టి ఖమిడికుప్పెలను - ఆ మంచి పాన్పున యవి చాలజల్లి
పచ్చిపోకలు మంచి పండుటాకులును - ఆ మంచి పాన్పున యవి చాలనుంచి
అత్తరు పన్నీరు అమరంగజల్లి - చేడుల కల్లాపనులు చెప్పిచేయించి
చీరె శృంగారము చేయంగదలచె - సంపెంగనూనెతో శిరసొప్పనంటె
జవ్వాజి కస్తూరి నలుగొప్పపెట్టి - గంధమలకలు రుద్దె కమలాక్షికపుడు
వెండిగాబులతోటి వేణ్ణీళ్ళుతోడి - ఖమిడిగాబులతోటి చన్నీళ్ళుతోడి
చన్నీళ్ళు వేణ్ణీళ్ళు సమముగాతోడి - ముత్యాల చెంబుతో ముదితలందియ్యా
జలకంబులాడెనే సర్వేశ్వర్లదేవి - పట్టువస్త్రముచేత దేవి తలయొత్తు
హంసతూలిక పాన్పున అవి తరగడాలు
అచ్యుతులు కూర్చొనుట కమిరిసేపాన్పు
శృంగార రాయులకు చంగల్వ పాన్పు - గడువేగవేయించు యలరాచదేవి
గంధకస్తూరి కర్పూర జవ్వాది - పన్నీరు చందనం బాగుగాజేసి

చేడియకు యీ పనులు చెప్పి చేయించి - పచ్చి పసుపు పన్నీరు జలకంబులాడి
పచ్చ పట్టూచీరె బాగుగాగట్టి - నల్ల పట్టూరవికె నాతి తాతొడిగి
గజదంత చిక్కట్ల తలచిక్కుదీసి - ముత్యంపుకురులన్ని బాగుగాదువ్వి
నీలంపుకురులన్ని పాపిటలుతీసి - చెంపకొప్పున దురిమె చేమంతి పువ్వుల
ముగుదపాపిట నడుమ ముత్యాలు గూర్చి - మొగలిరేకులు దురిమె మల్లెలను దురిమె
చుక్కబొట్టును నుదుట చక్కంగదీర్చి - చిటికెన బొద్దుళ్ళు శీఘ్రతా బెట్టె
బొబ్బరికాయలు పొందుతో బెట్టె - మూడువేలు వెలగల ముక్కెరయు బెట్టె
ముదిత తన ముత్యాల నత్తమరబెట్టె - నాల్గువేల్విలువగల నాను మెడనేసె
పదివేలేచెయ్యగల సరములువేసె - పణతి తన పద్మాల ధమిరెపెట్టింది
వెయ్యివేలు విలువగల హారంబువేసి - కోటివేల్విలువగల గొలుసు మెడనేసె
కొక్కెంపుతారమ్మ కొప్పె నవరమ్మనాను - నలిరడుగు పెట్టె కమలాయతాక్షి
తన కమ్మలను పెట్టె పూసాలుతొడిడి - విడివిడి ముత్యాలు విడనేవనాలు
వుత్తడొలపేరే వొప్పుతో బెట్టె - పదివేలు చేసేటి పాంజేలుబెట్టె
పణతితా పదాల పట్టెడెట్టింది - నీలాలు స్థాపించు కీలుకడి కడియములు
నరహరునిదేవి తన కాళ్ళకునుబెట్టె - ఆరగించేవేళ అచ్యుతుని దేవి
తెచ్చిన భాగాలు పుక్కిటనుపోసి - పండు తెల్లని ఆకులు పిడికిటనుబట్టి
ప్రొద్దుపోయెయేమొ పొందు వో వదినా - జాముపోయెను రెండుజాములయిపోయె
వేళకురాడాయె నీలవర్ణుండు - గోప స్త్రీలతోటి కూడి నవ్వుతునూ
మరిచెనే నా మీది మక్కువలు అన్ని - రాజీవలోచనుని రాకతాజూచె
గడియగ్రక్కున బెట్టె కంకణాలుకదల - అంతలోవచ్చెను కాంత కృష్ణుడు
గరుడవాహనమైన గరుడాళనెక్కి - కొమరయిన ముత్యాల గొడుగులు బట్టి
బమిడిచెంబుదకముల పాదములు గడిగి - పనిచేయ వచ్చిన పరిచారకులకు
భాగాలు యిప్పించి పంపె నా రాత్రి - చామరలు విసరేటి సఖియ లిద్దరకు
తాంబూలములనిచ్చి తా వేసుకొనెను - తలుపు మేడలమీద యెవ్వరోగాని
పేరు చెప్పక మీరు రారాదుయనెను - పేరుమీద నీకు ప్రేమాయెనేమో
వనితరో గోపాల వల్లభుడు నేను
గోపికాసుతుడయితె రేపల్లెనుండు - ముద్దురాళ్ళకడకు ప్రొద్దున్న పొమ్మి
జలధరుడు అందురే చెలియ నా పేరు - జలధరుడు అయితేను తలలు నీ కేవి
నరసింహామని యందురే నా పేరు - నరసింహామయితేను మానగరికాశుండు
వెంకటేశ్వర్లందురే వెలది నా పేరు - వెంకటేశ్వర్లయితె తిరుపతియుండు

గోవిందుడందురే గోపి నా పేరు - గొండవో గొందివో నిన్ను నే నెరుగ
అచ్యుతుడు అందురే అతివ నా పేరు - అచ్యుతుడువో ముచ్చువో నిన్ను నే నెరుగ
బలభద్రుడందురే పణతి నా పేరు - బావవో మరదివో నిన్ను నే నెరుగ
శ్రీకృష్ణుడందురే చెలియ నా పేరు - చీరవో రవికెవో నిన్ను నే నెరుగ
మేనునేనాంచారి నేనిస్తునే చానా - మేనత్తవద్దు మా గోడలు పూసియున్నాయి
వస్తు నేనంచునే వస్తువే చానా - మదనదంతీ నేను వత్తునే చానా
వుంటినే నాంచారి వుందునే చానా - నీయంతరాణికి పిండెంత దెస్తు
నిలుస్తునా నాంచారి నిలుస్తునా భామ - నీయంతవాని నే నెక్కడ దెస్తు
దుష్టుడనె నాంచారి దుష్టుడనె భామా - దుంపబచ్చలికూర మా పెరటిలోను
జాణవే నాంచారి జాణనె భామ - జావీ బొప్పాసు మా పేరట్లొగలదు
పోదునే నాంచారి పోదునే భామ - నీయంత పోతుకు మేతెక్కడ దెత్తు
కూడుదునె నాంచారి కూడుదునె భామ - గుర్రాలుమాశాల కూడియున్నావి
ఇంతి నన్నూ నీవు పలగను లేవే - పద్మాక్షి నీ కాళ్ళు పట్టెదా నేను
ఆ మాట విని సత్యభామ తా - వేగపాన్పున దిగ్గునా దిగి తీసెనుఘడియా
శయ్యపై కూర్చుండె శ్రీకృష్ణుడపుడు - ముత్యాలచెంగు తా ముసుగులు దీసి
అలుకలేటికి నీకు అంభోజగంధి - కోపమేటికి నీకు కుసుమగంధారి
మొగమెత్తిచూడవే శుకవాణి నన్ను - నేటికిక వెళ్ళిరా తడవుంటిగాని
కాంత నిన్నూ విడచి ఘడియుండగలనా
నా మనసు ఎరుగవా నలినాయతాక్షి - నీ మనసు బ్రహ్మరుద్రాదు లెరుగుదురు
మాయకాడగుట యెరుగదూ నిన్ను
కమలాక్షి మావల్ల తప్పుగల దింక - తప్పులయిన నన్ను దయచూడవలెను
తప్పులన్నియు మాకు వొప్పులేకావా - కమలాక్షి తన విభుని తలయెత్తిచూచె
చెక్కిళ్ళ కాటుకలు చక్రధరునకు - కస్తూరి నలుపులే కమలాయతాక్షి
మెడలు పరిమళమేమి వో కృష్ణ చెపుమా - వలపసుపు పరిమళములో నీరజాక్షి
చీనిచీనాంబ్రాలు మరి పసుపులాయె - శ్రీకృష్ణ నీవున్న చెలిమేమి చెపుమా
వలతోట పసుపులో వాలలాడగను - వొల్లంతపసుపాయె వోసత్యభామా
మాటమాటకు బొంకులాడకునీవు - నూరుమాటలకెల్ల వోమాటబొంకు
నాడుచెప్పినమాట నేటి కాడితిని
పరమాత్మ నీపెదవి పగిలున్నదేమి - దోరమామిడితేనె నారగించగను
పతులారగించేవి పతులారగింతురా - పరమాత్మ నీవునికి బట్టబయలాయె

చిటిచిట్టిగడ్డంబువాడిన విధము - కంఠహారపతకమ్ము మెడలోనలేదు
వేటకెళ్ళిరాగ అలసి నా వొళ్ళు మరి - చెమటలయ్యెనేబట్టి గంధము
మకరకుండలాలు మాధవునకులేవు - ముద్దియ్యవిభునికి మొలకట్టులేదు
అవియన్ని యేయింతికిపెట్టి పంపితివో - చిటికినవ్రేలిదే భ్రమిడిముద్రిక
ఆముద్ర ముద్రికల పేరయినముద్ర - సూర్యప్రకాశమై వెలిగేటిముద్ర
రుక్మిణి వ్రేళ్ళయందుండు నాముద్ర - రుక్మిణీయింతి నీపట్నంపుదేవి
వచ్చుటలు ఏలయారుక్మిణిని విడచి
సతత మాసతియింట వుండకపోతె - యిచ్చోటికి మిమ్ము యెవరురమ్మనిరి
వచ్చిమమ్మూ యింతవుడికించనేల - ఓ పద్మనాథనే పిలిపించితినా
పద్మాక్షి నీవు నన్ను పిలిపించవలెనా - నామీదభక్తికి చాలనమ్మితీని
నలినాక్షి నామీదచాలగాప్రేమ - నీవింతవిద్రోహివౌట నేనెరుగ
తోకత్రొక్కినపాము మిట్టిపడ్డట్టు - అంతగోపముతోను ఆ యింతియుండె
అరమరలేని కూటమ్ములోపలను - అరమపడితన్న నేటి విభుడెంతో
నేడు మీబుద్ధంత యేయింతియెరుగు - అనుచు గనులను నీళ్ళువోడుకుంచనుచు
తలవంచి పట్టుకొని సఖియతానుండె - చేడెరో నీవద్ద చెలికత్తెలాను
సఖియరో నాతప్పులడుగవేవార్ని - చెలియలు నీవును యొక్కటేగాదా
చెలియలునీవద్ద యిందురు లంచము - ముగుదరో నిన్నునేచూడకుంటెను
వొక్కనిముషము వొక్కయేడుగా దోచు - కమలాక్షి అరఘడియకానరాకున్న
కాంత నాకన్నులకట్టి నట్టుండు - పువ్వులబోణిరో నీవు చెప్పినబుద్ధి
చిగురుబోణిరో నేను యెవరికోసమ్మే - యింత పదార్థముతెచ్చి నీయింటపెదుదు
మును వుమజ్జన భోజనంబులు నీయింట - యింకవిందులుండు మాయవాదములే లేవు
చక్కనిదానవని సఖియరో నీవు - నల్లనివాడనని వల్లనేనన్ను
కమలనాథుడయేల కరుకునాటీవు - అదియేమి నామీద యింతమత్సరము
మొగుడువల్లని నాతికది చక్కదనమా - మొగుడుచేపట్టింది అదె చక్కదనమే
మేము నీకేల వలపుల రుక్మిణుండ - వెెది నీ నోటికి వెరచితిగాని
రుక్మిణిమాట నీకేటికి చెప్పుమా - చనుపిచ్చి అది చనువుపుచ్చుకొన్నట్టు
నీచనువు పుచ్చుకొని యవ్వరికిస్తు - వనజనాభుడు నీవశమునన్నున్న
పరమాత్మ నీపెద్దదేవికిస్తి నీ - సతులందరుగూడి చలవట్టినన్ను
ప్రాణవల్లభు కృష్ణ పారదోలెను - యికనైన యీపట్ల యేలుకోరావా
జలజాక్షినీపట్ట నేయింతిలేదు యేలినావే - చేత అదియెట్టి బ్రతుకు

యేమియెరుగని విభునియేల నేర్పరమ్మా
అసురదేవునురంబు అతిమంచిదానా
జోడిగూడియుండగా చూడిచాలరమ్మ - గొల్లవారితల గొలివెలిగెరమ్మ
వారాడినపంతాలు ఈడేరనమ్మా - నేడుమాదైవమ్ము వారిగూడెమ్మా
మత్సరనాలుకే గుణం మానేరటమ్మ - యెంతబలువాయెనో నాతండ్రికపుడు
చిన్ననాడేవిషముపోసి చంపడాయె - అంతకన్నా మూతపడవెయ్యడాయె
యిందరూ సవతులమీద తన్ను వెదకితెచ్చి - నన్ను నీమెడనుగట్టి హర్షపడెను
అన్ని అడిగిన ముద్రలివ్వరయితిరే - యీయింతి యీపూసలు యేలచెప్పితినే
యీ ముద్రికవాదు కానుడదికాదు - మనసుమనసుల కలపివచ్చినడపుడపుడు
తగువులోపమ్మాట ఆడితిరిగాని - యింతవలపతుమా యిందీవరనేత్రా
వలపతుములును మావద్దనేలేవు - పతువాదితనంబు భామ నేనెరుగ
మీరుయిద్దరు రెండు కన్నులేనాకు - మీతండ్రివద్దనే మాణిక్యముండు
మాణిక్యములుపోతె మామీద కొచ్చె - జాంబవంతుడుతోడి యుద్ధంబుచేసి
నిన్ను పెళ్ళాడితిని నెలతరోవినుమా - అది యెరుసుగా నీవు యుంచుకొన్నావో
నిన్ను నొక్కవిధమున తెచ్చుకొంటినో - యంతచేసిన మెచ్చి యింతిరోతన్ను
యంతయిన నామాట నమ్మునే నీవు - దేవేంద్ర మొదలయిన దేవతలగొట్టి
పారుజాతమ్ము పెంచి నీ పేరటకిస్తి - పారుజాజతను నాకు పనికివచ్చిందా
అయినపువ్వులు మీసతికడనుస్తుంచి - వాదము మీవద్దనుంచ సేవింతు
నీయింట నీమాటముందరా నామాట - వెనుకా రుక్మిణి చెప్పినా నీవు చెప్పినను
విందునేరాధికా విందునే చెలియా - భామరో నీకు నే పరుడనాచెప్పూ
నా పద్మగంధిరో నన్నేలుకొమ్మనెను - నీవన్నెలమాటలు యెన్నడాడితివో
ఒకనాడు రాధికాగృహములోపలనూ - సీతకేళితో వాలలాడుచున్నపుడు
చెప్పిపంపించిన పనిచేయరయితీరి - భామవచ్చినదని చెప్పిపంపితేను
చెప్పిపంపినను చేయరయితీరి - ఆవేళ భామకు నవ్వువచ్చింది
యెరుగయెరిగితె మాతండ్రివసుదేవుడాన
వొట్టునీకున్నదా ఓ పురుషోత్తముండా
సత్యంబుమీకున్న చామర్లగంధి - అగ్నిసతిఅయితేను అంటనివ్వాను
మిత్రసతి అయితేను పొందనివ్వాను - తరుణులు తనకడకు రాకుండజేసి
తనకైన కాపురం లేకుండజేసి - ఇకనెక్కడ బ్రతుకు ఉన్నాదితనకు
యెన్నడు బోరిగిళ్ళకు వెళ్ళనివాడవు - ఈ ప్రొద్దుపొరుగిళ్ళ ఏతెంచనేర్చితీ

యెన్నడూకాపురం ఎరుగనాటింది - కాపురంలేని వారింటపుండూరె
యీచీరెలీరవికలీ సొమ్ములన్ని మేడలు - మడుగులు ఘుల్లెసాల్లు
పట్టెమంచము పరుపులీవెక్కడివెఖాసు - పరిచారకులనెల్ల వెనుకతెచ్చేరు
యిన్నాళ్ళు యెవరితో వర్తించిపోవే - యిన్నాళ్లు యెవరితో కూడియున్నావె
వారివూరుపేరు చెప్పవే నాతో - శ్రీకృష్ణచెప్పేను లెస్సతో వినుము
మాయదారివాడు మరితంత్రగొట్టు - మరి తంత్రగొట్టయిన టక్కరులవాడు
అబద్ధాలకోరు అకటకోట - అకటయిన ఆరుమాటలవాడు
నల్లనివాడయిన సుందరుడెవాడు - కళలుగలిగినవాడు కాంతిగలవాడు
భార్యలుగలవాడు పరమపావనుడు - ఇరుగున శ్రీదేవి నుంచుకొన్నాడు
తిలకమ్మునబోలు అతివలు వరస - ఆతనిచెక్కులు మించుటద్దములుబోలు
మకరకుండలములు పెట్టినవాడు - పిల్లనగ్రోవి చేతబట్టుకున్నాడు
అతని పద్మంబులు శంఖపద్మములు - అతనితోపోరాడ ఆపదలమీకు
పంతపుగరితవు అపుటనేనెరుగ - అందుకొరకై నోరుమూసికొనియుంటిని
వాలినీకేమయిన యెదురాడితినా - చెలికత్తెతో చనువుచేసె కృష్ణుడు
అంతలో చెలికత్తెలిట్లనిరపుడు పొంది - పొలతుల విభునికొనితేవరమ్మా
కొలువుతప్పినమాట నేటికాడితినీ - ఇన్నాళ్ళులాగున యెవినీతులమ్మా
సవతులమీద బ్రతుకు సఖియనిరి - నడవికి నిన్నెవరు పిలిపించినారు
భూతాలవలెమీరు బుద్ధిచెప్పేరు - రాక్షసులవలెమీరు తగవులీడ్చేరు
మందలావులవలెమీరు మనవిచేసేరు - అతని పొడుగుపొడుగు యెంతచూస్తావో
సత్రాజిత్తునకను లోకప్రఖ్యాతి - లోకప్రఖ్యాతయిన రాజకూతుర్ని
గుణముయెరుగనివాని తెచ్చుకొంటిని - పసులకాపరివైన మమకారమేమొ
గొల్లబోయడవగుచు యున్నవాడావు - అదియాలపోయాను అదిగొల్లబుద్ధి
యర్రవాడిని పొడుగలవాడిని - చక్కనివోవిభుని తెప్పించుకోవె
కూర్చుండతీరదే కుసుమసిరిగంధి -గొల్లభామలయెదుట చూచుచున్నారు
సిగ్గునతాలేచి శ్రీకృష్ణుడపుడూ - మొగదరుడు మొగపాలిముందరనిలచె
ప్రార్థించి యాసత్యభామ తాలేచి - పీతాంబరంచెంగు పిగులదాబట్టె
పట్టంగ తనశిరము తావంచుకొనియె - యంతచేసిన సతిమీద గోపమ్మొ
గుండెపట్టెగాని గోపికరోచూడు - కొండగొడుగట్టిగా గుండెంతబరువు
నీరుపట్టెగాని నెలతరోచూడు - నీరుమోసేవారికి వారెంతపరువ
పాముపట్టెగాని పణతిరోచూడు - పాముమీదనిద్ర పవ్వళించేరూ

చిల్లరగాదుసుమ్మి శ్రీకృష్ణగుణము - చెల్లంగ ఒకభాష చేసిపంపించే
కలవకాడలుతెచ్చి కలకర్ణుదువ్వి - పారుజాతముదెచ్చి కొప్పులోనుంచె
అప్పుడు సత్రాజిత్తు పంపేటినాకు - ఆడబడుచులబుద్ధి యేమనిజెప్పె
యేమనిచెప్పకుంటె వినశక్యమాయె - చెప్పకుంటె వినశక్యమాయే మిమ్ముశిక్షింపు
మని విన్నపములాయె బట్టి శిక్షింపు
అని అచ్చుతులుబలికె కొట్టుమని బంగారపు - కోల చేతికిచ్చె
బంగారముకోల తానుపారవేసుకొని - అక్కడ ఆ యింతి అట్టిట్టినిలిచె
యెక్కువలుతక్కువలు ఏమి ఆడితినో - పట్టుకొనివిభునికి - పాదాలువొత్తె
కడకు తననుబొందె కుసుమశిరిగంధి - మనువృత్తియెత్తునే మనమలరిగంధి
సత్యభామ సరసమ్ముపాడినా విన్నా
సతిపతిదంపతులు యెడబాయకుందురూ - యీపాట నెవ్వరు పాడినాగాని
బొందితో కైలాసం పొందెదరు.

---

# రుక్మిణీదేవి ముచ్చట్లు

ఆటకూటంబులోను - రుక్మిణీ - నాటకపు శాలలోను
పారిజాతపు శయ్యపై - రుక్మిణీ - పవళించి యెుక్కనాడు
కలికి శ్రీగోపాలుడు - రుక్మిణిని - కౌగిటను జేర్చుకొనెను
ముగుద కుచముల నడుమను - ముత్యాల - సరులు గుంపిసలాడగ
సిరులు నాట్యముసేయగా - తనపైట - చెంగు జీరాడగాను
యెలమితోడుత రుక్మిణి - తన విభుని - వద్దనే కూడుండగా
సరసమున నా యింటికి - చొచ్చితి - రా యేమి పనియున్నది
యిదియేడ సవతి తనకు - కోమలీ - యిది యెవ్వతె తనకునూ
యింత దుండగ తనములు - కోమలి - యీ యింతికె చెల్లును
యే యింతికె చెల్లునే - కోమలి - యీ యింతికె చెల్లును
పిలిచినా పలుకదమ్మా - దానికి - బడాయియే మోకాని
నిలచినా నిలువదమ్మ - దాని - యహంకారమే మోకాని
వంచిన వంగదమ్మ - దాని వ - య్యారమే మొకాని
చూచినా చూడదమ్మ - దాని పండ్లు - మింటనే అంటున్నవి
యెలమితో శ్రీకృష్ణుడు - దానికి - యింత చనువిచ్చినాడే
యేమిజూచి వలచెనే - కోమలీ - అదియెంత సుందరమ్మ
పాలిళ్ళుజూచి వలచె - దాని మంచి - పలువరుస జూచివలచె
వలచితె వలచెగాని - విభుని తన - వశము జేసుకపోయెను
సత్యభామ యుండుగాని - ఎన్నడూ - తమయిండ్లకురాడు
చూడనైతే చిన్నది - ఆ భామ - పంతమే అటువంటిది
చెలువంపు కుందనములూ - దాని మంచి - చెక్కుటద్దముల బోలు
చక్కెరకంటె మిగుల - విధినమరి - సఖియ చిగురాకుబోణి
మొలక నవ్వుల కృష్ణుడు - ఆ తరుణుని - మోహించక తీరదమ్మ
కలికి శ్రీగోపాలుడు - దానిని - కౌగిటా జేర్చుకొనెను
కురులు నున్నగ దువ్వియో - శిరసుపై - గొప్పగా పెట్టె తురుములు
సొగసయిన దాని నొసట - కస్తూరి - చుక్క చక్కగ దిద్దెను
ఆ మగువ చనుగవలపైన - యెంతో - అలరెనే శ్రీగంథము

కూడవచ్చిన వారికి - యిందే నీ - కూటములు గలిగెనమ్మ
జార స్త్రీలకు హితవుడై - అది మొదలు - జేరడే తన యింటికి
పుట్టు మొదలు దిమ్మరై - పశువులతో - బోయడై తిరిగినాడె
కోమరుప్రాయపు స్త్రీలను - పట్టుకొని - మూడిగంబులు సేయుచు
పలుగాకు లెల్లగూడి - ఆగొల్ల - పడుచులను మరగినాడు
పదహారువేలస్త్రీలు - ఎనమండ్రుడు - పట్టపు దేవులమ్మ
వారలందరుచాలరె - యిప్పటి - వారకాంతలు చాలరే
ఎందరైనను జాలరే - పడతిగో - పిందుని కౌగిటాకు
నలినాక్షి వినగదమ్మ - అదియయిన - నాకైన తెలియరాదు
బాలప్రాయమునైనా - అదిమొదలు - భావించి తెలియరాదు
అతివరో వినగదమ్మ - తనవిభుని - ఆరాధ కొప్పగిస్తి
కౌగిటనునున్న విభుని - రాధాంగివచ్చి - తీసుకపోయెను
అట్లెట్లులు బట్టుక - పోగాను - చూచుచుంటివె కోమలీ
ఆవేళ తనదేహము - పరవశము - నై యుండునేకోమలీ
ఆయింతి తనమీదను - అదియేమొ - తెచ్చి చల్లెనుమందులు
అచ్యుతుడాదానింటికి - పోయిన - ప్పటివేళనుంచి
యింతిరో తనకన్నుల - నీళ్ళకు - పై పైకురిసినావి
కుప్పలై కురినీళ్ళు - కోమలీ - కురిసి పోటించినావి
తరుణిరో వగవకమ్మ - నీసోగ - కన్నులే యెర్రనాయె
మొన్న రాతిరవేళను - అతనిపా - త్తున అరగించిన అన్నము
పెట్టి యిష్టాన్నములు - ఆయింతి - ముట్టలేదేకోమలీ
ముడువబోయిన పువ్వులు - తనకత - డిచ్చినవేకోమలీ
పూయబోయిన గంధము - తనకళ్ళ - సున్నంబులై తోచును
పరుపుమీద పరుండబోతె - తనకింత - బుద్ధిపుట్టదెకోమలీ
అతివరో తాంబూలము - తనకెంతో - అసహ్యమైతోచును
చూస్తివా ఓకోమలీ - యిందొక్క - మాటగదూ చెప్పెద
లక్షవేలూ జేసెడి - తనమెదను - పచ్చలాపతకముండె
అచ్యుతుని కంఠమాల - తగులుకొని - అరచిక్కుబడుచుండెను
ఆచిక్కుతీసితాను - పరుపుపై - బెట్టుంటి నొక్కసారి
ఎంతవలపే కోమలీ - దానిముఖము - చూచుచులోలుడాయె

చూచుచు లోలుడాయె - దాని - మెడను వేశానే
ఆపతకముగాదె - పతకము - ఆసత్యభామదే ఆపతకము
అచ్యుతుని పెండ్లినాడు - అల్లునికి - అరణమిచ్చిన పతకము
అంతతోనె కోమలీ - ఆభామ - అడగబంపెను కోమలీ
పతకంబు తీరుగాని - పతకంబు - చేయించి వేసినాను
ఎల్లుండి యీపాటికి - నీవొచ్చి - కొంచుబోవేపతకము
అనియిట్లు ఆయింతికి - ఆయింతి - యొప్పుగా జెప్పించెను
నారదుడు ఒక్కనాడు - ప్రేమతో - పువ్వుదెచ్చెను కోమలి
తెచ్చి నీలావర్ణుడు - ఆపువ్వు - తనకుయిచ్చెనె కోమలీ
యిచ్చినీలావర్ణుడు - తనలోను - తాను తాపంబొందెను
ఆవేళ అప్పగించి - ఆపారి - జాతమే కొంచుబోయె
దానికాళ్ళనుబట్టుచు కృష్ణుడు - దానిపెరట నేసెనే
ఆచెట్టును ఇంద్రుడూ - మెచ్చడాయె - నాతండ్రి చంద్రుడూ మెచ్చడాయె
జారుడికి తెచ్చిచ్చెనె - మాతండ్రి - చోరుడుకి తెచ్చిచ్చినే
తండ్రేమి జేసెనమ్మా - తన్నిచ్చి - తాను తెచ్చూకుంటిమి
రుక్మాంగుడన్నమాట - అదియెల్ల - తారుకాణాలాయెను
యెంతప్రొద్దూపోయిన - తన్నువిడి - యుండడే శ్రీకృష్ణుడు
అటువంటి శ్రీకృష్ణుడు - దానివల - తగిలిపోయెనెకోమలీ
ప్రేమదప్పెనె కోమలీ - తనమీద - ప్రేమచాలించగదవే
యశోద శ్రీకృష్ణుడు - తనతోను - యెంతగూడి యుండునేకోమలీ
ఏలాగకూడుండునే - చెప్పవమ్మ - రుక్మిణీ సంతోషమైయుండును
సరసంబులాడుచుండు - తనతోను - సయ్యాటలాడుచుండు
కేళింపుచూనుండునే - తనతోను - కేళిసల్పుచునుండునూ
అద్దంపుజూపుచుండు - తనకతడు - ఆకుమణచి యిచ్చును
ఆభరణములు సొమ్ములు - తనకతం - డలంకరించుచుండును
మాణిక్యాలకొడుకులు - మెడను - చక్కగా వత్తుచుండు
తేనెతో అరటిపండ్లు - తెప్పించి - తన కారగించుచుండు
కలియపీవనభక్తితో - బంగారు - వింజామరల విసరును
ఏమిచెప్పూకుందునే - కోమలీ - విభుడు జేసిన మన్నన
మొన్నరాత్రి వేళకు - అతనిపా - త్తున అరగించినయన్నము

పెట్టినా యిష్టాన్నము - తానింత - ముట్టలేదే కోమలీ
చిలుకకు పద్యంబులు - తానింత - జెప్పలేదే కోమలీ
చిలుకలుపలుకనాయె - కోమలీ - అవిచిన్న బోయివున్నవి
తాచిన్నబోయుండినా - కోమలి - అవిచిన్నబోయున్నవి
కలహంసనడువదాయె - గోమలీ - అవిచిన్నబోయున్నవి
తాచిన్నబోయుండగా - కోమలీ - అవి చిన్నబోయున్నవి
ఆటకూటంబులన్నీ - కోమలీ - అవిచిన్నబోయున్నవి
తాచిన్నపోయుండగా - కోమలీ - అవి చిన్నబోయున్నవి
నాటకపు శాలలన్నీ - కోమలీ - అవి చిన్నబోయున్నవి
తా చిన్నపోయుండగా - కోమలి - అవి చిన్నపోయున్నవి
అచ్యుతుడు కూర్చుండెడి - రత్నాల - మేడ చిన్నపోయెనె
తా చిన్నపోయుండగా - కోమలీ - అవి చిన్నపోయున్నవి
నారదుడు కూర్చుండెడి - భోజనా - శాల చిన్నపోయెను
తా చిన్నపోయుండగా - కోమలి - అవి చిన్నపోయున్నవి
చిత్తరపు చవికెలోన - రత్నాల - తూగుటుయ్యాలుండు
యే వేళ తమరిద్దరు - యొప్పుగా - వూగుచుందురె కోమలీ
నడువలేదని రుక్మిణీ - తన్నతడు - చంకబెట్టుకు తిరుగునే
చంకబెట్టుక తిరుగునే - శృంగార - సరసులను విహరించునే
మల్లెపూవుల కోయునే - నెలతరో - మరులు కొల్పుచు పల్కునే
వారిదరికేగి నీవు - నెలతరో - వర్ణించి నా కష్టము
విభుని మనమూ ద్రిప్పుచు - వేడ్కతో - నాథు దోడ్కొని వేగమె
వచ్చి నా ప్రేమలంది - గైకొమ్మి - వనితరో సౌఖ్యములను.

# రుక్మిణీ విజయము

శ్రీ వెంకటేశవినవే - నీకుజె - ప్పేను పక్కమనవి
ఆదరించి మ్రొక్కెదా - నీకు నే - అంకితంబుగ జెప్పెదా
శ్రీకృష్ణుడొక్కనాడు - రుక్మిణీ - చెలియమందిరములోనూ
మేలైనమణిమయముతో - యింద్ర నీ - ల స్తంభములుచాలూ
చంద్రకాంతపు వీధులు - ఘనమైన - చారువజ్రపు గోడలు
పచ్చబంగరురచ్చలూ - మేలైన - పగడంపుతిరువిధులూ
మణిదీపరతులుచేత - జగదీప్త - మానమైవెలుగగాను
అళులుజుమ్మని మ్రోగగా - కోవెలలు - అచ్యుతాయని పొగడగా
నీలమేఘముగురియగా - రుక్మిణీ - కేళికాగృహములోన
హంసతూలికశయ్యపై - కృష్ణుడూ - ఆనందలీలలమరా
పట్టుతలగడలు మెరయా - కృష్ణుడూ - పవ్వళించుండగాను
పాదమున సిరిగజ్జలు - మ్రోగగా - పసిడిఅందెలు మెరయగా
సందిటదండలున్నూ - మేలైన - సరసంపు గాజులున్నూ
సకలసంపెంగపువ్వులూ - జాజివిర - జాజి చామంతిపువులూ
మరిమంచి మల్లెపువులూ - మరువములు - వకుళచంపకపువులు
పాటలీకుసుమములునూ - దానిపయి - పారిజాతాకుసుమాలు
నిత్యమల్లెలు పరచిరీ - దానిపై - మొగలిపువ్వులు పరచిరీ
అత్తరు పన్నీరునూ - ఆమంచి - శెయ్యపైజల్లించిరీ
అద్దములు బాలీసులూ - మరిగొప్ప - గులేబులుగట్టిరీ
మత్స్యావతారాదిగా - పటములను - గదిచుట్టలంకరించిరీ
నవరత్నములుచెక్కిన - జాలరులు - దోమతెరలనువేసిరి
నిలువుటద్దములువుంచీ - యెంతోబహు - శృగారమలరించిరీ
ఖమిడిపళ్ళెరములతోను - ఫలహార - వస్తువులుదెచ్చిరపుడూ
వెండిపళ్ళెములుతోనూ - వారపుడు - ద్రాక్షఫలములుదెచ్చిరి

ఖండశర్కరయుమంచి - కలకండ - పాలుపానకమిచ్చిరీ
కిశిమిశీపండ్లుదెచ్చి - అతివేగ - చేడెలందరు వుంచిరీ
పనసతొనలూ మొదలుగా - మరిమంచి - కమలాఫలంబులును
తేనరటిపండ్లుదెచ్చి - మరిమంచి - కొమ్మరటిపండ్లుతోను
చక్రకేళీఫలములు - కర్పూర - చక్రకేలిఫలములా
కమలాఫలములబోలు - యీదఫ - లగను దెచ్చివుంచి
కరియావుపాలుదెచ్చి మాకాంత - లన్ని ఫలమూలుదెచ్చి
పంపరా పనసపళ్ళూ - బొప్పాయి - నారింజపండ్లుదెచ్చి
పక్వఫలములుదెచ్చిరీ - చెలులైన - సుదతులందరువచ్చిరీ
ఛమిడిచెంబులతోడను - ఉదకంబు - శయ్యకిందుంచి అపుడూ
సకల శృంగారంబుల - ఆస్త్రీలు - చేసివెంటనేతర్లిరి
అప్పుడా శ్రీకృష్ణుడూ - ఆ హంస - తూలికాశయ్యపయినీ
పట్టుతలగడదిండులా - మరిలెక్కాము - తొపవ్వలించియుండా
రుక్మిణీదేవప్పుడూ - పన్నీట - జలకములనెల్లనాడి
పట్టువస్త్రంబుచేత - తడిలొత్తై - పణతులందరు అప్పుడూ
పదువారములనగలూ - రుక్మిణికి - పనితలలంకరించి
పాదముల శిరిగజ్జెలు - ఘల్లుమని - పశిడిఅందెలు కదలగా
సందిటదండయున్ను - మేలయిన - సరసంపుగాజులున్ను
ముంచేతజేకట్లునూ - మేలైన - ముద్దుటుంగరము వేళ్ళను
కుప్పిరీ జడగదలగా - యేనుపయి - ముక్కెరయు తిలకంబునూ
పంకజాకంములునూ - మేలైన - పద్మంపుఛమిరాలును
సొగసైన నడుముపయిని - పిడిఘంట - వడ్డానములు మొదలుగా
ఇరుగడల రవిభాస్కరుల్ - కాంతులను - పిక్కటిలెనెల్లదిశలా
కురులు దూళారగాను - పయ్యెదల - కొంగుతాజీరగాను
ముంజేతిపయినిచిన్ని - చిలుకతే - ముద్దులాడుకొనుచును
ఇరుగడల చెలికత్తెలా - పయ్యెదలు - చెయ్యతుగావేసుకు
చిరునవ్వుకొనుచు రుక్మిణి - శ్రీలక్ష్మి - శ్రీహరికడకొచ్చెను
పవళించియున్న యట్టి - పతిపాద - ములకుతానపుడు మ్రొక్కి
సొగసుకన్నుల కాటుకా - మెరయగా - చెలియతానెనిలచెను

బోటిచేనున్నయట్టి - చామరము - చెలియతానేబట్టెను
వంకచూపులుకోమలీ - తన విభుని - చేరివిసరగదొడగె
నిలుపుటద్దమ్ములోను - శ్రీలక్ష్మి - నీడ తానేజూచెను
రత్నకిరీటమ్ములూ మేలైన - మకరకుండలములున్నా
వొయ్యారముగనువున్నా - విభుని శృం - గారమంతజూచెనూ
పతిపరూపమునుతాల్చినా - దాల్చనగు - పరమభాగ్యములంచునూ
పతితోను చెలియించెటీ - యెట్టిదో - చెందన్మయారుక్మిణీ
ఎందరుస్త్రీలు అయినా - నానాటి - కిందువదనలు అవుదురూ
అనియిల్లె శ్రీరుక్మిణీ - తలపుల్ల - అచ్యుతులు తానెరిగెను
ఎకసక్కెమున కృష్ణుడు - రుక్మిణీ - దేవినిట్లనియెనమ్మా
అష్టదిక్పతులకంటే - చంద్రుడు - ల్లిశవ్యాదయ సంపన్నుడూ
తల్లిదండ్రులు దమ్ములూ - ధవళాక్షీ - వారలకు తన్నిలిపిరీ
వార్నితలపక రుక్మిణీ - మావంటి - వార్ని తలచుట న్యాయమా
ఎక్కగద్దెలులేవుగా - మాకైన - పలరాజ్యములులేవు
పట్టఆయుధములులేవు - మాకైన - బలువైన బలములేదు
రాజ్యపీఠమ్ములకునూ - ఓయింతి - రాముడావేమునూ
రాచకూతురువె నీవూ - భూమిలో - రాజ్యగొల్లలము మేము
మావంటికులహీనుల - తగులుటకు - తరుణికే న్యాయమటవే
నీవుకావలసి నేను - నేనింత - పనికైనరాలేదుగా
వానిగర్వములణచనూ - నిన్నువరి - యించితెచ్చితిగాని
నీమీద ప్రేమచేత - శ్రీలక్ష్మి - నిన్నునే తేలేదుగా
అలజరాసంధుడాది - శిశుపాలు - డంత రాజులు ఉండగా
వరియించవేకోమలీ - నీమనసు - వచ్చువారలనెల్లనూ
రాజ్యంబునేలుకొమ్ము - యాతుత్రియ - బుద్ధితో నుండుకొమ్మా
వెలుగుచుండవెకోమలీ - గృహాధిప - విభవమున ఎల్లప్పుడూ
అనియిట్లు శ్రీకృష్ణుడు - రుక్మిణి - దేవితో నాడగాను
కాటుకామెర యంగనూ - కన్నీరు - వరదలై పారగాను
కుచకుంభముల మీదను - వున్నట్టి - కుంకుములుదడియగాను
అసురసుర మనుకొనుచును - ఆయింతి - నాతనిన్వగుచుచూను

యెరుగరా తన మనస్సులో - తలపెల్ల - పలనల చేయననుచును
అసురుపుసురుమంచునూ - ఆయింతి - పడిమూర్ఛ లేనాయెను
పడిమూర్ఛబోయినట్టి - సతినిగని - పద్మనాభుండూ
పడివున్నసతినియెత్తి - శ్రీకృష్ణు - డపుడు పాన్పునుంచెను
ముంగురులుకల దువ్వచూ - మోముపై - ముద్దుచమటలుదుడిచెను
మెడనున్నహారములనూ - కృష్ణుడు - మేనెలను సవరించెను
పచ్చకర్పూరమ్మునా - ఆయింతి - కర్నములు ఊపుచూను
చామంతిపూరేఖలూ - మేలైన - చెంగల్వ పూబంతులు
కన్నులాపై దిద్దుచు - కృష్ణుండు - పన్నీరుచిలికించుచు
ముత్యాలసురటిచేత - కృష్ణుండు - ముగుదకును విసరదొడగె
చాలవుపచారంబులూ - కృష్ణుండు - సఖియకునుతాశేయుచు
మేను మేనునద్దుచు - రుక్మిణీ - దేవినీ యూరడించె
నీకుదక్కితినిగాని - ఓయింతి - నీపాలివాడగానా
నీమీదకోపంబునా - శ్రీలక్ష్మిని - న్ననేపలుకలేదు
అనియిట్లు శ్రీకృష్ణుడూ - రుక్మిణి - దేవినీ వూరడించే
మూర్ఛఅంతా తెలసెను - రుక్మిణి - దేవివిభుని అనియెనూ
నరహరివాసుదేవా - రుక్మిణీ - నాధ శ్రీనివాసుడా
మీరాడినా మాటలూ - కర్నముల - ములుకులైనాటెనాకు
అనియన్నిపట్టలేక - ధరణిపై - పడిమూర్ఛపోతిని
యిట్లు యింతీబలుకగా - కృష్ణుడు - రుక్మిణీతో యిట్లనియెను
రతులందుజూదమందు - ఓయింతి - రణకయ్యములందునా
మనలనొప్పించిగాని - శ్రీలక్ష్మి - మరియు మెదలవలెను
అనియిట్లు శ్రీకృష్ణుడూ - రుక్మిణీ - యెడల పైనిడుకొంచును
మినుకురులు చిక్కుతీసి - పాపిటను - యందమలరగ దిద్దుచు
సన్నవిరజాజిపూలా - మేలైన - మల్లెమొల్లలుసోగలా
మంచిశామంతిపూలు - మధుర - మందారపుష్పములు దెచ్చి
రుక్మిణికి జడనిండుగా - వలపుతో - అపుడుశృంగారించెను
సోగకన్నులకాటుక - వెలయంగ - సుదతికిని తాదిద్దెను
కస్తూరితిలకమ్మును - రుక్మిణీ - దేవి నుదుటనుదిద్దెను
కస్తూరి గంధంబునూ - రుక్మిణికి - కృష్ణుండు మేనునలదెనూ

అధికసంతోషంబునా - రుక్మిణీ - దేవి శ్రీకృష్ణునకునూ
సకలవిభవములుచేతను - శృంగార - మొప్ప రంబిలజేసెనూ
గంధమునుపన్నీరును - కృష్ణునికి - మేనుయందలదె తాను
పండ్లు ఫలహారంబులూ - రుక్మిణీ - పతికితానందిచ్చేనూ
కర్పూరతాంబూలము - నేయుచును - దంపతులు సర్వకేళి
విలాసమానసులగుచునూ - వొకరొకరు - సంతోషమునగలసిరి
శ్రీరుక్మిణీ విజయము - జగతిలో - పాడినా విన్నగాని
ఎట్టివేలల దంపతుల్ - యెడతెగక - కూడికేళితానుందురూ.

# చెంచీత కథ

శ్రీరమాధిపుడైన శ్రీకృష్ణమూర్తి యా ద్వారకాపురిలోన నుండంగా
ద్వారావతీ పురిలోనుండంగా

ద్వారకాపురిలోన క్షీరనీరధికన్య ఆదిగాగల యష్ట భార్యలెల్ల
సత్యభామా మొదలు భార్యలెల్ల

మోదంబుతోనుండ యాదవాంబుధి సోముడాదరంబున వారినందరిని
సంతోష మొప్పంగ నందరినీ - మోదమిగురొత్తంగ నందరినీ

చాల సొమ్ములుబెట్టి వేల చీరలునిచ్చి కేళిలోనుండినవారలను
సంతోషపెట్టంగ సత్యభామా మొదలు కాంతలెల్లను మదిని గర్వించి
శ్రీకాంతునితో మాటాలు చాలించి శ్రీకృష్ణునితో మాటాలు చాలించి

గర్వించియుండగా కంజలోచనుడప్డు కాంతామణుల జూచి కోపామునా
వారిగర్వ మడపాదలచి కోపమునా
వారిదర్ప మడపదలచి కోపామునా

మీరింత గర్వింప మీ కంటె హెచ్చైన వారిజాస్యల కోరితెచ్చెనే
చాల సొమ్ములు చీరలిచ్చెనే - మేలైన సంపదల నిచ్చేనే

మా కంటె హెచ్చైన వారి జాస్యల నీవు తేలేవు తేలేవు కృష్ణుడ
నీవుతెస్తేను చూతాము కృష్ణుడ
నీవు తేవోయి చూతాము నాసామి

చూడండి చూడండి భామలారా - మీ సున్దరము చూతము భామలార
మీ చక్కాన చూతాము భామలార - మీ సొంపులూ చూతాము యువిదలార

మా కంటె సుందరులు లోకములో లేరు లోకేశ నీ వెరుగటవోయి
భూతేశ నీ వెరుగటవోయి - సర్వేశ నీ వెరుగటవోయి

ఈ రీతి వనితలా వారిజాక్షునితోడ కోరివేడుకవాద మాడుచుండా
మీరి సంవాదంబు సేయుచుండా - హరితోడ సంవాదమాడుచుండా

వారిజాక్షుండపుడు వనవిహారముసేయకోరి ద్వారకవెడలె మోదమునా
చాల భార్యలతోడ వాదమునా వేటాడువేడుకను అడవికి బోగాను

బూటకములేనట్టి వేటమృగములనెల్ల దాటించి
వాటి యంగాము దూటులుగ గావించి

చమరీమృగాది బహుచాల మృగముల గుంపు భ్రమజెందునట్లుగా
బెదరుపరచి వాటి తిమురడచి గుంపులను తెరలజేసి

భల్లూకముల మేన భల్లములు నాల్గేసి కొల్లగానాటించి వ్రేళ్ళవైచి
వాటి నోళ్లెల్ల రక్తాములొలుకజేసి - వాటి నోటను రుధిరాగ్రమ్మజేసి

వనజాక్షుడీరీతి వనవిహారము సల్పి - కనె నొక్క పొదలోన కమలముఖినీ
దాని కన్నుల సొబగెల్లగ నప్పుడు - దాని సొంపు సంపదలెల్ల జూచెనపుడు

నెలబోలు నెమ్మోము తళుకెక్కు చెక్కిళ్ళు కులుకు గుబ్బలచెంచు వెలదిగాంచి
దాని వలపుచేతను మేనుపులకజెంది - దాని కాంతిచేతను మనము భ్రాంతిజెంది

చెంచువేషము బూని పొంచిపొంచిడాసి చెంచుమాటల దాన్ని చేరదీసి
మంచి మాటలదాన్ని మనివిజేసి

ఎఱ్ఱనారీటిండ్లు యే యొక్క వగలాడి నా వంక నీవు జూడు చెంచిత
మోమెత్తి ననుజూడు చెంచిత - మోమోట ముంచవె చెంచిత

పచ్చనారీటిండ్లు పారుటాకులచీర పాహి యేవూరుదానావే
పణతిరో యేవూరుదానావే - చేడెరో యేవూరుదానావే

పవూరు ఐతేను మాజోలి మీకేల వేటకొచ్చినాము పోవోయి
అడి వేటకొచ్చేము పోవోయి దుప్పేట కొచ్చేము పోవోయి

వేటకొచ్చితేను యేమాయ చెంచిత - మాటలాడితేను కోపామా
ముచ్చటాడితేను కోపామా - పల్కు పల్కితేను కోపామా

మాటల్ మచ్చికాలు మాకేమి సరిపడవు - మరియేమిరా దగ్గిరొచ్చేవు
మగవాడ యేమిరా వొచ్చేవు - అదియేమిరా దగ్గిరొచ్చేవు

శ్రీకృష్ణమూర్తినే చెంచీత - లోకాల కర్తనే చెంచీత
నిన్నుద్ధరిస్తాను చెంచీత - నిన్ను పెండ్లాడెదను చెంచీత

రాధ రుక్మిణికన్న చెంచీత - చక్కని దానవని చెంచీత
కోరివచ్చితినేను చెంచీత - నీ మక్కువబడ్డాను చెంచీత

స్త్రీలులేకను చింతపడలేదు చెంచీత - పదహారువేలేమి చెంచీత
గోపికాస్త్రీలేమి చెంచీత - అష్టభార్యలేమి చెంచీత

నా యిష్టముగనున్నారు చెంచీత - వారితోడను నేను చెంచీత
వాదాడి నేనొస్తి చెంచీత - ఖేదమెంచాబోకు చెంచీత

మ్రొక్కెదను మ్రొక్కెదను చెంచీత - మ్రొక్కు చెల్లించవే చెంచీత
నీ పుణ్యముంటుందె చెంచీత - నన్ను పెండ్లాడవె చెంచీత

యేవూరి కమ్మారి చేసినాదురవోరి గుండెలిప్పుడు తెగవైతునురా
కండాల్ ఖండించి వైతునురా

గుండేలునేసిన గుజ్జుచేతులాకు - కమ్మాల్ కడియాలిచ్చేనే
కనకంపు బావిలీలిచ్చేనే - మేలైన బొమ్మ్మాలు యిచ్చేనే

మేడమీదా నిన్ను వుంచేనే - ఏడుకోట్లా ధనము యిచ్చేనే
బహుపుణ్యముంటుందె చెంచీత - నన్ను పెండ్లాడవే చెంచీత

ఏడు గూడెములాలో యెన్నికగలదైన - యెలుపోతూరెడ్డి కూతుర్ని
ఏడుగురుఅన్నలు గలదాన్ని - ఏడుగురువదినెలు గలదాన్ని

ఏడు గూడెములాలో యెన్నికాగలదైన యెలుపోతురెడ్డి కూతురవయితేను
వెతకనేల నాకు మామగావలనే - మేనరిక మున్నదే చెంచీత

బంధుత్వమున్నదే చెంచీత - చుట్టరికమున్నదే చెంచీత
బహుపుణ్యముంటుందె చెంచీత - నన్ను పెండ్లాడవే చెంచీత

పాన్పుపై బవళింప కృష్ణుడా - నిన్ను పామైన బెరకదా నాసామి
నిన్ను తేలైన బెరకదా నాసామి

తిట్టకే తిట్టకే చెంచీత - నీవు తిట్టినతిట్లెల్ల చెంచీత
అంబులై నాటేను చెంచీత - అల్గులై నాటేను చెంచీత

తల్లికి ఒక్కడనె చెంచీత - తండ్రికి వక్కడనె చెంచీత
బహుపుణ్యముంటుందె చెంచీత - నన్ను పెండ్లాడవె చెంచీత

నీవుపుట్టినయపుడు కృష్ణుడా - నీకు సంధైనకొట్టదా కృష్ణుడా
పోవోయిపోవోయి కృష్ణుడా - నీకు ప్రొద్దేలపోదోయి కృష్ణుడా

మేనత్తకూతురవె చెంచీత - మనకు మేనరిక మున్నదే చెంచీత
బంధుత్వమున్నదె చెంచీత - చుట్టరికమున్నదె చెంచీత

పాదాలుబట్టేను చెంచీత - నీకు పనులెల్లచేసెనే చెంచీత
అడవిలోకొచ్చెనె చెంచీత - ఇంక తడవేలజేసేవు చెంచీత

నాకెవ్వరునులేరు చెంచీత - నీకుపుణ్యముగద్దు చెంచీత
ఈకోనలోమనము చెంచీత - ఏకమైవుందాము చెంచీత

పెద్దపెద్దపాములు కొండచిలవలు - రెండు గండెకొచ్చినజాడ లెరుగుదువా
అనువులున్నాతావు నెరుగుదువా - అనుమానముండేది యెరుగుదువా

పెద్దపెద్దపాములు కొండచిలవలు రెండు గడికొచ్చినజాడ లెరుగుదునె
అనువులున్నతావు లెరుగుదునె - అనుమానమున్నాది యెరుగుదునె

బహుపుణ్యముంటుంది చెంచీత - నన్నుపెండ్లాడవే చెంచీత
నిమ్మాలగిరిమీద నిమ్మగతిరిగేటి - కొమ్మాలగురుపోతునేశేవా
పదుపందులనెయ్య నేరూతువా - అడవిదుప్పులనెయ్య నేరుతువా

అనుపులున్నాజాడ లెరుగూదువా - పుట్టతేనెలుబట్ట నేరూతువా
పరిగతేనెలుపట్ట నేరూతువా - కొండతేనెలుబట్ట నేరుతువా

నిమ్మాలగిరిమీద నిమ్మాగతిరిగేటి - కొమ్మాలగురుపోతు నేసేనె
పదుసందుల నెయ్యనేరూతునె - అడవిదుప్పుల నెయ్యనేరూతునే

అనుపులున్నా జాడ లెరుగూదునె - పుట్టతేనెలుబట్ట నేరూతునె
పరిగతేనెలుబట్ట నేరూతునె - నన్నుపెండ్లాడవే చెంచీత

పటుతగిలి మెకము యిలమీద - సోలంగ ఎదురుకోలాదొడిగివేసెనె
మారుకోలాదొడిగివేసెనె - మలితిరిగినిన్ను కలసేనె
బహుపుణ్యముంటుంది చెంచీత - నన్నుపెండ్లాడవే చెంచీత

అడుగుతప్పకెప్డు అంగుదప్పాకుండ - అచ్యుతావరవొలిచ్చేవా
మాపటికి మాయింటికొచ్చేవా

అడుగుదప్పాకుండ అంగుదప్పాకుండ - అడిగినావరవొలిచ్చెనే
మాపటికినినుగూడి మెచ్చెనే
బహుపుణ్యముంటుంది చెంచీత - నన్నుపెండ్లాడవే చెంచీత

జోరునావానాల్భోరునగురియంగ - జారుబండలెక్క నేరూతువా
జరుగుబండలెక్క నేరూతువా - జోరునావానాల్భోరునగురియంగ

జారుబండలెక్క నేరూతునె - జరుగుబన్డాలెక్క నేరూతునె
బహుపుణ్యముంటుంది చెంచీత - నన్నుపెండ్లాడవె చెంచీత

పోవయ్యపోవయ్య కృష్ణుడా - నీకు ప్రొద్దేలపోదయ్య నాసామి
మాయన్నలొచ్చేరు కృష్ణుడా - గోరింటపొదలోకి కృష్ణుడా
పరుగుపరుగునవెళ్లు గృష్ణుడా - అలుగులేవేసేరు కృష్ణుడా

గోరింటపొదలోకి చెంచీత - నాకుపోనుభయమేస్తాది చెంచితా
నీవురాపోదాము చెంచితా - మనమిద్దరుందాము చెంచీత

వాదులనాడేవు కృష్ణుడా - నేనువచ్చెదనయ్య నాస్వామి
నిన్నుగూడెదనయ్య నాసామి - మాయన్నలొచ్చేరు కృష్ణుడా
నిన్నుగోపించేరు నాసామి - అంబులేవేసేరు నాసామి

వస్తేనుభాగవును చెంచిత - వారు వస్తేనుమేలౌను చెంచిత
బంటుపంతముచెల్లు చెంచిత - నాభాగ్యమీడేరు చెంచిత
కలసిమెలసుందాము చెంచిత - నన్ను పెండ్లాడవే చెంచిత

నీమీదిమోహాము కృష్ణుడా - నేను పట్టలేకున్నాను కృష్ణుడా
తాళలేకున్నాను నాసామి - వట్టిమాటలచేత కృష్ణుడా
యింత వాదేలపోదాము కృష్ణుడా

గరుడవాహనమెక్కి చెంచిత - మనము ఘడియలోపోదాము చెంచిత
ద్వారకాపురిపోయి చెంచిత - నిన్ను పెండ్లాడేదనుచెంచిత

ఈ రీతి కృష్ణుండు కోరిచెంచిత - మనసునీరుగా కరగించినేర్పుమీరా
ద్వారకాపురిజేరె కూర్మితోడా

దీనజనులబ్రోచు దానవాంతకుడొక్క - శుభదినమున మహావిభవముగానూ
చెంచుచేడియ చెంతరాగానూ - చెంచితను
పెండ్లాడి మించుతనభామలను - వంచించినాసతిని గొంచుజనెయింటిన్

సత్యభామామొదలు సవతులెల్లనుచెంచు - సతినిజూచి వెరగంది
సరముగను సఖియలుగోపించు విరసముగను

పుల్లుదుప్పులవెంట పొలములోతిరిగేటి - పొలతుకమాతోడ సరియటవే
వోచెంచితమాతోడ సరియటవే - యేమెచేడెరో మాతోడ సరియటవే

తల్లిదండ్రులమాట దలపాక మీయన్నకు - దలవంపు శాయగదగునటవే
బలిమీరి మగనిని బతిమాలిగతిమాలి బిలిపించుకోలేదె రుక్మిణీ
యన్న తలవంపు శాయదే రుక్మిణీ

చెంచితనీకింత వంచనమాటలు మించినాడెదవేమె వేమారు
గర్వించిపల్కెద వేమారు

చంచలాక్షి పారిజాతముకయి మగనివంచనాచేసినాడెరుగనా
చాలించుమాటలింకతరుగవా - ఆలించివినెడి వారియెరుగవా

తగులుకొని వచ్చినదానవు - మాతోటి దగునటే పంతములాడగనే
యింత తెంపుమాటలాడను

## స్త్రీల పౌరాణికపు పాటలు

పగలాడి మదికిష్టమగు మగవారలు వలచివచ్చిన గూడ రాదటే
పరువుదెలియా పలికేవువాదటే

రోసముతోనెన్ని వేసాములేసినా సాటియాదువే భామినీ
పల్కులమారిగా సత్యభామినీ

వేసముగాకురువింద పింఛము దండివేసుక మెలగుటమరువకె
శాబాసు క్రొవ్విన నిక్కులరవకే - చెంచిత మాతోడదడవకే

అనుచువాదులాడ యతివలందరకాంచి వనజాతుడువాదువారించి
చనువున సఖ్యతనొనరించి చెంచితనుగూడి నగరుప్రవేశించె

వేమరునీకథ ప్రేమతోజదివిన - కామితార్థములెల్ల నిచ్చెనే
కడుభక్తి వినువారి బ్రోచెనె - ఘనమగు సంపదలిచ్చెనే

యనుచుసంతసమున వనజాతుడూపల్క - వనితామణిగూడి హాయలుమించి
యతులితసౌఖ్యము లనుభవించి - యధికసంతోషముతోమించి.

# తులసీదళమం

శ్రీనివాసమూర్తిసేవ చేసినేను సన్నుతించి
మానసమున తులసిదళము మహిమజెప్పెద
తులసిదళము మహిమ మంచిమోక్షమునకు మార్గమనుచు
బదులుజెప్పగాను వింటిపుణ్యమనుచును
బాగుమీర ద్వారకాపురంబులోన కృష్ణమూర్తి
రాజ్యమేలె నతడులోకనాథు డనుచును
ఒక్కనాడు నారదుండు వచ్చి కృష్ణసేవలంది
తిరుగజొచ్చె పురములోన ధీరుడగుచును
ద్వారకాపురంబులోన నెల్లతిరిగిచూచితాను
నొక్కవూహచేసినాడు వూరకుండక
సత్యభామ నగరికేగి అచట పూజలంది తాను
భక్తిజూచితలాపెట్టె వ్రతమునొక్కటి
తులసిపూజజేసితేను తోయజాక్షి నీకువేగ
వైకుంఠపదవివచ్చు వారిజాక్షిరో
యింతకన్న నెక్కు.వైన వ్రతమునాకు దెల్పవయ్యా
ముందుజన్మలోన కృష్ణుడు మగడుకౌటకూ
అంతకన్న నెక్కువైన వ్రతము నొక్కటుండెగాని
చెప్పగాను జేయవేమొ సిగ్గుచేతనూ
గోపికామనోహరుండు గోపాలకృష్ణమూర్తి
భర్తనా కమరియుండ సిగ్గులేటికి
పతినిదాన మిచ్చినట్టి వారిపుణ్య మేమొగాని
వైకుంఠ వాసులైన నణగివుందురూ
శ్రీలక్ష్మి పార్వతమ్మ యింద్రాణి మొదలుగాను
దేవిశక్తులైనగాని జడియుచుందురూ
యింతకన్న నెక్కువైనదానమున్న దెల్పుమనగ
దీనిమించి నట్టివ్రతము నేనుయెరుగనూ
అపుడువెళ్ళి సత్యభామ సఖులజూచి యిట్లుబలికె

వ్రతము సేయదలచినా నొక్కరీతిని
నానాథు కృష్ణమూర్తి యెచటనున్న గాని మీరు
యిచటదెచ్చి నిల్పరమ్మ వేడ్కమీరగా
పన్నీరుజలకమార్చి పట్టువస్త్రంబుగట్టి
ఫలపుష్పమాదిగాను పళ్లెరంబులూ
అనుచు జెప్ప నారదుణ్ణి జూచితానొక్కటనిరెు
మౌనినాథ నాదుమనవి చిత్తగింపుమీ
పతిని దాన మిచ్చినట్టి వనితబ్రతుకుదారి జెప్పు
మనగ తపసినవ్వి యిట్లు పలుకబొచ్చెనూ
దానమిచ్చినట్టి భర్తతిరిగి రానొక్కదారి
నతని యెత్తుకనక మిస్తెతిరిగి యిస్తురూ
ధర్మ శాస్త్రమందు వొప్పియున్నదనుచు జెప్పగాను
సమ్మతించి వేగజేయ సాహసించెనూ
పతినిదెచ్చి పూజజేసి తపసిజూడగాను మంచి
భూసురుల పిలువనంపె దానమివ్వగా
భూసురులు కోట్లకొలది వచ్చియున్న వారెగాని
దానమందరెవరు నతడు దైవమనుచునూ
సత్యభామ చిన్నబోయి నారదుణ్ణిచూచి తాను
యేమయ్య తపసిగారు యిట్టివింతలూ
అపుడునతడు దానమంది కోట్లకొలదిగాను ధనము
దక్షిణనుచు విప్రులకు పంచిపెట్టెనూ
యిది యేమివ్రతము యనుచు కృష్ణమూర్తి బలుకగాను
సత్యభామ జెప్పసాగె స్వామితోడనూ
నారదుండు వచ్చినన్ను వ్రతము జేయుమనుచుదెల్ప
ముఖ్యమయినవ్రతము నాకు చెప్పమంటిని
పతినిదాన మిచ్చినట్టి వనితలకును జెప్పరాని
పదవిదొరుకుననుచు దెల్ప నటులజేసితీ
యింతకన్న నెక్కువైన పూజనేను జేయలేదు
నిందసేయవద్దు నాకు నీవు వైరివా
యేమయ్య నారదుండ కృష్ణునెత్తు కనకమిస్తు
నాదుపతిని నాకుయిమ్మ వేగమందునా

అపుడు నారదుండు నవ్వి తులయునొక్క దానితెచ్చి
తూచుకనకమనుచుజెప్పె సత్యభామకూ
కోటలోను వున్నవన్ని వరహాలు మొహరీలు
అన్నివేసి తూచినాను మొగ్గదాయెనూ
యింటనున్న పలకసర్లుపతకమూలు దెచ్చినాను
తూగడాయె కృష్ణమూర్తి చోద్యమందగా
యిరుగుపొరుగు సొమ్ములన్ని దెచ్చివేసి చూడగాను
మొగ్గదాయె దైవమాయ తెలియదెవరికీ
తనకు సత్రజిత్తుడిచ్చినట్టి గొప్పముత్యసరులు
తెచ్చివేసిచూడగాను తూగదాయెను
కృష్ణమూర్తి యింద్రపదవి చూడబోయి తెచ్చినట్టి
కనకమంతవేసెగాని తూగదాయెనూ
నరకసురుని సంహరించి దెచ్చినట్టి మూలధనము
నన్నివేసి చూచెగాని మొగ్గదాయెనూ
తుదకు అష్టభార్యలెల్ల దాచుకున్న ధనముదెచ్చి
మంత్రివరుల సొమ్ములన్ని వేగదెచ్చిరీ
పదహారువేల గోపికాకాంతలందరొచ్చి
తమకు భర్త పోవునంచు సొమ్ములిచ్చిరీ
ద్వారకాపురంబులోన కాపురంబు జేసినట్టి
ప్రజలు జూచి చోద్యమందె వింతజూచియు
తమకు రాజవుండకోరి తమతమ యిండ్లనుండు
కనకమంత దెచ్చినాను తూగదాయెనూ
కొండపొడవు ధనములెల్ల కుప్పబోసి తూచగాను
తూగడాయె కృష్ణమూర్తి దుడుకుచేతనూ
వెతకివెతకి ధనములెల్ల దెచ్చివేసినానుగాని
భర్తతూగడాయెననుచు చింతనొందెనూ
సత్యభామ చింతనొంది సఖులజూచి యిట్లుబలికె
యేమిసేతు నెటులదెత్తు నాదుభర్తనూ
నారదుండుజెప్పగాను మంచివ్రతము దొరకెననుచు
పూని నేనుచేసితిని పతినిదానమూ
చేసినందుకేమి చింత చెలియలార మీరుకొంత

ధనముతెచ్చితేను వచ్చునాదు కృష్ణుడూ
అపుడు కృష్ణమూర్తిచూచి యింత సాహసంబు నీకు
యెవరుచెప్పినారు నన్ను దానమివ్వనూ
యింత ధనముతెచ్చినావు యింపుగాను చూచినావు
నన్ను గెలువజూడ నీకు న్యాయమౌనటే
మించిచేసి నట్టిపనికి చింతనొందనేమిలాభ
మనుచు కృష్ణమూర్తి బలికె సత్యభామకూ
పట్టంపుదేవియయిన భామ రుక్మిణీదేవి
చెంత జేరియిట్లు జెప్పుమనెను వేడ్కమీరగా
నీకుయిట్టి దుఃఖమేల నిజముగాను నీవువెళ్ళి
శరణునొంది చెప్పుమనగ చింతతోడనూ
వెలదులార యింత కాలమందునుంచి మాటలేక
యున్న రుక్మిణీచెంతనెట్లు బోదునూ
పోవనేమి లాభమనుచుజెప్పి తనదు మనసులోన
నొక్క వూహ జేసినది సత్యభామయు
నోటి పంతములవల్ల మాటలేకపోయెగాని
ప్రాలుతప్పనలవిగాదు అజునికయిననూ
అనుచున్నాయి రుక్మిణిని చేరివేగ మ్రొక్కగాను
దీవించి చేరదీసి యిటులనడిగెనూ
యెన్నడును రానిదాన విపుడువచ్చినట్టి కార్య
మేమొ దెల్పుమనుచు బల్కె వేడ్కమీరగా
మాటవినియు సంతసించి సత్యభామబల్కెనపుడు
పెద్దదానవనుచు మిమ్ముజూడవచ్చితి
వొక్కనాడు నారదుండు వచ్చినన్ను వ్రతముజేయు
మనుచుదెల్పగానుజేస్తి పతినిదానమూ
నతనియెత్తు కనకమిచ్చినపుడు మనముపుచ్చుకోగ
వ్రతముపూర్తి జేస్తినమ్మ వూరకుండక
కొండపొడవు కనకరాశి గొప్పముత్యసరములెల్ల
నిండుగాను వేసినాను తూగడాయెను
నాకువల్ల కాకపోయి సిగ్గుచేతమోమువంచి
మిమ్ముచేరి మ్రొక్కినాను చిన్నదానను

నావద్ద ధనములే దెన్నడయినగాని విభు
డెంత సొమ్ముతెచ్చినాను నాకుయిచ్చెనా
తనకుసత్రజిత్తుడిచ్చినట్టి గొప్పముత్యసరులు
విభుడు నీకు దాచియిచ్చె వేడ్కతోడనూ
యింద్రపదవి బోయిచూచి తెచ్చినట్టి కనకమెల్ల
యింపుగాను నీకుయిచ్చె కృష్ణమూర్తియూ
నరకసురుని సంహరించితెచ్చినా మూలధనము
నీయింటదాచినాడు మోదమందియూ
పెండ్లినాడు కట్టినట్టి పాలపూసలే గాని
యితరసొమ్ము లేవియనునాకు లేవుగా
యశోదతనయుడయ్యు దానమివ్వ నీకుబుద్ధి
యెవరుజెప్పినా రతని తండ్రియుండగా
పట్టంపుదేవినయిన నేను యిచటనుండగాను
నీకుయింత సాహసంబె వేశ్యకాంతరో
అయిననాకు గలిగినట్టి ముఖ్యమైన వస్తువుండె
యిచ్చెదాను వేగపోయి వేసిచూడుమా
తులసిదళము చేతవిభుడు రాకయున్న నేనువచ్చి
తెస్తుననుచుబల్కెనపుడు భామరుక్మిణీ
ఆమాట వినియు సత్యభామ నిటులబల్కజొచ్చె
తులసిదళము నేనుపట్ట నలిగిపోవునూ
మృదువైన తులసిదళము మీరుదెచ్చి తూచవలెను
ననుచుజెప్ప రుక్మిణిదేవి నవ్వసాగెనూ
అపుడులేచి పన్నీట జలకమాడె వేగమున
తులసిదేవి అరుగునలికి ముగ్గుబెట్టెనూ
ధూపదీప నైవేద్యపూల పూజమొదలుగాను
జరిపి యిటుల మ్రొక్కసాగె తులసిదేవిని
ఒక్కదళముచేతనెత్తి గోపాల కృష్ణమూర్తి
మాకువచ్చినట్టుగానె మీదుకీర్తిని
యెల్లలోకంబులను వినికిజేసి వేగమున
విభునితోడి సౌఖ్యమంది వేగనుందుము
అనుచునొక్కదళము త్రుంచి హస్తమున భద్రపరచి

సత్యభామవెంటరాగ సభకు వచ్చెను
సభకువచ్చి పతినిజూచి మ్రొక్కగాను దీవించె
దపసివచ్చి నిట్లుబల్కె తాను దేవితో
భూదేవి ఆకాశవాణి మొదలు యెల్లవారు
చూచుచుండ పతినినాకు దానమిచ్చెను
తిరిగిపతిని కోరితేను నతనియెత్తు కనకమిస్తె
పుచ్చుకొనగవస్తి ననుచుబల్కినాడను
అపుడు సత్యభామవెళ్ళి యింటనున్న ధనముదెచ్చె
తూగడాయె కృష్ణమూర్తి చోద్యమాయెను
యిరుగుపొరుగు సొమ్ములెల్ల వేగదెచ్చె సత్యభామ
తూగడాయె కృష్ణమూర్తి చోద్యమాయెను
అపుడుభామ రుక్మిణీదేవి వారిసొమ్ములన్ని
పంచివేసి చూచెనచట నొకటి లేకను
తానుదెచ్చియున్నట్టి తులసిదళము వేయగాను
మొగ్గసాగె నంతతపసి చేర వచ్చియూ
హరిసమానమైనతులసి నాకుముట్టెననుచువేగ
శిరమునందునుంచి నృత్యమపుడుజేసెను
సురులు వచ్చి ఆకాశమందు చేరి పూలవాన
కలుగచేసినారు చూడ కృష్ణుమీదను
నృత్యగానములుజేసి వైకుంఠమార్గమూన
నడువసాగె నారదుండు వేడ్కమీరగను
కృష్ణమూర్తి రుక్మిణితొ మందిరంబుచేరినాడు
సత్యభామ కనులయందు నీరుగుప్పుచూ
చెలులజూచి మందిరంబుజేరియుండె సిగ్గుచేత
జనులజూడ మనసురాక భీతిజెందియూ
తులసిదళము మహిమ యెవరు శ్రద్ధగాను చదివినను
విన్నవారికైన మోక్ష మున్నదాయెను
స్త్రీలకొరకు పాటగాను జేసి కృష్ణమూర్తికి
సమర్పితంబు జేయగోరి వ్రాసినాడనూ
తకిట తకిట తకిట తకిట.

# ఉషాస్వప్నము

అన్నంబు దినదాయె నాటలకుబోదాయె నట్టె నిలిచుండునంత
నిదురపోదాయెను నీరంబుగొనదాయె నేల బరుండు నెపుడు
కలువరించుచునుండు కలగంటి ననుచుండు పలుకదెవ్వరితోడనూ
పూలుగోయదాయె పుప్పొడుల్గొనదాయె బుద్ధి నిలకడసేయదు
పన్నీరుగొనదాయె పరుపు ముట్టదాయె పాటల్లు పాడదాయె
కథలు చెప్పదాయె కబురులాడదాయె కాంతలతో గూడదాయె
కుందెనగిరి యాడదు గుప్పచ్చియాడదు గుడిగుడి గుంజమయిన
దాగుమూతలాడదు ఊగుటుయ్యాలాడదు దాటిబిళ్ళాడదాయె
గట్టుమీద కోడిగవ్వల్ల కోడయను తట్టియాటాడదాయె
నన్ను ముట్టుకోకు నామల కాకియను కన్నె యాటాడదాయె
నెత్తన రాళ్ళాడదు హత్తిచేతులు వేసికత్తి బద్దాటాడదు
వామగుంటాడదు పాచికాటాడదు వాలలాడదు
బన్తులాడదు పరచజల్లినయట్టి చింతగింజాలాడదు
బొమ్మలాడదు బూజమాటాడదు నిమ్మాళ్ళాటాడదు
నాయప్పనవలమును నాకు నెమ్మలు నాటనయముతో తానాడదు
వానవాన చెల్లప్ప వాకిలదిరుగుచు చెల్లప్ప వరసాట లాడదెపుడు
చల్లోయమ్మ చల్లయని స్తంభముల్పట్టుకొని గొల్లాటలాడదాయె
వెన్నెలొత్తాడదు వెలదులను గూడుకొని వెసదుద్దుకదురాడదు
కాళ్ళ గజ్జియనుచు కంకణమ్మోయనుచు కాంత తా నాడదాయెనే
గులచుక్కోయని వెలగ మొగ్గోయని వెలది తా నాడదాయె
దోపుడిపుల్లయని దొంగాడిపుల్లయని తొయ్యాలి తా నాడదాయె
చిన్నిబిన్నితొ గద్దుసింగరగౌరెంత గద్దుతాళె బేళెంతగద్దు
తామర మొగ్గల్లో యనుతద్దాటలాడదు తరుణీటిల్లాటాడదు
చమ్మచక్కయని చారిడేసి బుక్కయని సఖియ తా నాడదాయె
అటువొయ్యంగ సని అరగించంగన యతివ తా నాడదాయె
దాచుకో మూచుకో సంబారిబుడ్డియని తరుణిలొడబం తాడదు
చిత్రరేఖయనెడి చెలికత్తె దరిజేరి చెలియతో నిటులబల్కె

పూర్వరీతిలేక పోవిడంతయు మీరిపూబోడి యెటులుంటివె
నీకు గలిగిన కలను నీ మదినిగల కోర్కె నెలత నాతో జెప్పవే
సుందరుడెవ్వడో చూరగొన నీ మనము సుందరాంగిరో పల్కవే
యేల నీపీలీల నెడద చింతించ నెలమి నాతో దెల్పవే
చెలికత్తె కదనిటుల చెప్పకుండుట తగదు చెలగి సత్యము జెప్పవే
ఎన్నడూ యిటువంటి వెఱుగవు నీ కిటులేటికే చింతింపగ
దుస్వప్నమాయెనో దూళిపడదాయెనో దోషంబు జాయుకోఅకు
రక్షరేకును గట్టి రమణిరోమంత్రించి రాత్రి భూతి యొసంగెద
తాయెత్తు గట్టెదను తరుణీరొచెప్పవె తగదిటు కృశియింపగ
అని నవ్వుచు భూతమంటలేదతివరో యాత్మచోరుడువచ్చెనే
అనగానె చెలికత్తెయంతయును దెలిసికొని అతివ యింద్రుడువచ్చెనా
అనగానె కాదమ్మ యమరనాయకునన్న నతిపాపమబ్బు నాకు
అనగానె చెలికత్తెయంతయును దెలిసికొని యబ్జభవుడే తెంచెనా
అనగానె కాదమ్మ యబ్జసంభవునన్న నతిపాప మబ్బునాకు
అనగానె చెలికత్తెయంతయును తెలుసుకొని పార్వతీ విభుడొచ్చెనా
అనగానె కాదమ్మ హరుడంచుబల్కినను నతిపాపమబ్బునాకు
అనగానె చెలికత్తెయంతయును దెలుసుకొని యాజయంతుడు వచ్చెనా
అనగానె కాదమ్మ యలజయంతునినన్న నతిపాపమబ్బునాకు
అనగానె చెలికత్తెయంతయును తెలుసుకొని యలవసంతుడు వచ్చెనా
అనగానె కాదమ్మ యా వసంతునన్న తనపాప మబ్బునాకు
అనగానె చెలికత్తెయంతయును తెలుసుకొని యా కుబేరుడు వచ్చెనా
అనగానె కాదమ్మ యక్షేశుననినచో నతిపాప మబ్బునాకు
అనగానె చెలికత్తెయంతయును తెలుసుకొని యబ్జబంధుడు వచ్చెనా
అనగానె కాదమ్మ యబ్జబంధుండనిన నతిపాప మబ్బునాకు
అనగానె చెలికత్తెయంతయును తెలుసుకొని యా నిశాపతి వచ్చెనా
అనగానె కాదమ్మ యా నిశాపతినన్న నతిపాప మబ్బునాకు
అనగానె చెలికత్తెయంతయును తెలిసికొని యంబుజాతుడు వచ్చెనా
అనగానె కాదమ్మ యంబుజాతునిరూప మమరునే కొంచెముగను
అనగానె చెలికత్తెయంతయును దెలిసికొని యా మన్మథుడు వచ్చెనా
అనగానె కాదమ్మ యా మన్మథునిరూప మమరెనే చాలవరకు

అనగానె చెలికత్తెయంతయును దెలుసుకొని యనిరుద్ధుడేతెంచెనా
అనగానె కాదంచు నౌనంచుబల్కక యతివశిరమును వంచెను
చేతితో తలయెత్తి చెలికత్తె నవ్వినను సిగ్గుచే దలయెత్తదు
కాలివేలితోడ నేలను వ్రాయుచును కాంత తా దలయెత్తదు
పయిట సవరించుచును పాపట దిద్దుచును పడతి తా తలయెత్తదు
మురుగులొత్తుకొనుచు ముక్కరనుదిద్దుచును ముదిత తా తలయెత్తదు
కురులు దిద్దుకొనుచు కొప్పు సవరించుచు తరుణి తా తలయెత్తదు
ముఖముపై చెమ్మటను ముదముతో దుడుచుచు సఖియ తా తలయెత్తదు
రత్నాల హారమును రదనముల గోరుచును రమణి తా తలయెత్తదు
రవిక ముడిగిల్లుచును రాయిడి నొప్పుచును నువిద తా తలయెత్తదు
అట్లుండ చెలికత్తెయంతయును దెలుసుకొని యామె తండ్రికి నిట్లనె
అయ్య నీ పుత్రికకు యౌవనము వచ్చెను అనిరుద్ధుమీది ప్రేమ
కలగాంచి నిత్యమును పలవించుచున్నది కౌతుకము సేయవలయు
అనగాను జనకుండు హర్షంబు మితిమీఱనట్లనే సేతుననగ
ఆ మాట చెలికత్తె యామె యొద్దకుబోయి యంతయును దెల్పగానె
ఆకొన్న మనుజునకు నన్నంబు దొరకినట్లామె సంతోషమొందె
పేదకును లభియించు పెన్నిధి విధంబునను వెలది సంతోషమొందె
దగగొన్న మనుజునకు దాహంబుదొరుకు చందమున సంతోషమొందె
నడియేట మనుజునకు నావదొరకినయట్లు నాతి సంతోషమందె
వడగొన్న సస్యంబు వానదడిసినయట్లు వనిత సంతోషమొందె.

# కుచేలోపాఖ్యానము

శ్రీరామాధిపుడు కుచేలునేలిన - చారు చరిత్రమును
చెప్పెద మోక్ష కారణమైయుండును - వీనులకమృత సారముగా నుండును
సిరులనిచ్చెడి వారిజాక్షుడు - బ్రాహ్మణుని తనవానిగా గై
కొనిన సత్కథ నారయగ నెటి - గింపుమన శుకుడనియె రాజుకు ॥శ్రీరామాధిపుడు॥

ఘనుడు మహాతపోధనుడు సజ్జనుడు - బ్రాహ్మణవంశ సంభూతుడూ
నిత్యానందజనిత మనోల్లాసుడు - వేదాంతభజన మార్గసంభూతుడూ
కామాదిషడ్గుణ విసర్జితయశుడు - కుచేలుడు
దినదినంబును పేదతనంబున - వనములో పండేటి ధాన్యము
తనకు దొరకినకొలది భార్యకు - ఘనముతోడుత నిచ్చుచుండెను ॥శ్రీరామాధిపుడు॥

ఆ విప్రుని భార్య మహాపతివ్రత - పతిభక్తిగల కోమలి
నాధుని మనోభావమెరిగిన శ్రీశాలీ - విజ్ఞాన సంభావము కనుకూలి
శాంతోద్దిత భావశ్రీశాలీ
సావధానముతోడ తెచ్చిన - ధాన్యములనవి బాగుచేసి
.... .... .... చుండెను ॥శ్రీరామాధిపుడు॥

పతిఆజ్ఞమీరక పచనభాగముకొంత - నతిథి జనులకుంచును
పుండిన కొంతపతికి నర్పణసేయును - మిగిలిన తాను హితవుగ భక్షించును
నిశ్చింతచే పతిని గొల్చుచునుండెను - మేలొందెను
కుతుకమున ఈ రీతినుండగ - సతికి నంతట నిరువదేడ్గురు
సుతులుగల్గిరి కడుపునిండా - మెతుకు పెట్టుటకు లేదిక ॥శ్రీరామాధిపుడు॥

పిల్లలాకలిచే మూర్ఛిల్లి అన్నము - తల్లీ యనుచునేడ్వగ
నాయమగుండె ఝల్లుఝల్లున పీడగ - చింతిల్లి తా తొల్లి నోచిననోముగా
దైవము చాలా తల్లడిల్లగజేసెగా - యోచింపగా
ఎల్లవారలు సుఖముచే - వర్ధిల్లుచుండగా నాదుపిల్లల
కెల్ల తిండికిలేక నీగతి - తల్లడిల్లుచుండనేమొకొ ॥శ్రీరామాధిపుడు॥

మదిలోన దిగులొంది మానినిమణి తన - హృదయేశు చేరుచును
పదములచే పొదుగుచు దీనతను - లేమిని తనవదనాంబుజము వాడెను
కన్నీరు విడచుచు నిటుపల్కెను - మృదువుగను
కదలి నాప్రాణేశ యేగతి - పదలు నీ రిక్తాంధకారము
కదసి ఆకలి అనుచు కుర్రలు - నిదురబోవ నన్నుపట్టిరి ॥శ్రీరామాధిపుడు॥

ప్రాణేశా మీరును పంకజాక్షుండొక్క - పాఠశాలనె గూడుక
విద్యలునేర్చి ప్రాణస్నేహము వీడక - ఏవేళ దుర్మానవులను గూడక
శాంతముచే సన్మార్గములు బాయక - మదినోడక
మానసంబొక్కటిగ మెలగుచు - కూడియుండిరటంచు వింటిని
కాన నా ప్రార్థనముగైకొని - దానవాంతకు కోరుమనె సతి ॥శ్రీరామాధిపుడు॥

భూతరక్షకుడు సర్వభూతాశ్రయుడు - స్వయంభూతు డవ్యయు డాతడు
విజ్ఞానప్రభూత భావనయుక్తుడు - సర్వాధారుడాతడె పరిపూర్ణుడు
స్వయంభువాపోజ్యోతిర్మయాకారుడు - విఖ్యాతుడూ
భూతహారు డక్షయు డజేయుడు - పోయి అడిగిన యేదోతీరున
బ్రోచుగాని కృపాతిశయమున - నేచి బాధలుపెట్టడా హరి ॥శ్రీరామాధిపుడు॥

ఏనాటి స్నేహము ఏనాటి బాల్యము - ఏనాటి సాంగత్యమూ
కృష్ణునకు నా కేనాటిబంధుత్వము - నాకూ శౌరికేమి నిమిత్తమూ
శాంతము అతనిచిత్తమె నా భాగ్యము - యోచింపుము
దీనుడను జీర్ణాంబరుడ ధనహీనుడను - జడధారినైచని
మానినీ యాచించుటకు అను - మానమన సతిపల్కె నిట్టులు ॥శ్రీరామాధిపుడు॥

అనుమానమేల సర్వాధారుడతడు - మిమ్మవమానించుట కొప్పునా
మీవంటివారిని మన్నించక యుండునా - మీయెడ స్నేహమును బాయుటకు నెంచునా
తాపసవర్యులని కాక - యోచించునా మనంబున
తనకు భేదముకల్గు నామ - న్ననలుచేయక యుండునా స
జ్జనులయెడ కోపించునా - యేగిన శుభంబు లభింపజేయడ ॥శ్రీరామాధిపుడు॥

అంగనజ్ఞాన ప్రసంగ సంగతులకు - పొంగుచు బ్రాహ్మణుడు
మానిని చెలంగి వెళ్ళెదను నేడు - కృష్ణునిగన్న మంగళంబులు చేకూరు
కానుక నొసంగవలెను వేచూడు - పల్కగ నంత
ఇంగితంబుగ చేరెడటుకులు - కొంగునను ముడిగట్టిబెట్టుచు
రంగశాయిని చూచివచ్చెద - రమణిరో యని చెప్పివెడలెను ॥శ్రీరామాధిపుడు॥

కరిరాజు మకరిచే గాసినొందెటివేళ - కరుణించె శ్రీకృష్ణుడు
నారాయణుడసురకుల సంహారుడూ - గోవిందుడ పరిమిత భవదూరుడు
సర్వేశ్వరుడు శరణాగతుల - కాపాడు పూనినేడు
మీఅలా యరవిందనేత్రుని - చేటి ఈ విధమెఱుగదెల్పిన
గారవంబున సిరులనెల్ల - నిదానముగ సమకూరజేయును ॥శ్రీరామాధిపుడు॥

తాల తక్కోలతమాల హింతాల - కుద్దాలములటు గాంచుచూ
చంపక పుష్పములా - ఘ్రాణము చేయుచు
ఫలభరిత వృక్షము - లెల్ల పొడగాంచుచు
కీరాది మృదుల సధ్వనులవినుచు - మది నెంచుచు
చాలగాను భల్లూక మృగశార్దూల - శరభ మార్జాల జంబుక
చమరిఖడ్గ మరాళపిక బక - బృందములను గాంచుచును ॥శ్రీరామాధిపుడు॥

ఆరీతి బుధుడు సర్వాపాగారణ్యాది - ఘోర వనముల నేగుచూ
ద్వారకకునేచేరుఔ టనుచు - చేరిన కృష్ణుడాయరాదని గుందుచు
అరసిన నన్నుగారవించున పొంగుచు - చెలంగుచు
పొరుడటుల మనోవికారవి - దూరుడై హరిభజన జేయుచు
ద్వారకాపురి చేరిపొడగనె - నా రమేశుని దివ్యభవనము ॥శ్రీరామాధిపుడు॥

పదియారువేల గోపాంగనలాచెంత - పదిలమై సేవింపగా
సత్యాబుషిసంపదలెల్ల నిండగ - నేత్రానందస్పదముగ గన్పించగా
శ్రీదేవి కాస్పదమై ప్రవర్తించగా - మదనజనకుడు
మదనరూపుడు మదనజిత - కమలాసనా సురముఖ్య పూజిత
శ్రీదమంగళమేఘుడగు - శ్రీకాంతు నటగాంచెను విప్రుడు ॥శ్రీరామాధిపుడు॥

కాంచి నిశ్చలుడై యేకాగ్ర - చిత్తమున ధ్యానించి నిలిచెను
కృష్ణుడు బుధునిగాంచి - దిగ్గునలేచెను
లేచి ప్రేమమించ - కౌగిట జేర్చెను
చేరిచిగద్దెనుంచి మ్రొక్కుచు - పల్కెను మదినొల్కెను
ఎంచగా బుధవర్య శ్రమచే - మించి మీరరు దెంచినారని
అంచితంబుగ శౌరిపాదము - అట్టెపట్టె మహాతపస్వికి ॥శ్రీరామాధిపుడు॥

భూదేవ నీకు నీ మిత్రులకు - బుధపుంగవులకు క్షేమమా
వేదాధ్యయనాదులకు సేమమా - అందున్న మిత్రాదులందరికీ కుశలమా
వేచెప్పు భోజనాదులకును లోపమా - యాది కలదా
నీకు నాయెడ ఖేదమా - నీభార్య నీయెడ మోదమా
ఏదికానుక తెచ్చితివో - నాకిమ్ము ఇచ్చినవారికిచ్చెద ॥శ్రీరామాధిపుడు॥

ఆరూఢి భూసురుడటుకులర్పిం - చుటకు అనుమానించుచుండెనూ
జ్ఞానాంచితోదారుడల్లది గాంచెను - విప్రుని కోర్కెతీర జేయగనెంచెను
ఐశ్వర్య సంభారముల గూర్చెను - మేలెంచెను
తనకుగా బుధవరుడు దెచ్చిన - అటుకులొగి నొకచేరెడప్పుడు
తీసి దయతోనారగించె - శివార్పితంబని కృష్ణభగవాన్ ॥శ్రీరామాధిపుడు॥

తిరిగి శ్రీహరి పిడికెడటుకులు - తినబోవ పటుదయా గమనించెను
శ్రీదేవి మిక్కుటముగ - భయమొందెనూ
నాథునిచెయ్యి పటుతరమ్ముగ - పట్టెను
మృదుమధుర సంపుటితముగ - పల్కెను ప్రాణేశ నే
నటకు దాసీరూపమున - ఏగుటకు సమ్మతికలిగెనా ఈ
చిటిపెములు తినవలదు - బుధునకు చేరె మహదైశ్వర్యమప్పుడె ॥శ్రీరామాధిపుడు॥

హితమతివచనములు చెప్పగా - లక్ష్మీపతి మదిమన్నించెను
అబ్బుధునియందతి - దయాన్వితూడాయెనూ
బాల్యచేష్టలెన్నో - ప్రసంగించెను
నారేయి ముదితస్వాంతుడు అయియుండెను - వేకువను
అంచితంబుగ బుధుడు కాలోచితంబులు - దీర్చి శౌరికి
నుతులొనర్చుచు సెలవుగైకొని - మరలినడచెను తనపురమ్మునకు ॥శ్రీరామాధిపుడు॥

ఏమాయె శౌరి మీకేమిచ్చెననిన - మా యింతితో నేమందునూ
తెచ్చెదను ఇంకేమోయని - చూచునూ
శ్రీకృష్ణుడదేమో - వృధాజేసెనూ
కాని సర్వకామితార్థ ఫల - ప్రదాయిని గాంచితిని భా
వించితిని నాకేమి కొరత - యటంచు పల్లియకేగికాంచెను ॥శ్రీరామాధిపుడు॥

ఏది నాయిల్లూ ఏదీ నా ఇల్లాలు - ఇదేవూరనీ జూచెనూ
వైకుంఠము కాదని యోచించెను - లక్ష్మివిభవాలందున గాంచెను
సద్విజుడు నాకేదిసాధనమనుచును - యోచించగా
మోదమున సతిపతినికని - అత్యాదరంబున మ్రొక్కితోడ్కొని
పాదపూజలొనర్చుచును తన - భవనమందునజేర్చె నాథుని ॥శ్రీరామాధిపుడు॥

అమిత ప్రభాపూర్ణమైన గోపురములు - అత్యనుపమా సౌధము
సౌధాగ్రభాగములను - మాణిక్యమ్ములు
మాణిక్యవిద్రు - మద్వార బంధమ్ములు
బంధురకలిత చిత్ర విచిత్రములు - చెప్పగజాల
అమలమై కమలామనోహర - విమలమై సువర్లోక భో
గములతోను మిగుల శృంగారములచే - వెలుగొందు నప్పురి ॥శ్రీరామాధిపుడు॥

హోల్లు లోగిళ్ళు మహల్లు శాలలందు - హంసతూలికాతల్పములు
త్రోవలందు ముఖమల్లు - తివాచీలు
నగలాపెట్టెలు - సందువాలు కుర్చీలు
బెంచీలు నిలువుటద్దములూ - ముఖమాళ్ళు బాలీసులు
వాలుకుర్చీల్ బొమ్మలూ - డోలికలు సుమమాలికలు ర
త్నాల దీపములోన వెలుగూ - నన్నియూనట నమరియుండెను ॥శ్రీరామాధిపుడు॥

కరతోరణాయుతమై నిత్య - కళ్యాణమై భవ్యమయీ ఒప్పెనూ
భ్రాజిత లక్ష్మిసుకుమారా - స్పదమయ్యెనూ
రత్నాలంకార ప్రకటితమై - వెల్గెనూ వెలింగెను
సకలధనరాసులను తాను - నికరము బొడగాంచి విప్రుడు
అకుటిలముగా భార్యతోనిట్లనియె - శ్రీహరిమాయ నిజమని ॥శ్రీరామాధిపుడు॥

ఏలా యీ వైభోగమేలా యీ - ధనరాసులేల యీ సంపర్కమూ
జయా మాయజాలమీ సంసారము - ఘోరారణ్యమున నిల్చునె సౌఖ్యమూ
మోహాంబుధి నోలలాడుచు ఖర్మనా - లేలెమ్మన
జలరుహేక్షణ ప్రాణనాథుని - సెలవుచొప్పున మెలగుటకు కే
వలము నిశ్చలభక్తితో సం - కులము విడచి నటించెనపుడు ॥శ్రీరామాధిపుడు॥

అతిబూటకము నీటియందుపుట్టిన - బుగ్గయనవచ్చునీ దేహమూ
నవరంధ్రనిర్గత దుర్గంధమీ గాత్రమూ - దుర్గంధవాసిత చర్మము ఈ రూపమూ
ఈ జన్మము సతతమా - క్షణభంగురము దుష్టవిహారము
పతితజాలము సిరులె నిజమని - పతనమొందును భక్తి విడచి
సతము వైరాగ్యమ్మె మోక్షము - అతివ నిజమని నమ్మలేమిక ॥శ్రీరామాధిపుడు॥

ఆరింటినెరిగి నైదారుజయించిరి - ఏడు విసర్జించిరీ
రెంటను నిశ్చలారూఢులై యుండిరీ - మూడింటిపై కోరికవెడలించిరీ
నాల్గింట నొకదారిగ - సమకూర్చిరి మేలెంచిరి
వాలలూర్ధ్వవిహార మానస - పూరచారణ చారుమోక్షణా
ధార పద సంచారులై - జడదారులైరి తపోవనమ్మున ॥శ్రీరామాధిపుడు॥

ఇది తీవ్రమిది శాంతమిది హితమిది - సుఖమిది దుఃఖమని యెంచక
నిరాధార విహితములకు జంకక - ప్రాపంచదుర్మద వాంఛలకు చిక్కక
వారింపక మతవిభేదులు .... .... ....
ఘోరకానన - మందు ఉగ్ర తపంబొనర్చుచు
సదమలామయమైన శ్రీహరి - సన్నిధికి జని నిరంతరమందున ॥శ్రీరామాధిపుడు॥

జననుత ఇది కుచేలుని సచ్చరిత్రము - వినినమోదమె కల్గూనూ
వ్రాసిన చాలధనవృద్ధి చేకూరును - చదివిన మోక్షమనుమానింపక దొరకును
తలచిన రోగాన్వితబాధలూ - అణగునూ నిక్కముగాను
హరిసమర్పిత మనుచు శ్రీ హాగ - రన్వయాబ్ధి సుధాకరుడు భూ
సురవరుడు సన్యాసిరాజు - విశుద్ధచరిత్రుడు చెప్పెకీర్తన ॥శ్రీరామాధిపుడు॥

# సుభద్ర కల

సుభద్ర ఒకరాత్రి సుఖనిద్రపోయీ - వో వదినె ఈ రాత్రి కలగంటి నేను
ఏమి కలగంటివే యిందీవరాక్షి - నాతోనూ చెప్పవే నాతీ యీ వేళ
దేవిన్ని దేవర కలగంటి నేను - ఆదినారాయణుని కలగంటినేను
నిత్య మల్లెతోట కలగంటినేను - నిండిన్న ముత్యాలు కలగంటినేను
పట్టె మంచము పరుపు కలగంటినేను - పళ్ళెరాల పచ్చిపసుపు కలగంటినేను
నట్టింట అద్దమ్ము కలగంటినేను - రావిరేకల వార్ని కలగంటి నేను
మద్దికాయల వార్ని కలగంటినేను - పచ్చంగ వేసిన పందిటి కింద
పండిన్న రేకులు కలగంటినేను - ఇంగువ బెల్లమ్ము వెలజీలకర్ర
ఇంతీ నా యింటికి తేను కలగంటి - ఆరగ ముగ్గిన మామిడి పండ్లు
అతివా నా యింటికి తేనూ కలగంటి

*   *   *   *   *

వాకిట వజ్రమ్ము కలగంటినేను - వరుస భోజనాలు కలగంటినేను
కూర్చిన్న ముత్యాలు కలగంటినేను - కూర్చని ముత్యాలు కలగంటినేను
అని చెప్ప ఆ వొదినె కలవిప్పి జెప్పే
దేవిన్ని దేవర నీ తల్లిదండ్రీ - ఆదినారాయణులూ నీ యత్తమామ
నిత్య మల్లెతోట నీవు పుట్టినిల్లు - నిండిన్న ముత్యాలు నీ కడుపుసుమ్మి
పట్టె మంచము పరుపు నీ ప్రాణవిభుడు - పళ్ళెరాల పచ్చిపసుపు అయిదువతనము
నట్టింటి అద్దము నీ లక్ష్మి సుమ్మి - రావిరేకలవారు రాచమరదళ్ళు
మద్దికాయల వార్ని ముద్దు తమ్ములు - పచ్చంగవేసిన పందిరి కింద
పండిన రేకులు తోడబుట్టినవారూ - ఇంగూవ బెల్లమ్మూ వెలజీలకర్ర
ఇంతీ నీ యింటికి కంతదెచ్చేరు - ఆరగముగ్గిన మామిడిపండ్లు
అతివా నీ యింటికీ సారె తెచ్చేరు - వాకిటా వజ్రమ్ము కూతురు సుమ్మి
వరుసభోజనాలు వియ్యాలవారు - కూర్చిన్న ముత్యాలు కూతుళ్ళు సుమ్మి
కూర్చని ముత్యాలు కొడుకూ కోడళ్ళు.

—

# సుభద్రా కళ్యాణము

శ్రీరమారమణుండు శ్రీకృష్ణుడనగ - ద్వారకాపట్టణము తానేలుచుండె
శ్రీకాంతుకృపవెలిగి చెలగుపాండవులు - ప్రాకటంబుగను ద్రౌపదిని పెళ్ళాడి
అంతయింద్రప్రస్థ మనుపట్టణమున - సంతసమ్మునవున్న సమయంబునందు
సురమునివచ్చెనని సురభిపూజించి - అరలేక మ్రొక్కించి - రపుడుద్రౌపదిని
దీవించిలోపలికి తిరగపొమ్మనుచు - యేగురుతోబలికె యెలమి నారదుడు
యింతులకతనమ్ము యెంతవారలును - చింతించి మనసులో చీకాకుపడిరి
సుందోపసుందులు సుందరికొరకు - పోరాడిమడసిరి పుడమిలో తొల్లి
సురభుడు సుందోప సుందులచరిత - వరుసతోయెరిగించి వారికిట్లనెను
ఒక్కొక్కయేడాది ఒక్కొక్కరనగ - మక్కువతోవుండుమని మర్యాదజేసె
ఆతనివరుసలో ఆదేవివున్న - యేతరి మీలోను యెవ్వరైనాను
యేకాంతమెరుగక యేగితిరైన - చేకొని మనస్సులో చెదరకేమైనా
తిరమొప్ప యేడాది తీర్థమ్ములన్ని - సరవి చెరయించమని సమయమ్ముజేసి
అదిచేసి నారదుం డరిగె నాతుణమె - సమయమ్ముజేసి భూపతివేడ్కతోను
ప్రబలమ్ముతో భూమి పాలింపుచుండె - కుంతీతనూభవుల కోర్కెదీపించ
వక్కనాడాపురి వక విప్రునింట - డెక్కరిముచ్చులు ధేనువుల గొనుచు
చనగ నా విప్రుడు సవ్యసాచికిని - మునికొని దీనతను మొరపెట్టదొణగె
ఆయార్తరవములకు ఆ ధనంజయుడు - ఆయుధశాలకు అరుదేరివచ్చె
ధర్మనందనుడంత ద్రౌపదితోను - మర్మిళీయేకాంత మందుండగాను
భూదేవతలువాడిలె పొదిలెధేనువలు - భాసురంబుగ తమ ప్రతిన మతిదలచె
భూసురవరుడుతా పొరయుటలుజూచి - బాధలుమాన్పంగ పరగధర్మములు
అనుచు ఆయుధశాల కరుదెంచెక్రీడి - ఘనములాయుధములు తాదాల్చికదలె
తరిమియాముచ్చుల దండించిపసుల - మరలించి దివిజునకు మగుడయిప్పించె
తమ అన్నకడకేగి దండంబుపెట్టి - మునిసేయు సమయమును మునుకొనిబలికె
యెలమితీర్థములకు యేగెదనన్న - పలికెధర్మజుడంత పార్థునితోను
నినుబాసి వకఘడియ నిలువంగలేను - నన్నుదిగవిడిచి యేరీతిజని యెదవు
కొమరొప్పవచ్చితివి గోపులకొరకు - సమయభంగములేదు చనదగదు అనెను
మౌనిజేశినట్టి మర్యాదలన్నీ - మనముశాయకవున్న మనుజులేమంద్రు

అనుచు ధర్మజుచాత అనుమతీవడసి - చనెను తీర్థమ్ములకు శక్రనందనుడు
గరిమిపెద్దలుపుణ్య కథలుచెప్పగను - ధరప్రదక్షిణమ్ముగా దాచరింపుచును
అంగవంగకళింగ హింగూళదేశ - బంగాళదేశములు పార్థుండు గడచె
మాళవబర్బర మగధకర్నాట - భూములొండొండెకికా రణ్యములుగడచె
అఖిలకోవిదులతో అలవుత్తరమున - మహారాష్ట్ర మని యేటి మండలంగడచె
హరిద్వారములుగడిచె హరివిల్లుగడిచె - కులగిరిపర్వతా లర్జునుడు గడిచె
అక్కడక్కడగలుగు అఖిలతీర్థముల - వేడుకనాడుతూ విజయుండుగదిలె
గంగస్నానంజేసి కడునియమముగను - సంగతివకనాడు సరయునదిచోట
నీమంబుగావించి వున్నయావేళ - కామించి వకనాగకన్యకేతెంచె
కనుమాయకప్పి కవ్వడిదోడుకొని - తనగతినాగలోకంబునకుచనెను
తనయింటనుంచి యాధర్మజానుజుని - అనురక్తితోమసలి రక్తిగావించె
మౌనముమానియా మగువకిట్లనెను - నాగినియిపుడుయీ వరలోకములకు
నేనేల వచ్చితినె నీదుపేరేమి
పూనికతోడయా పలుకులకుబలికె - ఐరావతాకుల సర్పవిభుండు
కౌరవ్యుడనువాడు కలడునా తండ్రి - నాపేరులూచి పన్నగకొమారితను
నీపౌరుషంబులు నీరూపుమహిమ - పనివడి గీతరాగములు మిముబాడ
వినిమిమ్ముకావలసి వేడ్కతెచ్చితిని - నాకోర్కెచెల్లించు నాకేశతనయ
గైకొనుము అనగాను కాంతకిట్లనెను - చపలాక్షినేబ్రహ్మ చర్యాదినీమ
నిష్ఠతోవకయేడు నిఖిలతీర్థములు - చరియింతునని ఒక సమయమ్ముజేసి
పరగధర్మజుతోడ పలికివచ్చితినె
నీమనమ్మున ఆర్తి నేనెట్లుదీర్తు - భామినియనిన నా పద్మాక్షిపలికె
తీర్థయాత్రలుచను తెరువెఱుంగుదును - పార్థివ యిదిపుణ్య ఫలములకుతెరువు
తనయూర్పుతన ప్రాణదానమ్ముకంటె - మరిలేదటంచును మహాత్ములందురుగ
చేపట్టినన్ను రక్షించినమీకు - పాకశాసనివ్రత భంగమెక్కడిది
పరగధర్మచ్యుతి పాంచాలినీమ - సరళిమీరుజేసినా సమయమ్మునందు
అనినధర్మచ్యుతి ఆత్మనూహించి - వనితకోరికదీర్చి మరియిళావంతు
డనుపుత్రునింగాంచి ఆ నాతికొసగి - మనమునవుప్పొంగి మర్నాడుగదిలె
కమలాప్తుడుదయించు కాలంబునందు - క్రమమునక్రీడి గంగానదిజేరె
తనవెంటవచ్చినా ధారుణీసురుల - కర్థములుధేనువులు సహస్రములుపెక్కు
అర్థితోభూసురుల కందందెయొసగె - అడచిమరి కొందర్ని ఆదరువేడుకల

కవ్వడిభక్తితో ప్రణమిల్లి మ్రొక్కె - ఓవిశ్వపాలకా ఓవిశ్వకర్త
ఓవిశ్వరక్షకా ఓజగన్నాధ - నీయందెజనియించు నీయందెపొదలు
నీయడందుఅణగును నిఖిలలోకములు - నాయందు కృపజూపి నన్నురక్షించి
పాయకనాకోర్కె ఫలియింపసేయు - మనిగొనిఅహోబలం ఆవెంకటాద్రి
వలగొని యటుకంచి వరదులనుజూచె - రయమునకావేటి రంగనాయకుల
ప్రియమునసేవించి పిదపదాగదలె - వరదక్షిణమ్ములను కలిగినయట్టి
మిన్నేటిమేటి తీర్థములాడెక్రీడి - మునికొనియటుపద మూడవనెలనూ
వనిపడిమణిపురిపట్టణంబులకు - అరుగుదెంచగనప్పు డాధీశుడెలమి
వరవిక్రముడుచిత్ర వాహనుండప్పుడు - యెదురుగా జనుదెంచి హేమసీతమున
వదలనిభక్తితో వాసవినునిచె - కౌంతేయునిష్టవర్గముఖకుఖాపి
అంతంతమతిపొంగె అర్జుననిజూచి - వరభుజనీవంటి వరునికికూతుర్ని
పరగయిచ్చుటతనకు భాగ్యమ్ముకలిగె - నేనునీకొకవార్త యెరిగింతువినుమా
మానవాధీశ్వరా మావంశముననను - ఘనవిక్రముడు ప్రభాకరుడనేరాజు
తనయులకొరకు తానీశ్వరునిగూర్చి - తపముశాయగ చంద్రధారుండుమెచ్చి
అతనితోవకమాట అరుదుగాబలికె - వశుధేశయిదియు మావంశూలకెల్ల
పొసగగంగవకొక్కక్క పుత్రూడుబుట్టె - ఘనుడనాకిప్పుడీ కన్నికబుట్టె
తనయునిరీతినే తరుణిబెంచితిని - యీలలితాంగికి వుదయించుసుతుడు
వాలాయముగమా వంశమ్మునిలుపు - పొసగపెళ్లాడు తనపుత్రికనెను
కవ్వడిదానికి కడుసంతసిల్లి - నివ్వటిల్లెటివేడ్క నెలతపెళ్లాడె
అనంగజుకేళి చిత్రాంగజనుగూడి - పొంగుచుఅంతనా పురముచెంగటను
అనియర్జునుడుధర అమరులుమెచ్చ - జయ్యానచనుదెంచె జలధితీరముకు
స్నానమ్ముశాయంగ సమకట్టియున్న - పూనియొక్కమునిపుంగవులువిజయ
అలరుయీకొలను మహాదుర్ఘటమున - గళితరగ్రాహసం గళితమ్ములైన
పార్థయిచ్చోటనే బహువిధంబులను - దీపించునవిమంచి తీర్థంబులైదు
సరళితంబైన ప్రసన్నతీర్థములు - లలితభుజంగ పౌలోమతీర్థములు
గళితమైనట్టి సౌభద్రతీర్థముబు - వనరొప్పగా భారద్వాజతీర్థముబు
కారుణ్యమాన్యయా కలికితీర్థములు - ధారుణిలోను ప్రసిద్ధమైనట్టి
శ్రీకరాదుష్టములేలు బల్లిదులెల్ల - చలగియీకొలనులకు చేరవెరుతూరు
ఆయెలసాహసుం డలరతానంచు - ఆయెడసౌభద్ర మనియేటికొలను
పరగప్రవేశించ జలమధ్యముననను - కడునుగ్రగతినివక గ్రాహియేతెంచె

జనుదానితానువుద్దండతాబట్టి - అనినబాహువుల వెలినిబడవేసె
నక్రరూపంమాని నాతియైయున్న - శక్రనందనుడుహాశ్చర్యపడిచూసె
యిదియేమెవోభామ యింతకుముందు - వదలకయీసరో వరములోవుండి
జలచరాకృతిమాని జలజాక్షివైతి - వరయేదియెరిగింపు మనినఅతుణమే
అనఘుడయేమందు అచ్చరస్త్రీని - తనతనకునుకూర్చు దానవాసఖులు
బేరుగనాసమస్త్రీలు ఐదుగురు - జలధిలోవున్నారు శాపమ్ముమోసి
అదియెట్లుయరిగింపు మనినఅర్జునుడు - మృగనేత్రజూచి యమ్ముదిత యిట్లనెను
యింద్రనందనవినవె సఖులమేగురము - యింద్రాదిలోకములు యెల్లగనుగొంచు
సురధిలోకములన్ని చూచుచురాగా - ధరణిపైఘనతపో ధనులున్నయట్టి
కడునట్టియాయగ్ని కల్పునితపసు - పరగ మౌనీతపసు విఘ్నమ్ముశాయ
తలచినయలిగియా తాపశోద్దవుడు - ఘనతమీరగరాని కడుశాప మిచ్చె
భయమునయామౌని ప్రార్ధనశాయ - దయదలచియాతపో ధనుడుయిట్లనెను
సాహసుండెవ్వడీ సరసులోజొచ్చి - బాహువుల మిముబట్టి బైటవేశినను
ఓపినమీశాప ముడుగుపొమ్మనుచు - పోపొండిఅనిన అప్పుడుమేముభూమికిని
చనదెంచనారద సంయమేతెంచె - వినుతమానసుడుమా వృత్తాంతమెరిగి
యతులదయాచిత్తులై మమ్ముదలచి - సతులారయీముని శాపవాక్యమ్ము
మిక్కిలిక్రూరితను విడమాన్పరాదు - గ్రక్కునదక్షిణా ఘనమైనయుదధి
తటమునపంచ తీర్థములుశోభిల్లు - అటుజనినూరేళ్లు అందుండమనెను
వకనాడుఫల్గుణుం డురుతరంబుగను - సకలతీర్థమ్ములూ చరియించవచ్చు
ఘనశాపమోక్షంబు కలుగుమీకంచు - అనిచెప్పినారదుం డరిగెనాక్షణమె
మీరాకకోరగా మీరువేంచేస్త్రి - ఆరయధన్యులం అయితిమి మేము
నరుడప్పుడారీతి నలుగురిసతుల - కరుణించిశాపమ్ము కడతేరజేసె
మగువలవీడుకొని మణిపురమ్మునకు - మగుడనేతెంచినెమ్మదినికొన్నాళ్ళు
అనురక్తివుండి చిత్రాంగదయింట - అనఘుణ్ణిబభ్రువా హానుడనేసుతుని
తరుణికియొసగి యామగువవీడుకొమచు - తిరమందుగోకర్ణ దేవుదరిశించి
అరిగెయవ్వనపార్శ్వ మాయర్జనుండు - చేరువయిచటకి శ్రీకృష్ణుడున్న
ద్వారకాపురమని తగు మునులు బలుక - నీలమేఘశ్యాము నీలాభిరాము
లాలితగుణధాము లక్ష్మీకళత్రు - ఆకంజదళనేత్రు నలరసేవింప
నాకోర్కెలెల్ల కోరగసమాకూడె - జనులచేమునవిందు కన్యసుభద్ర
మధురాక్షిహారిమధ్య మత్తేభగమన - గుణవతియనుచు మక్కువజూడవలెను

జనక నేనాకొమ్మ కనుగొనావలెనూ - యతులనారాధించు అనుచునూ కపట
యతివేషధారివై యాదవేశ్వరుల - భక్తిముక్తిప్రియా పుండరీకాక్షు
భక్తవత్సలు కృపా పరిపూర్ణగాత్రు - తత్తరపడకచి త్తమ్ములోనిలిపె
అక్కడశౌరి సర్వాత్మకుండైన - అక్కడనరుని తలుపంతయుందెలిసి
వక్కరుడే హరి వచ్చెనాక్షణమె - నరుడుహాశ్చర్యపడి నారాయణునకు
సరగునప్రణమిల్లి సద్భక్తిమ్రొక్కె - తెలియగావకయేడు యిది పూర్వపళము
సరళిగగంగాది సకలతీర్థములు - జగతిచరియించిమీచరణములుగంటి
తగునాకు తీర్థయాత్రాఫలముకలిగె - అనిన కృష్ణుడు మందహాసమ్ముజేసి
ఘనతరమ్ముగక్రీడి కౌగిటనుజేర్చి - కూరిమిఅందంది కుశలమ్ములడిగి
ఆరయతనచెల్లె లీమీదిప్రేమ - కొవ్వడి మనసులో కలుగుటయుదెలిసి
నవ్వుతుఅతనితో నగధరుండనెను - నిన్న నే సుతులగని నెలతరంబుగను
యెన్నికతొసన్యాశి వెట్లయితివయ్య - యెరుగుదుము మీవిద్దె లన్నిటినిమేము
కపటవేషాలన్ని గ్రాసాలకొరకె - అనిపలికినవ్వుతూ అతనిదోడ్కొని
చనుతెంచిరైవతా పర్వతమ్ములకు - యింద్రనందనునితో యేకాంతముగను
ఉపేంద్రుండుయెరిగించె యేకమారథము - హరిరీతికడనున్న ఆశైలమందు
ఆతనియుంచి యాయంబుజోదరుడు - చనుదెంచెద్వారకానగరుకు వేగ
కొలువునయాదవా కోట్లుకొలువగను - బలభద్రుతోటి పద్మాక్షుకిట్లనెను
తాళంకసకలయాదవులతోమనము - వాలాయముగరైవతకోత్సవమును
జరపగవలెను యీక్షణమహాయనిన - బలభద్రుడప్పుడా పణిహార్లబిలచె
సంతతమ్మునపురి చాటించమనుచు - సకలవారలకిట్లు చాటించబనిచె
పప్పుబూరెలునెయ్యి పాయసాన్నములు - పప్పుగుకూరలు వంటకమ్ములునూ
గారెలుబూరెలు ఖండమండిగలు - పేరినేతులు బెల్లపచ్చులునూ
అరటిపండ్లునురాజాన్నరాసులును - కననుచితమ్ముగా గంపల్లోవుంచి
ముందరనడిపించె మురవైరివాని - సుందరఘోషణలు సురచిరంబుగను
పడుచులుపెద్దలూ బాలింతరాళ్లు - కొడుకులుకోడళ్లు కూతురళ్ళుళ్ళు
తొకుతొక్కులాడుచూ త్రోవక్రిక్కిరియ - సకలయాదవమహా సంఘముంగదిలె
అంతంత చతురంత యానమ్ములెక్కి - అంతఃపురస్త్రీలు అందరు గదిలె
ఉద్దవుడుసాత్యకి వుభయపార్శ్వమున - బద్ధానురాగులై బలశితముగొల్వ
అత్తరిన్నీకృష్ణు డన్నయునుతాను - కొత్తముత్తెమ్ములా గొడుగులనీళ్ళ
సురలెల్లవెరగంది చూడగానపుడూ - గరుడధ్వజాలంకృతా ఘనరథంబెక్కి

విడువకబలములు యేకముగగొల్వ - జడియకప్పుడురై వతకమునవిడిసె
ఆయచలమ్మునా యాదవులెల్లా - ఆయతభక్తిచే హరిపించి మ్రొక్కి
భాసురంబుగమంచి బ్రహ్మపీఠమున - ఆసీనుడై యున్న ఆ సమయమందు
అంతనక్కడమరీ ఆ సుభద్రయును - పణతియుబంగారు పల్లకీయెక్కి
కొమ్మలుపెక్కురు కొలచిరాగాను - సమ్మతిగవచ్చినా సమయమ్మునందూ
సురుచిరరత్న భాసురభూషణములు -ధరియించియాసుభద్రాకన్నెవచ్చె
పొసగరై వతకాద్రి పూజలు అమర్చి - రసికవాక్యమ్ములూ రమణులూబలుక
వాసవసుతునకు వరునిగాగోరి - ఆ సమయమున మ్రొక్కి ఆ యింతియపుడు
ఆ యింతి మ్రొక్కంగ అటుజూసిచూసి - మనసున అర్జునుడు మరివిన్నవించె
తొలకరి అభ్రంబు తొలకించుమించు - యీలలనలోగాక యిదియది యనగా
ఉండునే యీడు యింతగ రూపుతోడ - వుండునో అనుచు యిట్లొక కొంతసేపు
దమకించి సొక్కి కందర్పు చేజిక్కి - బ్రమయుచు మది వెఱగు పడియుండె క్రీడి
యింతిమోముకు చంద్రుడు డీడాయెనేమి - కుంతలాలకు కలిమి కుశలవంబవును
మగువ కన్నులు నీల మణులాయెనేమి - ముడిబొమ్మ విల్లుగా మోహనాస్త్రములు
సతికుచములుకల శాలయనేమి - అది తిలపుష్పమా నాసికాయుగము
హరిమధ్య దామృగ పతిదాయనేమి - ఫాలంబు ముక్తాంబు బంతిచేనుకము
కోమలి పిరుదుసై కతమాయెనేమి - వామవని మృగముచే వనరథాంగమ్ము
నళిన జంఘలువా హళులాయెనేమి - లలితాంగి పద్మసంగతి మనుతొడలు
అనిపొల్చు సుందరీ తన వైభవమ్ము - కనుగొని పెక్కైన కాంతలతోను
కనుజూచి పలికెనా కమలనాభులు - అనఘాత్మ యతివరులు అతిజితేంద్రియులు
కడుప్రియ మొనరించు కామినీజనము - కనుజూచి నంతలో కాంతింపదగునా
మొదలు సూభద్రపై మోహమ్మునీకు - వదలకనుండు లే వడినెరుంగుదును
పొలతుకల పోనిమ్ము కుశలముల నడిగి - ఘనవిశేషములన్ని కలియనడుగుతును
ఆరోహిణీ పుత్రు ధరితోడ మొదలు - దండ ప్రణామములు తగునాచరించె
నిజముగ యతియని నమ్మెతాళంకి - భజియించి విజయ సంభ్రమమునను మ్రొక్కి
నారాయణాయనుచు నవ్వుచూనరుడు - కరముపట్టుకు అతని కడువేగ యెత్తె
అతనిచే సకల మహాతీర్థ మహిమ - ఉచితంబుగా విని వేగయిట్లనిరి
నీవు చాతుర్మాస్య నియతవ్రతంబు - జరుపుము మా యింట సంయమీ నాథ
అని ప్రియోక్తులుజేసి అతని తోడ్కొని - చనుతెంచె ద్వారకా నగరుకువేగ
బలకృష్ణులపుడు సూభద్రవీక్షించి - యెలనాగ నీ విపుడు యీయతీశ్వరుని

పూజించి మజ్జనా భోజ నుదకముల – వారితో విచ్చలగ వొనరించవమ్మ
అని చెప్పి సన్యాశి నచటనూవుంచి – పనిపినప్పుచుపుండె పద్మలోచనులు
కన్యాగృహంబున కన్యకామణియు – సన్యాశినుంచి పూజావిధి సల్ప
నిత్తెముతో వాసినవి కొత్త బిందెలను – అత్తరిజలకమా యత్తమ్ముజేసె
నెలత నానాటికే పూర్వములుగాను – వెలయక పదార్థములు అమరించిపెట్టి
యే వేళ కామౌని కిష్టమ్ముసైన – ఆ వేళ కొనరించు అతిభక్తితోను
పడుచుతనమ్మునా వణతి సుభద్ర – ప్రేమతో బొమ్మలా పెండ్లిండ్లుజేసె
ఫాలుపైన బంగారు బొమ్మరింటికిని – తళుకైన పొగడంపు ద్వారబంధములు
పచ్చల తలుపులు పొన్నారిగురుపు – అచ్చంపు దంతాన అమరె బొమ్మలును
చిలకల చెలుగులే జీలివ్రాతములు – చిరతపుప్వ్పళ్ళును చెంద్రికామణులు
దువ్వటంబులు తమ్మి ద్వారంబుపట్టు – పువ్వుల వాసనలు బొమ్మపొత్తికలు
బంగారు బొమ్మలకు బాగుగాగట్టి – శృంగారములు సేయ చెలులతొగూడి
నీరజాతుని పెళ్ళి నెమ్మిబాడుచును – కూరుమ్మితో బూజ గుండల్లుదెత్రు
చెలగి సుభద్రకు శుభమునేడనుచు – అత్తించి కప్పడి అతివకిట్లనెను
యిందు పురుహూతుండు యవ్వరే నీకు – అందమైనట్టి ఘడీయారమ్ము యేది
అన్నిని నేర్చినా ఆశ్రితుడనేను – ఉన్నాను యీ పెళ్ళి వనరజేయింతు
పప్పు బూరెలు నెయ్యి పాయిసాన్నములు – వప్పేటి భిక్ష తన కొనరంగగద్దు
తెరవద్ద గూర్చున్న దేవేంద్రసుతుడు – సరసిజ వదనతో సరసమ్ములాడు
భామ కర్పితముగా పలుకుమర్మములు – భావించి సతిబాశి పరగదమకించె
చేడె లక్షణాలు చెప్పేదనంచు – కలికి మిన్నలలేమ కరము జేపట్టె
వజ్రోజమైనీకు వట్రువైయుండు – నక్షత్ర సౌభాగ్య మన్నింటనమరు
పద్మరేఖలు నీకు భాసిల్లుననుచు – పద్మాక్షిపాదములు భావించిచూసె
వియ్యమ్ములొందెదవు వెలదిరోనీవు – ముడిపడెహారములు ముద్దూలగమన
చిక్కువిడుపింతునా చేడెసుభద్ర – మక్కువ నా మీద మరువకే మనసు
వేదోక్త యుక్తిగా యింతుల పెండ్లిండ్లు – కడుశాయవలెనంద్రు ఘనశాస్త్రులెల్ల
నాలుగోదినమునా నాగవిల్లనుచు – శోభనముజేతమా సుఖకరంబుగను
పానుపుటింటికి పరగబొమ్మలను – కడువేగబంపుదమ కమలాయతాక్షి
అనుచు కందువమాట లతివనుబలుక – నివ్వెరుగుపడివుండె నెలత సుభద్ర
మరి పెక్కువిధములా మాయలాతపసి – యెరగక తను చాల వెరగందెనబల
గ్రక్కున శ్రీకృష్ణుకడకు యేతెంచి – యెక్కడి యతివరుడు యితడు వోయన్న

జూడసహ్యాతగాదు సోగగాడింక - ఆడెటిమాట లిట్లని పలుకరాదు
భిక్షజేసి తన్ను పిలిచిన క్షణమె - పీక్షించి పొత్తులో కిపుడెరమ్మనును
సరసమాడగవచ్చు సారెకు తనతో - సురభివయ్యారంపు చూపులేజూచు
అనిన కృష్ణుడు నవ్వి ఆ యతీశ్వరుని - వినయమ్ముతోబిలచి వేగయిట్లనెను
అయ్యా మీ పనులన్ని ఆగడాలాయె - తొయ్యలి మాతోను దూరుగాజెప్పె
కడగి మా చెల్లెలు కడుముద్దరాలు - వెలలేని దుర్భాష లేమియాడితిరో
పొలతి పెట్టినట్టి భోజనాన్నములు - వదలకభుజియించి వదిగుండవలెను
కడగి కార్యములు సమాకూడినా దనుక - వదిగివకచోట వూరికె వుండవలెను
నాతొ జెప్పినట్టె నాతిసుభద్ర - అక్కడ బలభద్రుదు కతివయరిగిస్తే
యీ ద్వారకాపురియం దుండకుండ - కోపించి మిమ్మిపుడు తావెళ్ళగొట్టు
అనిచెప్పి సన్యాశి నచటను వుంచి - తన చెల్లెలును సుభద్రా కన్యజూసె
యామని నినుబలికె యిపుడు సన్యాశి
నాతోటి చెప్పినా నాతినేబోయి - యిటువంటి పలుకులు యింతి ననదగునా
ముద్దరాలోర్చునా ముప్పె మాటలకు - అని మట్టుపెట్టి యిప్పుడు నే వచ్చితిని
నళినగంధి నీ తెరువు రావెరచునమ్మ - వచ్చిన అప్పుడే వనిత నేబోయి
విరిచికట్టివేశి యపుడె శిక్షింతు - నవరత్న ఖచిత సింహాసనం మీద
ప్రియముతో కూర్చుండె పీతాంబరుడు - శిరసు వంచుకువున్న చెల్లెలిని జూసి
చిరునవ్వుతోను శ్రీకృష్ణమ్మ బిలచె - అమ్మరాముద్దుల గుమ్మరావమ్మ
కొమ్మ నవకెంపుల బొమ్మరావమ్మ - ముత్యాల సరములా ముద్దరాల రావే
చిత్తజుని బాణమా చెలియరావమ్మ - మచ్చకంఠీరావె మా దరికి రమణి
పువ్వువింటిబోణి శరమరావమ్మ - బంగారుపెట్టిలో శృంగారకన్య
అమృతంబు తేటల అరవిరిమొగ్గ - పచ్చి పగడమ రావె భామరోరావె
పక్షులుజేరిన్న వృక్షమ్మరావె - వేగుచుక్కరావె వెలశినందమ్మ
వెలయు చంద్రికలోను విరిజాజిరావె - వెలయ ముజ్జగములకు వినుతయినట్టు
స్త్రీలకెల్లబిరుదు చెలియరావమ్మ - అని గారవంజేసి అన్న బిల్వగను
పశిడిసలాకువలె పణతి సుభద్ర - బలుపువ్వు గుత్తులూ బలువాని వెడల
వెలపువ్వముల తులశి ఆడుచందమున - సన్నగొండలయేగు సవరింపుకొంచు
చిన్నారుగౌదీగ జవ్వాదునడుము - హంసనడకలతోను అతివసుభద్ర
అల్లిమెల్లిన వచ్చె అన్నముందరికి - భద్రేభగ మనసూ భద్ర రమ్మనుచు
తోయజాక్షుండెత్తి తొడలపై నుంచె - ఆ బాల వంటి కన్నులనీరు జార

కరములదుడెచెనా కమలనాభూలు - నీలాలవంటివి నెలతనెరిగురులు
వాలారిగోళ్ళనూ వడిచిక్కుదీసె - ముత్యాలుకూర్చినవి ముగిదనెరిగురులు
అత్తరినెరిగోళ్ళ అమరించెకొప్పు - శిరసు ఆఘ్రాణించి చెల్లెలిని జూచి
శేషకొప్పటుబెట్టె చలువమరగాను - చెక్కి లినొక్కి చెల్లిని గారవించి
మత్తేభగమననా మనవిచేకోవె - ఏడుయేడుపద్దానుగు లోకమ్ములన్ని
అరిసిచూచితి నేను ఆదికాలమ్ము - యిటువంటి సన్యాశి నెటుజూడలేదు
అటుగనక నీతోను యిటుజెప్పవలెను - ప్రమథగణములతోను పార్వతీపతియు
సతిజూడవలనొచ్చి చాలంగవచ్చె - ఆ కాలకంఠుడు అటువోడిపోయె
యీతని గెలువంగ యవ్వరికివశము - వుపవాసములచాత పళ్ళల్లడస్సి
యేమియెరుగనివాని వలెవున్నవాడు - కార్యములకోసమై కడుచిక్కుపడెను
కార్యములుజేసి గ్రక్కునబంపవలెను - సుదతి యీతడుజూడ సురపతిసుతుడె
మతిలోను నీకు అనుమానమ్ము వద్దు - యప్పటివలెనీవు యీ యతీశ్వరుని
తప్పకపూజించు తరుణిపొమ్మన్న - అన్నమాటకుతాను అంగీకరించి
గ్రక్కునమత్తేభ గమన తాలేచె - హంసనడకలతోను అతివసూభద్ర
అందెలుమ్రోయగా హారములుగదుల - ముత్యాతీవచ్చెను మౌనియింటికిని
ఆవనజాసన అరసెయామౌని - పూబోణి యామౌనిపూజింపుచుండె
యిందువలెగావించి వెయ్యివిధములును - పొందుగాయితనికి భుజియింపపెడుతూ
వడికముగ అన్నినివలెనెభుజియించి - కడుడస్సియుండేటి కారణమదేమొ
అడిగెదననిబూని అతివ సూభద్ర - తనమనసులోవున్న తాత్పర్యమల్ల
కడు అడిగెదననుచు కాంతసుభద్ర - జోకతోకమ్మ కస్తూరినలుగిడె
జాజిగొజ్జంగనీట జలకంబులాడె - రీతైనవకవింత రేఖచూపట్ట
జవ్వాజిపదునిచ్చి చంద్రకాంతంపు - దువ్వెనమెరుగార దువ్వెనన్నదుమ
పాపిటముత్యాలు బాగుగాదీశి - చూపుట్టకొప్పువెంచుక జారదురిమె
విటులమన్మధుడేయు విరిమొగ్గతూపు - నటుల గుమ్మడిగింజ నామమ్ముదీర్చె
వుమ్మెత్తపువ్వాలె వుతికీనచలువ - కరములగొనితెచ్చి కాంతకిచ్చినను
చంద్రకావిపావడా రంగుమీద - చెంగువిడిచికట్టెనూ సుభతిసూభద్ర
పావిళ్ళపైనంత పడనగువింత - రేకుభావులకొంగు రింగుగావేసె
అతివగట్టినచలువ కమరించినట్టి - చంద్రకావిరవిక చలువమర దొడిగె
భమిడిముత్తెములు వప్పేటిపూర్ణచంద్రు - రవిలించువిమలతా టంకములబూనె
మృగపతిగగుచంత ముచ్చంబుపలుకు - జిగిమించిమణుల మించులతాళిగట్టె

పుంజాలదండదాపున సేవళమ్ము - రంజిల్లభన్న స్వరములు క్రీడించె
తళుకుమించినసంది దండలమీద - యిరువంతతాయితలు నెరిబుట్టగట్టె
తిరుగుటుంగరముపూ తీరినవామ - కరమున ముద్దుటుంగరము ధరియించె
కుంకుమకస్తూరి కూర్చినయట్టు - హోమకస్తురిబూసె కోమరారుమేన
కరకంకణములబై ఘనతమీరగను - రామచిలుకను వుంచె రాజసముమీర
పచ్చయ్యపోకలు పండుటాకులును - మత్స్యాక్షికర్పూరవిడెమ్ము జేసె
గొప్పకన్నులకాటు కొప్పుగాబెట్టి - తెప్పించియద్దమ్ము చపలాక్షిజూసె
హంసనడకలతోను అతివసూభద్ర - అందెలుమ్రోయగా హారములు గదుల
మత్స్యాక్షివచ్చెనూ మౌనిసన్నిధికి - బృందావనంమీద కూర్చున్నవాణ్ణి
కమలాప్తుబి బంబు గతినొప్పువాని - బాలెందుబాయగల పదిరెండవగల
రాణించుపూర్ద్వపుంద్రములుగలవాని - వొప్పుచంద్రునిరాహు వొడసినరీతి
కర్పూరనెరివాలు గడ్డంబువాని - భమిడిమల్లియతావి తావిగైకొనగ
భవిరిజుట్టులు నటాక్షమాలకరణి - మునుపొత్తుము త్తెంపు మొగ్గలకరుణి
తళుకైన శుభ్రదంతమ్ములవాని - అలవడి తులసిపూసలపేర్లతోను
గవిగూడహరినీల కాంతిగేలించు - తమ్మిపూసలపేరు తనకునై జంపు
సొమ్ముగా వక్కింత జూపట్టువాని - ధాత్రమ్ములోమంచి కలుగువైడూర్య
సూత్రమ్ములోబ్రహ్మ సూత్రంబువాని - యిన్నివిధమ్ములా వుండేటిమౌని
చూచిసంతోషించె సుదతిహర్షమున - చిత్తమ్ములో మనసు చిగిలించగాను
వుత్సాహమునమేను వుప్పొంగుతుండె - పలుకుపలుకుకు తేనె లొలకంగనపుడు
పలికెనువకమాట పద్మాక్షిమౌని - అయ్యామిరేదేశ మరసిజూచితిరి
యెయ్యడమినామ మెచటవుందూరు - పరగ యింద్రప్రస్థ పట్టణంబనగ
పరగసంపదలచే పరగంగవలయు - ధీరమానసులు కుంతీసుతులుయేగూరు
ఆరయకుశలులూ అయియున్నవారా - కోరిమేనత్త కొడుకులైదుగురు
వారికికుశలమా వరమునీచంద్ర - ఆరాజవరులలో అర్జునుండెలమి
ధారుణితీర్థములు దరిశింపనేగె - అనిముందునేవింటి అతడుతామగడి
చనుదెంచుటెరుగుదుర సంయమీనాథా - అనిప్రియభాషలా అతివ బల్కగనూ
మౌనమ్ముతోవుండె మరికొంతసేపు - వోమునిపుంగవా వోమునిచంద్ర
పుంగవిభంగనిర్జర దోషహరణ - పాదోజిగన్నకా పదభక్తియోగి
నాథయనాథనా మనవిచేకోవె - అని చిలకబలుకులా అతివబలకగను
విని చెవులపండుగై వెలదికిట్లనెను - పద్మాక్షి నీతోను పలుకవెరతూనె

పలికినపలుకులు అతిగురుతు జేతు - దూదులెక్కించితివి తోయజాడునకు
అటుగనక నీతోను పలుగ వెరతూనె - పడుచుదనమున నేను పల్కినపల్కులు
మనసున బెట్టుదుర మరిరాజరుషిని - లేమ భాషించియో లేనవ్వుతెలసి
భామతంత్రమున రహస్యములబుట్టించి - చక్కనిముఖపద్మ సారెమోహించి
తెక్కరికుచములు తెగవిచారములు - మొలకనవ్వులు కెమ్మోవి కెంపులు
తళుకొత్తుమెరుపులు తరుణిచెక్కిళ్ళు - ఆ యింతిచక్కదన మటుజూసిచూసి
తలయూచి విజయుడూ తావూరుకుండె - యిటువంటిచోటునకు యీకోడెగాడు
అటుదిక్కుగలడని ఆపరింపుచును - పచ్చవింటివాడు పైపైనిబడుచూ
అచ్చుగపూవింట అతనిబడవేసె - బృందావనంమీద కూర్చున్నమౌని
కందువదెలియక కడమూర్ఛబోయె - ఓరామచిలుక నే నేలపలికితినె
బడలికలుగొనిమౌని పవళించినాడు - ఆరామచిలుక గ్రక్కున యేగుదెంచి
కుందనపురెక్కలతో కునిసియాడుచును - కంఠమున పెట్టినవి కంఠమాలికలు
మాణిక్యదీప్తులై మరివెలుగుచుండ - పార్థుని భుజములాపై వాలి జిలుక
జావతోలెమ్మన్ని బడలికలుదెలిపె - మోవికంఠన జేశి ముద్దులుపెట్టి
యిదిమేమి విజయుడా యీరీతినుండ - యీ లేమపలికిన యట్టిపలుకులకు
యీరీతి పరియాచకము శాయతగున - యలమి దుర్యోధనుల కిచ్చేదనన్న
కడుతాపమునపొంది కాంతనిన్నడిగె - అర్జునునిపై మనసు అలరుతుండగను
నిర్జలగతిచాత నిన్నడిగెనింతి - కడగికార్యములుసమకూడినా దనుక
వదిగివకచోట వూరికెనుండవలెను - యింతినిదోలుకొని యింద్రప్రస్థముకు
యెంతేసివేడుకల యేగుదూగాని - కమలాక్షి పెంచినా కడుముద్దుచిలుక
అడగవలెనానిన్ను అన్నిబుద్ధులకు - మందిమేళమ్ములకు యిదివేళగాదు
అనివచ్చి కరకంకణములపైవ్రాలె - చెంచలపడిమతిని ఆ చకోరాక్షి
తరలాక్షితలపోసి తానడిగెనింతి - యేసరసనున్నాడె యలమియర్జునుడు
యేపుణ్యభూములకు పోయియున్నాడె - యెచ్చోటతీర్థమ్ము లాడుతున్నాడె
వినుపించు నువునాకు యిపుడుతెలియగను - కోమలియిద్దరం గోకర్ణమందు
కూడియాడుంటిమె కొన్నాళ్ళు అచట - శయనభోజానములు వకచోటమాకు
చెలికాళ్ళమైయుంటిమి చెలగికొన్నాళ్ళు - యలమి అర్జునురూపు యరగించలేనె
గురుతులెరిగించవే గోరోజగంధి - మందారదారుడూ మాయన్నచాత
విందుగానెన్నడూ నే చూడలేదు - నిరివెంట్రుకలనాడు మృగరాజమధ్యముడు
గరగరనివాడు చక్కనివాడు అతడు - గొప్పకన్నులవాడు కోదండగుణగణాంకములు

బాహులుగలయట్టి బాహుపరాక్రముడు - భమిడిగడ్డంవాడు పన్నిదంబిడిన
యెసభుజంబులవాడు యెంతొవింతతడు - మొలకనవ్వులమోము ముద్దుకారంగ
దీర్ఘబాహులవాడు దేవేంద్రసుతుడు - వెన్నున మచ్చగల విభవంబువాడు
మెరుగుచామనచాయ మేనుగలవాడు - వెన్నున వెయివేలు వినదాగవచ్చు
చిగురొత్తు చంద్రికా చెలగిపాదములు - యీవిధంబెరిగించ యంతయునరుడు
నీవుగుణాఢ్యుడవు నీకెవ్వరెదురు శ్రీహరిచెల్లెలవు - శృంగారవతివి
యేపున నీభాగ్య మేమనావచ్చు - నీవుకిరీటికి నెలతవయితేను
భావింప అతనిది భాగ్యమేగాదా - నిన్నుదయజూసిమీ అన్న శ్రీకృష్ణుడు
నిన్నతనికీవలశి పన్నెనీవిధము - నీకోర్కె నీతలపు నిగమగోచరుడు
చేకొనిసమకూర్చు చింత యేమిటికె - మత్యాసతి నీకొరకు మరునిచేజిక్కి
యిచటకొన్నాళ్లు యిట్లుండవలసె - పూనినీవడగంగ బొంకయేమిటికె
మానినినేనిపుడు మరియు అర్జునుడ - అలరుగాంధర్వ వివాహంబురాజ
వరులకుగలదంద్రు వరధర్మవిదులు - అని తమకింపుచూ అతడుచెయిచాప
ఘనమైనసిగ్గుతో కాంతతానిలచె - యక్కడ సన్యాశి యోగీశ్వరుడితడు
నిక్కమే యితడితో నేనేలనిలచి - యేలమాటాడితినో యితనితో నేను
యేమనిపలుకునో యిపుడు సన్యాశి - ఆడవారిబుద్ధి అది ప్రళయమనుచు
వేడుకచెప్పినా వినసేరనైతి - అనిమోసపోయితిని అచ్యుతునిమాట
వినివూరకుండకా యేలపలికితినో - అనుచు భయపడుచున్న అతివనుజూసి
ఘనతరచెయిపట్టి కదలకటునిలిపె - కాటుకకన్నీరు కాలువైపార
యేటికె యీవగపు యలనాగనీకు - యేడిచెదవేమిటికె వెలదిరో నీవు
యీవిధంబునవున్న యేలదయరాదు - మన్మధునిబాణాన మరిచిక్కుపడ్డ
వోభామనినుజూసి నోర్వంగగలనా - చూడసన్యాశిని సుందరుడతాను
కామినిభోగములు కలిగుండుతనకు - యంతవాడనుగాను - యింతిరోనేను
యెంతలేదనిచూడ కింతిరోతన్ను - ఉన్నతోన్నతమతుడు ఉత్తమోత్తముడు
యెన్నిలోకంబులకు యెక్కువైనాడు - అజానుబాహుండు అచ్చుతానంతు
వేదాంతవేద్యుండు యిచ్చెనన్నాడు - నాతినీవుచిన్న నానాడెనాకు
యేతెరంగునమామ యిత్తునన్నాడు - మేనత్తమేనమామా పిల్లలకును
శీలముగలదటవె చెలియరోమనకు - చిలుకను బంపితివి చెలియముద్దులకు
ఘనతరంబుగ యీడ కలసికూడుటకు - సిగ్గేలబడియెదవు చిగురాకుబోణి
యెగ్గేలనేమనకు వెలదిరోయిపుడు - చెక్కిటచెయిబూని చింతయేమిటికె

అక్కరతోమాటాడవే దొడ్డదాన - వేరుడసూరుడ విక్రమన్మథుడ
ధీరుడభోగేంద్ర దేవేంద్రసుతుడ - యింతసాహసపరుడ విక్రమన్మథుడ
సంతోషమునలేచి సఖియచేబట్టి - కాంతమన్మథుబాణ కాకలకువోర్వ
చేకొవె తన్నిపుడు చేపట్టవేతన్ను - అనుచుదగ్గిరవచ్చి ఆలింగనమ్ము
ఘనతరశాయ అప్పుడుభీతిబొందె - తల్లియుదండ్రియు తగినబంధువులు
బల్లిదులన్నలూ పాయకున్నారు - వారియాజ్ఞచే వరియింపకిచట
యీరీతిపనులైన యిందరూనగరా - హరినీకుయిచ్చుట అనుమానమేల
దొరలు యేనుగనెక్కి దిడ్డిదూరుదుర - పిన్నలుపెద్దలూ ప్రియముతోడుతనూ
వద్దికతో రుక్మిణి వదినవున్నాది - ధర్మజుతమ్ములు ధర్మాత్ములండ్రు
యేతెరంగున నవర యిపుడుధర్మములు - కాదునామాటయు కల్లగాదంచు
వేళనివచ్చిని యిపుడె అచ్చుతుడు - వచ్చినఅప్పుడే వారిజాక్షుండు
యిచ్చలనవ్వడా యిదియగ్గు అనడా - మనసున నవ్వడా మన్మథునితండ్రి
వినికోపగించడా యేమందు అతని - తాళమద్దిలపెట్లు ధ్వనులువెలుగంగ
వేళనెవచ్చిని యిపుడె అచ్చుతుడు - అదెరామకృష్ణులు యిదవచ్చెరచును
బెదిరించిపరుగెత్తి పడతితాజనెను - యింతికినాపేరు యేలజెప్పితినో
కాంతయీలోపలికి గ్రక్కుననుబోయె - మరునిపుత్త్రడిబొమ్మ మాటికినేడిచట
పరిచర్యవొనరించ భావించదొక్కొ - యేమిసేయుదునిక నింకవకసారి
కమలాక్షిచనుదెంచి కరుణించదొక్కొ - కొమ్మలతోగూడి గుజ్జనాగూళ్లు
ఆ మగువవండియో వడ్డించదొక్కొ - యెన్నటికి యీపెళ్ళి యీడేరునింక
వున్నలిగకూటములు వనగూడవలెను - వున్న యీతెరువంత వుకుపీధరుండు
పన్నుగ తనమతిని భావించిదెలసె - తన మందిరములోకి తనకి తాబోయి
వెలదిరుక్మిణిజూసి యిట్లన్నిబలికె - నెలతనీమరదలు నేడు సన్యాసి
బలవైరిసుతుడౌట పరికించితెసె - మలయచువచ్చితన మందిరమునందు
దొరకొన్నసిగ్గుతో తాజారదింతి - అరసియన్నముపెట్టు మనుచునీమించి
సురభివినోదములు చూచుచుండె - అంతనక్కడమరి ఆసుభద్రయును
పణతియుబంగారు పట్టిమంచమున - హంసతూలికాతల్పమందు పవళించి
ముత్యాలచెలుగుతా ముసుగుపెట్టుకొని - అతివచిత్తములోన అర్జునునిదలచి
మగువతనమనసులో యిట్లన్నిపలికె - ధీరమానసుడైన దేవేంద్రసుతుడు
చేరివినయమునతన చెట్టబట్టినను - వినిపించుకొని కదూ వేగవచ్చితిని
వెడయక తనమనసు యట్లుండెనొక్కొ - గాకనేవడబడితె కడుచులకతనము

యీకడయిందరికి యల్లితముగాదె - అతిమోహనాకారు అఖిలాస్త్రవేది
సతతసత్యవ్రతుడు సద్ధర్మపరుడు - అంతర్యామితాను అఖిలజీవులకు
సంతతమ్ముగవున్న సర్వేశుడితడు - జలలాతునకుప్రియుడు చతురమానసుడూ
చెలియమామేనత్త చెలువంపసుతుడు - అన్నిటఘనుడుగన కతనిపైతనకు
వున్నదిమనసింక వుడపంగరాదు యెరగాడానేనేల యింతచింతించ
యిరవైన యీపెళ్ళియీడేరునింక - ఆ రుక్మిణీదేవి అక్కడకేగుదెంచి
అన్నరోలెమ్మన్న అర్జుననిబిలచె - మజ్జనభోజనం మగువగావించి
అలుగుమరదలుకడకు అతివచనుదెంచె - హంసతూలికాతల్ప మందుగూర్చుండి
ముత్యాలచిలుగుతా ముసుగుసళ్ళించె - యిదియేమిసూభద్ర యీరీతినుండ
కనులేలమూసితివె కలకంఠినీవు - శిరమేలవంచితివె చంద్రాస్యగమన
చెక్కిటచెయిబూని చింతయేమిటికె - వాలుగన్నులనీరు జారయేమిటికె
వనితసన్యాశినే వలవేసుకొంటివి - రామావతారాన రమణిరోనీవు
శాంతవై జన్మించి చెల్లలైతీవి - ఆరుషిశృంగుని అటులోనుగాను
వలవేసుకొంటివే వనితరోనీవు - దేవేంద్రసుతుదృష్టి తెగువతోదాకె
డిష్టితీయింతామ చేడెరోనీకు - తెగవాలుగన్నులా దిష్టించిచూడ
ఆతనిచాతనెగాని అదిమానదనెను - చిడిమిడికోపమున చేడెసూభద్ర
అమృతబింబాధరిని అవతలకుదోసే - కరకంకణములచేయి ఘల్లుఘల్లునగా
ఘట్టిగముసిగిడి కాంతతాబలికె - యింతినూ పలికినా యీపలుకులన్నీ
త్రైలోక్యపతితోను తావిన్నవింతు - యిప్పుడేచెప్పవే యిభరాజగమన
మీయన్నభయము నా కెంతయినలేదు - జలకమూడుదురావె చేడెసుభద్ర
చలువగట్టుదురావె చందన్నగంధి - భుజియింతువురావె పుత్తాడిబొమ్మ
వెలదినీకుపెళ్ళి వేగజేయింతు - అనిబుద్ధిజెప్పుతూ ఆయంబుజాక్షి
నిండుకౌగిటదెచ్చె నెలతరుక్మిణీ - పాపిడిబొట్టు సొమ్ములుచక్కదీర్చి
కొప్పుదువ్విమొగలి పూలజడలల్లె - అతివయేమెరుగదు అమెననకండి
సత్యభామానవ్వి జలకంబులమర్చె - రాజంపతగినట్టె పెళ్ళినేడంచు
రాధనవ్విపట్టు చీరతాగట్టె - వయిసుసన్యాశికడ వనితపోదగునా
కాళిందిఅనినవ్వె రవికొప్పదొడిగె - భద్రయేతెంచియో భామకొప్పూనా
పువ్వుదండలుజుట్టి పూబోణినవ్వె - యింద్రసుతుదగ్గరకు యింతిబోదగునా
లక్షణఅనినవ్వె తిలకంబుదీర్చె - అగ్నిజిత్తేతెంచి గంధంబులలది
అతివదేహంబెంతొ అలసెననినవ్వె - జాంబవతియేతెంచి జలజలోచననూ

చెయిబట్టితాదీసి చెలియనిట్లనెను - అటుగనకయిటుపంటి సుందరాంగనగా
సన్యాసిమోహించ సంకోచమేమి - సన్యాసియేమయి ననసన్న జేసినాడో
పూబోణిదేహంబు పుల్లసిల్లింది - అనియిట్లు యీరీతి యింతులుబలుక
ముత్యాలగొడుగులు ముగిదకు బట్టిరి - పనిపలికినప్పుచూ అతివలందారు
పొలతికిభుజియింప పెట్టిరావేళ - బుజియింపకున్న శైబుద్ధిలేదంచు
కరముగడిగీతాం బూలమ్మునిచ్చిరి - తరుచుమాటలుసఖియ నాకుపద్దనుచు
వెలదితోలుకుపోయె శ్రీరుక్మిణపుడూ - యింద్రసుతుడొటయెరి గీరీతినున్న
పవళించియున్న భలభద్రుడెరిగీని - సన్యాసులకుభితు సవరించినట్లు
సఖియలతోగూడ సందడినెపుండు - అతనికినుపుభితు అనపంగరాదు
ప్రియసఖులతోచెప్ప వద్దుమాయమ్మ - అనిబుద్ధిచెప్పుచూ అతివతోడ్కొని
ప్రేమతోడుత పెద్ద నగరుకేతెంచె - అంతఃపురంబులో దేవకీదేవి
బలురేలరేవతీ భామలుగొలువ - పట్టుపరుపులుమీద పద్మాక్షులుండి
చదరంగమాడంగ సఖియచనుదెంచె - తాళంకసరిసపిణి గద్దెలేదెచ్చి
పీటలుపెట్టిరా ప్రేమనంతింత - రుక్మిణిహస్తంబు పట్టిమరదలిని
ముందరికిరాదీసె ముదముతోనపుడూ - సుదతిసూభద్రనాతో జూదమాడు
ఓడినమీయన్న లిచ్చేరుధనము - ఆటకునువోడ్వి నప్పుడేకోటి
దివ్యమాణిక్యాల భూషణములిమ్మ - ఆటకునేవోడి నప్పుడేకోటి
దివ్యమాణిక్యాల ధనరాసులిస్తు - మాయన్నబలరాముచెట్టనుపట్టి
సొమ్ములుయిచ్చేది దొడ్డపందెములా - ఆటకునేవోడి నప్పుడేకోటి
దివ్యమాణిక్యాల ధనరాసులిస్తు - ఆటకునువోడ్వి నప్పుడేకోటి
దండములుబెట్టురా ములకునేజూడ - అనియిట్లుయీరీతి సుభద్రపలుక
తల్లిదేవకినవ్వె తనయపలుకులకు - చెయిపట్టి ముందరికి రాదీసుకోని
సుదతిసూభద్రశిరసాఘ్రాణించె - యెట్టిజాణవుగదవె యింతిసూభద్ర
అటుగనకరారాజు కిచ్చేరెనిన్నూ - సూర్యకళలొప్పేటి దుర్యోధనూడు
అధికచక్కనివాడు అనగవిన్నామె - దివ్యకిరీటమాం ధాతలుగొలువ
రారాజుకిచ్చేరె రమణిరోనిన్నూ - అనియిట్లుయీరీతి యింతులుబలుక
దిగ్గునతాలేచె శ్రీరుక్మిణపుడూ - హరికడకుబోవలెను అనుచుతాలేచి
తాంబూలాలందుకుని తరుణిచనుదెంచె - సుందరిజనములు వెంటగొలువగను
హరిద్వారనగరుమం దిరముజొచ్చెలక్ష్మి - అనిపలికిచనుదెంచె విదర్భతనయ
ఘనమైనయిందిరా మందిరమ్ములకు - ఆదినారాయణుం డఖిలాండమూర్తి

అండజునిపానుపున అతడుండగాను - యింతిధరియించినవి యలమిసొమ్ములును
రంతులుశాయగా రమణేగుదెంచె - తాటంకములదీప్తి ధవళింపగాను
నాట్యమాడుతువచ్చె రమణిఅక్కడికీ - కొమరాలుకొప్పునా గొజ్జంగదండ
నటనతోపీపునా నాట్యమాడగను - యింతిపయ్యెదలోను యేకాంతముగను
ఆచక్రవాకములు అతివ హారములు - కోవిలస్వరములా కొమరారు అపుడూ
చిలకపలుకులతోను శిరివిన్నపించె - పుండరీకాక్షుడా పురుషోత్తమూడ
మురవైరివందితా మువ్వగోపాల - యింతకాలంబునీ వెరగనియట్టె
కవ్వడినేచేది కాదుధర్మంబు - హరిఅంత వారితలు పంతయుందెలసి
వరుసతో దేవకి వసుదేవునకునూ - సారణప్రద్యుమ్న సాత్యకులకునూ
ఆరూఢవిజయుకు అర్జునితెరువు - ఆయింద్రసుతుమీద ఆసుభద్రకునూ
యివ్వరకవ్వడీ యీసుభద్రకునూ - చెలగివివాహమ్ము శాయవలెనంచు
సురపతి హరిషించె సురగురుండత్తి - అలవధూవరులకూ అనుకూలముగను
లలితలగ్నమున మిధునలగ్నమ్ము పెట్టి - హావిరుడుకళ్యాణ హోమమ్ముశాయ
కనకాస్యపరబ్రహ్మ కర్త్యయ్యినిలచె - అచటనుత్తయిదువలు ఆఅరుంధతియు
శశియురుక్మిణిసత్య భామయునుచెలగి - చెలగిపేరంటములు చేయుచునుండ
చెరకులు తరిగిరి శుభకరంబుగను - జలకమిద్దరికీని సరుగుననుఅమర్చి
దివ్యాంబరమ్ములూ దివ్యమాలికలు - దివ్యభూషాణములు దివ్యగంధములు
ధరియింపజేశి వాయిద్యధ్వనులుహాొసగ - గరుడగంధర్వులూ గానములుబాడ
అలరడమరిగియో ఆ శంభురాణి - అతివబూజంచెను ఆ సమయమందు
అఖిలలోకారాధ్యు డన్నగావలెను - సురపతిసుతుడుతన పతిగానువలెను
కరకంకణములచేయి ఘల్లుఘల్లనగా - అతివబూజించెను ఆసమయమందు
కదిశెను లగ్నమ్ము కన్నెదెమ్మనిన - చనుదెంచెఅరుంధతి సంభరమ్ముగను
పషిణినవరత్నాల పావాలుపెట్టి - మిసిమితోయదిపట్టు మేనుతగగట్టి
చేరుచుక్కయుబొట్టు చంపననటింప - తాటంకములదీప్తి ధవళింపగాను
కయిదండలివగాను కాంతకిరుగడల - కందర్పురాణితోడుకయేగుదెంచె
పట్టిరితెరనడుమ పషిణిజోతులును - పట్టుకొనిపాడుచూ పడతులిరుగడల
ధవళించిచేసినవి సన్నముత్యములూ - శాసనబ్రాలపుడు చేడెలటుజల్ల
మంగళాష్టకమ్ములూ మహారుషులుజదువ - మంగళసూత్రమ్ము మానవికిగట్టె
జీలకర్రబెల్లమ్ము శిరసుపైనుంచి కాంతకు తలంబ్రాలు పోసెవేడుకల
గుత్తంపుదోశిట ముత్యంబుప్రాలు - నళినాక్షివుంచెనూ నరునితలమీద

ఆదరముగసుభద్ర కాయర్జునునకు - వేదోక్తమునపెళ్లి విష్ణుండుజేసె
ఘనమకుటంములు కవ్వడికివొసగి - అనురక్తిచిత్తుడై హరివీడుకొలిపె
యిభరాజగమననీ యింతితోడ్కొని - రథసముతోను యింద్రప్రస్థమునకు
అరుగుము నీవని అలరువేడుకల - సరసకుండేగె అంతర్ద్వీపమునకు
అలిగేటివేడుకల అలుగుమరదలిని - హేమపీఠంమీద యింతితానుంచె
దీవించిఅక్షతలు శిరసుపైనుంచి - ముత్యరత్నమ్ములూ ముగుదవడినుంచె
సిగ్గూనుమురిపెమ్ము చెలరేగగాను - వద్దికతోవచ్చెతన వదినముందరికి
పశిడిసలాకువలె పణతిసూభద్ర - పాదపద్మమ్ములకు ప్రణమిల్లిమొక్కె-
మొక్కినమరదలిని మొగికవుగలించి - అక్కడదీవించె అతివహరషమున
శతకోటిసూర్య ప్రకాశములదీప్తి - మకుటముధరియించె మరియుఅర్జునుడు
వినయభయప్రియోక్తు లావిజయుడప్పుడు - దండప్రణామములు తగనాచరించె
నీరజాతునిరాణి నిత్యకళ్యాణి - దారిద్ర్యవినాశి దయగల్లతల్లి
పాండునందనల పోషణకర్తవమ్మ - కృపగలిగి రక్షించు కువలయానేత్రి
సత్యకృపాచార సత్యాచారిత్ర - సత్యముతప్పని సద్ధర్మపరుడ
సతతము నీవల శ్రీకృష్ణుభక్తి - కలిగుండుమీ యెల్ల కాలంబునందు
అనుచు దీవనలొసగి ఆ యాదిలక్ష్మి - మన్మధునికన్నట్టి మరువంపుమొలక
మకుటముబట్టి కవ్వడిలేవనెత్తి - కవ్వడిజూసి యాకాంత యిట్లనెను
మేనత్తకొడుకన్ని మందిమేళమున - చనువునవొకమాట సఖియబలికినను
మనసునబెట్టకుమి మరిధర్మపరుడ - ఆదరణకలిగుండు అంతరంగమున
చనువిచ్చినాడన్ని సఖియనీవిభుడు - పలుమారుమాటలకు బోబోకుతల్లి
పురుషులనమ్మంగ పొలతి వినరాదు - తలక్రింద కృష్ణసర్పంబులై యుండు
అనిబుద్ధిచెప్పుతూ ఆయంబుజాక్షి - అనుగుమరదలు జూసి యిట్లన్నిపలికె
హడలనేటికె మాయమ్మసుభద్ర - అత్తయనీకుమే నత్తయునుగాద
పాంచాలినీయందు పక్షమ్మగద్దు - చిత్తమెడగాకుండ శాయవే పనులు
వింతవారెవ్వరే వీరిలోనీకు - బావమరుదులు చాల భక్తికలిగిగుంద్రు
నిన్నంపి మీయన్న నిలువంగగలరా - కందువ యిప్పటికి గానంపెగాని
యిప్పటికిబోయిరావె యిభరాజగమన - నావద్దనేవుండు నాముద్దుగుమ్మ
కోరికలు కొనసాగె కొమరారనీకు - యింద్రనందనుగూడి వేంచాయవమ్మ
అరిగినపిమ్మటను ఆధనంజయుడు - రథముపై బెట్టుకొనీ రమణినప్పాడు
అలరుయీూక్రమమునా అచ్చోటువెడలి - బలచేదిసుతుడు సూభద్రదోడ్కొనుచూ

పోయేటివేడుకల పురిగాచివున్న - ఆయడబాహు బలాఢ్యరిపులైన
సమరసూనుడు కృతాశ్యంశుడనెవాడు - శరధికిఖూసవ్య సాచినితాకి
వోరోరిపాండవా వుద్దండవృత్తి - మూరామకృష్ణులూ లేకుండజూసి
యీలేమ దోలుకొని యెందుబోయెదవు - తాళంకుశౌర్యములు తలచవేమతిని
పోలతిని యిటుదించి పోరోరినీవు - బలునారసంముల పడవేయుదమనిరి
అనిన ధనంజయుడు అతిదర్పముననూ - ఘనసరశరము చక్కగ యెక్కుబెట్టి
శరములు వానిపై సరగుననుగూల్ప - సరకుశాయక కృత శ్మంశుడాదిగను
దొరకొని వాడుమరి తూపులనువేయ - నరుడప్పుడెరగందె నానాస్త్రతతుల
ఘనగోపురమ్ములూ ఘనసౌధములునూ - ఘనగిరి వనముల ఘనతరమ్ముగను
కిరిశిబాణములు క్రిక్కిరియంగవేసె - అమరేంద్రనందనున కా సమయమందు
రమణి సూభద్ర సారథ్యమ్ము నడిపె - విజయముచేకొని వెలదియును తాను
నిజపురి పద్దతికి నెమ్మితో జనిరి - నెమ్మితో చనతెంచె రామక్రిష్ణుండు
తమ్ముణ్ణిజూచి భలభద్రు డిట్లనెను - యేమికార్యం గలిగె యిందనక నీకు
మానవెన్నటికిని మందిమేళములు - ఉగ్రుడై కోపించె టన్ననూ జూసి
కపటనాటకధారి కలిపె నొకమాయ - నాగమల్లాతీగ రతిమల్లితీగ
కలసిపెనుగుతువున్న కడువింతజూస్తి - అచటసభావరులు అతిరభసముననూ
పొసగించి అర్జునుని బహుపరాక్రమము - భీమాదినిర్ఘోష భేరిరవంబు
రామాదియాదవా ప్రకరమ్మునందు - యెరిగింప చారులూ యీ విధంబరసి
చనుచనుదెంచిరా హరికడకువారు - మతిలోనువక్కింత మనలగైకొనక
పదపడినరుడు సూభద్రతోడ్కొనుచూ - పోయెటివేడుకల పోయెకాబోలు
అదెపట్టితెచ్చెదం యిదపంపుమమ్ము - అని పెక్కుభంగులా అందరూబలుక
విని వారిఅందరికి వేగయిట్లనెను - హరిహరయగుమాతకుం డరయ నాక్రీడి
ఘనవరదాంచిత కదనాస్త్రవిభుడు - అనఘుడు ధర్మజ్ఞు డతినీతిపరుడూ
బలవంతుడాతడూ బలశస్త్రవేది - అటుగాక ద్రోణునికి అలరుశిష్యుండ
కదనంబులోవాని కదయంగవశమా - యెదిగినకన్యకా యింటిలోవున్న
మనము శాయకయున్న మగువపెళ్ళాడె - తనమేనమరదలిని తానుగొనిపోయె
వలదనియవ్వరికి వారింపవశము - తలచ నీపనులకు ధర్మమేయనుచు
అపుడు ఆకృష్ణుడూ అందరికి బలికె - జలజాతుమాట యింతేకానియనుచు
అపుడూరకుండిరీ యాదవూలల్ల - చపలాక్షిగూడుకొని చరితాత్ముడగుచు
వావిలినాద్వైతవనమందువిడిసె - వెలయగరయమునా విడిచెసూభద్ర
చూచియిట్లనివలికె సురరాజసుతుడు - యీ చందములబోతె యిపుడుశ్రీకృష్ణ

యేమనిపలుకునో విరసమ్ముతోను - గోపాలసుతులతో కూడిముందేగి
ద్రౌపదికని మ్రొక్క తరుణిపొమ్మన్న - తనపతిపంప యింద్రప్రస్థమునకు
వనితప్రవేశించె వరుసనావేళ - కుంతికి కృష్ణుకూ కూర్మిమ్రొక్కిననూ
సంతసింపుచును పాంచాలి దీవించె - వనితనీపతి వీరవరుడాయనేమి
ఘనవీరపుత్రుణ్ణి కాంచుపొమ్మన్న - అనుచుదీవెనలొసగ ఆసమయమందు
ఘనవినుతుడు ధనంజయుడు ఆవేళ - చనుదెంచిద్రైన్య భాజనమొప్పజేసి
దొరకొన్నవేడుకల కుంతికిమ్రొక్కె - ఆలరు అన్నలకు సాష్టాంగమొనరించి
గరిమితోదమ్ములను కౌగిటనుజేర్చె - పార్థుడన్నలకు వృత్తాంతమ్ముదెలిపి
తీర్థయాచనయాత్ర తెరువెరింగించె - అన్న అత్తరికృష్ణు డుచితాత్ముడగుచు
అన్నయుతానునూ యాదవులుగొలువ - యొకపేదవలెపాయ యువిదసూభద్ర
సుభతినియాలాగు చూచుచుందూరో - అనివడివాటుగా అన్నకుదెలసి
అలుగుచెల్లెలికినీ హారణములుగొంచు - మగువలతోగూడ మదిమదినుండి
గరుడవాహనుడు అక్కడప్రవేశించె - వనమాలికెదురుగా వచ్చెధర్మజులు
మునికొనివసుదేవు మ్రొక్కెవృద్ధులకు - అందెందిమ్రొక్కంగ ఆవసుదేవు
కందర్పజనకులను కౌగిటనుజేర్చె - యింతులకు తగినట్టి విడుదులూవొసగి
అగణితసంతోష మగుచు మహోత్సవము - ఆరామకృష్ణులూ అర్జునుడుమొదలు
భూరిసమ్మదముగా బూజంబుగుడిచి - యీరీతి దినములు యిటునాళ్లు జరిపి
చేరి కృష్ణుడుతనా చెల్లెలికినపుడూ - లక్షగుర్రంబులు లక్షయేనుగులు
అక్షయబలవంతు లవ్వీరభటులు - కాంచనమహిడా వికాసహస్త్రములు
అరణములుగాయిచ్చి రాపాండవులకు - చేరి కుంతికి పాంచాలికిబనిపి
మగువలతోగూడ మదిమదినుండి - పొగడందు ద్వారకాపురిప్రవేశించె
అప్పుడు ధర్మజులు అతిసంభ్రమముగను - తప్పకపాంచాలితో విన్నవించె
యింద్రనందనకు సూభద్రకీవేళ - శోభనముగావించు శుభకరంబుగను
ఆనతిగై కొని అపుడుపాంచాలి - వేవేగయత్నమ్ము లింతితాజేసె
వొప్పైనబంగారు వుప్పరిగలోను - కర్పూరవాసనలు క్రమ్మరించగను
సాంబ్రాణిదూపంబు చాలగవుంచి - గంధవడిదీయించె కలియసంతాట
హారియులీలాటకం అన్నినిరాసి - చిత్తరువునిర్మించె చెలియపాంచాలి
పుత్తడిబొమ్మలా పొసగునాలుగుల - దిక్కులా మాణిక్య దీపములువెలుగ
బంగారు తరికోళ్ళ పట్టిమంచమ్ము - అందనబరిపించి అమరించెసజ్జ
యిరుగడల తలగడలు యిమ్మళిగజేర్చి - బంగారు సురటితా పొలతితావుంచె
సన్నగిరిమల్లీలు జాజిమల్లీలు - బొడ్డుమల్లెలుచాల నిండపరిపించె

గంధమువోకుడక కస్తురోకుడక - పువ్వులపొట్లాలు పొలతితావుంచె
పువ్వుల పొట్లాలు బుక్కపుట్లాలు - అత్తరు పొట్లాలు అతివతావుంచె
బంగారుగిన్నెతో పన్నీరువుంచి - బిందెలనింపించె గంగపుదకములు
వెయ్యిదీపంబులు వెలగంగనపుడూ - గొచనలు దీయించె గాజుస్తంభాల
యీరీతిపనులన్ని యిచ్చోట జేసి - చనుదెంచెపాంచాలి సంభ్రమమ్ముగను
భద్రేభగమన సూభద్ర రమ్మనుచు - చేడె శృంగారమ్ము చేయుచూనుండె
పసుపూసిమజ్జనం పన్నీటనాడి - నెరిబోసికట్టెనూ ధవళవస్త్రమ్మూ
అతివగట్టినచలువ కమరించినట్టి - చంద్రకావిరవిక చలువమరదొడిగె
విసనకర్రలవారు యిరుగడలవిసర - పొసగినంతట నార్చె పొలతి తన శిరసు
రశికవిరులు వశించినవి రమణులుతేగ - వేలాంగిరేకులా వప్పమరబెట్టె
విదియచంద్రుడుమోము నుదయించునట్టు - తీరైనకస్తూరి తిలకమ్ముదీర్చె
మూడువేలుజెయ్యు ముక్కెరబెట్టె - నాల్గువేలుజెయ్యు నానుమెడవేసె
పదియువేలుజెయ్యు పతకములుబెట్టె - వెయ్యివేలుజెయ్యు వెలశెహారములు
అనమాళ్ళపాయిసం ఆవూలనెయ్యి - పొలతులిద్దరుగూడి పొత్తారగించె
కరములు గడుగుకొని కాంతలిద్దారు - కర్పూరపు తాంబూలం వప్పుతోవేశిరి
సవ్యసాచినిబిలచి ధర్మనందనుడూ - సెజ్జకుయేగుమని తా నానతిచ్చె
విజయుడు పానుపున వేడుకతొ వుండి - సూభద్ర రాకడకు చూచుచువుండె
స్వాతివానకు ముత్తె మెదురుచూశినట్టు - యదురుచూచుచువుండె యింతిరాకడకు
మురయుచు సూభద్ర మరి సిగ్గుతోను - అడుగిడకావుండె అటుకొంతసేపు
అడుగిడకావున్న అతివనూజూసి - నవ్వుచు పాంచాలి యిట్లన్ని పలికె
నాల్గునెల్లు భిక్షు అమరంగజేసి - యిప్పుడేటికి సిగ్గు యిభరాజగమన
మేలిమిగలవాడె మేనత్తకొడుకు - కూరిమిగలవాడె కొమరాలనీకు
వేదనగల విభుని విరహాగ్ని రతుల - పోదెచేసినరీతి పొదివెచెంద్రికలు
పట్నమ్ములో వారు ప్రహారిదిరిగేరు - పణతిరొ పదహారు ఘడియలటు జనెను
అని బుద్ధి జెప్పుచూ అయంబుజాక్షి - జోడుచిలకలవాలె సవుతులిద్దారు
చెల్లెలిని దోడుకొని నెయ్యమ్ముతోను - చనుదెంచె పాంచాలి సంభ్రమమ్ముగను
విజయుడి పానుపున వేడుకతొవుంచి - తలుపులు మూయుచూ తరలాక్షిజనెను
వెయ్యి కిరణమ్ములూ వెలిగేటి విభుని - చూశి పాంచాలి చంచలపడెను మతిన
యేమి వస్తువలైన యీవచ్చుగాని - ప్రాణేశు నిచ్చితా బ్రతగంగరాదు
ధనధాన్య మేమయిన యీయవచ్చుగాని - ప్రాణేశునిచ్చి తా బ్రతకంగరాదు
అఖిలాండకోటి బ్రంహాండనాయకులు - ఆజ్ఞకు వెరచి నే నపుడూరకుంటి

మానముగా చేటి మాధవుండతడు - మానసంరక్షకుడు మదిన యేమనునో
భద్రాయనేమి సూభద్రాయనేమి - అక్కచెల్లెళ్ళలో అరమరే లేదు
ముద్దు చెల్లులు సూభద్రాయనేమి - అన్న కిద్దరమీద అరమరే లేదు
అనుచు చిత్తములోను అచ్యుతుందలచి - పవళించె పాంచాలి పానుపుపైన
మురయుచు సూభద్ర మరిసిగ్గుతోను - మాటలాడక దివ్వె మాటులకుజనెను
కొనలు నిక్కగవేయు కుసుమాస్త్రమనగ - బొమ్మలు నిక్కగవలా పులమాపుజూసె
అలమోహనాకారు డటుచూచుసెరిగి - లజ్జించిసిగ్గుతో రమణి తలవంచె
కుందనపు బొమ్మవలె కొమరారివున్న - అందు జనుదెంచి కరమటు వేగబట్టె
నిబ్బరపు గతిచాత నెలతనూబట్టి - అబ్బరమ్ముగ కౌగి టదుముకొనిదెచ్చె
తొయ్యలిని తొడలపైన నెయ్యముతోవుంచి - పగడపూలాదండ పొలతికిజుట్టె
కెమ్మోవి నొక్కుతూ కమలనేత్రూడూ - తీరైన కస్తూరి తిలకమ్ము దీర్చె
బంగారు సురటిచేపట్టికిరీటి - అంగనకు విశిరెనూ అటుకొంత సేపూ
ముద్దీయ సిగ్గునా మొగమటుబెట్టి - పూబోణివిభునికి పూసె చెందనము
సన్నపూల సురటి సఖియచేపట్టి - అర్జనుకు విశిరెను అటుకొంతసేపు
చిగురుటత్తమ్ములా చేడెసుభద్ర - ప్రాణేశు పాదములు పణతితావత్తె
యల్లలోకమ్ములూ యేలినయట్టి - వల్లభులతోడనే వనిత జన్మిస్థివి
నీ పాదములసేవ మేము జేయవలెనే - మా పాదములవత్త మగువనీకేలె
యంతటివాడైన యేగజేంద్రుడు - మావటీడకు యిందు మరివుండుగాని
బలిచక్రవర్తిని పాతాళాన త్రొక్క - వామనుడై బుట్టె వసుధమీయన్న
పొట్టివానికిగల్లు పుట్టిడుబుద్ధూలు - యిట్టి బుద్ధూలుజెప్పి అంపెనా నిన్ను
అని తేనియంబ్రోవు అనియంబ్రోవు - చనుదెంచెమెల్లనే చనుగాలి కొదగె
పానకమ్ములుదాగి పళ్ళారగించి - కర్పూరపు తాంబూలం వప్పుతోజేసిరి
అనిన కృష్ణునిపేర ఆధీశుపేర - వినినాసుతూపేర విఖ్యాతుపేర
ధరణిలో హేమాద్రి తనయుడప్పన్న - గురుభక్తి తిమ్మక్క మధుభక్తిరతియు
మలయుచుపూర్ణా సుభద్రా వివాహం - యవ్వాగు పాడినా యవ్వరూ విన్నా
ఆయురారోగ్యములు ఐశ్వర్యములునూ - ధనధాన్య సమృద్ధియు తరగకయుండు
కృష్ణజె కృష్ణజే క్రిష్ణమ్మజేజే - అష్టసౌభాగ్యములు యిచ్చి రక్షించు
రామజె రామజే రఘురామజేజే - రాముడనును మమ్ము రక్షించుకొమ్ము
గరుడజె గరుడజే గరుడవాహనుడ - కాళంగిమర్దనుడ కాశి రక్షించు
యక్కువ క్రిష్ణనే నేమి నిన్నడుగ - చక్కని వైకుంఠ పదవి మా కిమ్ము.

---

# సుభద్ర సారె

చిత్రంపు పాంకోళ్ళు రత్న బొంగడల్లూ - అర్జును దొడిగానే ఆ పడకటింట్లో
నడిమి నాలుగుదిశల నవరత్న నేతా - తల్లాపుదిక్కునా తామార నేతా
కాళ్లకడ దిక్కునా కలవెండి నేతా - పట్టెమంచం పరుపు తెక్కములు పెట్టి
పాన్పుమీద పవళించె పద్మనాభూలు - ఆకిదుగో పోకిదుగో అడకత్తెరిదుగో
సున్నంపుకాయిదుగో చుట్టియ్య వేమే - ఆకేల పోకేల అడకత్తెరేల
సున్నంపు కాయేల చుట్టియ్యానేలా - అనగ పార్థుడు నవ్వి అతివకిట్లనెను
కుంచముతో కుంచెడు కొలిచి ఇచ్చిరిగా - కొలత పళ్ళెరాలు పెట్టి మీవారు
మానెతో మానెండు కొలిచి ఇచ్చిరిగా - మారుకట్టు చీరలు మనకు మీవారు
తవ్వతో తవ్వెండు కొలిచి ఇచ్చిరిగా - తలంటు గిన్నెలు పెట్టి మీవారు
పున్నమ్మనాడైన బూరెలొండుకుని - పుణ్యుడా రమ్మని పిల్చిరె మీవారు
అమాస్యనాడైన అట్లు వండుకొని - అల్లుడా రమ్మని పిల్చిరె మీవారు
కనుమునాడైనాను గారెలొండుకుని - కాముడా రమ్మని పిల్చిరె మీవారు
మా వాళ్ళు పేదవాళ్ళు మా కేమి గలదు - పెట్టగల పెద్దింట పెళ్ళాడితేను
అచ్చటలు ముచ్చటలు అన్నియును జరుగు - అతివ పల్కులు విని గుడ్లెర్రజేసి
మాటకు ప్రతి మాటలాడుతావటవె - ఎడమ మీసం దువ్వి పాదాలు ఎత్తి
పాంకోళ్లతో తన్ని పక్కున నవ్వె - గోలుగోలుమని గోడపై కొరగె
ముత్యాల కన్నీరు ముక్కుకీ దిగెను - చేదెవతి కన్నీరు చెక్కిళ్ళ దిగెను
భోగావతి కన్నీరు బొడ్డుక్కి దిగెను - మానవతి కన్నీరు మడములకు దిగెను
కళ్ల కాటికతీసి కరడానపెట్టి - పళ్ల ఎఱుపుతీసి పళ్ళేన పెట్టి
వంటి సొమ్ములుతీసి భరిణెలో పెట్టి - మాసిన బట్టగట్టి మడుగుల్లుదాచి
మువ్వలా ముద్దుణ్ణి చంకబెట్టుకుని - గంటలా కాముణ్ణి చెట్టబట్టుకొని
వెళ్ళెనే సూభద్ర అన్నవాడలకు - వంటింట్లో వదినెల్లు చల్లచేయంగ
వాకిట్లో వారన్న నిద్రశయనించె - అంతిపురిలో వదినె ఎదురుతావచ్చి
ఆడబిడ్డను చూచి అతిజాలిచెంది - నిద్రబోతున్నావు నీలవర్ణుండ

నీ చెల్లి వచ్చింది నిద్రలేవయ్యా - నా ముద్దు చెల్లెలా యేమె సుభద్ర
ఏనుగలు వుండంగ గుర్రాలు వుండ - పౌండాలు వుండగా పల్లకీలుండ
బంటూలు వుండంగ జానిసెలుండ - కాని నడకలతోను వొంటరిగ నీవు
విడిబడీ వచ్చుటకు ఒరగడ్డమేమె - నూరువేలు చెయ్యని అన్నలుండంగ
నూరుకోను సనెకలుకి ఏవాడపోదు - పదివేలు చెయ్యన్ని అన్నలుండంగ
పసుపుకొమ్మడగంగ ఏవాడపోదు - కుంచముతో కుంచెడు కొలిచి ఇచ్చిరిగా
కొలత పళ్ళేరాలు పెట్టి మీవారు - మానెతో మానెండు కొలిచి ఇచ్చిరిగా
మారుకట్టు చీరలు మనకు మీవారు - తవ్వతో తవ్వెండ్రు కొలిచి ఇచ్చిరిగా
తలంటు గిన్నెలు పెట్టి మీవారు - పున్నమ్మునాడైన బూరెలొండుకుని
పుణ్యుడా రమ్మని పిల్చిరె మీవాళ్ళు - అమావాస్యనాడైన అట్లు వండుకుని
అల్లుడా రమ్మని పిల్చిరె మీవాళ్ళు - కనుమునాడైనాను గారెలొండుకుని
కాముడా రమ్మని పిల్చిరె మీవాళ్ళు - పుల్లిరుసు మాట్లాడి పురుషుడూ నన్ను
గుడ్లెర్రగాజేసి పాదాల తన్నె - హాడలుచూ వస్తినీ అన్న నీ కడకూ
చెల్లెలిని వోదార్చి చేరంగదీసి - కంట తడిబెట్టకు కాంతరో నీవు
తూర్పున్న వున్నాయి చూడి ఆవుల్లు - అవి గోనె చెల్లెలా అరణంబు నీకు
పడమటా వున్నాయి పాడి ఆవుల్లు - అవి గోనె చెల్లెలా అరణంబు నీకు
ఉత్తరాన వున్నాయి మదపుటేనుగులు - అవి గోనె చెల్లెలా అరణంబు నీకు
దక్షిణాన వున్నాయి తురుపు గుర్రాలు - అవి గోనె చెల్లెలా అరణంబు నీకు
కుదురు మీదున్నాయి గుండు బిందెల్లు - అవి గోనె చెల్లెలా అరణంబు నీకు
గూట్లోను వున్నాయి కంచుగిన్నెల్లు - అవి గోనె చెల్లెలా అరణంబు నీకు
అటకమీదున్నాయి అంచు బిందెల్లు - అవి గోనె చెల్లెలా అరణంబు నీకు
భరిణెల్లో వున్నాయి పతకముల పేర్లు - అవి గోనె చెల్లెలా అరణంబు నీకు
సావిట్లో వున్నాయి కావడిపెట్లు - అవి గోనె చెల్లెలా అరణంబు నీకు
దండేన వున్నాయి వెల్ల చీరల్లు - అవి గోనె చెల్లెలా అరణంబు నీకు
పెట్లోన వున్నాయి పట్టు చీరల్లు - అవి గోనె చెల్లెలా అరణంబు నీకు
రత్నాల కోళ్లదీపట్టె మంచమ్ము - ముత్యాల జాలరూ పచ్చదోమతెర
వారంపు సొమ్ములూ మందసమ్ములు - తోపూల భామలూ జానిసలు వీరు
ఇవి గోనె చెల్లెలా అరణంబు నీకు - అనుచు విష్ణుదు ఇచ్చి సతుల కడకంపె
ఒకొ్కయింటి వదినె వెళ్ళివస్తాను - వొయ్యారి కామన్న వెళ్ళిరావమ్మా
రెండోయింటి వదినె వెళ్ళివస్తాను - చిన్నారి నా తల్లి వెళ్ళిరావమ్మ

మూడోయింటి వదినె వెళ్ళివస్తాను - ముప్వాల్ల ముద్దుణి యెత్తుకొనిరమ్మి
నాల్గోయింటి వదినె వెళ్ళివస్తాను - నవ్వుల్ల నాంచారి వెళ్ళిరావమ్మ
అయిదోయింటి వదినె వెళ్ళివస్తాను - ఆటల్లకామమ్మ వెళ్ళిరావమ్మ
ఆరోయింటి వదినె వెళ్ళివస్తాను - అన్నగల చెల్లెలా వెళ్ళిరావమ్మ
ఏడోయింటి వదినె వెళ్ళివస్తాను - యెండీన ధాన్యమ్ము యెత్తూకపొమ్ము
ఇంటివాసాలన్ని బండిపై వేసి - ముంజూరు వాసాలు ముట్టించిపొమ్ము
ఇల్లూ విరుచుకుపొమ్ము ఓ ముద్దుగుమ్మ - వండీన వంటకము కట్టుకొనిపొమ్మి
కాలి మట్టెలజోళ్లు తీసుకునిపొమ్ము - కట్టుకొన బట్టా ఒకటీ ఉంచకుము
అనిన గుజగుజలాడి అతివదుఃఖించి - అన్నరో వింటివా ఆలిమాటల్లూ
కొన్న బానిస అంటె కొదువేమి మనకు - మన అమ్మ కొన్నాది మాయమంధరను
పదవే ఓ సూభద్ర పంపించి వత్తూ - పల్లకీ యెక్కించి పరమాత్ముడపుడూ
నవరత్నాభరణాలు పట్టెమంచములు - ఆవులూ అవుదాలు మేలందలములూ
కాసాలు బానిసలు కలవిఅన్నియును - కానుకలుగా యిచ్చి కమలాక్షుడంపె
సిరిసంపదలుగల్గి స్థిరముగానుండి - అర్జునుడు సూభద్ర యెలమితోనుండ
ధరణిలోగలయట్టి దంపతూలంత - పాటపాడిన విన్న ప్రబలులై యుంద్రు.

# మార్కండేయుల వారి జననము

పార్వతీవల్లభా పరమేశవిభావ - శరణు సర్వేశ మీ చరణములుగంటి
విష్ణ్వాదిదివిజులూ వినుతులూసేయ - విఘ్నేశకరుణతో వీడింపుమమ్మ
మాణిక్యభూషణా మహితాస్యరాణి - వాణివీణాపాణి వరమిమ్ముమారు
రమణీయ మార్కండేయ చరిత్ర - విపులసౌభాగ్యంబు విన్నవించెదను
కావించు ధర్మార్థకామమోక్షములు - భావించి శివునికి పరమహర్షమున
సంతానవర్ధనం సంతోషకరము - అపమృత్యుపరిహార మారోగ్యకరము
పాపవిమోచనము పరమపావనము - పాటించియిదివిన్న పరమపుణ్యములు
ప్రాపుదాపైయుండు పరమేశ్వరులు - కలవుగౌరీశ్వరుల కథలుయెన్నియున
ఇలలోన నీచరిత్రకీడులేదండ్రు - బహుతీర్థయాత్రలు బహుధ్యానములను
బహు తపోజపముల ఫలమిందుగలదు - విశ్వపతి చరిత్ర వినిన పాడినను
విశ్వనాధుండిచ్చు నుపదేశపదవి - మునులెల్ల సూతుని ముందుపూజించి
ఘనుడుతానమ్మని ధేనుడిట్లనెను - హరుడనయెట్టిదో యాదిశంకరులు
తెలియ మార్కండేయు లేవిధము గాంచిరి - చావుపుట్టుకలవి సర్వకాలమ్ము
జీవులకెల్లను సిద్ధమైయుండు - తనచావు యేరీతి తప్పించుకొనుచు
తనువ శాశ్వతమని తనలోనెతెలియ - కాలునిజంపి మార్కండేయులకును
ఫాలలోచనుడెట్లు ప్రత్యక్షమాయె - ఇదిమహాచిత్రమే యిది పవిత్రంబు
అదిమాకు వినవేడు కానతిమ్మనిన - మదనాంతకుని తనమదిలోన తలంచి
ముదమున సూతుండు మునులకిట్లనెను - మీరు కోరిన కథా మీకు జెప్పెదను
చాలసంతోషమున శివభక్తితోను - ఇతరచింతలులేక యేకచిత్తమున
ఉచితమ్ముగావినుడు విన్నవించెదను - ముక్కంటియనియెడి మునివరుండు గలడు
ప్రకటింపగా వేదపారాయణుండు - అతనికి గుణవతి యగుధర్మపత్ని
శతపద్మనాభుల శ్రీదేవిబోలు - సకల సజ్జనురాలు సౌందర్యవతికి
సకలసజ్జనమాన్య సౌందర్యమాన - దంపతులిద్దరు ధర్మార్థకామ
సంపదలతోచాల సిరియనుభవింత్రు - వేల్పులకువరమిచ్చు వేల్పుశంకరుడు
అల్పతపసులకిచ్చె నధికవరములను - మురహరువరమున పుత్రుకావలసి
అరిగిరివారు బిల్వారణ్యమునకు - ఘనపాపహరమయిన కావేటినదిని
యెల్లపురుషులుందురు యేకాలమందు - నెల్లతరువులుబూసి యేపుమీరగను

కేతునికివరము సంకేతములుసేయ - కేతునికి వరమిచ్చి గిరియరాయలును
అలనాడువేణుకథ యానాటనుండు - వనములనగా కేతు వనమనగ పెరిగె
ఆమహావనమునకు అటుదక్షిణమున - ఈవనము దేవకాంచనబిల్వవనము
తాలహింతాల మాలూరవృక్షములు - వారక నిమ్మలు నారదబ్బలును
కేతకీ పున్నాగ వకుళబదరీ - వాసిగల్గియున్నవి వటవృక్షములును
తియ్యనిమామిళ్ళు దేవదారులును - వెయ్యారువిధములౌ వేరుపనసలును
నారికేళములు పొన్నలుపోకచెట్లు - పేరయినవెలగలు పెద్దయుసిరిగలు
పదికోట్లపాటలు గంగరావులును - సంపెంగమారేళ్ళు కింకిణీతరులు
కర్పూరతరువులు కదళితరువులును - ఒప్పారుచుండెడు విప్పమావులును
మంచిగంధపుతరులు మాతులుంగములు - మించినమారేళ్ళు మేటిశాకములు
జాజితీగెలును పగడంపు తీగెలును - అక్షయమయిన రుద్రాక్షతీగెలును
జాజితీగెలు విరజాజితీగెలును - రాజిల్లు మల్లెమొల్లాతీగెతరులు
యాలకతీగెలు హేరాళములును - అలోలమైన మిరియంపుతీగెలును
పన్నీటికాల్వలు బయలుతామరలు - ఇన్నిగలకొలనులుయేపారగలవు
పొలుపుదేవేంద్ర నందనవనముకంటె - పొలుపుగానుదయించి పూర్ణమైయుండు
క్రతువులు సేయుచు కామించిమునులు - సతతముగ వేదఘోషగల్గియుండు
అందుల దంపతులు అతిమోదమునను - ఇందుకళాధరుని విష్ణుదాయకుని
పూజకై కావేరీపుణ్యానదియందు - తేజంబుతో నిష్టదీర్చి నతిభక్తి
మౌనివనము వెడలగాబూని దంపతులు శివదేవపరులుచేరి సేయుదురుపూజ
జ్ఞానాదిప్రార్థనల స్థానాదినదుల - పూని నానావిధ పుష్పములచేత
తిలకించు కర్పూరదీపములచేత - పలికించు బిల్వాదిపత్రములచేత
అంచితములైన నైవేద్యములచేత - రుద్రాభిషేకములు రూఢిగాజేసి
దులలుకొను సాంబ్రాణిధూపముచేత
అంచితములైన నైవేద్యములచేత - రుద్రాభిషేకములు రూఢిగాజేసె
భద్రాత్ముడయినట్టి భావజజనకు - హాశివశంకరా హామహాదేవ
హాసూర్యశశినేత్ర హరహరాయనుచు - అంచితస్నానసంధ్యల పూజచేసి
పంచాక్షరీజపము జపియించుకొనుచు - నిరతంబులయిన సత్తరువులతరువుల
కల్పాదులయిన హరిసర్వజ్ఞములను - నాటకున్న యీషణత్రయమ్ములను
పాటిగానుదయించు పంచేంద్రియముల - కర్ణముల్ తావయినకరభూషణములు
వర్ణింపనిద్దరు వృద్ధదంపతులు - నిద్రించిరాహారనిద్ర సంగతులు

వర్జించి భక్షణలు వాయుపులుగొనుచు - పంచాగ్నిమధ్యమున పగలెల్లనుంద్రు
మంచుతోబోరలుదురు మహితమునధాత్రి - జలములోనుంద్రు చలికాలమెల్ల
బలువానకాలాన బయటనుండెదరు - ఈ రీతి నీ తపము హెచ్చుగాసేయ
అతియుగ్రమైనట్టి యాతపమ్మునకు - ప్రత్యక్షమైనిల్చె పార్వతీశుండు
ప్రత్యక్షమైనట్టి పార్వతీశులకు - సత్యమయినభక్తి సందడింపగను
ఆనందబాష్పముల ఆనందులగుచు - ఆనందివాహనులకతిభక్తిమ్రొక్కి
ధరణిసాగిలిమ్రొక్కి దంపతులునిలచి - కరములుమొడుచుకొని పలవించిరవని
జయ సకలభూతేశ జయ పార్వతీశ - జయ చంద్రసంకాశ జయ నాగభూష
జయ చిత్రచారిత్ర జగమేలుచిత్ర - జయ సురాసురనేత్ర జగమేలుమిత్ర
జయ భక్తదానంద జయతుదానంద - జయార్ణవీసాంద్ర జయ మహాలింగ
బ్రహ్మాదిరుద్రులు బ్రహ్మఋషులెల్ల - బ్రహ్మవు నీవని బ్రస్తుతించెదరు
నేరనువర్ణింప నేనెంతవాడ - గౌరీశ మిమ్ముల కండ్లజూచితిని
కనిమ్రొక్కగావింటి కలిగెసౌఖ్యములు - మనమున గల్గుక్లేశములు బాపవయ్య
పుత్రులేసంపద పుత్రులేధనము - పుత్రులేయిహపరమ్ముల పట్టుకొమ్మ
సుతులుపుట్టిన వెనుక సుతులపితౄరుణము - పుత్రులయిన పరలోక పుత్రుకార్యములకు
కన్నపుత్రుని మోహముకన్న మాత్రమున - పున్నామనరకములు పుణ్యంపుగతులు
అని సన్నుతులుసేయ నాదంపతులకు - చనుపిచ్చిపలికెను సర్వేశ్వరుండు
జపములు తపములు జరుపుచునిత్య - ఉపవాసములచేత నుంటిరిన్నాళ్ళు
బడితిరి మీకోర్కెఫలమిత్తిననుచు - అడుగుడీయని శివుడు ఆనతిచ్చినను
గనిచింతగా అపుత్రస్య గతిర్నాస్తి - అనిఋషివేద వాక్యముబలుకుచునుండె
అటుమీద సంతాన మభిలాషగలిగి - చపలాక్షి మదిలోన మిమ్ముదలచితిని
అనవినినవ్వుచునసురాంతకుండు - సంశయముదీర సన్యాసికిట్లులనెను
సామాన్యపుత్రులు చాలగావలెన - శ్రీమంచిగుణముల చెలువలరుచున్న
సకలవిద్యలయందు సంపూర్ణుడయిన - సుదతి పదునారేండ్లసుతుడు గావలెననిన
దంపతులిద్దరు నేకచిత్తమున - వెతకి కోరినవేరు కన్బడినరీతి
తలవాంచి దంపతులు సమ్మతమ్ముగను - కొనిరాజశేఖరుని కోరి నిజముగను
కులము రక్షించబద్దులుగాని సుతులు - బదుగురు పుట్టగా ఫలమేమిగలదు
కలుగగానేమిఫలమునకు నీచమతులు - చదపురుగు పుట్టలో జన్మించవెన్ని
హరుడు పదునారేండ్లు అయినానుచాలు - శీలుడొక్కడేచాలు శీఘ్రమ్మునిమ్ము
తనయంతవాడు ఉత్తముడు సజ్జనుడు - ఘనుడు మార్కండేయుడను సుతునిమీకు

ఇస్తినిపొమ్మనుచు నీశ్వరుండపుడు - వినిదంపతులు సంభ్రమునవరము పొంది
చనిరి తమపురములకు చనిసంభ్రమెసగి - చిత్రమగు రజితాద్రి చేరిరంతటను
అంధకాసురవైరి అనతిప్రేమ - బంధువులతోజెప్పి ప్రబలుతునుండె
మానవతియైనట్టి మౌనీంద్రసతికి - ఆనాటగర్భచిహ్నాలు గానవచ్చె
ఓకిలింతలు తరుచుపుచ్చెకోరికలు - ఏకువగలముఖము కడుతెల్లనాయె
బలునిద్ర తరుచాయె బరువాయె నడుము - నౌబద్ధదేహమ్ము నల్లనాలాయె
శ్రీమంతమయిన శృంగారవతికి - శ్రీమంతములుచేసి చెలియమరుచుండె
నవమాసములునిండె నళినలోచనకు - రవితేజుడనగ పుత్రరత్నంబుగలిగె
పూర్ణచంద్రునిబోలు పుత్రరత్నంబు - కర్ణముల వినితండ్రి గంగకేతెంచి
స్నానములుచేసి మదనాంతకూని - పూజగావించెను పూజించిమించి
పూజతా యిచ్చెను పుణ్యవేళలను - మీరుమరువక యెవ్వారువీరనక
పాత్రమెరిగిచేసె బహుదానములను - అచ్చటపదిదినములయిన బాలునికి
మోదంబుతో పురుడు పుచ్చిరంతటను - క్రమముతో నామకరణములువ్రాసి
ప్రమదమ్ముతో నామకరణమ్ముదీర్చి - అప్పుడు మునుశివుండు అనతిచ్చినప్రకారంముగ
మనుడుమార్కండేయుడని నామమిడిరి - సభవారికెల్లను భోజనములుపెట్టించి
విభవమ్ముజేసిరి విస్తారముగను - దినదినమ్మున పోషించుబాలు
శ్రీపూర్ణచంద్రునివలె ప్రబలుచునుండె - పొరిగలబడనేర్చె పొర్లగానేర్చె
సారంగధరణిపై జోకాడనేర్చె - నిలువబడగానేర్చె నెలలవెంబడిని
చెలరేగి తప్పటడుగులుపెట్టనేర్చె - అత్తత్తయననేర్చె అడ్డాలువచ్చి
ఎత్తుకోమనిచేతు లెత్తంగనేర్చె - బంగారుగిన్నెలో పొరిబాలుబువ్వ
రంగుమీరంగ కుడువంగనేర్చె - అందెలుగజ్జెలు అపరంజిగొలుసు
అందముగ మద్దికాయలు రావిరేక - బాలతొడుగులుదొడిగి బాలునిముద్దు
లీలలుజూపుచు తలిదండ్రియెదుట - వడకప్రాయంబయిన వరపులుజూచి
వడుగుజేసిరి జగతివారెల్లమెచ్చ - అటుమీదబాలప్రాయము దాటకుండ
తర్కముజదివించి తగువేళలందు - అన్నమార్కండేయు లన్నరావయ్య
సంహ్యాకేంద్రునియెదుట చదువుమని పలికె - చదివెను వేదములు చదివెశాస్త్రములు
చదివెపురాణములు చదివెసకలమును - ఘనమయిన వారిలోపల ఘనతకెక్కె
ఎలమిజనకులమాట జవదాటకుండ - తేరానివస్తువులు తెచ్చితాయిచ్చె
కోరినపనులన్ని గొబ్బునజేసె - వినిపించెకథలన్ని విస్మయంబుగను
పరికించెతాను విజ్ఞానశాస్త్రములు - మాతృపితృభక్తి మరువకెన్నడును

పాత్రమెరిగికొల్చె పాదపద్మములు - దాటెనుపదునేను సంవత్సరములు
పాటించివచ్చెను పదునారుయేండ్లు - మరచి చూడచూడ వర్షాముల్ చనెను
హరుడానతిచ్చినవరము చింతించి - గురుభక్తుడయినట్టి కొడుకునుజూచి
దిగులుపడి కనుదప్పి ధీరతమెలగి - తమలోనె దంపతులు తలపోసుకొనుచు
విడచివేతూమనుచు దిగులొందుచూను - భీతితోడుత కాళ్లుచేతులాడకను
రాతిపై ప్రతిమల రీతినుందూరు - తనయుడు పతెంచి తల్లిదండ్రులకు
వినయమ్ముతో మ్రొక్కి వెలదులంజూచి ఇన్నలైయున్నారు కీడేమితోచె
ఎన్నగనెవరయిన పెచ్చుబెట్టిరిర - నేరకయేమయిన నేనుజేసితిన
వేరుజేసి మిమ్ము విడచి కుడిచితినా - యేవేళకైనాను మీయాజ్ఞమీరి
యడుగకెవ్వరికయిన పెచ్చుబెట్టితిన - అనుచుదండముబెట్టి అటుకడనున్న
తనయునికౌగిట దయతోడజేర్చి - నాయన్ననాతండ్రి నాముద్దులయ్యా
ఏతప్పు మీవల్ల యెరుగమెన్నటికి - కొడుకుమాత్రుండవా గుణసముద్రుడవు
చేకొని వినుమన్న చెప్పెదనీకు - వోకార్చిచెప్పెదను వోపుత్రవినుమి
వినుము మార్కండేయ వివరమ్ముగాను - పుత్రాతురులమై భూమంతతిరిగి
సత్యమయినతపము సలుపంగమెచ్చి - జోకతోడుత హరుడు సరిగూడుకొని
మాకుప్రసన్నమయి మదనారిపలికె - వీరకాడు అయిన విస్తారుడయిన
మానశుద్ధుడయిన సుతుడుగావలెన - దంపతులుయిద్దరు యేకచిత్తమున
వెతికికోరగ వేచుకొమ్మనెను - కనికోరుకొమ్మని విచారించుకోగ
కోరుకొంటిమి నిన్ను కోర్కెకొనసాగె - అపదమ్ములుబూని నిన్ను గాంచితిమి
నీవల్లబహుసుఖము మేము బొందితిమి - జరిగెను పదునేను సంవత్సరములు
పాటించివచ్చెను పదహారోయేడు - ఇదినిత్యమిది దుఃఖమాయెనని పలికె
ఇంతమాత్రానకే యిదికొండజేసి - చింతసేయను మీకుచెల్లదెన్నటికి
నాడుమీకిచ్చిన రణబిరుదువైరి - నేడు యెక్కడబోయి దాగియున్నాడు
ముంగిటిలోధనము మునుకొంగుపసిడి - తనచేతిజున్ను సదాశివుండనగ
ఆ వుమామహేశ్వరుని అట్టిశంకరుని - అట్టివిరూపాక్షుని అఖిలదాయకుని
కోరి చెలితపము కొదువలేకుండ - ధీరతతో మహాదేవిమెప్పించి
మరణమ్ములెన్నటి మరియులేకుండ - వరముగైకొనివస్తి వగువనేమిటికి
దీవెనలు యిచ్చిన సందేహమునులేక - వేవేగబంపుమని విన్నపముజేసె
తల్లిదండ్రికి ప్రదక్షిణముగావచ్చి - మెల్లన నిలుచుండి మ్రొక్కికీర్తించె
ఎల్లకాలముబ్రతుకు ఈశ్వరునివలెను - చల్లగానాసుతుని చాలదీవించి

పంపెనుభక్తితో బలగమ్ముతోను - ప్రియముతోడుతబంపె బిల్వవనములకు
తమవారితపసులకు తన్నుంచినట్లు - వనము విశ్వేశ్వరుని వీక్షించిమ్రొక్కె
క్రమముతోడుత నదీస్నానములుచేసి - విరివిగా సర్వేశువిధులన్నిదీర్చి
మొదట కామక్రోధ మదమోహాలోభ - మదమత్సరములన్ని మరికట్టుగట్టి
జపమాల హస్తములసవరించుకొనుచు - జపముజేయుచు బుద్ధి సళ్ళనివ్వకను
కుంకుమకస్తూరి గోరోజనమ్ము - పొంకమైనట్టి పునుగుజవ్వాది
తరుచునాగమ్మన తోయముంచుకొని - పరిమళమ్ములు సమర్పణమ్ములేజేసి
మరువంపుపత్రియు మాచిపత్రియును - బిల్వంబుమారేడు - పత్రియునుచేత
కండచక్కెరెతేనె ఘనముగాబెట్టి - ఘనముగా కొబ్బరి ఖర్జూరములను
బలినయివేద్యముజేసి సరిహారతిచ్చి - పొలుపమరగా మంత్రపుష్పములుపెట్టి
ఈ రీతిగా శివపూజ యెడతెగకజేసి - కడువడి వత్సరంకడదినమువచ్చె
అంతటకోపించి యంతకుండంత - పనిబూనిపంపించె బంటులనపుడు
మీరుతోడుతతన్ను కోరినాముద్ర - మీరుకొంపోయిన ఫలము మరచివచ్చినను
భూలోకమునకేగి భూశక్తిమెరయ - పాలవంటిది మంచి బ్రహ్మకులమునను
ఘనుడొక్కరుండు మార్కండేయుడనంగ - వెలసినపేరుతో వర్ధిల్లుచుండె
వాడి బలమునుబట్టి వాడి ప్రాణములు - పూనిబంధించి యిప్పుడు తోడితెండు
అనుచు పొమ్మనిబంపె నాయమునిభటుల - నీలకంధరుపూజ నెరిసేయువాని
ఫాలలోచనుపయి భక్తిగలవాని - పరమాత్మ మంత్రంబు పఠియించువాని
గనిరిమార్కండేయు గనిరి యమభటులు - కనుగొని శివుడున్న గుడిచొరలేక
గదపాశములచేత గదలించిచూచి - కదలకయున్నారు గారణంబేమో
తమచేతగాదనుచు తగిలి కింకరులు - యముడున్నచోటికి యేతెంచిపోయె
దాటిపోరాదు యెంతటివారికయిన - నేటితో మీయాజ్ఞ నేలపాలాయె
మమ్మజూడడువాడు మాత్రుడయినాడు - మేముదేవళములోకి మరిచొరలేక
మీకుజెప్పితిమయ్యా నిర్మలముగాను అనవినికాలుడు - అతిరోషమునను
గద్దెగ్రక్కునదిగి కన్నెర్రజేసి - అద్దిరాడాయె అనిబిల్వబనిచె
యురమప్పళించి కనుబొమలెగరేశి - తొడ - రించిమీసమ్ము వడిబెట్టుకొనుచు
కాలుదండముచేత క్రీడించుకొనుచు - భుజగేంద్రుకై వడి బుసకొట్టుకొనుచు
కాటుకకొండనగ నీటుగహెచ్చు - ధాటిగా యెనుబోతు మీదనేయెక్కి
బింకమ్ములాడి యా భీషణాప్రియుడు - ప్రళయకాలమునాటి పావకునిరీతి
బిల్వవనమునకువచ్చి పెడబొబ్బలెట్టె - పటపటమనగా పళ్ళలుగారెమిన్ను

సురలురాక్షసులు యతులుయెగిరిపడగ - అనవిని కాలుడు అతిరోషమునను
గుడివాకిటను నిలిచి కోపించిపలికె - ఓరిగర్వాంధుడా ఓరిమారకుడా
ఓరిదుష్టాత్ముడా యోరినిర్దయుడ - వినరోరి నాఇంట్ల పీడదొలితివా
తనుగానలేక తృణమైనగైకొనక - యెవ్వరిబలముతో పెచ్చియున్నావో
క్రొవ్వితివా నన్నుగుర్తెఱుంగకను - చిత్తమునగన్పట్టి జీవకోట్లెల్ల
నానావిధప్రజలెల్ల నన్నుజేరుదురు - ధనధాన్యపుత్ర మిత్రాదులనువిడువ
జిక్కితివి నాచేత దిక్కెవరు నీకు - యెక్కడబోయినా యికమీదనయిన
ఏమయినపోనిమ్ము నిన్ను నేవిడువ - దండధరుడప్పుడు దండంబుబూని
దండంబుతనభుజా దండందుబూని - తడబడ గుడికిని దుడుకునబోయి
వడిని మార్కండేయు మెడనుపాశములు - తగిలించితియ్యగా తత్తరంబంది
పొలుపుతోడుత శివుని బలుకౌగలించి - ఆలింగమందుకొని అతిశీఘ్రమునను
చాలమాటలుబల్కె శూలమ్ముతోను - ఘనమైనరవికోటి తేజమ్ముతోను
కాలకంఠుడుతాను కలకలనగుచు - ఘనమైన నాగభూషణముతోను
వచ్చెనుగదా నీవు పోరిరియనుచు - యెడమకాలుయెత్తి యెదురొమ్ముదన్ని
కాలుండురక్తమ్ము గ్రక్కుచునుగూలె - కూలెను ధరణిపై కొండపోడవుగను
నిన్నుజంపెడివాడు నిర్మూలమయ్యె - అన్న వెరువకుమని యభయంబునిచ్చె
చెందినవేడుకతో చెయిబట్టితీసె - నా పూజపరులను నీవుదలచబోకు
నీపొరుబత్తెమ్ము నీవుజేసికొమ్ము - అప్పుడు దగ్గిర మార్కండేయునిలచి
నీకు దీర్ఘాయువు నీతల్లిదండ్రి - అనుచుమార్కండేయు పంపిరిదేవతలు
ఆదివిష్ణువుగర్భమునంది మాగర్భ - మునబుట్టి మమ్ములనురక్షించు
చండికుమారుడు జన్మించినట్లు - క్షేమమ్ముపవిత్రుల జేస్తిరిచాల
మార్కండేయచరిత్రమదిని - ఆడినానుడివినా ఆయుష్యమిచ్చు
కైలాసపదవిచ్చు ఘనసాంబమూర్తి - సంతోషపదవిచ్చు సాంబమూర్తైపుడు.

# ధర్మరాజు జూదము

శ్రీమంతులై యుండ్రు శూరులై యుండ్రూ - సామంతులై యుండ్రు సరసులయియుండ్రు
సత్యమ్ముదప్పరే ధర్మనందనులు - పుత్రులుపౌత్రులు తాతలుప్రజలు
కోటివేలాయేండ్లు రాజ్యములుసేయా - మేడలుమహాలులే మంచిసావిళ్ళూ
మాణిక్యమయమైన సింహాసనమునా - అచ్చోటనిలచిరే ధర్మనందనులు
తల్లికికడసారి గారాబుపట్టి - చావుపుట్టుకదెలియు సహదేవుడుండే
తామరకొలనిలో భమిడిగుండమునా - జలక్రీడలాడుతూ సహదేవుడుండే
పొడివస్త్రము గట్టడే తడివస్త్రమేగాని - అంతటతనయన్న డాయంగవచ్చె
విన్నపముధర్మజులు వినియవధరించూ - బింబిలికార్యములు చేయనోకయ్యా
ఆడకుమిజూదములు ఓడబోకయ్యా - ఓయన్న యెట్లయిన నా మాటవినుమా
పతులుచూడగమన సతిచెరలుబడుద్రు - ఈడ్చుకుబోదురు సభకురాజుల్లా
అనియిట్లు సహదేవుడాడంగవినుచూ - చిరునవ్వు నవ్విరే తాము ధర్మజులు
చిన్నవాడవునీవు యేమియెరుగుదువు - సాటివారుబిలిచితే వెళ్ళంగమానా
హస్తినాపురములో అంగళ్ళలోను - ప్రథమమేనడచినవి పిళ్ళారిబళ్ళూ
కొమ్ములగట్టినవి గుఱ్ఱాలుఅన్ని - అవియన్నినడచెనె హస్తినాపురమూ
నీళ్ళోసిపెంచేటి నెలతలందారు - వారెల్లనడచిరే హస్తినాపురమూ
ఉగ్గోసిపెంచేటి యువిదలందారూ - వారెల్లనడచిరేహస్తినాపురము
పాలిచ్చిపెంచినా పణతులందారు - వారెల్లనడిచిరేహస్తినాపురము
యేవురుయిరువరుస గుఱ్ఱాలనెక్కి - యేవురువేసేటి హారములువేసి
యేవురుబట్టేటిగొడుగులేబట్టి - యేవురుబట్టేటి ఆయుధాలుబట్టి
ధర్మరాజేతెంచె హస్తినాపురము - అంతటధర్మజుల రాకల్లుజూచి
యెదురులేచీవెళ్ళె రారాజు అపుడు - సింహాసనమువేసి కూర్చుండబెట్టి
లోహాసనంమీద కాళ్ళుగడిగించి - పచ్చివీపోకల్లు పండుటాకుల్లు
భమిడిపళ్ళెరాల తాంబూలమిచ్చే - హస్తినాపురములో అంగళ్ళలోను
పలకయుసారెయు వెలయదెప్పించి - ఈవలవేయించె సింహాసనమ్ము
ఆవలవేయించె లోహాసనమ్ము - సింహాసనమ్మీదధర్మరాజుండె
లోహాసనంమీద రాజుకూర్చుండి - సరసల్లజూదము వరుసల్లలాడి
క్రమ్మరపాచిలు కడుచేతనంది - వరుసల్లజూదము వరుసనాడాడా

ధర్మరాజుకుజిక్కె కనకమ్ము నేడు - రాజుచేతికిజిక్కె బలపంము నేడు
హస్తినాపురములో అంగళ్లలోను - తనచేతిపాచికలు శకునిచేతిచ్చె
తా వెల్లిపెద్దమ్మ నగరికేతెంచె - అతివనుపొడగాంచి అతిభక్తితోను
సాష్టాంగదండ నమస్కారములుజేసి - చేతులుముడుచుకొని చేసెవిన్నపము
ధర్మరాజుతోను జూదమ్ములాడి - ఆడితినినేను తలలెల్లయోడి
వస్తినేనునిను శరణమువేడా - అనియిట్లు రారాజు ఆడంగవినుచు
చిరినవ్వుతోబలికె జేష్టమహాదేవి - ధర్మరాజుతోను జూదమ్ములాడా
వద్దనుచునీకొకరు చెప్పనేలేదా - అప్పుడేజెప్పరా యెల్లవారెల్లా
అటుగాక ధర్మజులు శరధిగాదన్ని - అయినానుతననేర్పు చేసెదనన్నీ
క్షీరాబ్ధికడకేగె చెల్లెలనువేడా - అల్లంతటతమఅక్క రాకల్లుజూచీ
గుండెఝల్లుమనియె మహాలక్ష్మికపుడు - యెవ్వరినిచెరపను వచ్చెనోయక్కా
పోకుట్టచాలవే పుట్టెలాజెల్లా - అరచేతికలహంము పెంచుకొనివచ్చే
యెవ్వరినిపొందనూ వచ్చెనోయక్కా - అల్లంతటతమఅక్క రాకల్లుజూచీ
యెదురులేచీవెళ్ళి మహాలక్ష్మియపుడు - వలగొనిముమ్మారు ప్రదక్షిణముజేసి
సాష్టాంగదండనమస్కారములుజేసి - చేతులుముడుచుకుని చేసెవిన్నపము
యేమేవోయక్క నీవొచ్చినపనులూ - అనతిమ్మనుచు పలికెమహాలక్ష్మి
అనియిట్లు మహాలక్ష్మి యడుగగానపుడు - ఇట్లనిబలికెనే జేష్టమహాదేవి
రారాజుధర్మజులు జూదంములాడా - ఓడెనురారాజు వరుసతోడుతనూ
తనరాజ్యములనోడి తనకడకువచ్చే - శరణుజొచ్చినవాని చెడగొట్టుటాకు
మనసువొప్పదునాకు మహాలక్ష్మివినుమీ - ఆబ్రహ్మవిప్రులుచేసేటివేడ్కా
రాజసూయయాగంముచేసిన్నవాడు - వీధివీధులుగట్టి విస్తళ్ళువెయ్యా
ఆయజ్ఞశాలల్లలోపలికిబోతీ - కూతుల్లు తానూను కుడువబోవంగా
ఆకులు వేసుకుని మేముగూర్చుండా - కూతుళ్ళతనుజూచి కోపించెభీమూ
ఆడదానవునీవు యిదినీతిగాదు - మగవారిలోకుడువపాటిలేదనుచు
ఆకులుదీయించి పారవేయించె - ఆభీముకిస్తినే శాపమునేను
చేటల్లలోవడ్లు నెరిపిన్ననాడు - నాడునినుగొలతునని పలికితీననెను
కుంచమువారగా బెట్టిననాడు - నాడునినుగొలుతునని పలికితీననెను
అరికాలినువుగించ తడవన్నినాడు - నాడుమిముగొలుతునని పలికితీననెను
నాటికార్యము నేడుసమకూడెననుచు - నిన్నువేడగవస్తి చెల్లెలకావూ
నాకోర్కె దీర్చవే నలినాయతాక్షి - యేమేమహాలక్ష్మి యేమే నా చెలియా

నీవేగిధర్మనందనులనేబాసి - రాజునుపొందవే రమణిరో నీవూ
అనియిట్లు తమఅక్క అడుగగానపుడు - ఇట్లనిపలికెనే మహాలక్ష్మితాను
అలికివిడచినగడప దాటడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేను
దివ్వెలేని గృహము చూడడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేనె
వాల్చినరోకలి దాటడేరాజు - నేధర్మనందనుని యెడబాలేనె
యింటముగ్గూలేక నడువడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేనె
నీరాడులేనింట నిలువడేరాజు - నేధర్మనందనుని యెడబాలేనె
కూరాడలేనింట కుడువడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేనె
ఆడమిగిలినజలకము లాడడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేనె
కట్టివిడిచిన వస్త్రములు కట్టడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేనె
సానమీద చందనంబలదడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేనె
సభలోనపక్షమ్ము పలకడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేనె
పాళ్ళల్లో భేదమ్ముపంచడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేనె
జట్టిపెండ్లిండ్లు చెయ్యడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేనె
మునిమాపుముంజూరు దుయ్యడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేనె
సంధివేళచాకివీధి వెళ్ళడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేనె
ముత్తైదునిముండయని తిట్టడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేనె
వడిలోనపుష్పములు కొయ్యడేరాజు - నేధర్మనందనుని యెడబాయలేనె
అలికివిడచినగడప దాటిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
దివ్వెలే నీ గృహము చూసిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
నట్టింటచిట్టూకమట్టిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
దూలమ్ములేనిల్లు దూరిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
ఆడమిగిలిన జలకమ్ములాడిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
కట్టివిడచినవస్త్రమ్ము కట్టిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
సానమీదచందనంబలదిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
రాములేనింట నిలచిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
కూరాడులేనింట కుడిచిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
సభలోనుపక్షమ్ము పలికిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
పాళ్ళల్లోభేదమ్ముపంచున్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
జట్టిపెండ్లిండ్లు చేసిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె

మునివడ్లుమునిపండ్ల కోరికిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
మునిమాపుముంజూరు దూసిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
వొడిలోనపుష్పములు కోసిన్నవాడు - ఆపాపకర్ముణ్ణి నేబొందలేనె
అనియిట్లు మహాలక్ష్మి పలుకగా నపుడు - యాగ్రహామునజూచెనే జేష్టమహాదేవి
లక్ష్మివచ్చిరారాజు పొందుటదెలిసి - శకునిచేతిపాచికలు సందిళ్ళబడెను
హస్తినాపురములోను అంగళ్లలోను - పలకయుపారయు వెలయదెప్పించి
ఈవలవెయ్యించె సింహాసనమ్మూ - యావలవెయ్యించె లోహాసనమ్మూ
సింహాసనమ్మీద రాజుగూర్చుండి - లోహాసనంమీద ధర్మరాజుండు
సరసల్లజూదమ్ము వరుసతోనాడి - క్రమ్మరపాచికలు కడుచేతనాడా
రాజుచేతికిచిక్కె కనకమ్ము నేడు - ధర్మరాజుకుజిక్కె బలపము నేడు
హస్తినాధర్మజులు తమరోడిరపుడు - కొమ్ముగట్టినవి కోటియేనుగులు
తప్పకనుధర్మజులు తమరోడిరపుడు - కుంచలగట్టినవి గుర్రాలు అన్ని
తప్పలేకధర్మజులు తమరోడిరపుడు - తలలంటిపెంచినా తరుణులందరిని
తప్పలేకధర్మజులు తమరోడిరపుడూ - నీళ్ళోసిపెంచినా నెలతలందరినీ
తప్పకధర్మజులు తమరోడిరపుడూ - పాలిచ్చిపెంచేటి పణుతులందరినీ
తప్పలేక ధర్మజులు తమరోడిరపుడూ - ఉగ్గుపోసిపెంచినా యువిదలందరిని
తప్పకనుధర్మజులు తమరోడిరపుడూ - యేవురుయెక్కినా అశ్వాలనోడె
యేవురువేశిన హారాలనోడే - యేవురు పట్టినా ఆయుధములోడె
యేవురుగట్టినా వస్త్రములనోడే - యేవురియిల్లాలు పాంచాలనోడె
సింహాసనంమీద రాజుగూర్చుండీ - ప్రేమతో తమ్ముణ్ణి బిలువనంపించి
గాంధార్నిబిలువరే పాంచాలినితేను - చాందాను బిలువరే పాంచాలితేను
కర్ణునిబిలువరే పాంచాలినితేను - అన్న కెదురుగవచ్చి అతిభక్తితోను
చేతులు ముడుచుకుని చేసెవిన్నపమూ - గాంధారి యీ పనులుగావు మా చేతా
చందాను యీ పనులు సరిపడవు యనెను - కణుడాండు ఈపనులు కారాదు యనేను
యిందరు పలుకులూ యిట్లు పలుకగను - కోపముతొ పలికె రాజుల్లరాజు
యేమోయిగాంధార నీవోయి కొమరా - పోయిరా పాంచాలిని దోడుకొనిరారా
ధర్మరాజుగట్టినా వస్త్రములుగట్టి - ధర్మరాజువేసినా హారములువేసి
ధర్మరాజుబట్టినా ఆయుధముబట్టి - ధర్మరాజెక్కినా అశ్వాన్నియెక్కి
హస్తినాపురముకూ వెళ్ళినాడపుడూ - అల్లంతట గాంధారి రాకల్లుజూచి
యెదురులేచీ వెళ్ళే పాంచాలియపుడు - యేమోయి గాంధార నీవోయి కొమరా

జూదంపుశాలల్లో వార్తలేమయ్యా - మాయన్న గెలిచెనూ మీరాజువోడె
ముఖ్యముగ పాంచాలి నిన్నురమ్మనిరీ - వదినగారిని నుమ్మ పరసతిని సుమ్మా
వావిదప్పగరాదు వరపుత్రవినుమా - వదినగారవుకావు వరుసల్లులేవూ
నిక్కముగ పాంచాలి నిన్నురమ్మనెను - తలలంటి పసుబూసి జాజిల్లుముడచీ
అంగుష్టవారధిని రారాదు యనెను - అన్నకెదురుగ వెళ్ళి అతిభక్తితోను
చేతులుముడుచుకొని చేసె విన్నపము - పాంచాలిమహాదేవి రాలేదు యనెను
యేమోయి దుశ్శాసనుడ నీవేగికొమరా - పోయిరా పాంచాలిని తీసుకొనిరారా
ఆపలుకులువిని దుశ్శాసనుడపుడు - హస్తినాపురముకూ వెళ్ళినారపుడు
ఏమోయిదుశ్శాసనుడ నీవోయికొమరా - జూదంపుసాలల్లో వార్తలేమయ్య
మాయన్నగెలిచెనూ మీరాజువోడె - నిక్కముగ పాంచాలి నిన్నురమ్మనెను
వదినగారినిసుమ్మ పరసతినిసుమ్మా - వావిదప్పగరాదు వరపుత్రవినుమా
వదినగారవు కావు వరుసలు లేవూ - నిక్కముగ పాంచాలి నీవురావేగా
తల్లంటి పసుబూసిజాజిల్లుముడచీ - అంగుష్టవారధిని రారాదు యనెనూ
వెండికాగులతోను వేణ్ణీళ్ళుగాచి - ఛమిడికాగులతోను చన్నీళ్ళుదెచ్చె
వేణ్ణీళ్ళుచన్నీళ్ళ సమముగాతొలిపే - పాపకర్ముడుబోసె పాంచాలి మీదా
పాంచాలిశిఖపట్టి దుశ్శాసనుడీడ్చె - కూర్చుండబడెనపుడు కుంతికోడాలు
పాంచాలిచెంగుబట్టి దుశ్శాసనుడీడ్చె - ముత్యాలవాలీలు ముందరా బడెనూ
ముట్టుకోకాబోవమూక పోదోసీ - యెడయెడగ నిలుచున్న పాంచాలిన్జూచీ
మూగిమూకాలెల్ల మూగియిట్లనిరి - కూడిమూకాలెల్ల కూడికొనిరపుడూ
మూడువేలగుర్రాలు మూడువేలమూకా - మూడువేలఆవులా పాడిగలవారూ
నాల్గువేలగుర్రాలు నాల్గువేలమూకా - నాలుగువేలయావుల పాడిగలవారూ
అయిదువేలగుర్రాలు అయిదువేలమూకా - అయిదువేలయావుల పాడిగలవారూ
ఆరువేలగుర్రాలు ఆరువేలమూకా - ఆరువేలయావులా పాడిగలవారూ
అచ్యుతా అక్షోహిణి ఆరువేలబలమూ - దయగలా ధర్మజులు యెందుండినారో
బింకముగల భీముడూ లేడె ప్రాణమునా - కవలవారిద్దరూ కారువారైరో
అనిచెప్పి దుఃఖించె పాంచాలియపుడు - తొయ్యర అపర్ణశాల వాకిటికి
పదుగురుజూడగా భంగముజేయరా - యేపురుపురుషులాతోడ గూడుకునీ
గుర్రాలసాలలు బాగుజేసేనూ - తొయ్యర ఆ పర్ణశాలవాకిటికీ
పదుగురుజూడగా భంగముజేయరా - మేడలు మహలులు మల్లెసావిళ్ళూ
సరిమంచమెక్కవే సఖియ నాతోడా - నీయొక్క తొడలపై సుదేష్ణ యెక్కూ

నీయొక్క తొడలపై దత్తంమ యెక్కా - సరిపుంచ మెక్కురా తల్లి గాంధారి
తొయ్యర ఆ పర్ణశాలవాకిటికి - పదుగురుజూడగా భంగమ్ముజేయరా
కుండలోదికూడు తినని కాకుల్లు - కుక్కనీవు రాజ్యమ్ము యేలితివియటరా
గాజు మెరసితేను పుష్యరాగమగునా - మాణిక్యము నలుపైతె మసిరుండయగునా
గాడిదెయిది యెంతగజమౌనటోరి - కాలువలెన్నయిన కలసిపారితె
గంగనదితోటి సాటియగునట్రా - విరులుయేన్నయిన యెత్తిపొంగితె
సముద్రమ్ముతో సరియౌన చపిటిబట్టెల్లు - పాదములొనిను నా పడగలెత్తితె
శేషునితోసరియగున - చెదు పురుగులెల్లా
పక్షులామని తమరు వృక్ష మెక్కినను - గరుత్మంతునితో సరియగున సకలపక్షుల్లు
కోతులామని తమరు కొమ్మలెక్కినను - హనుమంతునితో సరయగున ఆకోతులెల్లా
కరణాలమని తమరు కవిలిబట్టిననూ - శ్రీరాములుతో సరియగున సృష్టికరణాలు
రాజులామని తమరు రచ్చలెక్కినను - ధర్మరాజుతో సరియగున కలరాజులెల్ల
భూచంద్ర పాలకులు సత్యచంద్రూలు - మారాజు కుంతికొమాల్లతో సరిన
తొయ్యేర ఆపర్ణశాలవాకిటికి - పదుగురుజూడగా బంగమ్ముజేయరా
కృష్ణజే కృష్ణజే కృష్ణమ్మ శరణూ - కృష్ణుడా నీవు నాకు సహాయముగరమ్మి
క్షీరాబ్దిలోపలా సిరిపాన్పుపైని - శ్రీలక్ష్మితోడను జూదమ్ములాడి
ఆడేటిపాచికలు అటునిశ్చయించి - అన్యాయమనిపేసె అప్పుడుపాచికలూ
ఆడవలె నోడవలె గెలువవలెగాని - అన్యాయమనియేటి కలవెపాచికలూ
మన కులగోత్రమూ మన భక్తురాలు - మన నామమేగాని మరువదెన్నటికి
మగవారు చీరబట్టి బాధింపగాను - అన్యాయమనిపేస్తి అతివరోసేడు
తూర్పునాబడ్డవి తొంబదివేలకోట్లూ - పడమరానడ్డవి పదివేలకోట్లూ
ఉత్తరమునపడ్డవి ఊళ్లంతపొడవూ - దక్షిణమునపడ్డవి తాళ్లంతపొడవూ
వేలన్నివిరగెనూ శాలల్నుమణిగే - ఓపలేకా వారు గూర్చుండబడిరి
ఏమినోము నోస్తి పాంచాలి నీవూ - ఈ సభ జూడగా ఇందరిలోనూ
పొందుగ కుంతెమ్మ చలిమేల్లుజెయ్యా - భీముడుపిసికేడు పోకలందియ్యా
అర్జునుడు అలచేతుల ఆకులందియ్యా - కలవలిద్దరుగూడి ఉల్లడముబట్టా
విష్ణుకాంతనోస్తినీ వినుడు మీ రిపుడూ
బ్రాహ్మణవీధులాపణతులందారూ - భావించిగట్టిరే పట్టుచీరాలూ
వెలమవారియిండ్ల వెలదులందారు - వెలదీర్చిగట్టిరే వెలలచీరాలూ
రాచవారీయిండ రమణులందారూ - అంచుదీర్చిగట్టిరె అంచుచీరెల్ల

పట్టుచీరెలు రెండు పట్టుకునివచ్చి - పదిలముగ దాచుమనిపలికె నా రాజూ
పెట్టలేరని వారి పెద్దలకునెల్ల - కట్టలేదని వారి కరువుదీరగనూ
పశులై యెగిసినవి పట్టుచీరల్లు
హస్తినాపురములో అంగళ్ళలోనూ - అమ్మనితలకురులు ముడుచుకొమ్మనెనూ
తనతొడలు యెక్కు మన్న రారాజు - తొడలుచీరించక తలముడువనేనూ
తన శిఖబట్టినా దుశ్శాసనుని - చేతులూ తోరణాలుగుచ్చకా తలముడువననెనూ
ధర్మరాజుతో జూదమ్ము ఆడితివిగానీ - తనతోటి జూదమ్ము ఆడుమనిపలికె
పాంచాలితోటి నే నోడేదననుచూ - ఉల్లాసమునఉండె రాజుల్లరాజూ
హస్తినాపురములో అంగళ్ళలోను - పలకయును బలపమును తెప్పించిరపుడూ
ఈవల వేయించె సింహాసనమూ - ఆవల వేయించె కూర్మాసనమూ
సింహాసనంమీద రాజుగూర్చుండి - కూర్మాసనమ్మీద పాంచాలియుండె
పాపకముఖనిముఖము తాజూడననుచూ - నడుమను వేయించె గండభారామూ
రారాజు తనచేత వేసె పాచీకలూ - పాంచాలి తనకాల్లుత్రోసె పాచికలూ
వక్కోపలకకే వస్త్రములుగలచే - తన పలక గెలుచుకుని తలవడ్డుకొనెనూ
రారాజు తనచేత వేసె పాచికలూ - పాంచాలి తనకాళ్ళత్రోసె నా పాచికలు
రెండోపలకకే హారాలు గెలచె - తన పలక గెలుచుకుని తలవడ్డకొనెను
రారాజుతనచేత వేసెపాచికలు - పాంచాలితనకాళ్ళత్రోసెపాచికలు
మూడోపలకకె ఆయుధములుగెలచె - తనపలకగెలుచుకొని తలవడ్డుకొనెను
ఆరాజుతనచేత వేసెపాచికలు - పాంచాలితనకాళ్ళతోసెపాచికలు
నాలుగోపలకకే కొడుకులనుగెలచే - తనపలకగెలుచుకొని తలవడ్డుకొనెను
రారాజుతనచేత వేసెపాచికలు - పాంచాలితనకాళ్ళత్రోసెపాచికలు
అయిదవపలకకే అందరినిగెలచే - తనపలకగెలుచుకొనితలవడ్డుకొనెను
ఆరాజుతనచేత వేసెపాచికలు - పాంచాలితనకాళ్ళ త్రోసెపాచికలు
ఆరవపలకకే రాజ్యాలుగెలచే - తనపలకగెలుచుకొని తలవడ్డుకొనెను
ఆరాజుతనచేత వేసెపాచికలు - పాంచాలితనకాళ్ళత్రోసెపాచికలు
యేడోపలకకేయేవుర్ని గెలచె - తనపలకగెలుచుకొనితలవడ్డుకొనెను
ఆరాజుతనచేతవేసెపాచికలు - పాంచాలితనకాళ్లత్రోసెపాచికలు
అంతలోనేవచ్చి ఆమాయశకుని - ఆడవారితో జూదంము ఆడితివ నీవు
అటుగాక పాంచాలితోను యాడితివా - ఆడవారేకార అతివలేకారా
ఆడవారికి యగ్నిసాయమేగాదా - ఉడికేటిఅన్నములు తొణికిజూసేరూ

మండేటిమంటకూ మారుసమలేరూ - కాలేటికోరివెలు కాళ్ళుతన్నేరూ
అటుగాక పాంచాలితోటి యాడితినా - ఆడవారెగార అసురలెగార
అటుగాక పాంచాలి పతివ్రతేకాదా - అనియిట్లు యాశకుని ఆడుమాటలకు
ఆటచాలించినరాజెల్లరాజూ - ఆమాటవిని యపుడు ధృతరాష్ట్రుడొచ్చి
సభలోను ఆశ్చర్యమున తాను జూచి - ధృతరాష్ట్రుడప్పుడూ కోపించి పలికె
ఇదియేమిజూదములు యిల్లుయాడుదురా - రావమ్మపాంచాలివరములిచ్చెదను
నీవైన రాజ్యములు నీవుగైకొనుమా - పతులదీసుకు నీవు పదిలాన వెళ్లూ
అనియిట్లు యారాజు ఆడుమాటలకు - ఆమాట ధర్మబాలువిని యాదరించె
ఆడవారిరాజ్యములు ఏలంగదగునా - సతిగూడివనములకు పోయెదనుచూ
పాంచాలికోరినే పతులనేగురిని - తప్పకనుధృతరాష్ట్రుడు తాధారబోసె
పతులనుగూడుకునిపాంచాలితాను - అరణ్యావాసమున అతివేగజనెను
పన్నెండుయేండ్లు పదిలమునయుండి - అజ్ఞాతవాసముకు అతివేగవచ్చి
విరటుపట్నముజొచ్చి వీరశేఖరులు - ధర్మరాజు జూదంము పాడినావిన్నా
అష్టయిశ్వర్యములూ ఆరాజుయిచ్చూ.

# శశిరేఖ పెండ్లిపాట

బలరామునిసుత బంగరుబొమ్మ - దుర్యోధనునీ కుమారునకు
లక్షణవంతుడు లక్ష్మణునకు - యిచ్చి వివాహము పెచ్చుగచేయ
నడుగుమి యని తన యంగన బలుక - భార్య మాటలకు పరమ ప్రీతి
భీష్మ ద్రోణుల బిలిపించియును - గురువర్యులు యిరువురు వేంచేసి
బలరామునితో ప్రాణములిచ్చి - శశిరేఖను లక్ష్మణునకిమ్మ
అని అడుగుండన నంతనె పోయి - ఓ బలరామా యొప్పున నీవు
దుర్యోధన సుతు దోర్బలయుతు - లక్ష్మణునెరుగవ లాలిత్యమ్మా
అతనికి నీ పుత్రికనిచ్చి వివాహము - పెచ్చుగ జేయవలయును సుమీ యన
బలరాముండు మంచిది లగ్నం - బుంచుడు మీరనగా నెల్లుట
నై యుండె మాఘము నవమీ తిధియందు - అనూరాధా కన్యా ల
గ్నమున సుముహూర్తము - తగు శుభమైనది
అనిన మంచిదని యట్లనేసేతు - తర్లీరందు తగదప్పక మీరు
అనిన మంచిదని యరుగగ వారు - రేవతియంతట భావమునందు
వగచి వగచి తనవల్లభుతోడను నిటు పల్కెను - తా ఇంపెసగగను
అయ్యో యింటను నభిమన్యుండు - మేనల్లుడు నా మేటికిగాక
లక్ష్మణుకీయుట లలితమే మీకు - అనగా మిక్కిలి యాగ్రహుండగుచు
అర్జునుడడవుల నంటుకపోయె - జానడు పొట్టకు జేరె సుభద్ర
కుడువ నన్నము తోడుగగుడ్డ - లేనివారికీ లేమనొసంగి
పొట్లు చూడవలె పాపముగాదా - కన్నబిడ్డను ఘనులకు నీయ
సుఖముగ నుండిన జూడలేవె - యిట్టి కూతలను నెన్నటికయినా
ప్రేలకు నాకడ ప్రియములుగావు - అనుచు అట్టీ మాటలను నాలకించుచును
శశిరేఖయు దా స్వాంతమునందు - గుందుచు చెలులతో పొందుగ కేళి
వనములకేగెను వనితలతోడ - పూవుల గోయుచు పుష్పాడలైన
ఎత్తదు ఫలముల నేమియు గొనదు - అభిమన్యునిపై అతిప్రేమమున
పిన్నట నుండియు జేసిన మైత్రి - తలమునకు వచ్చిన తడబడుచుండు
ఇట్టులనుండగ నింటిలోన - అభిమన్యుడు తా నచటికి వచ్చి
సంగతియంతయు సరగున వినుచు - తల్లిని వీపున దనరగబెట్టి

తండ్రికడకు బోదము పదమనుచు - మేనమామపై బూనిన యీర్ష్య
వెడవుడ మిక్కిలి వృద్ధిని బొంద - పోవగ పోవగ తోవలో నొక్క
యాశ్రమమును గని యచ్చటికేగ - నచట ఘటోత్కచుడను రాక్షసుడు
ఎవడవురా యివ్వనమునకు - రా బనియేమిరా రభసముతోడ
అని మీదికి రా నాతనితోడ - యుద్ధము చేయుచునుండగ నంత
నారదు డెదురుగ నయముగ వచ్చి - మీర లిద్దరును పోరుట తగున
అన్నదములయి నతి ఘోరముగను - కొట్టుకొనుట మీ కెట్టులు చెల్లు
అనిన నాతనికి నంతయు దెల్ప - అయ్యో తమ్ముడ అయ్యోయనుచు
నిష్కారణమున నీతో బోరి - యెరుగక జేసిన నెగ్గుకు మీ
తల్లి సుభద్రా తప్పెన్నకుమీ - అని పలువిధముల ననుజుని వేడ్క
కౌగలించుకొని కడువడి తాను - అమ్మకు నొక సాష్టాంగము జేసి
కారణమంతయు కనుగొని వేగ - కోపము మిక్కిలి కురియుచునుండగ
శశిరేఖను తా చయ్యనవేడె - తెచ్చెద దమ్ముని తెచ్చుట యేల
పెండ్లి చేసెదను పెండ్లియె కాదు - దుర్యోధనునొగి తోలెద వేగ
ననుచు వేగమె యచటికిబోయి - మంచముపై శయనించియు నున్న
శశిరేఖను మంచముతో గూడ - నభిమన్యునికడ కనువుగ దెచ్చి
మరల తాను నొక మంచము మీద - శశిరేఖతో సరిచక్కని రూపము
దాల్చి పరుండగ తన నక్కడికిని - చెలికత్తె లేతెంచి చెలియ శశిరేఖ
పెండ్లివారందరును ప్రేమతోడుతను - వచ్చి కూర్చుండిరి వనితరో లేవె
మంగళస్నానమ్ములు పొంగుచును సేయ - వేచియున్నారమ్మ లేచియును రావె
అనునంత నా మాట లతివచెవిబడగ - ఎక్కడి లక్ష్మణుడు యెక్కడి పెళ్ళి
ముక్కు మొగ మెరుగని మూఢునిచేత - పరిణయంబగుకన్న మరణమే మేలు
అని పల్క చెలికత్తెలనుట తగున - రావమ్మ తండ్రి బలరామునికన్న
తెలిసినవారెవరు తెలివిగల వానినీ - పెండ్లిచేయ నిశ్చయముగా అనుచు
బలవంతానను అతివకు తోడై - వచ్చి పీటపై గూర్చుండబెట్టి
లక్ష్మణా శశిరేఖ లాలించి చూడు - అనగానె కన్నెత్తి యతివ వీక్షించి
అయ్యయ్యో పెద్దపులి అమ్మయ్యో పాము - అమ్మయ్యో సింహాము అమ్మయ్యో తేలు
అమ్మయ్యో వెలుగుబంటమ్మయ్యో జెర్రి - అమ్మయ్యో గండుబిల్లి అమ్మయ్యో రేచు
అమ్మయ్యో తోడేలు అమ్మయ్యో చిరుత - అమ్మయ్యో చిట్టెడ అమ్మయ్యో దెయ్య
మమ్మయ్యో రాక్షసి అమ్మయ్యో భూతం - అనుచు గజగజ వణకి అవతలికి బోవ

పెద్దలందరుజేరి భీతిలేదనుచు - చక్కని శశిరేఖ చాననుజూచి
యెట్లు భ్రమజెందగ నేల నా తండ్రియనుచు - తీసుకవచ్చి యా పీఠమీద
గూర్చుండ బెట్టంగ గొబ్బునను మరల - తేరిపార చూడ దెయ్యమయ్యయ్యొ
కళ్ళు పెద్దవిజేసి కరవవచ్చెడిని - నాకు పెండిలివద్దు నన్ను చంపకుడు
ఎక్కడి శశిరేఖ యిదినాకు - పోదమురండనుచు పోవుచుండగను
ఎక్కడికి పోయెదవు యిదిగొ నా దెబ్బ - చూడుమని వీపునను జర్రుమని చరవ
బాబోబాబోయనుచు పరుగెత్తంగ - అందరును భీతిల్లి అటుపోవంగ
పోదురే మిమ్మింక పొడిచేయువాడ - నే ఘటోత్కచుడని నెరదెల్పవస్తి
నా తమ్మునకు నీకు నాతిపరులకును - పరిణయము జేతువా బలరామనీవు
నా తమ్ము డభిమన్యు డాతడిపుడున్న - చంపి పోగులు పెట్టజాలడా వీడు
బంధువర్గంబనుచు పోరద్రోలితిని - శశిరేఖ యభిమన్యు సతిగాగనుండ
లక్ష్మణుని పెండ్లాము లలనసెట్లగును - చూడ వేడుక యున్నచో మీరలంత
నా యాశ్రమునకు సమముగారండు - శశిరేఖ పెండిలి సరగ వీక్షింప
ననుచు గొందరు వెంట నంటిరాగాను - తన యాశ్రమమునకు తగగొంచుపోయి
అచ్చటను నభిమన్యు హెచ్చయిన పెండ్లి - యుత్సవము గావించి యుండునంతటను
సిగ్గుపడి హలదరుడు చెల్లెలానేను - తప్పుజేసితినిపుడు తగ గావుమింక
అభిమన్యుడా నేను అన్యాయమునకు - పాలయితి నవియన్ని బాటింపబోకు
అని పెక్కు రీతులను అందరకును దెలిపి - కూతురు దగ్గర బిలిచి కొమ్మరో నీవు
కోరుకున్న విభుడు గూడె నీ కిపుడె - నన్ను బెట్టిన కలత యెంచబోకెపుడు
అనుచుండ రేవతియు నతివసంతసమున - వదినెరో సుభద్ర వనిత నీ కిస్తి
నా బిడ్డ కాదిక నీ బిడ్డ సుమ్మి - పనిపాటులెరుగని పడతిసుమి వదెన
కసిదికొట్టినయట్టి కాంతసుమి వదినె - నను విడిచియుండని నాతిసుమ వదెన
చెప్పిచేయించుకొనుటొప్పుసుమ వదిన - నను విడచియుండని నాతిసుమి వదెన
బొంకి యెరుగనియట్టి పొలతిసుమి వదెన - అని పెక్కు భంగులను అతివతాజెప్ప
నా కింతగాచెప్ప నా కన్యరాల - అన్నకూతురుగాన అతివగుణములను
నే నెరుగకుంటినా నా కింతయేల యనుచు - సంతోషమును ఆపగాలేక
తండ్రికిని మ్రొక్కించి తల్లికి మ్రొక్కించి - బావకు మ్రొక్కించి భక్తిమీరగను
పెద్దలకు మ్రొక్కించి పేర్మితోనపుడు - సుఖముగా తమతమ చొప్పులకుపోయి
దంపతులు మిక్కిలిగ దయతోనుండి - కాపురము చేయుటను గనుల వీక్షించి
తల్లిదండ్రు లతిమోదకలితులై బంధువులు - సంతోషభరితులై యుండ్రి.

---

# కీచక వధ

శ్రీమంతులై యుంద్రు సూరులై యుంద్రూ - సామంతులై యుంద్రు సరసులై యుంద్రు
సజ్జనులై యుంద్రు సుమతులై యుంద్రు - ధర్మంబుతప్పడే తాను ధర్మజులు
తనపాలిధర్మంబు తగిలిపడగొట్టి - తలచిధరణిపుతోటి జూదమ్ములాడి
దుర్యోధనుడనువాడు పాపకర్ముడూ - కల్పించెవాడొకటి కపటజూదమ్ము
మాయతల్లడిగాను ఆడెజూదమ్ము - ధరణీతల్లడగాను ఓడెజూదమ్ము
కొలువారువోడగా గుఱ్ఱాలవోడే - అయినవారినివోడె అందనాలోడె
అతిరథులనూటడె సమరథులనోడే - విష్ణుభక్తులనోడె ఏనుగులనోడె
తనతమ్ములు ద్రౌపతీతానుసహితముగా - తనవార్ని ఓడగా తనఘోములోడె
అడవిపన్నెండేండ్లు ఆహారములనూ - పన్నెండూయేండ్లు పన్నిద్రయుండి
యేడాది అజ్ఞాతవాసంబుజేయా - విరటునిగొలిచిరే వీరశేఖరులూ.

కులధర్మమును దప్పికొలచెధర్మజులూ - నాట్యగురువై యుండె నగరఅర్జునులూ
వంటకొరకై యుండె వనరభీముండూ - గుఱ్ఱములుకాతునని కొలిచెనకులుండూ
గోవులుకాతునని కొలచెసహాదేవు - ఈ పనులు తమరు శృంగారమునజేయా
కోరివిరటుల దేవి కొలువపాంచాలి - పోయెనంతఃపురికి పూబోణితాను.

ఈరూపు ఈ రేఖ ఈచక్కదనమూ - ఎందుండి యీపూరికేతెస్తివమ్మా
మగవారుజూచితే మనసునిలుపుదురా - చూడడాకృష్ణుడూ చూడడానన్నూ
చూచినకృష్ణుడూ చూడకుంటేనూ - కాకయినుముకు యీగ ముసురునా చెపుమా
నిప్పుచెదలంటునా నీవు యెరుగావా - సముద్రముకడముట్ట ఈదునా యెవడూ
గంధర్వులేవురూ కలరునాపతులూ - వారేవ్వరై నాను లేరు ఇచ్చటనూ
యెరుగక అంటినే యెలనాగనేనూ - తప్పులేదేమిటికి చంద్రముఖియనుచూ
అనుచు విరటులదేవి ఆదరింపుచునూ - నీవుచేయుపనులు నెలతరోయేవి
ఆనతిమ్మనుచునూ అతివబలుకగనూ - చేడె పాంచాలితా జెప్పంగదొడగే.

యెంగిళ్ళుముట్టనూ సంగతికిరానూ - పాదంబులొత్తుటకు పడతినేనోపా
బాలలంగుళులైన నొత్తనేరానూ - అంగనలపనులైన నాచేతగావు
ఇంతఝుడియగనేల ఈమాటలేల - అతివ నీకూ నాకు అరమరలుయేలే
అప్పజెల్లెళ్ళవలె భావింతుననెనూ - అనుచు విరటునిదేవి ఆదరింపగనూ
కోరివిరటులని దేవి కొలచెపాంచాలి - కొన్నాళ్ళు ఈరీతి కొలిచియుండగను.

తివురుమదగజములా తీరుగలవాడూ - మదమత్సరముతోటి మత్స్యపతిమరదీ
వచ్చివాకిటనిలచె వలకీచకుండూ - కుంతికోడలిజూచి గునిసెదుర్జనుడూ
కుంతికోడలిజూచి మోహించిబలుడూ - చింతచిక్కుచు మదిని సింహబలుడుండే
అక్కనీదగ్గరా నిలుచున్నచేడే - దానివూరేవూరు దానిపేరెవరే
దానిమొగుడెవ్వరో చెప్పవేనాతో - ఇంతిరో యేరాజుకూతురే నాతి
చెయ్యవేసిన పనులు చేసునానీకూ - వెలదికస్తురి నామమలదగాజూతు
మేనుముత్యాపుసరులు మెడవెయ్యజూతు - ఇంతిమిన్నరో జెప్పు నీవెవరోనాతో
ఈచీరఈవొళ్ళు ఇట్లున్నవిధమూ - ఓయన్న నీకేల నాదుమాటల్లూ
పసిడిబొమ్మవుగదే పరికించిచూడా - మగువరో నీవొళ్ళు మైలలెక్కడివే
పుట్టరా ఆడపుట్టుకలునీతోడా - ఇట్టిదోషపుపలుకులెట్లు పలికితివి
రాముసతిగోరియో రావణుడు జెడెనూ - చెడ్డమాటలన్ని చెప్పంగదొడగీ
పరస్త్రీ పరధనము సంభ్రమమ్మగాదూ - తేటతెల్లడిగాను పలచెడెదావూ.

అక్కనీవద్దనూ నిలుచున్నచేడె - హంసనడకలుదాని అడుగులునుబోలూ
పద్మదళములు దాని పాదములుబోలూ - పోకబోదెలుదాని పిక్కలునుబోలూ
అరటిబోదెలుదాని పెందొడలుబోలూ - కలశలబోలునే కాంతపిరుదులూ
వడ్డాణమమరినట్లున్న దానడుమూ - చెరుకుకోలలుదాని చేతులుంబోలూ
తమలపాకులుబోలు దానిహస్తములూ - శంఖచక్రమూలు భుజములంబోలూ
చక్రవాకమ్ములా కుచములూబోలూ - ప్రొద్దున్న సూర్యుడూ ఉదయించినట్లు
పణతిదానీముఖము పద్మమునుబోలూ - కలువరేకులుదాని కన్నులుంబోలూ
చామరేకులుదాని చెక్కిళ్ళుబోలు - సంపెంగపువుబోలు సొంపునాసికమూ
దంతములు దానిమ్మగింజలునుబోలు - మల్లెమొగ్గదాని పలువరుసబోలూ
దొండపండ్లునుబోలు దానిపెదిమెలునూ - కుసుమతుమ్మెదబోలు దానికురులునూ
కోసతుమ్మెదదాని కొప్పునునుబోలు - శశిముఖియాడుచు నాట్యమాడగనూ

అతివయాకారాన జలధిలోమునిగి - అంకుశంబైనట్టి ఆ మొసలిచేతా
పట్టుబడియున్నాను బ్రతుకుతెరువేమీ - సర్వేశ్వర్ల దేవిలా బొందకున్నాను
గారవమ్మునదాన్ని గదియించకున్నా - పొందించకున్నాను పోవుప్రాణములూ
బ్రతుకనుమి అక్కనుచు పాదములబడెను.

పాదములపైబడ్డ తమ్ముణ్ణియెత్తి - అక్కనజెప్పుకొని అతివయిట్లనెను
రారసింహాబలుండ రాజరత్నామా - పలసింహాబలుడ ఇటువంటిపనులూ
నాతిరిగుటమానునా బుద్ధివినుమూ - ఆడదానిచిత్తమ్ము అరిటాకుమొప్పు
యెవ్వరేమన్నాను యముడుబాధించూ - సర్వేశ్వరువిన్న దండించునిన్నూ
ఇల్లాలిగోరితే ఇదియొక్కనిందా - పతివ్రతనుగోరితే పోను ప్రాణములూ
గంధర్వులేవురూ కలరు దానిపతులూ - వారేవురైనాను లేరు ఇచ్చటనూ
వారువింటేనిన్ను తలలుగొట్టుదురూ - పుష్పాటీగెవలె పొలతులున్నారూ
కుందనపుబొమ్మవలె కాంతలున్నారూ - పగడబొమ్మలవలె పణతులున్నారూ
వజ్రపుబొమ్మలవలె వనితలున్నారూ - నీలంపుబొమ్మలవలె నెలతలున్నారూ
నీరజాక్షునిబోలు నెలతేదిచెపుమూ - నాకొలువువారంత నాకెందుకనెనూ
రంభాను అచ్చిరులు రమణిసరిరారే - యెందరైనా ఇంతి గోరుబోలారే
చూడగూడదుతండ్రి చూచెదవుసుమ్మీ - నవ్వగూడదు తండ్రి నవ్వెదవుసుమ్మీ
ముట్టగూడదు తండ్రి ముట్టెదవుసుమ్మీ - ముందునొకనాడునే ముచ్చటాడితే
వనితకోపించితే వణకితినినేను - అనియిట్లు తనఅక్క ఆడుమాటలకు
తల్లడింపుచుదాని పాదములబడెను - నిలువవు ప్రాణములు నిజముగానమ్ము
అని కీచకుడు బలుక అతివభీతిల్లీ - కానున్ననీబుద్ధి కడముట్టదన్నా
సురపేరుజెప్పియోసుదతినంపేను - అటుమీద నీవలచినట్లుండుమన్నా.

అక్కపలుకులువిని ఆసింహాబలుడూ - అధికసంభ్రమముతోను నగరికేతెంచే
మహారాజువచ్చెనని మంగళహారతులూ - ముత్యాలహారతులు ముదమొప్పదెచ్చీ
మగువలుదెచ్చినా మంగళహారతులు - ఉల్లంఘనా జేసి ఊర్మిళాసఖయా
సంపెగతైలాన శిరసొప్పనంటీ - మల్లితైలముతోను మరినలుగుబెట్టి
సూగంధిగంధమున అటకల్లుగాచీ - వెండికాగులతోను వేన్నీళ్లుగాచీ
ఛమిడికాగులతోను చన్నీళ్లుతోడి - చన్నీళ్ళువేణ్ణీళ్ళు సమముగాతొలిపి
ముత్యాలముంతలా ముగుదలందియ్యా - పసిడిముంతలలోను పణతులందియ్యా
మహిమతో మహారాజు మజ్జనమాడె - మెత్తనివస్త్రముల మేనుతళ్ళొత్తి

పట్టువస్త్రములె కట్టదెస్తూరూ - రత్నాలసొమ్ములే రాజుమరిదికినీ
హెచ్చైనచెవుల ముత్యాలపోగులునూ - ఆణిముత్యపుసరులు హారములువేసె
మరిమాణిక్యాలు ఆసింహబలుడు - గంధకస్తురి పరిమళపుద్రవ్యమూలూ
బాగుగాధరియించె ఆసింహబలుడూ - ఏడునిలువుల భమిడిమేడలోపలను
బంగారుతరికోళ్ళ పట్టెమంచమ్మూ - పట్టెమంచమువాల్చి పాన్పమరబరచీ
యిరుగడలతలగడలు ఇమ్ముగానుంచీ - నేత్రానపట్టుపచ్చడమొప్పబరచి
తోడిమెలబూసినవి పారిజాతములూ - ఆ మంచిపానుపున అవిచాలబరచీ
జామోయిబూసినవి జాజిపువ్వులూ - ఆ మంచిపానుపున అవిచాలబరచీ
మాపోయిబూసినవి మల్లెపువ్వులూ - ఆ మంచిపానుపున అవిచాలబరచీ
పొన్నలుబొగడలే బొడుమల్లెలు - ఆ మంచిసానుపున అవిచాలబరచీ
నాలుగుదిక్కులా కడదివ్వెవెలుగా - నడుమపసిడిమహాలు చిలుకల్లగద్దె
కస్తూరివకకుండ గంధమొకకుండా - చాలవన్నెలనిండ పోకలాకులును
చిన్నారిగోలుసులది సున్నంపుకాయా - గరగతోనుదకమ్ము చిలుకలడకత్రీ
సకలాభరణములు చాలపళ్లెములా - ఇన్నియంపించెనే తమ్మివలెతాను
తామరకుంచలే ఆణివజ్రములూ - ప్రతిష్టశ్రీలక్ష్మి ప్రతిబింబమాయే
మగువవిరటులదేవికి మరిపువ్వులముడచే - మగువనుజూచి యోసుధేష్ణబలికే
మగువకీచకునింట మంచిసురగలదూ - కోరలోబోయించి గొబ్బుననురమ్మీ
సుదతినేనాయిల్లు చూచియెరుగుదునా - అంగనబంపకే అడిగున్నదాన్ని
ఒరులగొలిచినవారు ఓపికలచెడిరీ - పరులగొలిచినవారు ప్రార్థనకుచెడిరీ
పతులుదగ్గరలేని సతులనెల్లాను - ఆడరానిమాటలాడుదురుజనులు
సతులమనసెరుగకా తప్పులాడెదరూ - తేవమ్మసుధేష్ణ సురదెచ్చెదాను
భమిడికోరిటుదెమ్మి పద్మదళనేత్రీ - ఆకోరబట్టుకొని అతిశీఘ్రముననూ
వెరచుచునడచెనే పాంచాలియపుడు - ఓయాకాశమా అంతరిక్షమ్మా
ఓభూమిదేవమ్మ తోడుగావమ్మా - కృష్ణజేకృష్ణజేకృష్ణమ్మజేజే
కృష్ణుడా నీవునాకు సాయమ్ముగమ్మి - అడలుతూవెళ్ళనే వానినగరికినీ
వెరచుచునొకకాలు లోపలికివేస్తూ - వెరువకనొకకాలు బైటనేవేసే
అన్నమన అక్కసుర నడుగబంపిందీ - కోరలోబోయించు కొంచబోయెదనూ
అన్నయనిబిలచేవు అతివరోనీవూ - బావయనిపిలువవే పద్మాయతాక్షీ
హారుదుగోరినయిల్లు మల్లెలాపాన్పు - పణతిపాన్పుపైని పవళించుమనెనూ
వెరచుచు పాంచాలివెనుకకుపోయె - దయలేకనుగ్రుడై తలబట్టియీడ్చె

పాపకర్ముడెవాడు పాండవులసతినీ - వెదువనున్నా చెయ్యి నిడిపించుకొమనగా
సూర్యుడుబంపినరాక్షసుడుదన్నె - వానిముక్కునఁకోట వసకండలొలికే
ఆకొలువువారెల్ల అందరూజూడా - చానవరుగెత్తెనే సభలోకితాను.

శృంగారకన్య యిక్కడికేలవచ్చే - ఆ కొలువువారంత నాశ్చర్యపడుచుం
అంత్యకాలమువీని కాసన్నమాయె - తెరువుగానక చేడెవచ్చెనాసభకూ
వకమ్రానుచెయిబట్టి ఉగ్రుడై భీమూ - కష్టాలకు ఈ మ్రాను ఖండింతుననెనూ
వచ్చిది యీమ్రాను పాటిగాదనుచూ - వద్దనుచుధర్మజులువారించిపలికే
ఆడదానవునీవె సభనడుమనిలువా - తగదునీకనిబలికె తాధర్మజులూ
పగుముసుధేష్ణనగరిలోపలికి - ఒక్కడుమగడగును వనితలకునెల్లా
పవురుమగలుండి దనకుయీపాట్లూ - వచ్చెననిపలికెనూపాంచాలితానూ
పటపటపేలేవు సభనడుమకొచ్చి - పగుము సుధేష్ణనగరికనిపలికే
పాంచాలినిజూచియో సుధేష్ణబలికే - నొప్పిస్తినీమననునొచ్చెనోయనుచూ
నామాటరచ్చలకుపాలాయెనేడు - అంత్యకాలమువానికాసన్నమాయె
సురముట్టుదునెనేను సుదతిరోయనెనూ - నామాటరచ్చలకు పాలాయెనేడు
ఆవంటశాలలో నాభీముడపుడు - పవళించియుండగా పాంచాలివెళ్ళి
తెడ్డుతలక్రిందుంచి పవళింపజూచి - పతిగాంచివలవల వణాతిదుఃఖించె
కుంతికొమాళ్ళిట్లు యిడుములకుబడగా - గాంధారితనయులకు పట్టమ్ముగట్టె
అడవిలోనానలుని దమయంతిబాసి - దమయంతియిడుములను బడినట్లుయుండే
ఆలాగుకన్నీరు అరచేతబట్టి - యీచేత బొబ్బలకు ఇకతెరులేదూ
ఒరులుతీసినగంధ మొల్లనటచేడె - తానుదీస్తేగాని యొప్పదటతరుణి
ఈజీవుడుండగా విచారమేలె - ధర్మజులుయుండగా తలపోతలేలే
నేనీకునుండగా నేరమేమిటికి - వనిత నీవద్దకూ వచ్చితేవాడు
వచ్చెదననిజెప్పు వనితరోనీవూ - ఆరాత్రినిద్రించి అటుతెల్లవారె
అబలయెక్కడికిబోక అక్కడికెబొమ్మి - భామదిక్కులుజూచి బద్మములుజూచి
పద్మమ్ములోపలికి పాంచాలివచ్చె - గట్టిగా పట్టుదల పట్టుకీచకుడు
కాంతయున్నాచోటి కేతెంచెనపుడూ - వనిత నినుచెరబట్ట వచ్చితినినేనూ
వనితరో నాయొడలు వణకినదియేమే - కలకంఠినీతోడ కలయవచ్చితే
కాంతరో నాకెంత కంపంబుబుట్టె - యువిదరో నీతోడ నుండవచ్చితే
పణతిరో నాకింత భయమాయెనేమే - పసిడిబొమ్మవునీవు పరికించితేను
పణతినీతోడైన స్త్రీలుయున్నారే - ఇంతినీతోడైన యింతులున్నారే

రమణిరో నీపతులను రప్పించుకోవే - ఏవురుపతులనీ యెగిరితి నీవు
పదిమంది పతులైన పణతినాకెదురా - నీకుగలవారితో నీవుజెప్పుకోవే
యిట్టిపలుకులుబలుక యెట్టిదేబుద్ధి - రాజులాకల్లాను రాజునేనేను
నాడుకల్లాసుమి నేడున్ననిజము - నిన్నగూడావత్తు ఈరాత్రినేను
నిన్నప్రేరేపించి నీవంతజేసి - నేడువస్తానంటె నేనమ్మలేను
పట్టుగ్రుచ్చినవారు పతులరప్పింత్రు - నీవువచ్చేనంటె నేనమ్మలేనే
నమ్మకుండగనేల నామాటనీవు - గురుయుపదేశంబు కొంగుదీముల్లె
నిన్నుజంపుకతిందు నేడుఈరాత్రి - నాటకపుశాలలో నాట్యశాలలో
నాటకపుశాలలో రంగమధ్యమున - నినుజంపి నీనెత్రు బొట్టెట్టుకుందు
అనియిట్లుపాంచాలి యాడుమాటలకు - అధికసంభ్రమతోను నగరికేతెంచె
మహారాజువచ్చెనని మంగళహారతులు - ముత్యాలహారతులు ముగుదలుదెచ్చి
మగువలుదెచ్చినా మంగళహారతులు - ఉల్లంఘుపడిరాజు అవిపారదన్నె
రత్నసింహాసనము రత్నంపుగద్దె - రాజుకువేసిరీ పనసల్లనీడ
సంపెంగతైలాన శిరసొప్పనంటి - సుగంధిగంధమున అటకళ్ళుదెచ్చి
వెండికాగులతోను వేణ్ణీళ్లుగాచి - భమిడికాగులతోను చన్నీళ్ళుతోడి
చన్నీళ్ళువేణ్ణీళ్ళు సమముగాజేసె - ముత్యాలముంతలా ముగుదలందియ్యా
పగడాలముంతలా పణతులందియ్యా - మహిమతో మహారాజుమజ్జనమాడె
మెత్తన్నివస్త్రముల మేనుతళొత్తి - పట్టువస్త్రమ్ములేకట్టనిస్తూరా
రత్నాలసొమ్ములు రాజుమరిదికిని - హెచ్చైనచెవుల ముత్యాలపోగులును
ఆణిముత్యంపుసరులు వానికేయమరే - మరిమాణిక్యాలు ఆసింహబలుడు
గంధకస్తురిపరిమళద్రవ్యములు - బాగుగాథరించెనాసింహబలుడు
ఏడునిడుపులభమిడి మేడలాలోను - సన్నబియ్యము మంచిచాయపప్పూలు
కందపెండలములు కాయగూరాలు - నానబాలుపాయసము ఆవులానెయ్యి
భక్తితోనారగించె నాసింహబలుడు - గంగజలముదెచ్చి హస్తములుగడగి
పచ్చివిపోకలేపండుటాకులు - పచ్చకర్పూరాన తాంబూలమిచ్చె
తాంబూలమువేసెనే నాతిమ్మాడు - ప్రొద్దుబుచ్చాలేక పొలతితమ్మాడు
కీచకుడుపోయెనే కేళీవనములకూ - దానిమ్మవనములే దబ్బవనమూలు
నారింజవనములే నిమ్మవనములు - చామంతివనములే జలధికాలువలు
భానువంకాజూచి పద్మములుజూచి - గ్రుంకేటిభానుడు గ్రుంకకున్నాడు
విల్లంబువుంచుకుని మండపమ్మునమూ - మండలాపతికెదురు మహిమతోనిలచి

గ్రుంకకున్నానిన్ను కొట్టెదననెను - అనియిట్లుకీచకుడు ఆడుమాటలకు
సూర్యుడుచూచినట్లు శాపంబుబెట్టె - ఎప్పుడానీజిహ్వ పడునురాత్రి
గడగడనువణకుచూ గ్రుంకెసూర్యుడు - పడమరనుభానుడు గ్రుంకినంతట్లో
అక్కడభీముడు వంటశాలలలో - పావకుడనీవు నాకుబంధుడవైతే
శాకపాకమ్ములూ క్షణములోజేతు - అనియిట్లుభీముడు వంటసేయగను
వీరశేఖరులొచ్చి విస్తళ్ళువేసె - వరమశేఖరులొచ్చి పచ్చళ్లువేసె
అవిరటుకొలువువారినందరినిలేపి - పంక్తివారికెల్ల పరగవడ్డించి
తా నారగించెనేభక్ష్యభోజ్యములు - పిండినంటనేతులూ భక్ష్యభోజ్యములు
సంతుష్టిగాగుడిచి సరవి నదినీళ్ళు - వాంఛతీరగత్రాగె వరుసభీమూడు
బనిపూనిభమిడిచెంగులచీరగట్టి - అంగుష్టములవీర మద్దెలనుబెట్టి.

గట్టిమట్టెలుబెట్టి కడియములుబెట్టి - పరగనాభీముడు పతకములువేసీ
ఉరమునఅవిరెండు భరణెలంబెట్టి - కుచములమర్చెనే వాయునందనుడు
ద్రౌపదినితోడుక వెళ్ళెభీమూడు - ఇదియేమి చోద్యమే చిత్రపుత్రికా
విరహాన నినుగోరి వీడేలచెడెనే - వీడిలక్ష్మిరాజ్యము నేలపాలాయె
భక్తితోతనసతీ అకుచుట్టియ్యా - వీడెమ్ముసేయుచు వేడుకలతోను
కలసిముచ్చటగాను కాంతతోనుండా - అల్లంతటవచ్చేటి యాసింహాబలుని
రాకలుజూచిరీ రాజ్యాధిపతులు - సింహాబలుడొచ్చెనని దీపమ్ములార్పే
వెలుగేలఆర్పితివె వెలదిరోనీవూ - అనియిట్లు కీచకుడు ఆడుమాటలకు
మాయద్రౌపతిబలికె మాయతోడుతనూ - దీపమ్ములుంతురా లోకమ్ములోను
యేవురుమగనాలినై యుండినేమూ - దీపమ్ములుంతురా లోకమ్ములోను
దివ్వెల మలసితివె దేవినేరాగా - బింబమ్ముబోలునే దేవి నీముఖమూ
వెలుగునామాణిక్యము దీప్తిల్లుచుండు - వేసారిమాణిక్యము యెందుండుచెపుమా
అనుచు దానిరొమ్ము అదురంటవేసీ - బలువుకు చాలకా పట్టెమంచమ్మూ
విరిగినయంతతో విమలాక్షిబలికే - మంచము విరిగితే మరణమందూరూ
పురుషులకువీలుగాదు బుద్ధేమిచెపుమా - మెల్లనేచెయిబట్టి మెల్లనేదీసి
చందమామనుబోలు సఖియనీమోమూ - కళదప్పియున్నదే కాంతరోనేడు
పగలుచూచితె చిగురుటాకులనుబోలు - మాపుజూచితె మద్దిమ్రాకులనుబోలు
ఆడకట్టుగాదేమొ అనినిశ్చయించి - మనసులోపల చింత మరిదిగులుపడెనూ
ఆడదెబ్బగాదనుచు అదరిపడిలేవా - చెంపపెట్టూబెట్టెతానుభీమూడు
కదలకతన్నెనే కన్నూడిపడెను - ఆచితన్నితె యూడె ఆదంతమూలు

భీముడు సింహబలుడు యుద్ధమ్ముసేయా - మూడులోకమ్ములు ముందరావణకే
గడగడభూదేవి అప్పుదేవణకే - కాళ్ళూనుప్రేళ్ళూను అన్నియునువిరచే
పొట్టచించి బుర్ర పొట్టలోపెట్టె - యువిద పీడినెత్రు బొట్టెట్టుకోవె
అనిచెప్పి భీముడు అక్కడా గదలీ - ఒప్పేటిగుండములో స్నానముజేసీ
కాంతయెక్కడికిబోక యింటికేబొమ్మా - అనిచెప్పి భీముడు అక్కడా వెడలి
తనకొలువుచోటికి తానేగుదెంచె - అప్పుడు పాంచాలి యక్కడావెడలి
కీచకులవీధిలో తాకేకవేసి - మీకీచకునిజంప గంధర్వులొచ్చీ
యేరాజుజంపెనో చూతామురారె - రారెచూతాము రాచవారిరెల్లా
తమఅన్న జంపింది ఈపాపకర్మి - తమఅన్న చితిప్రక్కను దీన్నెసిగట్టరే
అంతలోనే వచ్చిరి వానితమ్ములును - నూరుగురు కీచకులు నిమిషానవచ్చీ
అంతట యీమాటవిని విరటురాజు - కంకయ్యతో జెప్పె కీచకునిచావు
ఈమాట రాజువిన్నాడు ఇపుడు - మనపట్నము గెలుచుకొని పోయెదురుసుమ్మా
యెవరికి తెలియకుండ దహనపరిపించూ - అనియిట్లు ధర్మజులు ఆనతియ్యగను
అట్టుసేయామనెనూ ఆవిరటురాజూ - వానిప్రక్కనువేసి ద్రౌపతినిగట్టి
ప్రేతభూములలోకి కొంచబోయిరి.

ప్రేతభూములలోను పతివ్రతాతాను - అన్నాహారములేక అడలుతూ బలికే
ధర్మమూదెలిపేటి ధర్మజులుతమరూ - పతివ్రతా పాంచాలిని చూచిపొండయ్యా
ఈమూడులోకాల కార్యులమీరు - పతివ్రతాపాంచాలిని చూచిపొండయ్యా
గుఱ్ఱాల్నిగాచేటి కొమరులుమీరు - పతివ్రతాపాంచాలిని చూచిపొండయ్యా
గోవులనుగాచేటి గోపాలమీరు - పతివ్రతాపాంచాలిని చూచిపొండయ్యా
ఆ వంటశాలలో ఆభీముడుండా - ఆదేవిపలుకులు కర్ణములబడెను
కోపగించిలేచె తానుభీమూడు - ఉగ్రుడై వెళ్ళే తానుభీమూడు
నూరుగురుకీచకుల వొక్కనిమిషాన - అగ్నిహోత్రునికితా నాహుతిజేసి
లక్కటిళ్ళాప్రొక్కు తీరెనోయనుచూ - సంతోషముననుండె ధవళాయతాక్షి
కొలనుకుయేతెంచి ధవళాయతాక్షి - స్నానముజేసుకొని తరుణితావచ్చే
మగలనుదాచుకొందు మగువలందారూ - సోదర్లను దాచుకొంద్రు సఖియలందారూ
యింటింటజాతర్లు జేతుమేతల్లి - ఈయేటిబిడ్డలూ నీపేరెసుమ్మి
పాంచాలిరాకజూచి సుధేష్ణతా - పెద్దగాశోకింప దొడగె
నీరీతి విరటునింటికి పీడురావంగ నేలే - వచ్చిదానిజూచి మోహించనేలే
పీనిరాజ్యము శ్రీవనముపాలాయె - యింకనెవ్వరిజంప నేతెంచినావే

యికను నీపురముకూ జనుదెంచుమనెనూ - అనియిట్లు సుదేష్ణ మాటలాడు
నేనేమి జేస్తినే నెలతరో నేడు - నీవల్ల నేరమే నిజముగా నమ్మూ
దక్షిణగోవులు తరిమిపట్టగను - తాబోయివిడిపించె తాను ధర్మజులు
ఉత్తరాన గోవులువురిమిపట్టగను - తాబోయివిడిపించె తానుఅర్జునుడు
యేవురుపెనిమిట్లు మధ్యపాంచాలి - విరటుసావిట్లోను కొలువుగూర్చుండా
చూచివిరటులరాజు సాష్టాంగమొరిగె - చూచివిరటులదేవి సాష్టాంగమొరిగే
చూచిపురజనులంత సాష్టాంగమొరగ - సంతోషముననుండె ధర్మరాజపుడు
యీపాటయెవ్వరైన పాడినవిన్న - ధర్మంబుగలదనీ ధర్మజులు అనిరీ.

# విశ్వరూపము

భారతసేనలూ పన్నినన్ననాడు - పరమాత్ము ముఖం చూచి పార్థుండు పలికె
గాండీవమును విడిచి కవ్వడి తాను - శ్రీకృష్ణుజూచి రాజిట్లన్ని పలికె
విల్లమ్ములను నిలిపి విజయుండు తాను - సేనలోపల వున్న చెలువుడిట్లనెను
సేన మధ్యమందు శ్వేతవాహనుడు - ఖిన్నుడై పలికెను కిరీటితాను
కేశవా కృష్ణమ్మ వాసుదేవూడా - వామనుడ వైకుంఠమేలిన స్వామి
అసురులను బోరిగొన్న జనార్ధనూడా - అచ్యుతుడ నాదొకటి విన్నపము దేవా
గోకులంబేలేటి గోవర్ధనూడా - మండల వలగొన్న మాధవస్వామి
వెన్నుడా నాదివక విన్నపం దేవ - విన్నపము నా మనవి విని యవదరించు
పుత్రులూ పౌత్రులూ భ్రాతలూ ప్రజలు - కడుమంచి చెలువులూ కలరిందు సుమ్మి
ద్రోణుడూ భీష్ములూ కృపాచార్యులు - అశ్వత్థామ మొదలుగా ధార్తరాష్ట్రులు
ఆరువేల సంఖ్య వారైన జాంభవులు - ఎనమనూన్నారువేల వారు యుద్ధరాజుల్లు
తొమ్మిదినూరువేల వారు తురగ క్షత్రియులు - పదినూరువేల వారు పట్టభద్రూలు
పన్నగ పదకొండు అక్షోణిబలము - అతిరథులు మహారథులు సమరథులు దేవ
అర్ధరథులను గెలువ నొల్లనుమిదేవ - గురువులను వధియించ గోవింద ఒల్ల
బంధువులనందరిని భంగమ్ముపరచి - రాజ్యంబువల్ల సుమి బావ శ్రీకృష్ణ
కప్పెర దయచేయి గంగకునుబోదు - వస్త్రమ్ము దయచేయు వనములకు బోదు
అనియిట్లు అర్జునుడు పలుకగా వినుచు - కలకలా నవ్వెనే కమలనాభూలు
రథముపై కూర్చుండి రమ్ము రమ్మనుచు - చెయిచేయి చేర్చుకొని చిరునవ్వుతోను
మకరకుండలాల మణులుపై వెలుగ - తాంబూల చాయల్లు ఒప్పుగా తేరా
కర్పూర వాసనలు వొప్పుగాతుళ్ళ - కిరీటి ముఖంచూచి కృష్ణమ్మ పలికె
ఎట్లెట్టు అర్జునా యేమంటివయ్యా - పగడాల వచనాలు పలికిరచ్యుతులు
వీరయ్య ద్రోణులు వీరు భీష్మూలు - వీరెల్ల మీచేత చచ్చేటివారా
కర్ణుడు మొదలైన వీరపురుషుల్లు - వారయ్యా మీచేత చచ్చేటివారు
అశ్వత్థామ మొదలుగా ధార్తరాష్ట్రులు - వారయ్య మీచేత చచ్చేటివారు

చంపుదురు మీకు మరి చచ్చేదివారు - లేకుంటె వీరెల్ల బ్రతికేటివారా
వీరులు ద్రోణులు వీరపురుషులు - వీరికి అనగాను చావెందుగలదు
వీరితో స్నేహంబు కారణంబేమి - అనియేటి స్నేహంబు అదినాకు గలదు
యేలయ్య మా యెడ భక్తులుగారా - అర్జునుడు భారతము వొక్కడే గెలుచు
కోర భూములలోను క్షత్రియులనెల్ల - సాధించి జయలక్ష్మి చేకొనిపోయె
భక్తుడా భార్గవుడు శ్వేతవాహనుడా - ఇంకాను ఇక నొకటి యెరుగవలెనయ్య
క్షత్రియ ధర్మంబు యెరుగవా చెప్పుమ - శత్రువుల మిత్రులా చంపి రాజ్యమ్ము
వల్లనని పల్కుటా వుచితంబె చెప్పుమ - అధర్మములు కాయనని తలిస్తివే అయినా
అర్జునుడ నువు నాకు అన్యుడవు కావు - యుద్ధభూమియందు క్షత్రియులనెల్ల
చంపించి జయలక్ష్మి చేకొనమందు - అన్యుడవ అర్జునుడ అభివత్సలుడ
ఎట్టిదో నీ మాయ నే నెరుగనయ్యా - చెప్పితే తెలియదా దేవ నీ మహిమ
పార్థుడా ఫల్గునుడ శ్వేతవాహనుడ - తెలిపేను వినవయ్య దేవరమాయ
వృక్షాలలోకెల్ల విశేషమైనా - అశ్వత్థ వృక్షమ్ము నేనె కిరీటి
చెట్లల్లలోకెల్ల విశేషమైనా - కల్పవృక్షము నేను కవ్వాడి వినుమీ
వనములలోకెల్ల విశేషమైనా - శ్రీతులసి వనమనగ నేనె కిరీటి
తరువులలోకెల్ల విశేషమైనా - శ్రీగంధ తరువనగ నేనె కిరీటి
సంవత్సరాలలో విశేషమైనా - విజయ సంవత్సరము నేనె కిరీటి
ఋతువులలోకెల్ల విశేషమైనా - వసంతఋతువనగ నేనె కిరీటి
మాసాలలోకెల్ల విశేషమైనా - మార్గశిరమాసమ్ము నేనె కిరీటి
పక్షాలలోకెల్ల విశేషమైనా - శుక్లపక్షమనగాను నేనె కిరీటి
వారాలలోకెల్ల విశేషమైన - భానువార సప్తమ్ము నేనె కిరీటి
దినములలోకెల్ల విశేషమైన - దశమి యేకాదశి ద్వాదశుల్ నేను
దానాలలోకెల్ల విశేషమైన - అన్నదానం నేను అర్జునుడ వినుమి
ధాన్యాలలోకెల్ల విశేషమైన - నువ్వులూ గోధుమలు తిలలందు నేను
వర్ణాలలోకెల్ల విశేషమైన - శుద్ధసువర్ణమనగాను నేనె కిరీటి
పద్మాలలోకెల్ల విశేషమైన - అష్టదల పద్మమ్ము నేనె కిరీటి
ఆయుధాలలోకెల్ల విశేషమైన - వజ్రాయుధమనగాను నేనె కిరీటి
పర్వతాలలోకెల్ల విశేషమైన - మేరువు పర్వతము నేనె కిరీటి
గజములలోకెల్ల గారాబమైనా - ఐరావతమనియేటి యేనుగున్నేను
అశ్వాలలోకెల్ల విశేషమైన - ఉచ్చైశ్రవమనియేటి అశ్వమ్ము నేను

ధేనువులలోకెల్ల విశేషమైన - కామధేనువు నేను కవ్వాడి వినుమ
పక్షులలోకెల్ల విశేషమైన - వైనతేయుడ నేను వాసవాత్మజుడ
వాహనాలలోకెల్ల విశేషమైన - గరుడవాహన మనగ నేనె కిరీటి
ఇంద్రలోకానికి ఇంద్రుణ్ణినేను - దేవలోకానికి దేవుణ్ణినేను
బృహస్పతిని నేను బుద్ధుణ్ణినేను - ఈశ్వరుడు మహరుషులు బీభత్సనేను
పృధివని చెప్పగా పృధివంతనేను - అంబరీషుడనేను అర్జునుడనేను
చెట్లలో పారేటి సింహమ్మునేను - సృష్టిలో నేరేళ్ళు జంబూలునేను
మహిమీద పారేటి మహానదులు నేను - కర్తనునేనుసుమి భోక్తనునేను
హరుడన్న నేను సుమశివుడన్న నేను - శంభుణ్ణినేను సుమశంకరుడ నేను
క్షీరాబ్ధిచిలుకంగ పుట్టిన్నయట్టి - పారిజాతమునేను అమృతమునేను
బ్రహ్మనునేనుసుమి భగవంతుడునేను - చంద్రుణ్ణినేనుసుమి శంకరుడునేను
అష్టమాదిక్కులూ అష్టసిద్ధుల్లు - సప్తధాతువులనగ సర్వేశుడనగ
గంగయమున సరస్వతి బిందుశ్రేణినేను - బిందుమాధవుడునేను జగన్నాధుడేను
ఋగ్గువేదములకు ఋక్కుల్లునేను - యజుర్వేదములకు యాజ్ఞికుడనేను
సామవేదములకు స్వరములునేను - అధర్వణవేదాని కాధారంనేను
యజ్ఞపురుషుడనేను యాజ్ఞికుడనేను - యజ్ఞసాధకుణ్ణేను యజమానినేను
ధర్మయజ్ఞములు పూర్ణాహుతులుగొన్న - పురుషోత్తముడినేను కవ్వాడి వినుమ
కాశిలోచేసిన్న స్నానంబునేను - గయలోను పెట్టిన్న పిండమ్మునేను
బ్రహ్మపద విష్ణుపద రుద్రపదములకు - పితృపితరులకెల్ల పితామహుణ్ణి
ప్రేతపర్వతంనేను పితాళ్లునేను - ప్రీతితోపెట్టేటి పిండమ్మునేను
అక్షయమగుచున్న ఆవటముక్రిందా - అర్చించిపెట్టిన్న అన్నమ్మునేను
జ్ఞానమ్మునేను వైరాగ్యమ్మునేను - వేదాంతవేద్యుణ్ణి నేనెకిరీటి
సంగీతవేద్యుణ్ణి సాధురక్షకుడ - సకలవిద్యలలోన కుశలుణ్ణినేను
దుర్యోధనుడు మొదలు ధృతరాష్ట్రపుత్రుల్ని - దుర్యోధనుని బలము ధూళిగాజేసి
ధర్మరాజ భీమనకుల సహదేవుల్ని - తప్పించి చంపుదు సందేహంలేదు
దశరధుని పుత్రుడను శ్రీరామచంద్రుడ - వాలిని చంపిన వారిజోదరుడ
యేడు తాళంబులా వేసినావాడ - సుగ్రీవుచుట్టమను శుభలక్షణుడ
సేతు బంధించిన సీతవల్లభుడ - లంక సాధించిన రామభద్రుండ
స్వర్గమనిచెప్పేది ద్వారకాపురము - ఇదె వైకుంఠము ఇదె అయోధ్య
ఇదె పరమ పదము ఇదె వైకుంఠం - ఇదె హరిద్వారమ్ము ఇదె నందనమ్ము

త్రైలోక్యనాథుల ద్వారకాపురము - సకలలోకమ్ముల తల్లి పుట్టిల్లు
యాదవులు నందనులు యముడు ధర్మజుడు - రుద్రుడు భీముడు నీ వింద్రుడవు
సహదేవుడు నకులుడు సరసయీశ్వరులు - ద్రౌపతి పార్వతీ ధనంజయా వినుమి
భక్త వత్సలుడనేను భక్తుడవు నీవు - చెలిమికాడవు గనుక తెలియజెప్పితిని
ఓంకారమని చెప్పు వుత్తముడ నేను - అహంకార మనియేటి అజ్ఞుడ వీవు
మౌనంబు దాల్చేటి మురవైరి నేను - శాస్త్రంబులను చెప్పు సరియొజ్జ నేను
సందేహములు లేవు సర్వశాసనుడ - స్థావర జంగాలు అన్నిను నేను
మున్నూట అరువయ్యి తిరపతులు నేను - ఆకాశం బ్రహ్మాండ మంతాను నేను
సూదిగుచ్చిన రంధ్ర మంతాను నేను - నిమిత్త మాత్రాన నిన్ను నిల్పితిని
చెలికాడి కిచ్చెనే శ్రీ దివ్యదృష్టి - విష్ణుడు విశ్వరూప మంతాను జూపె
శంఖూను వకచేత చక్ర మొకచేత - శార్ఙమ్ము దళవస్త్ర మొకచేత బట్టి
కమలమును పట్టి శ్రీ కమలనాథూలు - తమును పెరిగెను బ్రహ్మాండ ఖాండమ్మునిండ
పాతాళలోకమున పాదములు పుట్టె - పాదముల కిందనె భాగవతాలు పుట్టె
మెరసెడి మిగాళ్ళ మేదినీ పుట్టె - మడమల పుట్టేను మహాఋషి గణము
రోమరోమమున బ్రహ్మాండములు పుట్టె - చెలువంపు చిరుతొడల దేవతలు అయిరీ
సూర్యులు ముఖమాయె చంద్రుల కాంతి - శంకరుడు తనువాయె ముఖమెంచి చూడ
అష్ట దిక్పాలకులు అవి రెండు వీనులు - సమస్త నిధులు క్షత్రియులు అయిరీ
సరసిజనాభుల నాభిలోపలను - సరిగంగ గనె జాహ్నవుల గనెను
పంకజనాభుల నాభిలోపలను - పతివ్రత లనగాను స్త్రీలందుగలరు
సువర్లోక భువర్లోక మహర్లోకమంత - వెలశున్న విష్ణులోకమ్మునుగనెను
పంచమ్మి నాయకి భగవతి దుర్గా - మేరువనెగిరి మేదిని లోకమునా
ఈ భూలోకమ్ము ఈ యేడు నదులు - ఇంద్రుని నందన వనమందు గనెను
నంద వసుదేవుల నగరంబు గనెను - పురిటి నాటి పూతకిని చంపిన్నయట్టి
పుండరీకాక్ష పురుషోత్తముల గనెను - అన్న భద్రునితో ఆడిన్ననాడు
అటుకులకు చెయిజాపు హస్తమ్ము గనెను - అల్లప్పడాలున్ను అతికసన్నాలు
చిక్కముల చల్దుల శ్రీహరుల గనెను - చెట్లకు తగిలించి రోలును లాగి
మద్దులను గూల్చిన మాధవులగనెను - మందటావుల గంటి మాధవులగనెను
గోకులములోనున్న గోవిందు గనెను - కంసుణ్ణి జంపియో మళ్లి వచ్చిన్న
అచ్చుడం పచ్చుడం అగడవీధులను - హారతులిచ్చిన ఆచోట కనెను
తల్లి దగ్గరకొచ్చి త్రైలోక్యస్వామి - మొక్కుతు కౌగలించిన ముద్దు కనెను

అర్జునుని దృష్టికీ అశక్యమాయె - చూచి చూడాలేక సొక్కితా నిలచి
చప్పలించుకు లేచి ధైర్యంబు చెదరి - దైన్య వచనంబున తనయుడిట్లనెను
లక్క గృహాలందు రక్షించినావు - నేడు మము రక్షించు నీరజాక్షుండ
అహల్యా పావనుడ అంబరిష వరద - కరుణతో మముగావు గజరాజవరద
ద్వారావతినుంచి ద్రౌపతి మానంబు - సభలోను గాచినా దయజూడు మమ్మ
తల్లివీ నీవు సుమ తండ్రివి నీవు - తగినచుట్టము నీవు దాతవు నీవు
గురుమంత్రములు నీవు గురువువు నీవు - తిరుమంత్రములు నీవు తిరుపతివి నీవు
మందునీవే నాకు మహిమీదనైతే - కమలనాభుడ నిన్ను కానలేనైతి
కమలాకరా వరద కంటినీ నేడు - వొక్కడే అనుకుంటు వేడితినిస్వామి
బొంగరాలాడితిని స్వామినీతోను - సయ్యాటలాడితిని సరసమాడితిని
పొత్తున కుడిచినా భోగేంద్రశయన - భమిడి తామరపువులు పాదములబోసి
ప్రదక్షిణల చేతామంటె చోటింతలేదు - అర్జునుడు పట్టినా దేవదత్తంబు
మూడులోకాలకీ వీణెయయితోచు - పరమాత్మ పట్టినా పాంచజన్యంబు
మూడులోకాలకీ స్వర్గమయితోచు - కృష్ణజే కృష్ణజే కృష్ణమ్మ జోత
ఇహాపరాదులు మాకు ఇచ్చి రక్షించు.

# పద్మవ్యూహము

పార్థుడా ఇటువిను పరమరహస్యము - సూటిగ వివరించెదా
పటికి ఈ భ్రమలు ఎల్లాజీవకోటి - మాటిమాటికిజూడ మాయాపాశమెరుగావె
పాటిగాదిది ధర్మపద్ధతి - పటికెరుగవు బుధులవాక్యము
బూటకంపు తనువునకె కాక - పుట్టుచావులు సున్నసున్నా ॥పార్థుడా॥

పద్మవ్యూహమునందు పడిన నీ సుతునికై - పలుమారు విడిపి త్రిపి
పద్ధతులెరుగాక వనరూటపనిగాదు - అడ్డులేకబోయె అవిటా అభిమన్యుచేత
పద్మమును భేదించుటకునై - పరమరహస్యము తెలియజాలక
వజ్రమున గిరివలెను వ్రాలితి - పనుచు నీవిటు వ్యసనముందుట ॥పార్థుడా॥

ఋణానుబంధము రూపముచే వీరు - క్రమమెరిగి వర్తింతురూ
ఋణముతీరిన వెనుక తృణమైన నిలువారు - ఋణమున్న వేళలో చనుమున్నచనరయ్యా
కావునను పశుపత్ని సుతనిజ - దేహములు శాశ్వతములనుకొని
కానజాలక పరమపురుషుని - కర్మవాసనచేత చెడుదురు ॥పార్థుడా॥

వృక్షమందున శాఖ లనేకములుకలుగు - ఉర్విలోపల ఫల్గుణా
పత్రబీజములచే ప్రభవిల్లికొన్నాళ్ళు - విస్తరించి చాల విభవముతోనుండి
పత్రసంపద క్రమమురాలగ - వట్టితరువులు చదలకచలును
అట్లె మాయాతనువులకు నీ - కేల భ్రమలూ పార్థివోత్తమ ॥పార్థుడా॥

మృత్తికచేతను భాండాలనేకములు - కులాలకుడు చేయును
భిన్నభాండములను అన్నిపారవైచు - ఉన్నావె ఉండూను వగచెందునా వాడు
ఆ విధంబుగ మట్టితనువని - యెన్నివిధముల తెలుపుచుంటిని
ఇట్టిమాయాతనువుతో నీ - కెట్టి భ్రమలో పార్థివోత్తమా ॥పార్థుడా॥

విజయ అర్జున విడుము విభవముతోడుత - సతిసుతులను భ్రమలు
వర్ష ఋతువునందు వచ్చితరువులు రెండు - కలసిసాగుచుండు క్రమముగ
వరదందు నదులు భిన్నంబైన తరువులు - నాల్గుత్రోవల బోవుగదమరి
భ్రమల జిక్కిటు వగచుచుండక - నిర్మలుండై మెలగమేలగు ॥పార్థాడ॥

ఎన్నిజాతుల ఖగము లెన్నెన్నొ విధముల - వచ్చిచేరును వృక్షమూ
పన్నాగ ప్రాభాతవేళయందున లేచి - ఎగసిపోవుచుంట ఎరుగమె మనమెల్ల
పొందుగా ఈ భూతములును ప - తంగ విధమని తెలిసి నీమది
తన్నుతా తెలిపేటి గురునీ - మన్ననలతో గనుటమేలగు ॥పార్థాడ॥

ఎంతకాలము కర్మశేషములుండునో - అంతకాలము జీవమూ
వింతగా నిలుచుండు వెతలా జెందనేల - చింతలన్ని గురుపదములుచేరి
అంతరంగపు దృష్టిగొని సుశ్రాంతి - నొందియు పరము దెలిసియు
వింతలేమియు లేని బయలున - వేడ్కమీరగనుండు విజయా ॥పార్థాడ॥

కిరీటి వినవయ్య ప్రీతితోనీకథ - పాతకంబులు మానుము
జాతస్యమృతమను శ్రుతివాక్యపద్ధతి - అదినీకు తెలిసియు ఈతీరు సుతుడని
పాతకంబని తెలయజాలక - బోటివలె యిటు మెలగుచుంటివి
పటికెరుగవు బుధులవాక్యము - బూటకంబిది నమ్మజాలక ॥పార్థాడ॥

పుష్పదామమురీతి పొల్పారుయవ్వనము - భోగములస్థిరముల్
సంపద అశాశ్వతచంచలవాయువు - ఎంచిచూడబోక పటికి నిజమని
అంచయానను గూడుకొని ప్ర - పంచవాసన దెలియజాలక
మించిపలుకుచు ఆర్యులను యమ - కింకరుల బాధలకు లోబడి ॥పార్థాడ॥

పార్థసారథియిట్లు బోధచేతెలిపెను - పూజితుడై అర్జునకూ
ఖేదముతోడ మహేంద్రతనయూడు - ఆధారంబుగ సుతుపై ఆశమానకయున్న
ఫల్గునా యిటురమ్మటంచును - పరమవిమానారూఢులై
గరుడగంధర్వ యక్షకిన్నర - వరులు పొగడగ సుతుని కలసిరి ॥పార్థాడ॥

పార్థుడా చూడుము ప్రఖ్యాతతనయుని - హద్దులేటికి యింకనూ
అడ్డులేకపోయె అయ్యా నా ముద్దులయ్యా - అనుచు కౌగిటనదుమపోగానే వారించి
అయ్యకనుగొని అతడు పలికెను - నెయ్యయేమిటిది ఇప్పుడు నీతో
అయ్యలెందరో అయిరి నాకని - అకట నను ముట్టవలదనె ॥పార్థుడ॥

నాదు పుత్రుడవని నమ్మివచ్చితిగాని - నీ కృపను నిజమింతే
కాపునను గర్భవేదనచేతను - పామరుడనైతి పరమాత్మ తెలియక
ప్రేమమీరగ నన్నుమాయలో - తొలగత్రోయక వెలుగుచూపితి
పరమపదమును ఇచ్చిబ్రోవుము - పన్నగేంద్రశయాన పాహిమాం ॥పార్థుడ॥

శ్రీరాములవారి చరణములేనమ్మి - చేసితి నీ తత్త్వమూ
వాసిగ నీ భక్తి వైభవమలరగ - భూసురకోటికి బుధులకు మ్రొక్కెద
మందహాసముతోడనే నిపు - డిందిరారమణుని పదంబుల
డెందమెంచగ పరముగని ఆనంద - మందుచు నుందు నిలపై ॥పార్థుడ॥

కాకాని నరసాంబ కరుణతో ఈ - కథ ఖ్యాతిగ వర్ణించెనూ
అకలంకమగు పరంజ్యోతి స్వరూపుడు - ఈ తీరు విజయునికెట్లూ బోధించెనో
ప్రీతితో కృష్ణార్జునుల కథ - వ్రాసి చదివిన వినినవారికి
పాతకంబులద్రుంచి శ్రీహరి - పరమపదమును ఒసగుకొఱకై ॥పార్థుడ॥

# పండు పాట

ఖాండవమహాముని యాశ్రమమ్మున - పాండవులేవురు వసియింపంగా
పోడిమిగలిగిన ఆరోజనమ్ముల - చెట్టున మామిడిపండొకటుండెన్
గాండీవమ్మున అర్జునుడేయగ - గడగడవణకుచు ధర్మజులప్పుడు
పాండవకులమిక మునితో జెడునని - భయముతో తన ఆత్మబంధునిదలచెన్
ధర్మతనూభవు తలచినపుడే - పరమపదవు ఆదికృష్ణుడు వచ్చెన్
కర్మవశంబున అడవులుదిరుగుచు - కడుద్రోహం చేసితిరీ యనెను
నిర్మలచిత్తుండయినా మునిసతి - మర్మముజెప్పెద యిటురమ్మనుచున్
మర్మగాడు పరమేశుండైనా - మాధవుడా వృక్షము కడనిలచెన్
పుత్తములారా వినుడీవనములో - వక రుషివరుడూ తపమొనరించెన్
నిత్యమునూ వక పండాహారముగా - నీ మామిడిపండుండగనూ
గుర్తుదెలియకను వేశెనర్జునుడు - యికనయినా మీరేవురు నిజమని
సత్యముతోడుత పలుకుడి - పండూ శాపముబోయి తొడిమెను అంటున్
అని యీతీరుగ కృష్ణుడుబలుకగ - అవుగాకనుచును ధర్మజులప్పుడు
అనుమతిప్రియమున యేకాంతమ్మున - తమ్ముల నందరివద్దకు బిలిచి
మనలనందర్ని దుర్యోధనుడూ - వెడలదోలి తమ రాజ్యమువిడచీ
అడవులుతిరిగిన యీ యపరాధం - మునిశాపము లేకుండ బల్కుడీ
ద్వాపరమ్మున కృష్ణుడే మనకూ - తల్లియుదండ్రియు అయివుండగనూ
యేపనులయినా ఆనతిచ్చినను - శీఘ్రముగనుగొని జేయుదునూ
అనిన ధర్మజూలు అందరుగలసి - చనియాకొలనులో స్నానంజేసీ
వనిత ద్రౌపదీసహితముగా వచ్చి - ఆ వృక్షముకడనిలచెన్
వరుసగవచ్చి కరములుముడిచీ - వనజోదరులకు మ్రొక్కినిలచీ
ధర్మతనూభవు - తూర్పుముఖముగా నిలచీ యిట్లనియెన్.

శ్లో. సత్యం మాతాపితాజ్ఞానం - ధర్మోభ్రాతా దయాసఖా
శాంతిపత్నీ క్షమాపుత్రీ - షడయితే మమబాంధవాః.

ధారిణిలోనూ తల్లిసత్యం - తనలో జ్ఞానం తండ్రితోసరూ
ధర్మమెనాకు తోడబుట్టువు - బాయని దయినా చెలికాడు
ఒనరగ శాంతం కులస్త్రీతల్పం - తనఓర్పే తనపుత్రుండనుచును
పరువడి దేవత లాకాశమ్మున - వోహోయన పండొక యోజన మెగసెన్

శ్లో॥ మాతృవత్పరదారాంశ్చ - పరద్రవ్యాణిలోష్ఠవత్
ఆత్మవత్సర్వభూతాని - యఃపశ్యతి సపశ్యతి.

మదిలో ధర్మం కులస్త్రీతల్పం - మానుగ పరస్త్రీ తల్లిగజూతూ
పృథివిలో పరధనమెంత గల్గిన - పెంకుసమానముగా జూతున్
సతతము యెప్పుడు పరులశరీరం - సర్వం తన దేహముగా జూతూ
|వతమని భీముడు బల్కిన - పండూ వసుధకు రెండో యోజన మెగసెన్

శ్లో. ఆమంత్రితోత్సవావిప్రా - గావోనవతృణోత్సవాః
భర్త్రాగమోత్సవానార్యా - సోహం కృష్ణరణోత్సవః.

భూసురవరుడు కలడొకవిప్రుడు - భోజనమునకుజెప్పితె సంతోషం
వేసవికాలం పచ్చనిపూరీ - వేడుకవర్షం గోవులకూ
అని పున్యాంగన పతితో బల్కిన - అల్లే తనకు వ్రతముగల్గునని
వాసవినందనుండు పల్కిన పండూ - వసుధకు మూడో యోజన మెసగెన్

శ్లో. ప్రాణంవాపి పరిత్యజ్య - మానమేవాభిరక్షతు
అనిత్యోభవతిప్రాణో - మానమాచంద్రతారకం.

మరిసంసారం అనిత్యమనుచును - మనలను రక్షించుట కభిమానం
పారదోలినా పరగానైనా - కృపశాయక నా మనసుసగలడని
పోషణతనదని నకులుడు బల్కిన - నానాదేవతులెల్ల పొగడగా
అవనికి నాల్గో యోజన మెగసెన్.

శ్లో. అనిత్యాని శరీరాణి - విభవోనైవశాశ్వతః
నిత్యంసన్నిహితో మృత్యుః - కర్తవ్యో ధర్మసంగ్రః.

సత్యమె జయమవు అసత్యమే యమవు - జగతిలో ధర్మమె ధర్మజు గెలుచు
యెత్తినకోపం ఓర్పున గెల్చును - యెల్లసురుల శ్రీకృష్ణుడు గెలుచునె
అత్తరినీ మామిడిపండుండగ అవనికి అయిదో యోజన మెగసెనె.

శ్లో. పంచమేపతయస్సంతి - మహాషష్ఠోపిరోచతే
పురుషాణామ భావేన - సర్వానార్యః పతివ్రతాః.

అయిదుగురు పతులూ తనకూ వుండగ - మిగులగ పతినీ ఆరోవాడీ
మీద మనసూ గలిగుండుటకూ - తెగగొని పల్కెను గగనం పొంగెను
దుందుభులటు మ్రోయగ పండంటెనె
కంటిమి ద్రౌపతి గుణములు యికనూ - కాని యన్యాయము లేదనిరీ
జంటతనమ్ములు శ్రీలగుణమ్ములు - నమ్మరాదనీ నకులుడు సలికెనె
వైకుంఠ వల్లభుడా సమయమందున - కుంతీ సూనుల కిట్లనిరీ
అలనాడర్జునుడంత్ర మధ్యమున - అలనాడు విల్వేసి పట్టినా
పంతముతోడుత ఫలము దొరికెనని - భావము తల్లికి జెప్పగనూ
కుంతిదేవి తన గర్భమందు - నాకు మాళ్ళేవురు పంచుకొమ్మనిన
వనితలకెల్లా తోడబుట్టినావాణ్ని - కాని యన్యాయం లేదనిరీ
చనియా కృష్ణుడు సౌభాగ్యపర్వతం - జగతిలోపలా యీ భారతము
పఠనజేసితే చెవులకు నింపూ - యిష్టసంపదలు శ్రీకృష్ణుడు యిచ్చును.

# సారంగధర చరిత్రము పాట

పర్వతాల మల్లన్న భమిడిమేడలమీద మెరిపించె జోగిరూపు
పులితోలు వస్త్రమ్ము భూతగణముల పేరు చంకజోలెయుగట్టకూ
ముఖమునా విభూది మెడనిండ రుద్రాక్ష ధావళంబులు మెరయగా
బంగారు కిన్నెరా రత్నంపుమెట్లాది వాయింపుచుండగాను
కిన్నెరా నాదముకు కిటికీలు దెరచుకొని రత్నాంగి పారజూచే
యీశ్వరా నీవంటి పుత్రుని యిమ్మనీ శంభున్ని.తాగోరెనూ
రత్నాంగి కోరిక రంజిల్లునట్లుగా రజతాచలేశుడిచ్చె
నెలదప్పి రెణ్నెల్లు నెలతకూవచ్చెను గర్భచిహ్నములు బొడమె
నాలుగవ నెలవచ్చి పాలిండ్లు నలుపాయె పంచమా మాసంబు పణతికొచ్చె
ఆ రాజసుతకునూ సీమంతమూజేసి స్థిరముగా వారుండిరి
నవమాసములు గడియ నాతి నీళ్ళాడెనూ వుత్తమా సుతుడుగల్గె
బాలుడుగల్గెనని బానిసలచేతనే భూపతికి కబురుబంపె
పుత్రూడు గల్గెనని పుడమీశుడప్పుడూ పుత్రోత్సవంబందెను
గోవుదానమ్ములె భూమిదానమ్ములూ కన్యదానముజేసెనూ
శాస్త్రజ్ఞులబిల్పించి శాస్త్రములు జూపించి మండలం బేలునయ్యా
సగమురాత్రివేళ సాంబమూర్తివచ్చి చక్రవర్తికి జెప్పెనూ
రాజ్యరక్షక యోరాజేంద్ర భూపతి నాపేరు బెట్టుమయ్యా
సభ్యులుమెచ్చుగా సారంగుడను పేరు సుతునికి రాజుబెట్టె
ముద్దులూ ముచ్చటలు ఆటలుపాటలు జూపి బాలూడూ పెరుగుచుండె
వత్సరంబులైదు వరుసతోరాగాను వత్సకుని గురువుకిచ్చి
చప్పన్న విద్యలూ సకలశాస్త్రములు సారంగుడికినేర్పెను
బాలప్రాయం విడిచి పదునెనిమిదియేండ్లు పైబడెను బాలునికి
మంత్రిసుతు సుమంత్రు మరియు స్నేహముజేసి బాలురతో నాడదొణగె
రాజనరేంద్రుడూ రాణువను తోడుకొని వేటకూ వనముకెళ్ళె
నీలంపు వుంగరాల నల్లంపు పావురం నరనాథుకే బెంచెను
వజ్రంపుగజ్జెలా తెల్లనిపావురం వసుధీశుడే బెంచెను
పచ్చన్నరెక్కలా పైడిమువ్వల పక్షిని పార్థివుండే బెంచెను

పావురంబట్టుకొని సంగడీండ్లాతోను సారంగుడాడగాను
విధివీధుల వెంట విడిబడి ఆ పక్షి చిత్రాంగి మేడజేరె
వ్రాలినా గువ్వనూ వనిత చేరగదీసి పంజరంబున నుంచెను
బంట్ల జానీకులను దాసదాసీలను ఫణిహార్లనే బంపెను
గుళ్ళుగోపురములు మేడల్లు మిద్దెలు మణిమంటపములు వెదకె
ఫణిహార్ల సందడి పణితితాగన్గొని యేలవచ్చిరి బాలురూ
బంగారు రెక్కలా పచ్చనీ పావురం పారిపోయెను జూస్తివా
పణతిమేడలోయున్న పక్షిజాడలు దెలిసి పరిచారకులు యేగిరి
పద్మాయజాక్షిరో బాలసారంగుని పక్షి యిమ్మని యడిగిరి
రాచనగరికి మీరు రారాదుపోరాదు రాజునే బంపుమనెను
పరుగుపరుగున వచ్చి బాలునితో యీవార్త బానిసలు యెరిగించిరి
మంత్రి సుబుద్ధియు మంతనంబునలిచ్చి మహారాజుతో బల్కెను
రూపురేఖల నెన్న రూఢిగా మన్మథుని ధిక్కరించెటి మోమయా
చిత్రాంగి జూడగా చిన్నదీ సొగసుదీ వన్నెలా వలపులాడి
రాజులేనివేళ రాణివాసములోకి రాజేంద్ర వెళ్ళదగదు
ద్రౌపదీ అవతార అహల్యా మొదలుగా పణతులాకొరకు ప్రజలు
కొట్లాడి చచ్చిరి శాపాలు బొందిరి కండ్లజూచుచునుంటివే
మంత్రిమాటాలంత మరుగునా ద్రోచియూ బాలకుడు తల్లిజేరె
బాలరాకలు జూచి పణితా యెదురుకొని యేకనివ్వాళులిచ్చె
పన్నీరు అత్తరు ఫలములూ మొదలుగా బాలునకు కానుకిచ్చె
అమ్మకట్నంబివ్వ అన్యాలమూ మేము కొమ్మ నీసుతునిగాదా
ఆకలితొ నుంటివో అన్నము వడ్డిస్తు ఆరగించుమి యల్లుడా
ఆకలయినా లేదు అన్నమ్మునాకొద్దు అమ్మ నాపక్షినిమ్మా
అమ్మన్న నోటికీ కమ్మన్ని కజ్జాలు కాముడా నేబెడుదును
పెంచెనే మీతండ్రి పెద్దవానిజేసి పెండ్లిశాయాడాయెనూ
భోగాలవారింటి కొత్తువో పోదువో బొంకకా నాకుదెల్పు
కన్నుసైగలుజేసి కాంతలా బిల్చుటకు గాలమిప్పుడువచ్చెను
తల్లి పిల్లిగనెంచి అల్లిబిల్లాడుదము కల్లలూగాదుసుమ్మి
చప్పన్న దేశాల చిత్రపటములు జూచి చిన్నపుడె వరియిస్తిని
వార్ధక్యమూగల వరునకూ నన్నివ్వ వనజనాభుడు వ్రాసెనా

మాటికి మాటికి మారుపన్నులుపన్ని మగువ తల్పులేవేసెనూ
చక్కనివారోజాల చేత జిక్కితిననుచు రెక్కలూ తల్పువేసె
వేడిపున్నాచోట వెన్న కరుగనలేను పన్నెకాండా వింటివా
రాజులేనివేళ రమ్యహర్మ్యము కేగి రతికేళిదేలుదాము
ముగుదబల్కిన పల్కు ములుకులయి చెవినాట సుదతితో నపుడుబల్కె
గుడిమ్రింగ దలచినా లింగంబు అడ్డునా కడుపాపజాతియా ఆడజాతి
చావడాకీచకుడు: చావడా యావాలి చావడా రావణుండు
సతులకొరకై వారు చచ్చినా విధమునా చిక్కితీ నీచేతను
మంత్రి సూబుద్ధియూ జెప్పినామాటలూ మరుగునా ద్రోచితస్త్రి
కాంతచెయి జిక్కినా కనకంపుశాలువా కొంత జించుకయేగెనూ
గజముపైనీ యెగురు సింగంబుకరణినీ తరుణి తరుముక వే వెళ్ళెనూ
మానవాధీశుని మార్గంబుకయిజూచి మగువ వేదనబొందెనూ
కాముడా నీవింత కఠినంబుజేస్తివి కాంతునకు నేదల్పెదా
కటిస్తుకొట్టిస్తు కాల్పిస్తు న్ననియిన కండలే గోయింతును
చీరలు జించుకొని రవికలు జించుకొని రవ్వలేతాజేసెను
హారాలుపతకాలు ముత్యాలసరులన్ని ముగుద త్రెంచీవై చెనూ
గుబ్బలుగీరుకొని గాజులుగొట్టుకొని గరితరవ్వలు జేసెనూ
ఆటకత్తయిన యీ పాటలాగంధియు రత్నాంగికొడుకయితెను
రాకాశి అయినాడు - రవ్వలుబెట్టినాడు తనను సతిగాగోరెను
తంటాలుబెట్టెనని తరుణిలేఖవ్రాసి తండ్రికీ పంపగాను
హర్కారులనుపిల్చి సర్కారువారికి జిప్పుననుయిచ్చిరండి
వనములోనున్నట్టి యా నరనాథుండు పత్రికావిప్పిచూచే
రేఖచూచి రాజుకొలువు దిగ్గునలేచి పల్లకిబట్టుమనెనూ
పల్లకీతాయెక్కి మజలీలుతాజేసి పతిమేడకేచేరెనూ
చిలుకలు పలుకవు హంసలు ఆడవు కాంతరాదాయెనెదురూ
కోయిలలుగూయవు అళులయిన మ్రోయవు అతివరాదాయెనెదురూ
అప్సరసలాడరూ గంధర్వులు బాడరూ కామినీరాదాయెనూ
నివ్వాళులూరావు నీరజేతుణరాదు నగరుకళలే దప్పెనూ
సుందరీనీజూచి అందంబుచెడియున్న దందమేమోదెల్పవే
చంద్రవదనా నీదు చక్కదనమంతాను యెక్కడాడాగెనొక్కో

సరసిజాముఖియొక్క సరసకును తాజేరి సల్లాపమాడదొడగె
ముట్టకుమీ వోరాజ మామనయ్యేదునీవు మమ్ము నంటకుమా నెనూ
కోడలూ కూతురుతో నెన్నంగదగునని వేదశాస్త్రముబల్కునే
గవ్వముడితావిప్పి గబ్బిగుబ్బలుజూపి గోరువాటులుజూపెనూ
కోకముడివిడిచి నా కొడుకు జేసినవిధము నాథయిటు చూడుమనెనూ
చిత్రాంగికయిజూచి చిన్నపోయిరాజు చదురునకు తాజేరెనూ
ధర్మశాస్త్రంబులు దగనెరిగియున్నట్టి పండితులబిల్వనంపె
వేదాంతవేద్యులు నీతికోవిదులార వెదకిధర్మముజెప్పరే
బాలుడూగాడు నాపాలింటి పగవాడు కొడుకింత దుడుకుజేసె
తల్లినీబట్టినా తనయునికిదండన తండ్రులారా జెప్పరే
సారంగ నీ బిల్చి సావడికినిదీసి సభజేసె సకలజనులూ
రత్నాలగుమ్మ యీవార్తగయికొని యొకతె రత్నాంగి నగరుకేగె
పట్నంపుదేవియగు పణతినీవు వినవమ్మ పశిబాలునీపాటులు
చిత్రంపునడకులా చిత్రాంగి పతితోను సుతునినేరము జెప్పెనూ
రత్నాంగివినవమ్మ రాజనరేంద్రుడు సారంగుని చంపునూ
తనయునీవల్లను తప్పేమిదెల్పుమని సభవారు సామినడిగె
నీతికోవిదుడయ్యా నీ కొడుకునెన్నగా నిర్మలాచిత్తుడయ్యా
విష్ణుభక్తుడై వర్ధిల్లువానికి విపరీతమేలబుట్టు
సుదతులామాటలూ సూటిగావనిమున్ను శృతులుదెల్పగ దెలియదా
కౌరవాకన్యకను కీచకుడుదాగోరి కాలునీపురికేగెను
అవనిజనుతగగోరి అయిశ్వర్యముఃతోడ అసురుండు హతమాయెనూ
నీ సవతియింటికి వేసరకనేబోయి మోసముజూచివస్తి
గజగామినీయపుడు గాజులూదీసెనూ గుడ్డుయర్రనజేసెనూ
వేడినిట్టూర్పులు వెలదిదానూదీసి వంటరిగపవళించెనూ
కాంతమందిరములోను కలకలధ్వనిలేక కళదప్పియుండెనమ్మా
చిలుకలూపల్కవు కోయిలలు గూయవూ అంచలూయాడవమ్మా
వళ్ళుఝల్లూమని వడలెల్ల నీరయీ రమణిరచ్చకువచ్చెనూ
అన్నసారంగుడా అందేలబోతివీ అపరాధమొచ్చె మనకూ
బాలనీవుపుట్టినా పన్నెడుయేండ్లకూ పాపాలుపండెగదరా
యెన్నొనోములునోచి కన్నాము పుత్రుడా అడవిపాలయితివన్నా

కొలువుసావడి జేరు కొమ్మనితాజూచి కండ్లు యఱ్ఱనజేసెనూ
రాణివాసమువిడచి రాచకన్యవునీవు రచ్చలకు రాదాగునా
మాతృద్రోహుడైన మనసుతుని ఘనునిగా యెంచ లోకులు మెత్తురా
పతిమాటలూవినీ సతియుదాశోకించి సరసవాక్యములునిట్లు
సారంగబాలుడూ చక్కనీ సుగుణుండు వేదవేదాంతవిదుడు
దేవతాభక్తుండు దిననాథతేజుండు ధీరశాంతుండుసుమ్మి
తరుణులనుతల్లిగా తలపులోభావించు తత్తరాపడ నేరడు
కాశీదేశమున కాంపిల్యనగరమున కలడు వొకబ్రాహ్మణుండు
వేదవేదాంగుండు విద్యలకె ప్రౌఢుండు వరతపోధనుడుసుమ్మి
పూబోణికంతటా పుత్రులూలేకున్న పెంచేవకముంగినీ
ముగుదముంగిని పెంచి ముద్దులూబెట్టుచూ ముచ్చట్లుదీరుచుండె
కొంతకాలము జరుగ కంజభవునాజ్ఞచే కలిగెను వరపుత్రుడు
ఆడుతుపాడుతూ అన్నదమ్ములురాగ ముద్దుబాలుడు ముంగిసయు కలసియుండె
తలయంటి తడియెత్తి తూగుటుయ్యెలజేర్చి తరుణితానీళ్ళకేగె
పాపిష్టిదొకపాము బాలప్రాణములోనా పైకివేధుముకగానూ
బాల్యప్రాయమునుంచి పాలించుచున్నట్టి బాలకునికైజూచెను
నాగంబునోటను నాయనుజపోదునా నాథ నీకెవరుదిక్కు
కటకటనుకన్నీరు కాల్వలయియేడిచీ కర్కోటకుని జంపెను
పామునోటను నీవు బాలుడాజత్తువని బాలకునిముద్దాడెనూ
కన్నతల్లంతటా కడవ అచ్చటబెట్టి యేడ్చేటికొడుకేత్తెనూ
నిన్నెవరుకొట్టిరీ నిన్నెవరుతిట్టిరీ నీవు యేడవకుమన్నా
పండ్లయినబెట్టెను పాలయినబోసెను బొమ్మలానిత్తు తండ్రి
అనుచుబుజ్జగించి సుతునితోడజేర్చి స్తన్యమివ్వగజొచ్చునూ
బుగ్గరక్తపుకర్రు భామకండ్లనుజూచి భగ్గునామండిపడెనూ
మగువమగనిబిల్చి మనబాలునికాటు ముంగిసావేసెననెను
సుతునిపై ప్రేమచే సతిమాట తొందరచె జవ్వననుదానిజంపె
ఆడుతూపాడుతూ అందందుద్రిప్పగా మొండెంబుగానుపించె
కాలసర్పముయొక్క కళేబరంచూచి కాంతదా దిగులొందెనూ
కాంతునితాబిలిచి కాలసర్పముచూప కలవరంపడెనంతలో
బాలప్రాయమునుంచి బాలునివలెపెంచి కాలునికి వొప్పగిస్తి

ముద్దులాకొడుకుని ముంగిసాయిచ్చింది ముందుదెలియకపోతిమి
దంపతులు అంతట ధరనిపడిశోకించి దహనంబుజేసెదాన్ని
దశదినంబులకర్మ కడతేర్చివారంత చింతతోగుందుచుండె
మరివక కథగలదు మనుజేశ్వరా వినుము మన్ననతో దెల్పెదాను
చోళదేశమునందు నీచుళాపురంబను చక్కనీ పురిగలదయా
చిత్రకేతుండను మహారాజు ప్రేమతో చిలుకనూ బెంచుచుండె
పక్షిజాతులన్ని పయనమయి పోతూను కీరుమని కేకవైచె
దేవతావనములకు వేవేగపోదాము వత్తువా పక్షిబావా
పార్థునానతిలేక పయినమైపోవుటకు ప్రాణంబు నొప్పదనెనూ
ధరని పాలకుని దాను దగ్గరబిలచి తనపనియు తెల్పెనంత
రాచిలుకనూ బోను రాజు సమ్మతిపడి పంజరపు పక్షినొదిలె
చక్కని చిలుకలతో గుమిగూడి యాపక్షి అంతరిక్షముకేగెను
నదులు నగరులుదాటి నవ సాగరులుదాటి నందనావనముజేరె
చిగురులును గొరుకుచూ కాయలను గొట్టుచూ కొమ్మలా కెగురుచూను
ద్రాక్షలూ దినుచునూ దబ్బలూ గొరుకుచూ కేరి గంతులువైచుచు
పచ్చ మామిడిపండ్లు పక్షు లారగించి పసిబాలకూలయ్యెను
శుకరత్నమంతటా సఖులనుతాజూచి తలపోశె తనలోపలా
మళ్ళివచ్చెదనని మహరాజుతో బల్కి మోసము చేయతగునా
తోటిబాలురతోటి సాటిగానేనును బాలుడయి పడియుంటినా
యెచ్చటి నిచుళపురి యెచ్చటి చోళరాజు ఏగుటా యెట్లుమాకు
అనుచు ఆలోచించి చక్కని చూతఫల ముక్కునా కఱచికొనెను
నదులు నిధులూదాటె నవ పర్వతములుదాటి నగరుకంతట జేరెను
చక్కని పక్షినీ తన చక్కికీదీసి చూతఫలము గయికొనె
కలవర్తమానంబు కీరంబువల్ల విని రారాజు సంతసించె
మడివకటి దున్నించి పండొకటి దెప్పించి పాతించెనందు రాజు
చెట్టయిన యెదిగెను కాయయిన గాచెను పండువొకటి పండెను
పండు నేలనుబడగ ఫణివొక టారగించి పసిబాలు డయిపోయెను
ఆ మాట యెరుగకా హంర్కారు వొక్కడూ అంతిపురియందునా ఆ పండు వప్పగించె
తొలుతవచ్చిన ఫలము తగు పండితులకిచ్చి తరువాత తిందమనెను
బుద్ధికుశలతగలా వృద్ధ విప్రునిబిలచి పండు బహుమానమిచ్చె

పండుదిని బ్రాహ్మణుడు మండలీపతియెదుట దండధరు పురికేగెను
అయ్యయొ బ్రహ్మహత్య అరక్షణములోగగ్గె అధికపాపంపచ్చెను
చక్కని పక్షిని మక్కువతో బెంచుటా మోసంబు వచ్చెననుచు
వాడిగల ఆయుధం వెడిపదునువేసి పంజరపు పక్షిజంపె
పక్షిబోయిన వెనుక పట్నాన వరవేశ్య పుత్రితో పోరాడెనూ
చచ్చిసాధింతునని చొచ్చి తోటలుదిరిగి చెట్టుక్రిందా జేరెను
పడియున్న పండుదిని పణతి పన్నెండేండ్ల బాలకన్యక ఆయెను
యీవింత అంతయును ఆ చెంతనున్నట్టి చారులు దెల్పగాను
వారకాంతను బిల్వ వైఖరంతయు దెల్ప నివ్వెరా బొందె రాజు
దూరంబుచూడకా దురుసుతనమూచేత కీరంబు జంపితిని
నా ప్రాణనాధుడా నా సుతుని జంపుటా న్యాయంబు గాదుసుమ్మి
కొడుకుపేరూ జెప్ప కోపంబుపడి రాజు కాలరుద్రుడాయెను
పట్నంపు దేవినీ మెడపట్టి గెంటుడీ ద్వారములు దాటించుడీ
కన్నీరునించుచూ కలవరంబొందుచూ కాంత యటుపేగతరలే
తనయుణ్ని బిల్పించి తలవరుల కిప్పించి కట్టించె సారంగుని
నేరమేమియులేదు నా వ్రాతఫలమేమొ బ్రహ్మయీలా వ్రాసెను
తండ్రితో యీ మాట తనయుండు ఆడగా పుడమిజనులెల్ల వాడలె
పరిచారకులు తమ బాహులాపై చికొని హారహారాయనుచు నడచె
వో చంద్రవంశజా వో రాజపుత్రుడా నిన్నెట్లు చంపుదూము
చేతులు ఆడవు చెదరెనూ గుండెలు ఛేదింతు మీకట్లను
పరభూమికి వెళ్ళి ప్రాణంబుదాచుకొని బ్రతుకుమీ బాలకుండా
అడవిలోకి వెళ్ళి ఆకుఅలములుదిని డొంకల్ల దాగుండుమీ
దొంగనయి నేనెట్లు పరభూమికిబోదు ధరణిజనులూ నవ్వరా
తండ్రి దయివంబని ధర్మశాస్త్రముబల్కు తప్పి యెటునడువదగును
రాజనరేంద్రముకు యోజనా దూరమున పణగు బండలమీదను
పరుపు కొండలమీద రుద్రవృక్షము క్రింద బాలునీ పడవేసిరీ
కత్తులును నూరియూ కాళ్ళుచేతులు గోసి కండలును తెగగొట్టిరీ
దిక్కులూ గదలెను చుక్కలురాలెను సురలెల్ల ఘోషలిడిరీ
చిన్నతనమూనుంచి శిరిసంపదలతోను పెరిగియున్నా పుత్రుడూ
పన్నెండు యేండ్లకు పాశంబులోబడి పలవరించుచుండెను

ఆకాశవాణియో మాయమ్మ భూదేవి పార్వతీ పరమేశ్వరా
ఓ సూర్య చంద్రుడా యో బ్రహ్మదేవుడా నన్ను కాపాడరయ్యా
శ్రీరామచంద్రుడా సీతామహాదేవి విభీషణవరద గావు
తల్లడంబొందేటి ధరణిపతినిజూచి తలవరులు వాడలుచూను
కాలును వక్కటీ కరమున వక్కటీ ఆనవాలుగదీసియూ
ప్రబలమగు సభలోన పట్టభద్రుండుండ కరపాదములుజూపెను
ఆనవాళ్లూజూచి అతివకూ యిమ్మని పంపె నంతీపురముకూ
పడతిజేసినపనీ పరమాగడంబని తలవర్లు నిలచుండిరీ
అర్ధరాత్రీవేళ అరణ్యామందునూ అచ్చటీ రుషిసంఘమూ
కాకులుదూరని కారడవిలోపలా శోకమేలాగలిగెను
చీమలుదూరనీ చిట్టడవిలోపలా చింతయేటికిగలిగెను
అనుచునూ చింతించి పరిచారకుల బిల్చి బాలుణ్ణి దెప్పించెను
పున్నమ చంద్రుడో పూర్ణేందువదనుడో మన్మథుని కుమారుడో
ఏడేడు భువనాల వెతకినప్పటికయిన యిట్టిసుతుడేల గలుగు
బాలుండుగాడయ్యా భగవంతునీరీతి బ్రహ్మసృజియించెనేమొ
తల్లితండ్రులు యెంతో ధన్యులయియుండిరో యిట్టితనయుడు గలిగెను
నెత్తురూ కండలూ రక్తపుధారలూ ఏరులయిపారె నపుడూ
పరమపురుషు లెల్లాను పరితాపమును బొంది పట్టిదగ్గరజేరిరీ
పుట్టినా స్థళమేది తల్లిదండ్రూలెవరు తనయ మాకెరుగించుమూ
కరపాదములు నీకు ఖండించు కారణము చంద్రవంశజ జెప్పుమా
సన్యాసులనుజూచి సారంగుడడలుచు సాధులారాజంపుడీ
ఋడియహూమనివచ్చి సిద్ధుదరిజేరి తనయునీచేత దువ్వె
ఆకాశవాణియు నంతలోనేవచ్చి కలనిజంబెల్ల దెలిపే
కమలాసనునివేడ కాళ్ళుచేతులుదెచ్చి బాలకునికే అమర్చిరీ
ఆచంద్రతారకం యీచంద్ర వంశజుడు జోగులతోకూడియుండె
నా వంశవర్ధనా నాదుముద్దులపుత్ర నాతిమాటలునమ్మియూ
భూతభేతాళులకు బలిగానుకట్టిస్తి యెంతపాపీ నయితినీ
అనుచు ఆలాపించి గద్దెపయి మూర్ఛిల్లి గిర్రునాక్రిందపడెను
చీరెతెరలోనుంచి చిత్రాంగితావచ్చి తలవర్లతాదిట్టెను
కల్లలాడేవారు కాలులారా మీరు కపటమాటలుయేటికి

అడవిలో బల్కినా ఆకాశవాణి యీ అపనీకునను జెప్పరాదు
ఆకాంతమాటలకు ఆకాశవాణొచ్చి రాజురక్షనునిలచెను
మండలీపతివయ్యా మహనీయగుణధయిర్య మహారాజులేవవయ్యా
ప్రహ్లాదునీవంటి పరమభక్తుడు పీడు పాతకంబనకగొట్టా
చిన్నిబాలునిజంప చేతులెటువచ్చెను జాలియంతయు లేకను
స్త్రీబుద్ధి ప్రళయమని శత్రులుబల్కుచునుండ స్త్రీలచెయి జిక్కితివి
కాలసర్పమువంటి కాంతచేతిలో జిక్కి కొడుకునూ జంపితివి
చిన్నభార్యలవలన యెన్నలేని దోషంబు కన్ననాగలిగెను
ఆదేవిపల్కులు వసుధేశుడువిని వనితను బిల్పించెను
దయ్యమారాశివో గ్రామదేవతా నాపాలిపెద్దమ్మరో
పెనుభూతమువలె పట్టంబులోజేరి బాలునిజంపిస్తివి
ఆగ్రహంబున అపుడు తలవరుల బిలిపించి నరికించెనా దేవిని
పాతకంబనకను సతిసుతులకంపితిని ఎంతపాపిస్తైతిని
యీ రీతిదేవితో రాజనరేంద్రుడు దుఃఖమును బొందగాను
వేటలోకెల్లిన బాటసారులుకొంత రాజపుత్రునిజూచిరి
కుడికన్నుమెల్లనా ఎడమకన్నుమచ్చ చింకిజడలే చూచిరి
పుట్టిందిమొదలుగా పెంచిపున్నాయట్టి దాదులుతగజూచిరీ
జోగుల్లతోనున్న భోగవతినిజూచి దండ్డంబులే బెట్టిరి
బాలుణ్నిజూచియూ పరమసంతోషమున రాజకొలువుచేరిరి
ఓ రాజదేవేంద్ర వోయి సద్గుణసాంద్ర నీకువకమేలు చెప్తిమి
చనిపోవలేదయ్యా సారంగుడూ నేడు జోగులలో కలశుండెనూ
చెదురుమాటలేల చారులారామీరు చచ్చినావాడొచ్చునా
చెల్లిపోయివాడు నెలదినములాయెను మళ్లివచ్చునా భూమికి
కుడికన్నుమెల్లనా యెడమకన్నూమచ్చ గుర్తంతచూచివస్తి
పణిహారుదెల్పినా పలుకులూవినగానె పణితికిపొలుగురునె
యేకోర్ధూమునవారు యేణాకాక్షితోగూడి వెళ్ళిరీ పర్వతముకు
సిద్ధులనుజూచిరీ సాధ్యులనుజూచిరీ సన్యాసులను జూచిరీ
జోగులనుజూచిరీ భస్మంబుబూసియు బాలజోగయియున్న కన్నబాలుని జూచిరీ
మాకులాదీపకా మావంశరక్షకా పుత్రరత్నమరావయా
పాలైనదాగుమీ పండ్లయిన భక్షించు మంచమున శయనించుమీ

స్త్రీల పౌరాణికపు పాటలు

రత్నాలతోడుగులూ రావిరేఖయు బెడుదు రారాజు రమ్మనేనూ
తల్లిదండ్రులుయేల ధనసంపదలు యేల చెల్లిపొయ్యేవారికి
ధర్మమేతలిదండ్రి ధర్మమేతోడుసుమీ ధర్మమే పట్టుకొమ్మి
రాజ్యంబులూ యేల రచ్చలు నాకేల రత్నంపుసొమ్ములేల
రాజయోగంబిచ్చు రాజాధిరాజొకడు అంతరిక్షమున వెలుగు
యీ రీతి హితవులూ యింపుతోడుత బల్క చిత్రాంగి చిహ్నలడిగె
చంపితిని చెలియను కండలునుగోయించి కాకులకు వేయిస్తినీ
హారహారాయని చెవులు అంతలోనేమూసి నిర్భ్రాంతు డయిపోయెను
దేవాదిదేవతలు కులదయివముల నెల్ల సిద్ధులను ప్రార్థించెను
తండ్రినీచేబూని తల్లియున్నచోటు తాను తెలిసికొనెను
భగవంతునిదలచి కమిడిబెత్తముచేత భూమిమీదను కొట్టెను
వింత అయినా వేరువిశల్య కరుణనొకటి కాంతశిరసున పారెను
శల్యంబు లాపని సంజీవితాకగా చిత్రాంగిలేచి వచ్చె
అయ్యో నా పుత్రుడా అపకీర్తి పాలయితి నేనయినయిటుజేస్తినే
మా తప్పులను మన్నించి మమ్మురక్షించి మహియంత యేలవయ్యా
పణతిజెప్పిన మాట పాటిసేయక నంత బయిరాగులలోగలిసెను
తల్లులకు దండ్రులకు తగ ప్రదక్షిణంచేసి తాను మరల్విచ్చెను
రమణులిద్దరు తాను రారాజు పురిజేరి రాజమంద్రంచేరెను
సాధ్యులతో గూడి సారంగుడచ్చట శివపూజచేయుచుండె
బలువయిన పాతకం బాసును యీ కథా వినిన పాడినవారికి
సిరియు సంపదగలిగి స్థిరజీవులైనను వర్ధిల్లుచుందురా సారంగధరుని రీతి.

# ధర్మాంగచరిత్రయను పాము పాట

శ్రీగణాధిపదేవ శ్రీకంఠతనయ - దలచి నే మ్రొక్కెదను దయయుంచుమయ్యా
శారదాదేవినే సన్నుతించెదను - సకల శుభముల నొసగు సదయు బాగుగను
మూడు మూర్తులకెల్ల మూలమయినట్టి - వైకుంఠవాసునకు వందనము జేసి
కైలాసగిరిలోని కాలకంఠునాకు - కరమొప్ప నతిజేసి కవులను దలంచి
ధర్మాంగ చరితంబు ధరణిలో నేను - చెప్పెద వినరయ్య శ్రీపతీ మీకు
తప్పక శిరులిచ్చు తథ్యంబుగాను - ఘనుడు సూతుడు శౌనకాదులతోను
చోద్యంబుగా జెప్పె వ్యాధ్యమౌ కథను - శౌనకముని సూతసూనుని జూచి
మేలగు పతివ్రత యే లోకమందు - వెలుగుచున్నదో తెలియగా మాకు
చెప్పంగవలెనంచు చేరి ప్రార్థించ - సూతపౌరాణికుడు ప్రీతితో జెప్పె
కాశ్మీరదేశాన కరమొప్పుచుండు - కనక పురంబను ఘనపురముగలదు
ఆ దేశమందున అమరినయట్టి - నలువర్ణములవారు నయశాలులరయ
నాపురంబేలు ధర్మాంగ భూవిభుడు - ధర్మప్రకారముగ నగ నేలుచుండు
పేదసాదలయందు ప్రియమెపుడు జూపు - ఆ రాజు ప్రియపత్ని అర్మిలిదేవి
లక్ష్మిదేవికి సాటి లలిమీరుచుండు - అర్మిలి ధర్మాంగులను సకల జనులు
శ్రీసతీ విష్ణులని చెప్పుదురు ధరను - వారికి భాగ్యంబు వలనొప్పుచుండు
ఏనుగులు గుర్రాలు యెలమిగా గలను - పాడియు పంటయు బాగుగాగలదు
చుట్టాలు హితులును నొరదిగాగలరు - ఇన్ని భాగ్యములుండి ఇంపుగాదయ్యె
సంతాన హీనతను దలపోసి రాజు - దాన ధర్మంబుల దనరంగజేసె
గుళ్ళు గోపురములు కొమరొప్పగట్టె - సత్రముల్ గట్టించె సకలజనులకును
అంత కొన్నాళ్ళకు నర్మిలిదేవి - కమలాక్షు కృపచేత గర్భంబుదాల్చె
అప్పుడు ధర్మాంగు డానందమొందె - పురజనంబులు విని పరితోషముగను
యర్మిలిదేవిని యనుదినము జూచి - యుపచారములు జేసి యూరడించుచును
కడువేడ్క కొన్నాళ్ళు గడచినయంత - యేడవ నెలలోన యెలనాగకపుడు
సీమంతమును జేసి చెలువుమీరంగ - బంధుమిత్రులు విందు బాగుగా జేసి
వేవిళ్ళు దీర్చిరి వెలదిమనమలర - తొమ్మిదవ నెలలోన తోయజాక్షికిని
గర్భవేదన కల్గి కనుతెర్రనాయె - యా బాధపడలేక అచ్యుతునిగూర్చి
అర్మిలి వందనములర్పించె మిగుల - ఆ మీద తన దేహ మతిభారమగుట

మంత్రసానులు మిగుల మన్ననతోడ - యూడిగంబులు జేసి యువిదబాధలను
ధర్మాంగునకుదెల్ప దగను శ్రీహరిని - ధ్యానించి మైమరచి ధరమీదబడియె
అప్పుడు మంత్రులు అవనీశునకును - ఉపచారములు జేయ నొప్పుగాలేచి
మంత్రులతోగూడి మలయుచునుండ - మంత్రసాని యొకతె మరివచ్చినిలచి
భూమీశయిపుడు నేనేమి జెప్పుదును - అర్మిలిదేవియు అతిమూర్ఛతోడ
ఒడలు తెలియక నేలపడియుండు వేళ - పుట్టలోపలపాము పొగలిడురీతి
బుస్సుబుస్సనుచును పుట్టెశేషుండు - ఆ పాము తల్లి శయ్యను ముద్దుగాను
చుట్టుకొని పడిగను సొంపుగానెత్తి - తల్లిమోమును జూచి తగపైన నొరిగి
అట్టిట్టు తిరుగుచు నలరారెననగ - ఆ మాట వినియు ధర్మాంగ భూవిభుడు
అట్టె మూర్ఛనుబొంది అవనిపైబడెను - అప్పుడు మంత్రులు ఆ రాజునకును
శైత్యోపచారములు సల్పినయంత కొంత ప్రొద్దుకులేచి - చింతనముజేసి
ఓ మంత్రులార యీ భూమిలో నేను - చెడ్డపాపంబును జేసితినోగాని
దనరంగ నాపాలి దైవమొకడైన - దయజూడడాయెను ధరణిలో నేను
బ్రతికిన ఫలమేమి భాగ్యముల్ నాకు - గలిగియుండియు నేమి గార్యంబుగలదు
ముగుదయా యర్మిలి మూర్ఛతాదెలసి - పామునుజూచితే బ్రతుకునా భువిని
అనియిట్లు తలపోయ నా మంత్రులనిరి - వినుము భూమీశ్వర విధి దాటవశమె
పూర్వకర్మంబును పొంది మానవులు - భూమిలో పుట్టుదురు పోనాడదరమె
పాముపుట్టిన వార్త పరరాజులకును - చెవిబడ్డమనలను చిన్నబుత్తురుగా
కావున మీ రిపుడు కాగల పనిని - క్రమముగా జరిగించి కడుకీర్తి పొంది
పరులకు పరిహాసకరముగా నీక - యుండుటేబాగని యొప్పుగాబల్క
మరియు ధర్మాంగుడా మంత్రులమాట - లాలించి విని దేశమంతటనపుడు
సంపూర్ణ సౌభాగ్య సంపన్నుడయిన - కొమరుండు గల్గెనని కోవిదులకెల్ల
షోడశ దానములు సొంపుమీరంగ - జేసె హరికర్పణంబని యా రాజు
ఆవల నర్మిలిదేవి తా మూర్ఛ - దెలియంగ గర్భంబు పలచనయియుండ
మంత్రసానుల జూచి మా బిడ్డడేడి - అని మంత్రసానుల నడిగిన వెరచి
దీనత నొక మంత్రసాని యిట్లనియె - ఏమి జెప్పుదునమ్మ యిందీవరాక్షి
భామ నీ గర్భమున ఫణిరాజు పుట్టె - నని చెప్పినంతలో నర్మిలిదేవి
కొట్టిన చెట్టువలె నట్టె తా బడెను - మాట లేదయ్యెను మధురవాణికిని
అప్పుడు చెలులెల్ల నసువు మీరంగ - శైత్యోపచారములు సలిపి ప్రియముననను
మించు నేర్పున నూరడించిన మీద - అర్మిలిలేచి తా నతివలజూచి

యేమి సేయుదునమ్మ యీ జన్మమెత్తి - మహారాజపత్నినైయు మన్ననలబొంది
సంతానమునకునై సకలదానముల - నిచ్చితి నా కర్మ మిట్లయ్యెనమ్మ
పదునాల్గు జగముల పాము పుట్టుటయు - కనివిని యున్నారె కామినులార
అనినంత నొక చెలి అర్మిలితోడ - నిట్లని వాక్రుచ్చె నిభరాజగమన
కశ్యపమౌనికి కద్రువయనెడు - భార్యకు పుట్టెను పాములు నూరు
ఆ పాములే గదా యష్టదిక్కులను - ధరియించియుండుట తరలాయతాక్షి
కావున మదిలోన కలతల నుడిగి - కమలాక్షుగొల్చుచు కాలంబుగడుపు
ప్రారబ్ధముడిగిన ఫణిరాజు నీకు - పరమేశు కృపచేత వరతనయుడగును
యనిచెప్పినంత నా యర్మిలిదేవి - చింతదూరము జేసి చెలులను జూచి
ఆదిశేషుండేడియని యడిగినంత - పెలుచన మంత్రసానులు పాము జూప
చూచి యర్మిలిదేవి శోకించె మదిని - ముట్టశక్యముగాక బోగలుచునుండ
ధర్మాంగుడంపెను ధర్మపేటికను - ఆ పెట్టెలో సర్పమమరపరించి
పుట్టలో జొచ్చెడి పొలుపు వహించె - దనర నర్మిలిదేవి తన చంటిపాలు
బంగారు గిన్నెలో పట్టిపెట్టంగ - ఆ పాము ద్రాగెను యనుపొప్పుగాను
అంత నర్మిలి స్నానమాడించి యపుడు - పదునొకండవనాడు ప్రజలు మెచ్చంగ
పుణ్యాహవాచనము పొందుగా జేసి - దానాదులెల్లను తప్పక నిచ్చి
అందరిని సంతోషమందించె రాజు - ఇట్లుగా చెల్లె పదియేను వర్షములు
పదునారుయేండ్లకు బాలరాజునకు - పడుచు నిచ్చెదమని పరదేశమేలు
పృథివీశులందరు వియ్యంబుసెయ - నాసించి శుభలేఖలంపుచుండగను
ధర్మాంగుడును తన ధర్మపత్నియును - జాబులు జూచియు సంతాపమొంది
అప్పుడు మంత్రులు నవనీశుజూచి - ధరణీశునకు చాల ధైర్యమున బల్కి
వచ్చిన జాబులకు మెచ్చునట్లుగను - బదులెట్లు వ్రాయంగవచ్చునని యడుగ
మంత్రులాలోచించి మహిరాజునకును - పరమసమ్మతముగా పల్కిరెట్లనిన
దేశదేశములకు తెరగొప్పగాను - స్వర్ణరేకులయందు జాబులను వ్రాసి
మన పురోహితులను మన్నన జేసి - యంపించి కన్యల ననువుగాజూచి
సకల లక్షణములు సౌభాగ్యములను - కలిగిన కన్యను గైకొందమనిన
మంత్రుల మాటలు మదినెంచి హరిని - భక్తిని ధ్యానించి పత్రికలు వ్రాసి
పౌరోహితుల బిల్చి పత్రంబులిచ్చి - తరలించె ధర్మాంగ ధరణీశుడపుడు
అంత పురోహితు లచ్యుతునిదలచి - దిక్కులన్నియు దిరిగి దేశదేశముల
రాజుల కన్యల రహిమీర జూచి - తనరశేషునకు పొంతనములు లేక

మదిచింతగొని మీద మాణిక్యపురము - పోయిరి విప్రులు పొలుపొందగాను
ఆ పురంబేలు రత్నాంగ భూవిభుడు - వరపురోహితులకు ప్రణతులొనర్చి
వచ్చిన కార్యంబు వనరుగా మీరు - వినుపింపుడని వేడ విప్రులిట్లనిరి
కాశ్మీరదేశంబు కడుసొంపుగాను - పాలించు ధర్మాంగ పతితనయునకు
తగిన కన్యక జూచి తరలి మీ కడకు - రహివచ్చితిమనంగ రత్నాంగ రాజు
అత్యంత సంతోషితాత్ముడై యపుడు - తన పురోహితులను ఘనుల రప్పించి
యీ శుభవార్తను యెరిగించెనంత - నా పురోహితులు ధర్మాంగ సుపుత్ర
జాతకంబడగిరి సంతసంబునను - కనకపురీ విప్ర ఘను లిట్టులనిరి
మా రాజవంశజుల మహిజాతకములు - వ్రాయించువాడుక వలనొప్ప లేదు
అందంబు చందంబు ననువుగానున్న - పరిణయమును జేసి పద్మాక్షువ్రతము
వలనొప్పదీర్చి శోభనము జేయుదురు - అనిన మాణిక్య పురాగ్రజన్ములును
మంత్రులు మొదలగు మహితబంధువులు - ధర్మాంగ రాజుతో దగవియ్యమంద
కాంక్షించి సంతోష కలితాత్ములగుచు - వినవయ్య రత్నాంగ వేడ్కతో మనము
ధర్మాంగ రాజుతో దగవియ్య మంది - యశమునొందగవచ్చు నవనిలోపలను
అనిన రత్నాంగుడత్యానంద మంది - వేడుకమించ విప్రులజూని పలికె
ధర్మాంగసుతునకు ధాత నాసుతను - ధర్మపత్నిగ జేయ తప్పింతురెవరు
పొంతనంబును లేక పుత్రినిచ్చుటను - జూచి నిందింతురీసున లోకులనిన
విప్రులిట్లనిరి భూవిభుతోడ నధిప - సుఖదుఃఖములు రెండు సొంపుగా వ్రాసి
ఇష్టదైవము ముందరింపారనుంచి - యెత్తింప సుఖపత్రికెత్తి నట్టయిన
ధర్మాంగరాజుతో దనరంగమనము - వియ్యమందగవచ్చు వేడ్కతోననిన
అపుడిష్టదైవమున కభిషేకములును - పూజలర్చనలును పొందుగా జేసి
సుఖము దుఃఖమునని సొరదిగా రెండు - పత్రికలన్వ్రాసి బరిణెలోనుంచి
కన్యనెత్తుమనంగ కమలాక్షుదలచి - సుఖమున్న బరిణను సుదతియెత్తంగ
అందు సుఖమనియుండ హర్షంబునొంది - రత్నాంగుడపుడు ధర్మాంగరాజునకు
శుభరేఖవ్రాసి భూసురుల కందిచ్చి - వారినిపూజించి వసుధేశుడంప
వేడ్కతోవచ్చి తమ విభునకిట్లనిరి - దేవరతమయాజ్ఞ దేశంబులన్ని
జూచి పొంతనములు జూపట్టకున్న - బర్బరపాండ్య కళింగ కాంభోజ
మహారాష్ట్ర మాళవమత్స్య నేపాళ - అంగ వంగ పుళింద కర్ణాట ద్రవిడ
కోసల కేకయ కుకురుకహోటా - వైదర్భ కొంకణ కొంకణంబులును
దేశంబులందునగల కన్యకలను - పోయిచూచితిమయ్య పొంతనములేదు

ఆ మీద సౌరాష్ట్రమనెడు దేశమున - మాణిక్యపురమును మహిమతో నేలు
రత్నాంగరాజును రహిమీరగాంచి - శుభలేఖ నీయంగ శుభమస్తుయనుచు
మంత్రిపౌరోహితుల మరి బంధుజనుల - నిలిపించియడిగిన ప్రియముతో వారు
ధర్మాంగరాజుతో దగును వియ్యంబు - రమణీయ మనసంత రత్నాంగ రాజు
జరిపిన విధమంత చక్కగాదెల్పి - శుభలేఖజూపింప జూచి హర్షించె
అంతయు వినిన సాధ్వి యర్మిలిదేవి - వేడ్క కోడలిరూపు వివరింపుడనిన
తన పురోహితులపుడు దగనిట్టులనిరి - ఆ కన్యకామణి యంగసౌష్టవము
వినుతింప బ్రహ్మదేవునికైన వశమె - ముఖము చంద్రునిబోలు ముదిత కనుబొమలు
కంతునిశింగిణుల్ కనులు కమలములు - మల్లెమొగ్గలబోలు మగువరదనాళి
కంఠంబు శంఖంబు గతులుకరిగతులు - అని చెప్పగావిని యర్మిలిదేవి
యిట్టి సుందరపతిని యీ పామునకును - పెండ్లిజేసితిమేని పిదప నేమగునో
యనుచు దుఃఖించి శ్రీహరికరుణింప - మనపాము బాలకుమారుడగుననుచు
మరియు త్రయిలోక్య సుందరి సుఖమనెడు - వ్రతంబుగైకొని మహిమతోడంగ
జయమగునని మహాసంతోషమొందె - అంతలో ధర్మాంగుడా పెండ్లిపనులు
సిద్ధంబుసేయుమనిజెప్పె మంత్రులకు - సకలసన్నాహముల్ సమకూర్చియతడు
దేశదేశములకు తెలియంగజేసి - రంగుగా రత్నాంగ రాజున కపుడు
సరగునలగ్న నిశ్చయలేఖనంపి - తగు బంధుమిత్రులు ధరణీశులెల్ల
వచ్చిరి ధర్మాంగ వసుధేశుపురికి - మహితరత్నాంగుడు మంత్రులగూడి
బంధుజాలముతోను పల్లకినెక్కి - త్రైలోక్యసుందరీ తగుచెలులగూర్చి
కనకంబు రధముపై కైజేసితెచ్చె - మరునాడు శుభలగ్నమందున పెండ్లి
విభవముగ కర్తికివేడుకతోజేసి - వియ్యాలవారికి వేడుకగాను
వచ్చినవారికి వలనొప్పగాను - సకలజనంబులకు సంభ్రమముగాను
అతిధులకెల్లను హర్షంబుగాను - పండితులకెల్లను బాగొప్పగాను
బ్రాహ్మణజనులకు పరమదయగాను - విందులు మర్యాద వివిధరీతులను
జరిపెను ధర్మాంగధరణీశుడపుడు - ప్రతినిధిమర్యాద రత్నాంగరాజు
క్రమముదప్పకజేసె కడుచోద్యముగను - ఇవ్విధంబున పెండ్లి యింపుగాజేయ
రత్నాంగుడత్యంత ప్రమదంబునొంది - ధర్మాంగరాజును దగవీడుకొల్పి
త్రైలోక్యసుందరికి తగుబుద్ధిచెప్పి - అర్మిలిదేవితో అరమరిలేక
తనకుమార్తెను మిగులదయ హెచ్చుగాను - పుత్రికిసమముగా పోషించుమనుచు
విన్నపముజేసియు వేడుకమీర - రత్నాంగుడాత్మ పురమునకు మరలె

ఆమీద కోడలి నర్మిలిమిగుల - ప్రేమతోపుత్రివలె పోషింపుచుండ
ఇట్లుగాకొన్నాళ్ళు యేగినమీద - త్రైలోక్యసుందరి తననాధుజూడ
మదిలోన తలపోసి మలయుచుండంగ - కన్నుల తనభర్త యెన్నాళ్ళకయిన
కనబడకుండంగ కన్నీరుబుట్టి - వ్యసనంబుతో నొక్క ప్రక్కకూర్చుండి
కమలేశు మది చింతనముచేయుచుండ - అత్త యర్మిలిదేవి యనుగుకోడలిని
జలకమాడుటకునై పిలువంగవచ్చె - త్రైలోక్యసుందరి నతిజేసిముందు
పిలిచిన యత్తను నెరిచూడకుండె - అర్మిలితనలోన వ్యసనంబునొంది
ఇన్నాళ్ళుకోడలు యెదురుగావచ్చి - ప్రణతులు జేయును బాగొప్పగాను
నేడేమొ చింతతో నేనువచ్చుటయు - ననుకనుగొనలేక నతముఖియగుచు
నేలజూచుచును గన్నీరునువిడచి - వనటజెందుచునున్నదని మదిగుంది
త్రైలోక్యసుందరి దగ్గరజేరి - అర్మిలియిట్లని యనువొందబల్కె
నాముద్దుకోడలా నాగృహలక్ష్మి - నాభాగ్యదైవమ నామూలధనమ
నానోముఫలమ యోనాదైవవరమ - నీవిట్లు శోకింప నేమికారణము
మనసఖులెవరైన మారాడినార - మామగారేమయిన మాటాడినార
పనివారలేమయిన భాషించినార - పరిచారికలువచ్చి పనిజేయలేద
నీతలిదండ్రుల పైతలపులున్నె - నీమదిలోచింత నిఖిలంబునాకు
వివరంబుగాదెల్పు వెలదియని యడుగ - త్రైలోక్యసుందరి తలయెత్తిబలికె
వినవమ్మ అత్తమ్మ వివరంబుగాను - సేవకజనములు చేరిననుగొల్చి
ఆదరించెదరు శ్రీహరిసాక్షిగాను - కొదువేమిలేదు మదికొరతగలదొకటి
నాభర్తసేవకు నాప్రాణములను - అర్పించుటకుజాలవగ చింతనేను
విలపింతుననగ యర్మిలిదేవియపుడు - కడుప్రీతికోడలి గౌగిలించుకొని
ధర్మాంగునొద్దకు తరుణిగొనిపోయి - జరిగినదంతయు సతివినుపించ
ధర్మాంగుడప్పుడు తనలోన గుంది - వ్యసనంబు బైటికి ప్రకటింపనీక
త్రైలోక్యసుందరిని దయతోనుజూచి - ధర్మాంగుడిట్లనె తనకోడలికిని
కరుణతోకాంత మనయింటను కత్తికిబెండ్లి - కావింపనటమీద కమలాక్షువ్రతము
చైత్రపాడ్యమియందు సతిచిత్తభమున - ప్రారంభమయి మరువత్సరంబునను
ఉద్యాపనముజేసి యుండిననుగాని - భర్తనుకనులెత్తి పరికింపరాదు
అంతలోజూచిన నర్థాయువగును - ఈ రీతి కులగురులేర్పరచిరనిన
తరుణి త్రైలోక్యసుందరి సంతసించి - మరలకొన్నాళ్ళకు మధుమాసమునను
కమలాక్షువ్రతమును కరమొప్పజేసె - వలనొప్ప నొకయేడు వ్రతమాచరించి

ఉద్యాపనంబును నొనరంగజేసి - షోడశదానముల్ సొరిదిగాజేసి
ఘనవిప్రవరుల దీవెనలు తాబొంది - యీ దినమున భర్త నరయుమనుచును
యుప్పొంగి యత్తతో నుచితంబుగాను - తనభర్త దర్శనము దయచేయుమనుచు
తరుణి త్రైలోక్యసుందరి యడిగినంత - యప్పుడర్మిలి యేమియనలేకయుండె
మూతిపైగుడ్డను యువతి మూసికొనియుండ - నరసి త్రైలోక్యసుందరి తనలోన
ఇదియెంత విషయని మదితలపోసె - ప్రాణంబు విడుతునని పంతంబుజేసి
త్రైలోక్యసుందరి తనభర్తపైని - పంచప్రాణంబులు పరగంగనిల్పి
విలపించుచుండంగ వెలదులుగూడి - దుఃఖించుచుండిరి దోచకేమియును
అంతటనొకచెలి వ్యసనంబుదీర్ప - పొంపుగ త్రైలోక్య సుందరిజూచి
ఓయమ్మ నీమగండున్నాడుగాదె - ఆదిశేషునివలె అమరియున్నాడు
నిజముచెప్పితినమ్మ నీమనసులోన - పసుపుకుంకుమమునకు భాగ్యంబుగలదు
సంతానసుఖమేమి సంభవించదుగ - త్రైలోక్యసుందరి తనమదిలోన
కలతజెందుచు మరల చెలియనుజూచి - వివరముడిగినయంత వెలది యిట్లనియె
అర్మిలికడుపున ఆదిశేషుండు - పుట్టుకలన ధర్మాంగభూవరమణుండు
చింతింపమంత్రులు వింతలుపన్ని - కత్తి పెండ్లియటంచు కాంతుండు నీకు
కావించిరనిజెప్పె క్రమమొప్పనపుడు - పన్నినకపటంబు లన్నియుదెలిసి
విధిని నిందించుచు విభునికైజాల - తత్తరపడి తుదకు ధైర్యంబుగొనియు
అత్తమామలకును అంజలిజేసి - ఇట్లనిబల్కెను ఇంపుగానపుడు
అత్తమ్మనీమదిని ఆరడిజెంది - విలపింపరాదమ్మ విష్ణుమాయకును
నీకేలచింతింప - నాకర్మఫలము
నాకయ్యె నాభర్త నాకిచ్చిపంపు - నేను నూటెనిమిది నిధుల తిరుపతుల
దిరిగి స్వామినిసేవ మరిమరిజేసి - నానాథుయువరాజుగా నొనరించి
సకలభోగములను సంతోషముననను - అనుభవించుదునమ్మ అత్తరోభువిని
నాభర్త నీకుమారుండౌగదమ్మ - నాపుణ్యఫలమున నీపుత్రకుండు
శేషరూపముమాని సీతాంశుపగిది - వెలుగొందుచుండును విష్ణునికృపను
ఏదేవుడయిన నాకీ పతిభిక్ష - పెట్టకపోవునా పృథివిలోపలను
పణతులెందరొ మున్ను పతులనుబడసి - ఆనందమొందరే అత్తమ్మ యనిన
అర్మిలి మూర్ఛిల్లి అతిదుఃఖమొంది - ఆసుందరినిజూచి యర్మిలిదేవి
ఒంటిగాబోయిరె యువతు లెచటైన - పరులు నిందింతురు భావమెరుగకను
అనినంత సుందరి అత్తమ్మవినుము - పతితోడబోయిన పణతులనెవరు

దూషింపబోరమ్మ దూరుసేయరుగ - నా మనసు శోధింప నలువకుతరమె
నే పతివ్రతనైన నెవరెట్లు నన్ను - దూషించినను నాకు దోషమేమమ్మ
నీ కులము నా కులం బేకమేకాని - కులముజెరిపెదు కుటిల నేను గానునేడు
అర్మిలిమారు మాటాడంగ లేక - తనలోన దుఃఖించి ధవునితోజెప్ప
నా రాజు సుందరి నూరడింపంగ - సుందరి మామను జూచి యిట్లనియె
నా కర్మ ఫలమేమొ నాకగుగాని - మీరు విచారింప కారణంబేమి
నా భర్త ఫణిరాజు నాకిచ్చి నన్ను - అధిక సుమంగలి యనుచుదీవించి
దయచేయుమన నొచ్చి ధర్మాంగ విభుడు - చిత్తంబులోగుంది శేషుడున్నట్టి
కుందనపూ బుట్ట కోడలికియిచ్చి - అతిసుమంగలి యగుమనుచు దీవించి
ధర్మాంగుడర్మిలి తగు బంధుజనులు - యిరుగుపొరుగులవారు యింటిలోవారు
హాయని దుఃఖింప నూరిజనులంత - పరుగు పరుగునజూడ వచ్చినవారు
వినినవారెల్లను విలపించిరపుడు - త్రైలోక్య సుందరి తగవార్కి మ్రొక్కి
శిరమున శేషుని ధరియించుకొనియు - హరిహరీయని తలచి యతివ తానడచె
అడవులు నేరులు నదులునుదాటి - రాత్రి పగలనకను రమణినడచె
ఘోరమృగంబుల ఘోషముల్ వినుచు - బెదురుచు నడచెను విభునిదలచుచును
పతినాకు నిమ్మ శ్రీపతిదేవయనుచు - పురుషుని దయచేయు పరమేశయనుచు
నాథు నిప్పింపుమీ నలినాక్ష యనుచు - అతికష్టపడి సింహాచలాదికము గడచి
శ్రీకూర్మంబుగని హరికినీ మ్రొక్కి - శ్రీజగన్నాథుని క్షేత్రంబుజేరి
అచటగల తీర్థంబులన్ని సేవించి - కాశీపురముజేరి గంగలోమునిగి
కాలభైరవునకూ కడుభక్తి మ్రొక్కి - నలినాక్షి యన్నపూర్ణకు పూజజేసి
ఘన విశాలాక్షికి కానుకలిచ్చి - అచట పంచక్రోశ యాత్రనుజేసి
నిత్యయాత్రల నెల్ల నియమమునజేసి - గయజేరి మాంగళ్య గౌరికి మొక్కి
ఫల్గునినదిలోన పతితోడమునిగి - విష్ణుపాదంబుపై విరులు పూజించి
అచటితీర్థములన్ని అరశిసేవించి - అచ్చటవిడచి ప్రయాగకును జేరి
ఆ త్రివేణిలో స్నానమాడె పతితోడ - అచట భరద్వాజుని యాశ్రమమందు
మునులకెల్లను మ్రొక్కి మోదంబుతోచు - సాకేతపురమేగి సరయూ జలమున
ప్రేమతోమునిగి శ్రీరాములకు మ్రొక్కి - శ్రీహరిద్వారంబుచేరి హరిమ్రొక్కి
భక్తితో బ్రహ్మకపాలంబుజేరి - అచటున్న దేవున కంజలిజేసి
నర్మదానదిజేరి స్నానంబుజేసి - గండకీనదిని జలకంబాడి పిదప
కాళింది నదిలోన కాంతుతో మునిగి - బదరినారాయణు భక్తితోమ్రొక్కి

ప్రేమతో గోకుల బృందావనమున - సతి సరస్వతిలోన స్నానంబు జేసి
శీప్రానదిని మున్గి శివుని పూజించి - వరపయోష్ణిని మునిగి వంజులమునిగి
కౌశికిమునిగి యుత్కళలోన మునిగి - నిర్వంధ్యమునిగి ప్రణీతలోమునిగి
కరతోయలో మునిగి సురసనుమునిగి - సుమలాపహారిణి సుఖముగామునిగి
గండకిమునిగి మేఖలనదినిగ్రుంకి - వరశరావతిగ్రుంకి వైస్యసుగ్రుంకి
భీమనదినిమునిగి గోమతిమునిగి - కుటమహానది మునిగి కుంజికమునిగి
తమసనుమునిగి చంద్రసంతాపంబు బాసి - కంబుపతిని మునిగి కపశనుమునిగి
వరశిలోచ్చయలోన పరునితో మునిగి - వరకుముద్వతిలోన పరునితోమునిగి
దేవికలోమునిగి దివిజులకు మ్రొక్కి - చర్మణ్వతిని గ్రుంకి చంద్రమసమునిగి
వాసవిలోదాను వనరుగామునిగి - శోణభద్రానది సుఖముగామునిగి
చంద్రభాగానదీ స్నానంబు జేసి - పంపాసరస్సులో భక్తితోమునిగి
నాభిగయలోపల నయముతోమునిగి - యేలానదీస్నాన మింపుగా జేసి
పాదగయలో మునిగి పరమేశు మ్రొక్కి - పురుహూతికాదేవి పూజించి పిదప
సర్వవరక్షేత్ర సన్నిధి జేరి - ముక్తిగుండంబులో ముమ్మారు మునిగి
భావనారాయణు భక్తి పూజించి గౌతమీతీరంబు కడుభక్తి జేరి
అందులోమునిగి భద్రాద్రిరాములను - భజియించి సతి పర్ణశాలకు జేరి
శ్రీరామలక్ష్మణుల సీతగొల్చరిగి - శ్రీరామగిరి రాము సేవించి పిదప
పట్టిసాచల వీరభద్రుని మ్రొక్కి - కోటిలింగక్షేత్ర కూలంబు జేరి
ఘనుని మార్కండేశ్వరుని పూజజేసి - సప్తగోదావరి స్నానంబు జేసి
ప్రీతి ద్రాక్షారామ భీమేశుగొల్చి - అటజని మాతృగమనాఘహారిణిని
మునిగి సోమేశుని ముదమున మ్రొక్కి - సప్తసాగరసంగ స్నానంబు జేసి
కృష్ణవేణిని జేరి కొమరొప్పమునిగి - కనకదుర్గాంబను గని పూజజేసి
శ్రీకాకుళేశ్వరు సేవించి మ్రొక్కి - చేర మంగళగిరి శ్రీనృసింహునకు
పానకంబుల నిచ్చి భక్తి బూజించి - మగువ శ్రీశైలమున మల్లిఖార్జునకు
భ్రమరాంబకును - మ్రొక్కి భక్తిపూజించి
వెంకటాచలపతిని వేడ్కసేవించి - పెన్నలోమునిగి శ్రీరంగనిజూచి
స్వర్ణముఖిని జేరి స్నానంబుజేసి - శ్రీకాళహస్తీశు సేవించిమ్రొక్కి
శేషాచలంబెక్కి శ్రీవెంకటేశు - వినుతించి పాపనాశనమున దోగి
ఆకాశగంగచే నంగంబుతడిపి - గోగర్భమందున కొమరొప్పమునిగి
కపిలతీర్థమున నవగాహనముజేసి - కంచికిబోయి యేకామ్రేశు మ్రొక్కి

వరదరాజును మ్రొక్కి వరములుగోరి - గోవిందరాజుల కోరిసేవించి
అలివేలుమంగకు నంజలిజేసి - కామాక్షిదేవిని కడుభక్తిమ్రొక్కి
గారుడనదిలోను కరమొప్పమునిగి - ఘనచిదంబరములో గౌరీశుమ్రొక్కి
చియ్యాళిలోనున్న శివునకుమ్రొక్కి - పక్షితీర్థంబేగి పరమాత్మజూచి
వైద్యనాథేశ్వరు వలగొనిమ్రొక్కి - మాయూరశివునకు మరియునూమ్రొక్కి
కావేరిలోపల కడుభక్తిమునిగి - రంగుగ యారంగనాథు సేవించి
కుంభకోణంబులో కుంభీశుమ్రొక్కి - పంచనదంబులో పలునాళ్ళుమునిగి
వేగవతినీజేరి వేడ్కతోమునిగి - పాలేరులోపల భక్తితోమునిగి
మధురమీనాక్షికి మరిమరిమ్రొక్కి - సుందరేశ్వరు ప్రసూనంబులర్పించి
పాషాణనవకంబు భక్తితోమ్రొక్కి - రామేశ్వరముజేరి రామనాథునకు
గంగాభిషేకంబు కడువేడ్కజేసి - తివిరి యిరువదినాల్గు తీర్థములందోగి
గంధమాదనగిరి కరిగిసేవించి - వరధనుఃకోటిలో వరుసమూనాళ్ళు
ముప్పదియారు స్నానములు గావించి - సేతుమాధవునితో చెప్పిసేవించి
పర్వతవర్ధనికి బాగుగా మ్రొక్కి - తామ్రపర్ణినదిని తగుభక్తిమునిగి
తుంగభద్రానది తోయమునమునిగి - పొన్నూరుయందునా పొదలుచున్నట్టి
భావనారాయణు బాగసేవించి - సకలసాగర నదీసంగముల మునిగి
నైమిశారణ్యంబు నాతిదాబోయి - గార్గేయ మాండవ్య గాలవ కపిల
ఆత్రేయ శాండిల్య హారీతమునుల - పాదంబులాపయిని ఫణిరాజునుంచి
త్రైలోక్యసుందరి తగుభక్తిమ్రొక్కి - పతిభిక్షమిమ్మని ప్రార్థించియడుగ
ఆ మునులందరు యతివనుజూచి - భామిని నీరాక కేమికారణము
వినుపింపు దాచక విశదంబుగాను - అనినంత సుందరి యానందమొంది
లోలాక్షిపుట్టిన కాలంబు మొదలు - నాటిదాకను జరిగినది యెల్లదెల్ప
నంతట సుందరి నా మునులంత - దివ్యదృష్టినిజూచి దేవికిట్లనిరి
వినవమ్మ నీ పతి వెనుకజన్మమున - పుడమినేలుచునుండె పొందు మీరగను
ఆ కాలమందున అతనికి నీవు - పత్నివైయుంటివి బాగొప్పగాను
అతడును నీవును అడవులకేగి - వేటాడుచుండంగ విప్రుడొక్కండు
వొప్పుగా నేతెంచి వకచెట్టుక్రింద - కూర్చుండియుండంగ కొమ్మరో నీవు
పామును తెలియక బడవేసినంత - విప్రునిపై బడ వెరచి భయమంది
శాపంబుబెట్టె నాజగతీసురుండు - నాతిరో ముందుజన్మమున కొన్నాళ్ళు
పామును భర్తగా బడయుదువనెను - కావున నీకు నాగాధీశుడిపుడు

మగడయ్యెనని దెల్పి మరియు నిట్లనిరి - మహిలోన మీయత్త మామలునున్ను
రాజ్యంబునేలిరి రాజులుమెచ్చ - ఆ కాలమందు నాగాలంకృతునకు
శేషభూషణములు సేయంగదలచి - భక్తుడొక్కడు వారిపజ్జను వచ్చి
నాగభూషలకునై నానువిత్తంబు - దయచేయుడని వేడ ధనికేశు డపుడు
పుట్టలోపల నాగములు చాలగలవు - అవిదెచ్చి శివునకు నర్పించుమనియు
అప్పుడాతనిపత్ని హీనంబుసేయ - వారికి నాగంబు వనరంగబుట్టె
ననిమునుల్ చెప్పగా నాసుందరియును - పతిభిక్ష కృపచేసి పాలింపుడనుచు
ప్రార్థింప నా మునులు పలికిరో వినుము - పశ్చిమాంబుధి తీరమందున వెలయు
బ్రహ్మగుండము జేరి పాముతో నీవు - ముమ్మారు మునుగుము సమ్మతిగాను
నీ భర్త బాలచంద్రాభుడయి యపుడు - అవతరించునటన్న హర్షంబునొంది
దేహంబుభారమై తేజంబు మెరయ - పోయినబలమెల్ల పొందుగాగలిగి
శ్రీనివాసునిదలచి శీఘ్రముగ మునుల - పాదకమలంబులకు భక్తితో మ్రొక్కి
అటనుండి తరలెను అజ్ఞాయతాక్షి - తడయక వనపర్వతంబులుగడచి
యైదారునెలలకు అతికష్టపడుచు - బ్రహ్మగుండము జేరి వ్యసనంబుతోడ
శ్రీపతే కమలాక్ష శ్రీకృష్ణ రామ - వాసుదేవ ముకుంద వారిజనాభ
మధుసూదనాచ్యుత మాధవా శౌరి - భువిలోన నేజేయు పూర్వకర్మంబు
ఇన్నాళ్ళుపొందితీ యీకాలమైన - మౌనులమాటలు మాయముగాక
నిశ్చయంబగునని నీపాదములను - చింతించుచున్నాను స్థిరభక్తితోడ
కాపాడు కాపాడు కమలేశ నన్ను - ద్రౌపదినిగాచిన ధర్మాత్మకుడవు
చంద్రమతికీరక్ష సలిపితివీవు - దమయంతిబ్రోచిన దామోదరుడవు
నీవిపుడు ననుగావు నెరనమ్మినాను - పతిభిక్ష మీయంగ పదునిదియనుచు
పలువిధంబులుగాను పక్షివాహనుని - మదియందు ధ్యానించి మగువతానపుడు
సర్పంబు మెడయందు సరవితోదాల్చి - సతిబ్రహ్మగుండంబున స్నానంబుజేసి
బయలువెడలినయంత బాలచంద్రుండు - పాలసంద్రమునందు ప్రభవించినట్లు
బ్రహ్మగుండమునందు భాసిల్లుచుండ - జూచియుత్రైలోక్య సుందరీదేవి
మనమునను ప్పొంగి మాధవుదలచి - మునులమాటలు సత్యమని మదినెంచి
తనతల్లిదండ్రుల తన యత్తమామ - ధ్యానించిభర్తను తలవంచిజూచి
యాతనిపదముల కతిభక్తిమ్రొక్కి - నాభర్త నానాథ నారాజసింహ
నాభాగ్యదైవమా నను బ్రోవుమంచు - ప్రార్థించినిలువంగ పలికెనారాజు
నీవెవరు నాభర్త యనుచున్ బలిమి - నినునేనువరియించి యెరుగనేకొమ్మ

ముందుతెలిసిన యట్లు ముదితరో నీవు - అనుమానమూ విడచి యుంటివినాతో
ఇది తగునే స్త్రీల కిలలోన ననగ - ఆ సుందరాంగియు నా మాటలకును
బదులుఁజెప్పగలేక పంకజనాభు - దలచిమూర్ఛిల్లెను ధరణిపై యపుడు
ఆకాశవాణి యిట్లని తగబల్కె - ఓ రాజుచంద్రుడా యనుమానమేల
నీభార్యయగునిది నిజముగానమ్మ - నిన్నువరించె నాటికాలమున
ధర్మాంగునకు నీవు తనయుడై పుట్టి - శేషరూపంబుతో చెలువారుచుండ
నిన్నువరించె నీ సన్నుతగాత్రి - చిత్రాంగరూపంబు జెందితివిపుడు
అని సకలంబును ఆకాశవాణి - అపుడెరిగించ చిత్రాంగభూవరుడు
త్రైలోక్య సుందరిని తన చేతులార - దయతోడ తాడీసి దడయక నెత్తి
తొడమీదనిడుకొని తొయ్యలిజూచి - ఇట్లనిపలికెను యింపుమీరంగ
యతివ నాకున్నట్టి యనుమానమెల్ల - గగనవాక్యముదీర్చె గావున మనము
సతిపతులయ్యెనేడు సారసనాభు - అనుకంపగూడితి మని సంతసమున
బలుకంగ సుందరి ప్రాణనాధునకు - తన మదియుప్పొంగి తాను జన్మించి
పెరిగిపెండిలియైన వృత్తాంతమెల్ల - జెప్పెనుదాచక చిత్రాంగునకును
అపుడు చిత్రాంగుడా యతివనుజూచి - సంభ్రమంబొప్పగ సరసవాక్యముల
ఓ కాంతమనమిట నుండంగదగదు - మన నగరంబునకు మరలుదమనిన
తరుణిత్రైలోక్య సుందరిదేవి యపుడు - ధరణీశ మా తల్లిదండ్రులునన్ను
ఇన్నాళ్ళుజూడక యెట్టులున్నారో - అదిగాక యల్లుని యరసిజూడకను
ఆనాడెవిలపించి యరిగిరిగాన - మనమిపుడేగి యామాణిక్యపురము
తరువాతనా కనకపురము జేరుదము - అని విన్నవించగా నా రాజవరుడు
సమ్మతిగొనినంత జనిరి దంపతులు - అడవులు గొండలు అతికఠినమైన
మార్గంబుగాజని మధుర ఫలములును - భుజియించి మాణిక్యపురముజేరంగ
పౌరులెల్లను వీరి పరికించిజూచి - యొకరితో నొక్కరు ఓయమ్మయిట్లు
రాజింటిబిడ్డయై రాజుచేపట్టి - యీలాగువచ్చుట కేమికారణమొ
దైవతాప్రార్థనొ తగవిరోధంబొ - యేమియు దోచదే యింతిరో యనుచు
తరుణులందరు గూడి తమ బుద్ధికొలది - యూహించుచుండిరి యొకరితో నొకరు
ఇట్లుండ దంపతులేతేరజూచి - రత్నాంగరాజు ప్రయత్నంబుతోను
మంత్రుల బంధులమాన్యులతోను - అతివేగమున జని యా వధూవరుల
వేడ్కతో నెదురేగి తోడ్కొనిపోయి - భోజనమజ్జనంబులను గావించి
తలిదండ్రులతి మోదమందంగనపుడు - అల్లునికూతుని అనువొందజూచి

మీరిట్లువచ్చుట కేమి కారణము - ధర్మాంగరాజు మాదరికి మిమ్మంపె
చిత్రంబుగాదెయో సీతాంశువదన - నాతి నీభర్తతో నడచిరానేల
యిదియేమొ విపరీత మికీతిదోచు - కావున జరిగినకార్యంబు నీవు
దాచక వినుపింపు తరుణి నిజమనిన - త్రైలోక్యసుందరి దైవంబుదలచి
యింతి హాయోయని యేడ్చి ఏమిదోచకను - దైవమా నా తల్లిదండ్రులకిపుడె
అనుమానమేకల్గె అచ్చుగానీవు - పోగొట్టవలెనంచు పొలతిదుఃఖింప
నప్పుడు తలిదండ్రులఖిల బంధువులు - శోకించి దుఃఖించి సుందరీ నీవు
భయమునువిడచి నిజమెరిగింపు - భయమునువిడిచి నిజమెరిగింపుమనిన
తనపెండ్లి మొదలు దను యాదిగానంత - జరిగినట్టుగదెల్పె సతి దాచకపుడు
అంతట రత్నాంగు డధికరోషమున - ధర్మాంగరాజును దండించదలచి
మంత్రులబిలిచి కనకపురంబునాకు - దండెత్తిపోయి ప్రియా ధర్మాంగరాజు
వాని మంత్రులతోడ పట్టితెండనిన - అపుడు రత్నాంగు సైన్యంబుపురికోల్ప
చలమున చతురంగ బలమెల్లనడువ - విన్నవారెల్లను వెరగందియుండ
రత్నాంగి మంత్రి చతురంగముతోను - కనకపురము చేరి కడుధీకరమున
రణభేరీ వేయించె రత్నాంగు మంత్రి - ధర్మాంగు డదివిని తత్తరపడుచు
అతని మంత్రులబిలచి యడుగంగవారు - కారణము దెలియకను కడుశోకమంది
కనుగొనయత్నించి క్రన్ననబోయి - కొవులుకూటమునందు కూర్చుండియపుడు
వేగులవారిని వేగపిలిపించి - యిట్లని పలికిరి యిరువొందగాను
రణభేరివేశిన రాజెవ్వడగునో - దెలిసిరండనగ వేగులవారు వేగ
జనిచని దళపతిగని మ్రొక్కి నిలచి - మీరాక కారణం బారయదెల్పి
మీరాజుపేరును మీయూరిపేరు - దాచక మారాజు దయచేసిమిమ్ము
అడిగినారని జెప్ప నాదళవాయి - రమ్యంబుగాబల్కె రత్నాంగవిభుడు
మీరాజుమంత్రి నిమిషమాత్రమున - పట్టితెండన నంత పయనమయి మేము
వేగవచ్చితిమన వేగులవారు - దగుసెలవు గొనివచ్చి ధర్మాంగునకును
రణభేరివేసిన రాజు తెరగంత - వినిపింప ధర్మాంగ విభుడు భయమొంది
వలనొప్ప తనమంత్రివరులతో బల్కె - ఓ మంత్రులార మన యుక్తిసాయమున
పాపమని తెలియక పరిణయముజేసి - పరరాజు చేతికి ప్రాణంబులిచ్చి
మనము తత్తరపడవలసె ననంగ - మంత్రులందరు విని మారాడలేక
శోకించుచుండిరి చోద్యంబుగాను - అప్పుడు రత్నాంగ సైన్యంబు నగరు
రహిమీరజొచ్చి ధర్మాంగరాజును మంత్రిని బట్టి - బంధించి తనపురము కొనిపోయి

మాణిక్యపురమును మరిజేరిరంత - ప్రబలకోపముతోను రత్నాంగరాజు
ధర్మాంగరాజును తనకొల్వునకును - రప్పించి యిట్లని రయముతోనపుడు
ధర్మాంగ నీవు నాతనయకు పెండ్లి - చేసినప్పటినుంచి యీసరివరకు
పంపకయుండుట భావ్యంబుగాదు - నీకుమారుం డిప్పు డెక్కడున్నాడు
చూపుము త్వరలోన సోదెలుమాని - యనినంత ధర్మాంగ ధరాధినాథుండు
భయమొంది గడగడ వణకుచునపుడు - ధర్మాంగరాజును రహిమీరజూచి
నావల్ల నేరము నన్ను మన్నించు - తథ్యంబు బల్కెద దైవసాక్షిగను
పూర్వకర్మముచేత పుత్రుండునాకు - పాముగా గల్గెను పాపంబుమిగుల
ఆమాటదాచియు నామంత్రియపుడు - పామనిజెప్పిన పరిహాసమనుచు
పుత్రుండనుచు సాకె భూలోకమునను - కావున మాయింట కత్తికి పెళ్లి
యీరీతికావించినారు మంత్రులును - సుమతియే త్రైలోక్య సుందరిదేవి
భర్తనుగానక బహుచింతనొంది - దివ్యతిరుపతులను తిరిగిసేవించి
పామును భర్తగా బడసెదననుచు - పాముబుట్టను శిరోభాగమున దాల్చి
సంచరింపగ నేను చారులనెల్ల - దేశదేశములను తిరిగి సుందరిని
అరసివేరమ్మని యంపించినాడ - నని పల్కి ధర్మాంగుడవని మూర్ఛిల్లె
రత్నాంగుడంత ధర్మాంగ భూవిభుని - శోకంబు తగదీర్చి సుస్థిరుజేసి
రాజాధిరాజుల రప్పించివేడ్క - లోకులుమెచ్చ త్రైలోక్య సుందరిని
సభలోకి రప్పించి జరిగినదంత - తగజెప్పుమన నది తల్లిదండ్రులకు
తన మామగారికి దైవంబులకును - ప్రణతులుగావించి పల్కెనావేళ
సుదతి పామును కన్నుల జూచినది మొదలు - నాటిదాకను జరిగినది యెల్లబలికె
అప్పుడు సభవారలందరిట్లనిరి - సుందరి వాక్యంబు సూనృతమనగ
సాక్ష్యంబులేదని సంశయింపంగ - ఆకాశవాణి యపు డందరున్వినగ
సతియనుమాట సత్యము సత్యమనుచు - బాపురేయని జనుల్ భళిభళీయనగ
వేడుకతోడ దీవించిరందరును - రత్నాంగుడపుడు ధర్మాంగభూవిభుని
వియ్యంబుకల్పుచు విందారబల్కె - నీదుష్కృతంబును నాదుష్కృతంబు
నేటితో సుందరి నిఖిలంబుబాపె - కావున శుభలగ్న కాలంబునందు
సుందరికన్య నీసుతునకు పెళ్లి - కావించెదను నేను క్రమమొప్పగాను
అనినంత ధర్మాంగుడట్లు చేయుటకు - సమ్మతించినయంత సంభ్రమముగాను
చెలువారు చెలి సుందరికి చిత్రాంగునకును - శుభలగ్నమందున చోద్యంబుగాను
పెండ్లిజేసిరి జనులు ప్రియమొందగాను - మాణిక్యపురము ముదముతో నల్లునికి

కడువేడ్క పట్టంబు గట్టినారాటు - కడుప్రీతి కొన్నాళ్లు గడచినయంత
తనదేశమునకు చిత్రాంగుడేతెంచి - అత్తరి ధర్మాంగు లానందమొంద
సుందరితోగూడి సుఖముగానచట - కాపురంబును జేసి ఘనులుపొగడంగ
దనర త్రైలోక్య సుందరి యీవిధమున - భర్తకయి మిగిలేని భోగలనొంది
కమలాక్షుకృపచేత కలకాలమెల్ల - యువతులందరికంటె యుత్తమసాధ్వి
యనిపేరువడసెను యవనీతలమున - యీకథవినుసట్టి యింతులెల్ల
భక్తియు ముక్తియు భర్తపై ప్రీతి - భాగ్యంబు ధనధాన్య పుత్రసంపదలు
వస్తువాహనములు వస్త్రలాభములు - గృహములు భూములు గోవులుగల్గి
పుత్రపౌత్రాభి వృద్ధిగ నుందురనుచు - సకలంబు సూతుడు శౌనకాదులకు
వినుపించె ధర్మాంగ విభుని చరితంబు.

# గంగా గౌరీ సంవాదము

శివశరణు మాంపాహి శివశరణు సోమా - శివశరణు మనపాల శివునకు శరణు
గురుశరణు మాంపాహి గురుశరణు సోమా - గురుశరణు మనపాలి గురువులకు శరణు
హరశరణు మాంపాహి హరశరణు సోమా - హరశరణు మనపాలి హరులకు శరణు
యెక్కెను గౌరమ్మ యెలనంది మీద - కోసెను పూలన్ని కొమ్మ విరువకను
ముడిచెను ఆ పూలు ముందుగా తాను - ముడువ మిగిలిన పూలు పళ్ళెరమునుంచి
పంపెను గౌరమ్మ గంగ మేడలకు - వాడిన పూబంపిన వనిత యెవరమ్మా
వడలిన పూబంపిన వనిత యెవరమ్మా - చాలకుంటే తన్ను సరికొల్లలాడు
సరికొల్లలాడను సరిదానవటవే - సరిదాన్ని కాకుంటె శివుడేలదెచ్చు
శివుడేల తెచ్చును జగమేలమెచ్చు - శివునికి చిన్నారిని నీకు చెల్లెలను
తన్నెను తనసవతి గుండెల్లు పగుల - అక్క మీపాదాల రాలినమన్ను
సందుల్నిగట్టిస్తు గొందుల్నిగడుదు - కొడుకు వీరన్నకు కోటగట్టిస్తు
కోడలగు భద్రాద్రికి మేడగట్టిస్తు - బసవన్న పడుకునే పంచటరుగేస్తు
శివునికి శివపూజ గద్దిగట్టిస్తు - నీకు అనగ సరిగద్దెకడుదు
సరిగద్దెకట్టను సరిదానవటవే - సరిదాన్నిగాకుంటె శివుడేలదెచ్చు
శివుడేలదెచ్చును జగమేలమెచ్చు - శివుడికి చిన్నాలిని నీకు చెల్లెలను
తన్నెను తన సవతి పళ్ళన్నిరాల - అక్క మీపాదాల రాలినపళ్లు
కూర్చుండి యేరిస్తు గుండు గంపలను - నిలుచుండి యేరిస్తు నిలువు గంపలను
పరుండి యేరిస్తు ఒకటయినలేక - పిన్నలకు పెద్దలకు నీవు పంచిపెడితె
పసిపుత్రబాలాది నే పంచిపెడుదు - సమముగ పంచిపెట్ట నీవు సరిదానవటవే
సరిదాన్నికాకుంటె శివుడేలదెచ్చు - శివుడేలదెచ్చును జగమేలమెచ్చు
శివునికి చిన్నాలిని నీకు చెల్లెలను - అని పలికి గంగమ్మ జనెను మేడకు
అంతట గౌరమ్మకు చెంగుతామాసె - ఉదకాల జాడలు కానరావాయె
తనకొడుకు వీరన్నను గ్రక్కునా బిలిచి - రావోయి వీరన్నా రాజశేఖరుడా
వయసు గలిగి వర్ధిల్లు వీరన్న - ఉదకాల జాడలు కానరావాయె

ఉదకాల జాడలు చూచిరా కొడుకా - అటుబోయి వీరన్న ఆ కొలను జూచె
ఆ కొలను వుదకాలుదాచింది గంగ - ఇటుబోయి వీరన్న ఈ కొలను జూచె
యీ కొలను నీరంత దాచింది గంగ - చిలుక సముద్రమును జూడ చిన్న మెత్తు లేవు
పాల సముద్రం జూడ పాతికెత్తు లేవు - ఎచ్చట తిరిగినా వుదకంబు లేదు
వీభూదిగుండాన యింకిపోయినవి - మల్లయ్య గుండాన మరిగిపోయినవి
సవతులగుండాన చట్టుపోయినవి - వెళ్ళెను వీరన్న గౌరి మేడలకు
ఉదకాల జాడలు కానరావాయె - దక్ష మేడలదాక పోయిరా కొడుకా
పోయినే దక్షునితో యేమందు నమ్మా - దయపుట్ట జెప్పరా మీ తాతతోను
అయిదు దినములబట్టి స్నానమ్ము లేదు - ఆరు దినముల నుంచి శివపూజ లేదు
శివపూజ మా తల్లి చేసుకొనలేదు - ఉదకాలు జాడలు కానరావాయె
ఉదకాలు జాడలు మిమ్మడుగమనెను - ఆ మాట విని తల్లి వీరన్న అపుడు
బల్లెంబు శూలంబు పల్లెతాయొకటి - రాక్షసుల మర్దింప రమ్యంబుచేత
బయల్వెడలె వీరన్న సంతాపమునకు - గుజ్జుమామిడి దాటి గురివెంద దాటి
కొమరుగా వీరభద్రుండు గుండెకదల వెళ్ళెను - వీరన్న దక్షమేడలకు
ఎన్నడు నా మేడ యెఱుగవు తండ్రి - ఏమిపనికొస్తివి నీవు వీరన్న
అయిదు దినముల బట్టి స్నానంబులేదు - ఆరు దినముల నుంచి శివపూజ లేదు
శివపూజ మా తల్లి చేసుకోలేదు - ఉదకాల జాడలు కానరావాయె
ఉదకాల జాడలు మిమ్మడుగ మనెను - యిటుబోయి దక్షుడు యీ కొలను జూచి
యీ కొలను ఉదకాలు దాచింది గంగ - అటుబోయి దక్షుడు ఆ కొలను చూచె
ఆ కొలను ఉదకాలు దాచింది గంగ - గంగకు అధికార మెవరిచ్చినారు
చిలుక సముద్రములోను చిన్న మెత్తు లేవు - పాల సముద్రములోను పాతికెత్తు లేవు
వీభూదిగుండాన యింకిపోయినవి
మల్లయ్యగుండాన్న మరిగిపోయినవి - సవతులగుండాన చట్టుపోయినవి
కాశి కావడికట్టి కాశికే పంపె - కాశిలో ఉదకాలు కళ్ళబడదాయె
గంగకావడి గట్టి గంగకే బంపె - గంగలో ఉదకాలు కానరావాయె
పట్టించు పదివేల పాలకావిళ్ళు - కట్టించు పదివేల నేతికావిళ్ళు
పాలకావిళ్ళొచ్చి పందిళ్ళదిగెను - నేతి కావిళ్ళొచ్చి మేడల్లదిగెను
పాలతోనేగౌరి స్నానంబు జేసె - నేతితోగౌరి శివపూజజేసె
చీమలు దోమలు చెడకుట్టసాగె - గండుచీమలు మేను చెండుతునుండె
పంచవటీదాక పోయిరా కొడుకా - పోయినే శివుని యేమడుగనమ్మా

అయిదు దినముల నుంచి స్నానమ్ములేదు - ఆరు దినములనుంచి శివపూజలేదు
శివపూజ మా తల్లి చేసుకోలేదు - ఉదకాల జాడలు కానరావాయె
ఉదకాల జాడలు మిమ్మడుగమనెను - బల్లెంబు శూలంబు పల్లెత్రాడొకటి
రాక్షసుల మర్దింప రమ్యంబుచేత - గుజ్జుమామిడిదాటి గురివిందదాటి
కోమరుగా వీరభద్రుని గుండెలు కదుల - వెళ్ళెను వీరన్న తండ్రి మేడలకు
యెన్నడు నా మేడ యెరుగవు తండ్రి - యేమిపని కొస్తివి నీవు వీరన్న
నీ మంచి గుణములు నే చెప్పుచుందు - కూర్చుందు వీరన్న కూర్చుండవయ్యా
శరణార్థి మా తల్లి శివశరణు మీకు - అయిదు దినములనుంచి స్నానంబులేదు
ఆరు దినములనుంచి శివపూజలేదు - శివపూజ మా తల్లి చేసుకోలేదు
ఉదకాల జాడలు కానరావాయె - ఉదకాల జాడలు మిమ్మడుగమనెను
మీ అమ్మ తక్కువేమి నా యెక్కువేమి - పుట్టించ గిట్టించ శివుడు కర్తగును
నోచిన నోములకు గౌరితాకర్త - జగములో నీళ్ళకు గంగతా కర్త
యే ప్రొద్దు గంగతో - యెదురువాదంబు
కూడదని చెప్పుమీ ఆ గౌరితోను - యీ ప్రొద్దుగంగకు తా మ్రొక్కమనుము
గంగ సమ్మతిచేత ఘన ఉదక మొచ్చు - నదులన్ని నీళ్ళతో నిండుందునయ్యా
స్నానపానమ్ములు సకల జపములు - నీరుంటె నెరవేరు నెలమి వీరన్న
మీ తల్లి స్నానంబు అటుచేయవచ్చు - అనిచెప్ప వీరన్న తల్లి మేడలకు
చనిచెప్పి నీ చక్కి ప్రథమంబుగాను - మీ అమ్మ తక్కువేమి నా యెక్కువేమి
పుట్టించ గిట్టించ శివుడు కర్తగును - ఆయుస్సు పోయుటకు బ్రహ్మ కర్తయగును
అందరిని రక్షించ విష్ణు కర్తగును - నోచిన నోములకు గౌరియే కర్త
ఆ నీళ్ళ జాడకు గంగతా కర్తా - యే ప్రొద్దు గంగతో యెదురుకయ్యమ్ము
యే ప్రొద్దు గంగతో యెదురు వాదమ్ము - కూడదని చెప్పుమీ ఆ గౌరితోను
యీ ప్రొద్దు గంగకు తా మ్రొక్కమనుమీ - గంగ సమ్మతిచేత ఘన ఉదక మొచ్చూ
నదులన్ని నిథులయి నిండుందునయ్యా - స్నానపానమ్ములు సకల జపములును
నీరుంటె నెరవేరు నెల్లవీరన్నా - తల్లి స్నానమ్ము అటుచేయవచ్చు
అని చెప్పుమని చెప్పెనమ్మరోయనగ - ఆ పల్కులువిని అంబ తన సుతునితో
కంట నీరుంచి తా కఠినంబుగాను - నీచదానింటికి పోవనుకొడుకా
జాలారి దానితో పొత్తేల మనకు - నీవైన పోయిరా ముద్దు వీరన్న
వెళ్ళెను వీరన్న గంగ మేడలకు - యెన్నడు నా మేడ యెరుగవు తండ్రి
యేమిపని కొస్తివీ నీవు వీరన్న - అనిపల్క వీరన్న గంగతోజెప్పె

అయిదు దినములనుంచి స్నానంబులేదు - ఆరు దినములనుంచి శివపూజలేదు
శివపూజ మా తల్లి చేసుకోలేదు - ఉదకాలుజాడలూ కానరావాయె
ఉదకాలుజాడలు నిన్నడుగమనెను - మీ అమ్మ తక్కువేమి నాయెక్కువేమి
అమెకంటె ఘనత నాయందుకద్దా - ఉదకాలజాడలు నేనెరుగననెను
ఆమాట వీరన్న విని మండిపడుతు - తలపగులగొట్టెను చంపివేసెను
యమభటులకు నిన్ను నప్పగించేను - యమదండన నిన్ను చాలచేతును
వద్దు వద్దు వీరన్న వాదమునాతో - పోవోయి వీరన్న పొంకమ్ముమాని
వచ్చెను వీరన్న తల్లి మేడలకు - యేమనిచెప్పెరా యెలమి గంగమ్మ
మీ అమ్మ తక్కువేమి నాయెక్కువేమి - అమెకంటే ఘనత నాయందుకద్దా
ఉదకాలజాడలు నేనెరుగననెను - ఆమాటవిని వుమాదేవి దిగులంది
యెందుకీవైరమ్ము యేమిపాపమ్ము - దైవవిధి గడుపను తరమె యెవరికి
శివునికి చిన్నారి శిరసెక్కెగనుక - ముచ్చట్లమురియుచు ముదిమరూర్చుండె
అని తాను తలపోసి తాపయనమాయె - ముందరను వీరన్న వెనుక గణపన్న
యిద్దరినడుమ గౌరితానడచె - గవరప్ప రాకాలు గంగప్పజూచి
వంచనజేయుటకు వంచనతాదలంచి - పచ్చిచాపలుదెచ్చి పందిళ్లువేసె
పండుటాకులుదెచ్చి తోరణాలుగుచ్చి - పెద్దచాపలు పంచరంగులుగట్టె
కప్పజచ్చిననీళ్ళు కళ్ళాపుజల్లె - చేపజచ్చిననీళ్ళు చెయ్యితాకడిగె
యెన్నడు నామేడ యెరుగవూఅప్ప - ఏమిపనికొస్తివి నీవు గవరప్ప
ఆమాటలు విని హరురాణిజెప్పె - ఐదుదినములుబట్టి స్నానములేదు
అరుదినములనుంచి శివపూజలేదు - శివపూజ అయినాను చేసుకోలేదు
ఉదకాలుజాడలు కానరావాయె - ఉదకాలజాడలు చెప్పుగంగమ్మ
ఉదకాలుజాడలు - నేనెరుగననెను
నాకొడుకు వీరన్న నీకిస్తుగాని - ఉదకాలుజాడలు చెప్పవే గంగ
నీకొడుకు వీరన్న నా కొడుకుగాడా - ఉదకాలజాడలు నేనెరుగనక్కా
నాకోడలు భద్రగిరిని నీకిస్తుగాని - ఉదకాలజాడలు చెప్పవేగంగ
నీకోడలు భద్రగిరి నాకోడలుగాదా - ఉదకాలజాడలు నేనెరుగననెను
నాకున్నరవికెలు నీకిస్తుగాని - ఉదకాలిజాడలు చెప్పవేగంగా
నీకున్న రవికెలు నాకునులేవా - ఉదకాలజాడలు నేనెరుగననెను
నాకున్న చీరెలు నీకిస్తుగాని - ఉదకాలజాడలు చెప్పవేగంగా
నీకున్న చీరలు నాకునూలేవా - ఉదకాలజాడలు నేనెరుగననెను

నాకున్న సొమ్ములూ నీకిస్తుగాని - ఉదకాలజాడలు చెప్పవేగంగా
నీకున్న సొమ్ములూ నాకునూలేవా - ఉదకాలజాడలు నేనెరుగననెను
నావక్క శివుని నీకిస్తుగాని - ఉదకాలజాడలు చెప్పవేగంగా
యిప్పుడన్నామాట తప్పకుమి అక్కా - యీ మాటకు సాక్షి యెవరనీ బలికె
భూమి ఆకాశము అడవి రెండుసాక్షి - మద్దులూ మారేళ్ళు అవిరెండుసాక్షి
సకల దేవతలు - వారెల్లాసాక్షి
అనగ సంతోషించి గంగప్పతాను - గుప్పు గుప్పున గంగ నుప్పొంగుచును
యేరులన్నీ చానలోకమయినిండ గౌరి - స్నానమ్ముజేసి శివపూజచేసి
శివుడొచ్చురాకలు గౌరితాచూచి - ఘడియ గ్రక్కునబెట్టె గవరమ్మతాను
ఘోరునతలుపెయ్య మేలాయెనక్క - భూమి యాకాశమ్ము వారైరిసాక్షి
ముద్దులూ మూరుల్లు అవి రెండుసాక్షి - సకలమైన దేవతలు వారెల్లసాక్షి
యీశ్వరా గవరప్ప యిచ్చెను నిన్ను - అనిచెప్ప శివుడపుడు అందరిని బిలచి
సాక్ష్యంబుచ్చుకొని సఖియగౌరితో - మీకిద్దరకు కలహంబు వద్దని
పలుక వారంత సఖ్యులై పొరలుచుండిరి.

# చిరితొండరాజు చరిత్ర

శ్రీపార్వతీ భర్త శివలోకమందు - ఆ పార్వతీయునూ అమరులూ గొల్వ
అమర దేవేంద్రులు అప్సరాస్త్రీలు - గరుడ గంధర్వులు గణనాయకులు
నందియు భృంగియు నాగ కిన్నరులు - ముందరా నిలుమండి మ్రొక్కి కీర్తించె
శివునిదేహమ్మునా చమటబుట్టింది - శివునిసతీయగు నా యుమాదేవి
హాశివా నా భర్త అకలంకస్వామి - దీనదయాపర వేదాంతమూర్తి
శివదేవ మీవంట చెమటేలబుట్టె - తిరిగిమర్దిస్తిరా త్రిపుర రాక్షసుల
మరలి మర్దిస్తిరా భస్మాసురుని - అని పార్వతడుగగా విని హరుడు బల్కె
గురులింగ జంగమ్ము కృపగలవాడు
చేరి మనపాదముల సేవకుడుగలడు - చిరితొండ దనియేటి చిన్నిభక్తుండు
యే కాలమూ పూజ యేమరక సేయు - నిరతాన్నదానంబు యెడలేక సేయు
మహేశ్వరు లితు ఖండంబులడుగ - ఖడ్గంబు బట్టుకుని తోటకూ నేగి
చెర్కులకడకేగి ఖండించికట్టి - మొయ్య శక్యముగాని మోపొనగూర్చి
యెత్తిచూచియు తాను యెత్తుకోలేక - హారాహారాయని బిలువ అచటికిబోయి
రాజుకి మోపెత్తి వస్తినిప్పూడు - సతిజూడు నాకిపుడు చెమటబుట్టింది
సతిజూడు నా యొక్క చతురతా నేడు - అని శివుడు పల్కగా విని పార్వతనియె
వొకసారి నీ వెంట వస్తూనుదేవ - పొందుగా భక్తున్ని పొడజూపుమనెను
అటులయితె భక్తుని కడకుబోవుదము - సుందరీ భక్తుని చూపింతు నీకు
ప్రేమతో శివుడపుడు ప్రమదగణములను - సరగునా రావించి సరసముగ బల్కె
ప్రమదగణముల్లార ప్రేమతో మీరు - దిక్కులకు యేగుడీ తీవ్రంబుగానూ
కొందర్ని పడమరా కొందర్ని తూర్పు - ఉత్తరం కొందర్ని దక్షిణం కొంత
అందర్నిపంపియూ హరుడొక్కడుండె - కాషాయవస్త్రములు ఘనముగా గట్టి
రాగి భూషణములు వంటధరియించి - భస్మలేపనంబు బాగుగాబూసె
పులిచర్మమూ తోలు వంటధరియించి - దండకమండలం తాచేతబట్టి
వేసెనే యతివేష మపుడు సాంబుండు - పసిడికుచ్చుల బొంత బాగుగాగట్టి

రమణొొప్ప రత్న భూషణములు దాల్చి - రాగి భూషణములు వంటధరియించి
చంకయెరుకలబుట్ట శిరసునను బెట్టి - వేసెనే పార్వతీ యెరుకవేషమ్ము
సతిపతులిద్దరు సంభ్రమ్ముతోను - లక్షపట్ణంబులు రమణొొప్పదాటి
చేరిరి వారంత చిరియాళుపురికి - చయ్యన వచ్చియు నా వేషధార్లు
వూరివెలుపల మర్రి మ్రానుకిందాను - చేరి బిడారమ్ము వేసిరంతటను
చిరితొొండనీ భార్య తిరుణాంగయూను - పలికెను పతితోను పరమహర్షమునా
భోజనపువేళాయె ఓ మహారాజా - అతిధి అభ్యాగతుల దోడితేరేమి
తోడుకుని రమ్మనీ ఆ యింతిబల్కా - వెళ్ళేను చిరియాళు పట్నంబు వెదుక
భక్తుని శ్రద్ధయు తా జూచుటాకు - జంగాన్ని వొకనయిన వొనగూర్చలేదు
హాశివశంకరా హామహాదేవ - విసిగి వేసారితిని ఓ విశ్వనాధ
వక జంగమయినాను దొరకనేలేదు - పట్టిన వ్రతమంత భంగమయిపోయె
అనుచును విలపించి యింటికేతెంచి - సతితోడ దెల్ప నా పరమపతివ్రతా
పార్థివోత్తమ నీవు పట్ణంబుకేగి - యెట్లయిన వొడయలను యిపుడుదేకున్న
పట్టిన వ్రతములకు భంగంబువచ్చు - అన విని రాజంతమరలె పురమునకు
పేటలు కోటలు పెద్దవీధూలు - నగరులు సవుధములు దివ్యభవనములు
వెదకి వేసారియూ నొక మర్రికింద - కాంచెను వొడయులను వృద్ధ దంపతుల
కలిగినారయ్యాలు కానరారెందు - దొరికితిరి నేడు నాపూర్వ పుణ్యమున
అనుచు ప్రదక్షిణ నమస్కారంబు జేసి - ఓ మహాదేవరా ఓ జంగమయ్యా
ఆరు దినములనుంచి ఆహారంబులేదు - శివపూజ చేయుటకు చేతులాడావు
శాకపాకంబులు సిద్ధంబులాయె - శివపూజకూ మీరు వేంచేయుడనిన
సంతోషమాయెనూ రాజకుమార - పట్నంబులో నీవు వున్నావు అని
నిరతాన్నదానంబునూ చేతువాని - పన్నుగా కన్నుల ప్రాణములతోటి
చేరితిమి యీ పురి దంపతులమిపుడు - యెందుకు ఓ రాజ మమ్ములాబిల్వ
వుండ యిల్లూలేదు పాడుగుడిగాని - పండమంచములేదు స్మశానమేను
కట్టవస్త్రములేదు పులితోలుగాని - పెట్ట సొమ్ములులేవు రుద్రాక్షగాని
యిటువంటి తపసులకు బిక్షమ్మునిస్తే - మోక్షమ్ములేవయ్యా వో రాజపుత్రా
మహానుభావుడవు దేవదేవుడవు - నీ వారగిస్తేను ముక్తి బొందుదుము
అనిన సంతోషించి ఆ సాంబమూర్తి - యేమేమి శాకంబు చేయించినావూ
గుత్తి బీరకాయ గుమ్మడికాయ - అగాకరాకాయ అలచంద పప్పు
పూర్ణంపు బూరెలు జున్రు పాయసము - ఆవునేయి పాలు అమర వడ్డిస్తు

యిన్నిను నాకేల యిలనులోను రాజా - పసరు కూరలు నాకు పొసగవెప్పొడు
సరసముగ నరమాంస మిష్టంబుసుమ్మి - అది తినక యీ తెగులు తీరదెన్నటికి
అన విని రాజంత హర్షంబునొంది - అయ్యా నా దేహంబు అంతాను త్రుంచి
హోయలుగ మీకిపుడు వంటజేయింతు
కడుముదర మాంసంబు కడుపుకే చేటు - నా యింతి నయినాను ఖండించియిపుడూ
చేయింతు పాకంబు చెల్లింతు వ్రతమూ - చేకొని స్త్రీహత్య చేయుటకన్నా
బాయక యాభిక్ష బాసులేమేలు - సుతులు యెందరుగలరు ధరణీశ చెపుమా
అధిక తపస్సులు హరుకొరకు జేయ - యిచ్చెను వకసుతుని ఆ గంగధరుడు
బాలుడు పదియేండ్ల ప్రాయంబువాడు - అనిబల్క నాహరుడు నీ ప్రియాసుతుని
మరిచంపి శాకంబు మాకు జేయించు - ఆ మాట కర్ణించి ఆ రాజు అంతా
పెట్టెను వీభూది పెద్ద జంగముకు - పెట్టెను వీభూది దక్ష పుత్రికకు
తనయింటికేతెంచి తన సతిని జూచి - వొడయల కథలెల్ల వివరించిదెల్పె
విని మూర్ఛబడిలేచి సుదతి యిట్లనియె - లేక లేకను వక్క పుత్రరత్నంబు
మానుగా హరులిచ్చె వంశపావనుని - చిన్నబిడ్డను చంపి పెట్టుమన్నాడా
పసిబిడ్డలా చంప చేతులెట్లాడు - పసిబిడ్డ మాంసంబు పక్వంబుసేయ
లేతదగుటాచేత పక్వానకూరాదు - నేనూను వొకనాడు మీరు వొకనాడు
బాలుడూ చిరియాళ పుత్రుడొకనాడు - పొసగ మూడునాళ్ళు విందియ్యరయ్యా
మీనాక్షి నినుదెచ్చి మీవాళ్ళునాకు - చిన్ననాటను పెండ్లి చేసినదిమొదలు
నామాటత్రోయక నళినాయజాక్షి - వున్నట్టు నిన్నిపుడు నే చంపగలన
అనుచును దంపతులు యిటులాడుచుండ - చిరియాళునీ భక్తి చూతాము అని
వెళ్ళెను అభవుడు పార్వతియుగూడి - చిరియాళు చదువుల సదనమునకేగి
రారోరి చిరియాళ రాజరత్నామ - తల్లిపేరెవరు నీ తండ్రిపేరెవరు
నీ పేరు యెవ్వరు నిజముగాదెల్పు - నా తండ్రి చిరుతొండ తల్లి తిర్మణాంగ
నా పేరు చిరియాళు డందురూదేవ - బాలభక్తికి ముద్దుపల్కులకు మెచ్చి
హరుడానతిచ్చెను భూపతికపుడూ - తపసిని నీ తండ్రి భిక్షుకును బిల్వ
నిన్ను కూరగవండి తాబెట్టుమనెను - కూర చేయింతునని కోరి వరమిచ్చె
బాలుడవు రూపసివి గుణమంతుడావు - ప్రాణభయం బిపుడు తప్పించుకొనుమీ
ఆకులకని వెళ్ళి అడవిలోదాగు - ఫలములకని చెప్పి వృక్షములదాగు
కొండలలోదాగు గుహలలోదాగు - ధృవునివలె యతివేష మేసుకునియేగు
వేటగానికి దొరకు వనమృగమువలెను

అప్పగించను చేతు లెట్లాడునయ్యా - అనియిట్లు పార్వతీ హరుడును బల్క
విని చిరియాళుడూ వివరముగ దెల్పె - యిదియేమి అయ్యా మీకీలాటి వెర్రి
చెట్టుబెట్టినవాడు చెలగి తొలికాయ - నిజముగాయిచ్చును నీలకంఠునికి
నరజన్మంబునా నక్కజన్మమున - శునకజన్మంబున కీటకములాది
జన్మంబులెత్తియు శ్రమలనూ బొంది - చచ్చి పుట్టుటకన్న నాదు గర్భమున
నిలువరంబుగనుండు తగును లోకముకు - అనియిట్లు పుత్రుండు పల్కగా విని
ఆనందమున పొంగి ఆ దంపతూలు - ఆశ్చర్యమును పొంది తర్లిరచ్చోట
అచ్చట పతితోడ ఆ తిరుమ్మణాంగసుతుని - దెమ్మని బల్క శుభచరిత్రుండు
వెళ్ళెను చిరియాళు చదువుల్లవాడ - మా చిరియాళుడా మాకులాతిలుకా
బల్ల పుస్తకములు చేబూనివేగా - సరగున వేంచేయు సదనంబునాకు
చిరియాళ్లు తమతండ్రి చంకనెత్తుకుని - మనసులో తలపోసి తనయ కిట్లనియె
వెలమయింటను నీవు యేలపుట్టితివి - యీ ముద్దు ముచ్చటలు ఆటపాటాలు
విద్యలు బుద్ధులు యేల నేర్చితివీ - నన్ను వకజంగమ్ము నరమాంస మడుగ
నిన్నుజంపి విందు చేయింతునంటి - కొడుకును చంపుదురె భువిలో నెవరయినా
అని హడలుచూ సుతుని సతిచేతికివ్వ - సుతునెత్తి ముద్దాడి చుంచూనుదువ్వి
నా చిరియాళుడా నాముద్దు పుత్ర - నాకులరత్నమా నాపాలితండ్రి
తపసికి నిన్నిపుడు విందుజేయింప - మానుగా వరమిచ్చె పార్థివేంద్రుండు
వెలమయింటను నీవు యేలబుట్టితివి - పాపపు గర్భాన జన్మించు కతన
బాల్యమందున బాపునికిచ్చె బ్రహ్మ - అనుచు సోకించెదు నా దంపతులకు
అతివినయంబుతో సుతుడు యిట్లనెనూ - యిదియేమి అయ్యారో మీకింతవెర్రి
నరజన్మమూకన్న నాగంబుకన్న - శునక జన్మముకన్న క్రిమి జన్మముకన్న
తపసి కడుపునబడితె తగును లోకముకు - సుతుని పల్కులన్ని హితవుగాయెంచి
సుతునెత్తి ముద్దాడి చుంచునుదువ్వి - జాజి సంపెంగ తైలమున శిరసంటి
కస్తూరి నలుగులు కడువేడ్క బెట్టి - శ్రీగంధములు కలిపి శిరసొప్పనంటి
పన్నీట మజ్జనం బాగుగాజేసి - మెత్తనివస్త్రముతో మేనుతళ్ళొత్తి
పట్టువస్త్రంబులు కట్టుకోయిచ్చి - వారమ్ముసొమ్ములు వంటనూబెట్టి
నుదుటను కస్తూరి తిలకంబుదిర్చి - పంచభక్ష్యాన్నములు భక్తితోబెట్టి
చిరియాళ్ని తనతల్లి చంకనెత్తుకుని - చెక్కిలినొక్కియు చేర్చిముద్దాడి
మోహపు సుతునికి తల్లి యిట్లనెనూ,

## జాలికాంభోజిరాగము — ఆదితాళము

ఆహా ముద్దుల పుత్ర - ఆహా నాశుభగాత్ర
నీమోమెన్నడు జూతు నీరజనేత్రా
చిరితొండరాజుకు చిన్ని కుమారుడవయి
యెంత గతి నొందెదవురా ॥ఆహా॥

అమ్మా యనుచూ నన్ను నిమిష మెడబాయనివాడవు
బాసీ చనెదవటర నాముద్దుబాలుడ ॥ఆహా॥

యన్నారాతులలోన ఎన్నోవిధంబుల సన్నుతింపగ
నిష్ఫల మాయెగదరా
పన్నగాభూషణుని బ్రస్తుతించి తుదకు
చిన్నినావరపుత్ర చెలువులో నినుగంటి ॥ఆహా॥

ప్రొద్దుప్రొద్దునలేచి చద్దిబువ్వనగానే
గద్దరివనికొట్టగా వెరచి యుండేవు
ముద్దులతనయ నీమోము రోకలిచేత
సుద్దగ త్రొక్కుట చూడావలసి వచ్చె ।ఆహా॥

ఒక్క పుత్రుడవయ్యు దక్కితి వనుకుంటి
అక్కటా యిలబ్రహ్మ దధికారమాయెగా
యెక్కువా శాస్త్రము లెన్ను నేర్పించితి
గ్రక్కున నీవు రాజ్య కర్తవగుదువనుచు ॥ఆహా।

పరమ ద్రోహులయింటి పాపాపై జన్మించి
ధం లేని యిడుమాలు దగిలితివోరా
పరగ పరబ్రహ్మ భక్తవరదుడౌ
శంకరుడు నీవాడగుచు కైలాస మిడుగాక ॥ఆహా॥

చిరుతొండని తల్లి చేరంగదీసి - మదిలోన పరమేశు మంత్రంబు దలచి
పంచాక్షరీమంత్ర పఠనంబుజేసి - ఆయుధంబు స్పృశించి ఆ బాలు శిరసు
వేసినంతనె శిరసు దూరాన బడియె - తత్తరముచేతనూ దిగువ ఖండంబు

చేతగొని ఆ తల్లి బంగారురోట - వెండిరోకలిచేత యీశ్వరుని దలచీ
ఓ శంభుశంకరా ఓ మహాదేవ - శివలింగ విశ్వేశ ఓ జంగమనుచు
కుండలమ్మిన యిట్టి గుండయ్యయింట - కుడిచితివి వకవిందు నీవు పరమేశ
కట్టెలమ్మెడు కోమటి శెట్టెప్ప యింట - కుడిచితివి ఒకవిందు ఓ జంబుకేశ
సురలార యీవిందు కుడిచి మీరంతా - చిరియాళునంపుడే శివలోకమునకు
త్వరపడి పంపుడీ తడవుసేయకను - అనుచు పాటలుబాడి ఆ యంబుజాక్షి
దంచిన మాంసంబు పచనంబుజేసి - తాలింపులో చముకు తగ్గమిరియంబు
వుప్పు మెంతియుబెట్టి వుత్పలాగంధి - నవరసాన్నంబులు సిద్ధంబుజేసె
వాకిట బడ్డట్టి శిరస్సు తాదీసి - తిర్మణాంగత్తయును పాకంబుజేసి
సిద్ధంబుజేసెను శ్రీశివునికొరకు - అచట ఆపార్వతీ పరమేశ్వరూడు
మదిలోన యిట్లనీ తలపెట్టుచుండె - రాజురాకలులేవు రమణి యిప్పటికి
సుతుచావుకై నాను సతివొప్పలేదొ - పతిభిక్ష పద్ధతి తనకు వద్దనెనొ
అనగ పార్వతిబల్కె అభవునితోటి - నేబోయి రాజిల్లు చూచయినవత్తు
అనుచును సెలవొంది ఆ యుమాదేవి - పసిడికుచ్చులబొంత బాగుగాగట్టి
రంగయిన రత్నాలపేర్లు మెడవేసే - రాగి భూషణములు వంటధరియించి
చంకనున్నబుట్ట శిరసుననుబెట్టి - యెరుకలనాంచారు వేషంబులోను
పురవీధులన్నియు పొందుగా దాటి - వచ్చెను సిరియాళు భవనంబులోకి
కద్దటే భిక్షమ్ము కమలాయజాక్షి - కలగకుంటే బోదు గ్రక్కునను జెప్పు
బిడ్డ చేదిగకున్న పిత్రుకార్యమేమొ - వడ్డించ తడవేమొ వేగిరందెల్పు
ఓ చెలియ నీకింత తత్తరంబేల - మనసిచ్చి కూర్చుండు ఓ ముద్దుగుమ్మ
అనగ పార్వతి నవ్వి ఆ చెలియతోను - వినవమ్మ వకవెర్రివాడు నావిభుడు
చిన్ననాటను పెండ్లి చేసినది మొదలు - వుండ యిల్లూలేదు పాడుగుడిగాని
పండ స్తలమూలేదు స్మశానమేను - పెట్టసొమ్ములు లేవు రుద్రాక్షగాని
కట్ట చీరలులేవు పులితోలుగాని - అందంది భుజియించ అది అర్థకూడు
అందంది భుజియించి అర్థాంగినయితి - వోయమ్మ నీవు యెందుండి వచ్చితివె
పతిపైని నిందలు పాటింప దగునా - కుంటివాడయినాను గుడ్డివాడయినా
సుంకరీడయినాను చోరుడయినాను - కల్లగాడయి తన్ను వల్లకున్నాను
అతనుగా యీశ్వరుని వలెచూడవలెనూ - పట్టుచీరెయుదెచ్చి కట్టుకోయిచ్చి
చాపెడు ముత్యాలు వడినిండబోసి - వేగమెపంపెనా వెలదినంతనూ
యిచ్చిన యవిదెచ్చి యీశ్వర్లుకపుడూ - చేతులోబోసెను భవానిదేవి

అద్భుతంబొందెను ఆ సాంబశివుడు - భర్త సన్నిధికేగి ఆ తిరుమణాంగ
భోజనపు వేళాయె ఓ స్వామినాథ - శాకపాకంబులూ సిద్ధంబులాయె
వొడయ లెచటున్నారు వేగతోడ్తెండి - ఆ మాట వినిరాజు కదలె తనపురికి
వెళ్ళెనే అభవుని వటవృక్షమునకు - సాష్టాంగపడి రాజు సన్యాసితోను
ఆనతిచ్చినరీతి అన్నివస్తువులు - నవరసాన్నంబులు సిద్ధంబులాయె
భిక్షకు వేంచేయి ఓ జంగమయ్య - అనుచును హరుబిల్వ ఆగ్రహముతోను
బొమలు ముడివడ నగ్నికణములూ రాల - నాటికిప్పుడ నీవు మముబిల్వ వస్తి
వొడయల నందర్ని కడుపులు గాల్చి - వెళ్ళకొట్టితివని వినుచుంటి నేను
నీ మనసు యిట్టిదని తెలిసియుంటేను - పట్నంబులో గలా యిల్లిల్లు దిరిగి
సంతతంబుగ భిక్ష నేదెమ్చుకొందూ - అని శివుడు బల్కగా చిరుతొండ డపుడు
యిక్లేల పలుమాట లానతిచ్చేరు - గుర్రమ్ము దెచ్చేను యెక్కేవదేవ
గుర్రమూపేరేమొ యెరుగనోరాజ
యేనుగను దెస్తు యేక్కేవ దేవ - యేనుగ అంటేను యెరుగనోరాజ
పల్లకీదెచ్చేను యెక్కేవ దేవ - కుళ్లుజంగానికీ పల్లకీ యేల
తూగుటుయ్యాల్ల యెక్కేవదేవ - ఆ చేర్లు తెగితేను నాకేమి దిక్కు
నా రెండు భుజములను యెక్కుమీ దేవ - అనగ శివుండంత హర్షంబునొంది
రాచభుజముల నెక్కె ఆ గంగధరుడూ - వూరిలోకి వస్తె కుష్టురోగనిరి
వాడలకు వస్తేను రణరోగి యనిరీ - మావాడకూవద్దు మళ్ళించుమనిరి
తల్పులు మూసియు చూచేటివారు - దేహవాసనగల బడుగు జంగమును
రాజు శిరసునమోసె భిక్షమ్ముబెట్ట - చేతులెట్లాడెనో మనసెట్లు వచ్చె
అనుచును బురజనులు ఘోషిల్లుచుండ - భక్తుని శ్రద్ధలు తాజూడదలచి
కలిమాయ గల్పించె గరళకంఠుండు - పురవీధులంతటా పొందుగా ద్రిప్పె
వచ్చెను ఆ రాజ సౌధంబులోకి - వచ్చిన విభుజూచి వనిత వేగమునా
భమిడి కలశములతో గంగ తాదెచ్చి - వొడయ పాదంకడుగ విభునికీనిచ్చె
పరమేశ్వరు పాదములు తనపతీ కడుగ - పాదతీర్థంబులూ పైజల్లుకూని
కర్పూరహారతి కడువేడ్కనిచ్చి - సంపెంగ తయిలమున శిరసొప్పనంటి
కస్తూరితో నలుగు ఘనమున బెట్టి - పన్నీట మజ్జనం బాగుగాజేసి
మెత్తని వస్త్రమున మేనుతళ్కొత్తి - పట్టువస్త్రంబులే ఆరుమికి గట్టి
కనకాసనంమీద కూర్చుండబెట్టి - గంధాక్షతలు యిచ్చె శంభుదేవరకు
పుష్పగంధములతో పూజగావించి ధూపదీపములిచ్చె తృప్తితో తాను

అయిదు మూళ్ళరిటాకు అందముగ బరచి - పాత్రాభికారంబు పణతి తాజేసి
పంచభక్ష్యాన్నములు మగువ వడ్డించె - మెత్తనివంటకము మేలుగాబెట్టె
హస్తోదకంబిచ్చె రాజశేఖరుడు - ఆరగించుము దేవ అనుమానమేల
అనియిట్లు భక్తుండు పల్కగా విని - వినయంబుతో శివుడు విభజించి పల్కె
తలలేని వంటకము వడ్డించినావు - అదిలేక యీతెగులు అంతతీరాదూ
ఆ మాటలూ విని ఆ రాజుతల్లీ - కోడలి కందిచ్చె శిరసు మాంసంబు
యిచ్చిన అదిదెచ్చి యీశ్వర్ల కపుడు - మోదముతో వడ్డించె ఆ తిరుమణాంగ
అచ్చుగా వడ్డించ హరుడంత మెచ్చి - భక్తుని సతితోను పరమాత్మ బల్కె
నీచిరుతొండనినూ బిల్వవమ్మా - మడిసిన పుత్రుడూ మరియెక్కడొచ్చు
తేనిపుత్రుని మీకు యెట్లు జూపింతూ - ఆరగించుమి దేవ అనుమాన మేల
బిడ్డలేనియింట కుడువని వ్రతాము - గొడ్డుబోతుల యింట కుడువని వ్రతమూ
నడిపితిమి మాచిన్న నాటనుండియును - కన్నమోహంబునా కాంతశోకించ
శోకతో ఆకాశవాణపుడు బల్కె ముద్దుముచ్చటలతో మురిపెములతోను
ఘల్లుఘల్లూమని ఘంటలట్లుమ్రోయా - వద్దకు చిరియాళు డటుచేరిరాగ
వచ్చిన సుతుని తానెత్తి ముద్దాడి - గరళకంఠుని పాదపద్మములవైచె
మెచ్చక యీశ్వరుడు హెచ్చుగాబల్కె - కుక్కను జంపితివి కురూపి నీవు
నక్కను జంపితివి నాకొరకు యిపుడూ - కానిమాంసంబివ్వ కరమెట్లు వచ్చె
అప్పుడేటికి తప్పు యిప్పుడేజూడు - తప్పక ఖండింతు నీ శిరస్సనిన
బిడ్డను చేబూని ఖడ్గంబుబట్టి - పంచాక్షరిమంత్ర పఠనంబుజేసి
ఆయుధం వేయగా బాలు కంఠమున - పూలహారంబయి పొలుపొంద నిల్చె
శివుడు ప్రత్యక్షమై ముందర నిలచి - అవుదువు తిరుమళాంగవుదువు నీవు
అవుదువు చిరితొండ పట్నంబు దేవ్వి - నీ సాహసంబేడ నీ భక్తియేడ
కోరుము వరములూ యిచ్చేదనన్న - యేమయిన నాకేల వోనాగధరా
శాశ్వత పదవైన కైలాస మిమ్ము - హరులిచ్చె కైలాస మాదంపతులకు
శంకరుడు పార్వతీ వృషభంబు నెక్కి - వెళ్ళిరి కైలాస పర్వతంబులకు
శివశరణు శివశరణు శివశరణుదేవ - శివశరణు శివకాశి విశ్వపతి శరణూ
హరశరణు హరశరణు హరశరణు దేవా - హరశరణు అర్ధనారీశ్వర్ల శరణూ
నందివల్లభ శరణు నన్నేలుస్వామీ - బాయిక యీ పాట పాడినా విన్నా
కైలాసవాసులయి ముదముతో నుంద్రూ.

---

# కామేశ్వరి పాట

శివాశివాదేవరా శివనందినెక్కి - కదిలేనే కైలాసపర్వతమ్ములకు
భారతి శ్రీలక్ష్మి పార్వతులగొలచి - పుణ్యతీర్థములాది పొలుపొందుగాను
పుణ్యములకు నేపొందుగా మొక్కి - పురుషోత్తమునియందు బుద్ధి నేనుంచి
పుణ్యమైయింపొందు పుడమిలోపలను - కామేశ్వర కల్పమ్ము ఘనముగాజెప్ప
మనవాడు పాలకోలను

శుకపిక శారకానక జక్కితోను - సురచిరమైనట్టి సుందర్లతోను
ఫలపుష్పములనొప్పు పాదపములతోను - లేచిగంతులవైచు లేళ్ళగమితోను
మల్లిచామంతుల మొల్లాలతోను - వెల్లివిరసియున్న విరజాజులతోను
నల్లిబిల్లిగొన్న ద్రాక్షలతోను - యుల్లాసమైనట్టి యుయ్యాలలతోను
అరటితోటలలోను పెనువెనుకున్నట్టి - గండపుతీవులా పొదరిళ్ళతోను
కలహంసలున్నట్టి కొలనులతోను - పొలుపొందు పర్ణశాలల పజ్క్తితోను
వలనొప్పు కాషాయవస్త్రములతోను - చెలగుచుండెడి వేదమంత్రములతోను
నీలకృష్ణాంజన విభవములతోను - ఆజ్యధారలు గల్లు యజ్ఞాలతోను
పూజ్యులై పెంపొందు పురుషులతోను - చెలగుచుండెడి నైమిశారణ్యమందు
మనవాడు పాలకోలను

ఈ కరణిదగ నైమిశారణ్యమందు - కపిలభార్గవ కణ్వాగవుతామాశ్వాల
కాణాచి వాల్మీకి వశిష్టయత్రి - పారశర్యాభార్గ భద్రకర్ణాట
బాహుళ్యా బాహ్లికాపాసురాట - శాండిల్య భృగుగాత్రి మాండవ్యమంతా
కాండిన్య కాపాలగాణు సపత్యాలు - మనవారు పాలకోలను
అతికౌతుకముతోను హీనమతియైన - సూతునీ లోకావిఖ్యాతుని గాంచి
అడిగిరి మునులెల్ల ఆనందముగను - వ్రతములలోను సువ్రతమగుచు చాల
ధనకనక వస్తువాహన శుభములను - ధాన్యాది బహువస్తు సంతానములను
గలుగజేసి పుణ్యకథ యెద్దియనిన - కలికల్మషంబెల్ల గలిగిపోవగను
జెప్పుమన్నను సూతుడప్పుడూహించీ - మనమాడు పాలకోలను

వినుడి మునులారా మీను లలరగను - వినుతికెక్కేటట్టు విస్తారముగను
సర్వజనులకు నెల్ల సౌఖ్యంబుగాను - పూర్వయుగమునందు పూజితమైన
పార్వతి కథలెల్ల బ్రణుతికెక్కగను - బ్రహ్మ నారదుల సంవాదమే తనదు
బ్రహ్మలకు హితవైన - హితవాస మొకటి మనమాడు పాలకొలను .

నిగతమయి వెలుగొందు సతగ లోకమున - ముత్యాలగద్దియను ముదముతోనుండి
వానితోపలుమారు వ్రాకుచ్చుచుండి - మునులెల్ల దనుమిగుల వినయమున
బొగడ సనకాదులెల్లనూ సన్నుతింపగను - వారించు నాకు వర్ణింపుమనిన
మనమాడు పాలకొలను

నారదూ విద్యవిశారదూగాంచి - పరమరహస్యమై బరగు నీ కథయు
విరివిగజెప్పెద వినుమని పలికె
మనమాడు పాలకొలను

దేవియదే వారావశివనందినెక్కి - దేవుమార్గముబట్టి దివ్యామయినట్టి
దివ్యమై పెంపొందు రత్నములతోను - దివ్యమైన క్రిను భవనములతోను
యక్షకిన్నరుల విమానములతోను - నక్షత్రపర్యంత శిఖరములతోను
పక్షులతోరొదగల్లు వృక్షములతోను - నాగకన్యలయొక్క నాట్యములతోను
బాగయిన సురపొన్న పంక్తులతోను - బెదరి బారులేళ్ళ కదుపూలతోను
సుదతులు శోభ సుగుణములతోను - మురయుచు దిరిగెడి వ్యామునులతోను
నెమిళ్ళతోను మామిళ్ళతోను - రామనామముబల్కు రాచిల్కతోను
చంపకాశోక పున్నాగములతోను నుండిన - నవరత్న రాసులతోను
విలసిల్లు విరజాజి మొగ్గలతోను - లలిమీర యమరారు కొలనులతోను
నిర్మాలిన్యమయినట్టి హర్మ్యంబులతోను - భర్మనిర్మితమైన బాణములతోను
వేదాంతములుబల్కు విద్వాంసులాను - బాగులాడెడి సూరివర్గములాను
కూడాయున్న కులాచలములయినట్టి - కదిలిరి కైలాసపర్వతమ్ములకు
ఇహాముందు పోయిపోయి యిక పోయిపోయి - భోగావతి కన్నెలా పొడగంటి దేవ
మాంకాళ వక్కరై మాధవకవరై - అసర మోహామువారు యెదురున్నవారు
దివ్వెరేపొన్నలా దివ్యకన్యలు - మరచిచెప్పకరారె విశ్వేశమీరు
మన అంతటా కైలాసగిరిపైకినేగి - హర్మ్యమధ్యమునందు యనువొప్పుగాను
తామరాల వాసనలతోగూడి - ప్రేమ దప్పెడి మట్టి పొదలతో గూడ
వ్రాకుచ్చు కరహంస వితతితోగూడ - వీకరత్నాలతో విలసిల్లుచున్న

స్త్రీల పౌరాణికపు పాటలు

రాకేందు ముఖులతో రంజిల్లుచున్న - మల్లెలతో గూడ మండపమ్ములకు
మహాదేవు శివునితో మరివేగవచ్చి - ప్రమదులునుముట్టి ప్రార్థింపుచుండ
వరదుందుభులును వాయింపుచునుండ - రంభ వూర్వశి నాట్యమాడుచునుండ
జంబారి స్తోత్రములు సలుపుచునుండ - జయజయ ధ్వనులతో జెలగుచునుండ
రయమున వింజామరలు వీచుచునుండ - మనమాడు పాలకొలను

అంతట దేవికి దాహములాయె - తనచేత శూలాన తవ్వించెకొలను
ముత్యంపు కొలనాయె శ్రీ పర్వతాన - ముత్యంపు చాయలదె కొలనువుదకమ్ము
వజ్రంపు కొలనాయె శ్రీ పర్వతాన - వజ్రంపుచాయలదె కొలని వుదకమ్ము
కస్తూరి కొలనాయె శ్రీ పర్వతాన - కస్తూరి చాయలదె కొలని వుదకమ్ము
పగడంపు కొలని వుదకమ్ము - నీలంపు కొలనాయె శ్రీ పర్వతానా
నీలంపు చాయలదె కొలని వుదకమ్ము - పగడంపు కొలనాయె శ్రీ పర్వతానా
పగడంపు చాయలదె కొలని వుదకమ్ము - రత్నాల కొలనాయె శ్రీ పర్వతానా
రత్నంపు చాయలదె కొలని వుదకమ్ము - గంధంపు కొలనాయె శ్రీ పర్వతానా
గంధంపు చాయలదె కొలని - వుదకమ్ము ॥మన॥

ముంచి ఆరగించె మూడుదోసిళ్ళు - ముంచకారగించె మూడుదోసిళ్ళు
యెంచి ఆరగించె ఏడుదోసిళ్ళు - యెంచకారగించె ఏడుదోసిళ్ళు
ఏడుదోసిళ్ళకు ఏకగర్భమూ - యొక్కొక్క గర్భము తొమ్మిది ఘడియలు
చిరితొడల బుట్టించె చిరివేణి తాను - చిరివేణీ తాగోరు చిక్కుపుట్టమ్ము
పెందొడను బుట్టించె పేర్వేణీ తాను - పేర్వేణి తాగోరె పెద్ద రంగము
వీపునబుట్టెను వీరభద్రుడు తాను - వీరభద్రుడు తాగోరె వింజామరాలు ॥మన॥

అరికాళ్ళ బుట్టించె అనకమ్మ తాను - అనకమ్మ తాగోరె యినకల్లుపుట్ట
మణమల్ల పుట్టించె మాంకాళి తాను - మాంకాళి తాగోరె మంచిమల్లెల్లు
మునుకున్న బుట్టించె ముద్దరాలు - తాను ముద్దరాలు తానెగోరె ముత్యాలపేరు
కటియందు బుట్టించె కనకమ్మ తాను - కనకమ్మ తాగోరె కమలపత్రములు
బొడ్డున పుట్టించె పోతన్న తాను - పోతన్న తాగోరె బొడ్డుమల్లెలలు
పేరురమున బుట్టించె పేరిందేవితాను - పేరిదేవి తాగోరె చెర్కుజపనమ్ము
జంఘాన బుట్టించె జక్కులమ్మ తాను - జక్కులమ్మ తాగోరె సన్నావళిపెమ్ము
కొనలందు బుట్టించె కొండవేణి తాను - కొండవేణి తాగోరె కొలకుల్లపట్ట

వెన్నున బుట్టిందె యన్నెమ్మ తాను - యన్నెమ్మ తాగోరె యర్రబాణమ్మ
రొమ్మున బుట్టిందె రత్నమ్మ తాను - రత్నమ్మ తాగోరె రమ్యంపు పట్టు
వెక్కాల బుట్టిందె చామంతితాను - చామంతి తాగోరె చిత్రంపు రవికె
కన్నుల బుట్టిందె కలికికామన్న - కామన్న తాగోరె కనకాంబరాలు ॥మన॥

ఏడుగురు అక్కలు ఆరుగురు చెలులు - యెంతో మోహముతోను తమ్ములిద్దరును
ప్రేమతో నానాట పెరుగుచునుండ - కామన్న అందరిలో కలికితా మెరసి ॥మన॥

పెరుగుచు కామన్న పువుపొదలనెక్కి - పొదలను పువ్వులా వడినిండగోసె
యా పువ్వులు ఈశ్వరుని నేత్రములజల్లె ॥మన॥

కనుదృష్టి మధ్యమాయె కానరాదాయె
కానరాకా శివుడు కాపాడుచుండె - దోసెడు రత్నాలు దాదోడితెచ్చి
యరుకను అడిగితె కామన్న తాను - సుతులును అడగితె సుదతి కామన్న
సుతులను గృహమున పెంపొందుచుంద్రు - వారంత మనసులో యేమి కోరేరు
పప్పుపంచదారలెల్ల కోరేరు వప్పుగా - వడపప్పు పళ్లు కోరేరు ॥మన॥

వనము కోవెలచూసె వాసంతమొదవె - వలరాచక్కలకి రంగమ్మ పోసగె
మునుపుచు తొలినాటి మునిమాపు ప్రొద్దు - శ్రీలక్ష్మి అక్కలూ శృంగారవతులు
శ్రీ లక్ష్మి బాబులు శివుని పంపుమన్న - శ్రీపుర పట్నానికిచ్చి రందరును ॥మన॥

కొలవవలె కామేశ్వరిని కొలదేర్పరించి - పెట్టవలె చిత్రంపు చిరిపట్టు చీరె
మనము గొల్చుదాము మహిమ వెలయగను - ముందుగొలుచుదాము ముదమొప్పగాను
అని పల్కి సఖులతో కైలాసగిరికి - మునుతూర్పు భాగమున నిర్మించెబ్రహ్మ
అరుదయినవారికీ అమృతంపు కొలను - ఆ కోణ మధ్యమున అమరున్నా కొలను
వెండివుయ్యాలలతో వెలసున్నా కొలను - భమిడి వుయ్యాలలతో ప్రబలుకొన్నా కొలను
రత్నాల వుయ్యాలలతొ రంజిల్లు కొలను - పచ్చలుయ్యాలతొ బ్రబలున్నా కొలను
వజ్రాల యుయ్యాలతొ వనరైన కొలను ॥మన॥

అరటినీడలదాక అమరించె కొలను - దబ్బనీడలదాక దాపించె కొలను
యిప్పనీడలదాక యిమిడించె కొలను - వటపత్రములదాక దాపించె కొలను
చిలుకలు చెలరేగి ఆడేటి కొలను - హంసలు ప్రతినడకలు నడచిందె కొలను
తుమ్మెద జంకారాలు మోసిరి కొలను - రత్నాలతాబేళ్లు రాజిల్లు కొలను

మంచి ముత్యములతో మహినొప్పు కొలను - చక్రవాకములతో చెన్నొందుకొలను
నాచుగుల్లలతో నాడెమయిన కొలను - నీటినీ వాయసములు నిండున్న కొలను
కలువపువ్వులునిండా గలిగున్న కొలను - తామరపువ్వులతో తరుచైన కొలను ॥మన॥

చిట్టిచిట్టిముత్యాల కుంచచేబట్టి - చీరవేకొలనాడ వేంచాయరమ్మ
పెదపెద్ద ముత్యాల కుంచచేబట్టి - పేర్వేణి వెలనాడ వేంచాయరమ్మ
అనేక ముయ్యాల కుంచచేబట్టి - అపకమ్మ కొలనాడ వేంచాయరమ్మ
మరకముత్యాల కుంచచేబట్టి - మాంకాళి కొలనాడ వేంచాయరమ్మ
ముదమొప్ప రత్నాల కుంచచేబట్టి - ముద్దురాలు కొలనాడ వేంచాయరమ్మ
కనకంపు కుంచము కరమందుబట్టి - కనకమ్మ కొలనాడ వేంచాయరమ్మ
జాజిమొగ్గలకుంచం చేతనేబట్టి - జక్కులమ్మ కొలనాడ వేంచాయరమ్మ ॥మన॥

కోరిపగడపు కుంచచేతనేబట్టి - కందువేణి కొలనాడ వేంచాయరమ్మ
యరపుదాతునకుంచ చేతనేబట్టి - యన్నెమ్మ కొలనాడ వేంచాయరమ్మ
రత్నాలు దాసిన కుంచచేబట్టి - రత్నమ్మ కొలనాడ వేంచాయరమ్మ
చారేడు ముత్యాల కుంచచేబట్టి - చామంతికొలనాడ వేంచాయరమ్మ
ముద్దాపసుపు లొప్పచేతానేబట్టి - ముత్తైగుకొల వేంచాయరమ్మ
కొట్టుపసుపు లొప్పచేతనేబట్టి - అక్కల్లు కొలనాడా వేంచాయరమ్మ
చాకలిమడతలు చంకబట్టుకొని - చాకలి యినగమ్మ కొలనాడరమ్మా
ముక్కోటి దేవతలు కొలనాడారండీ - మునియోగులందారు కొలనాడ రండి
నందెన్న నారదుడు కొలనాడరమ్మా - నాతూలందరు గూడ కొలవాడరమ్మా
నీరంటి పేరంటాళ్లు కొలనాడరండి - పీరింటి కామన్న కొలనాడరమ్మా ॥మన॥

కొట్టు పసుపుచేత కుంకుమాచేత - వెళ్ళేరే అక్కలు కొనను ఆడంగా
కొలనాడ అక్కల్లు కొలనూ విడనాడి - కట్టుకున్నా చీరెలు గట్టున్న బెట్టె
వోవంకా కన్నెల్లూ వోలలాడేను - వోవంక గన్నులు వోలాలాడేను
అందరు అక్కల్లలో వెలిగే తమ్ముడూ - పోతన్నా తావచ్చి ఆ ఘడియలు వేసె
ఘంటల్లా ఆ ఘడియ ఘల్లునావేసె - ముత్యాల ఘడియ ముదముతో వేసె
కెంపెల్ల ఆ ఘడియ తా కుదురుగావేసె - పచ్చలా ఆ ఘడియ పరగునా వేసె ॥మన॥

తూరూపూ మాది వాకలితుమ్మి - పువ్వులా మాచేత పూవ్వుల్లా మీరు
గొలువరయ్యా గిలిగిలి ముత్యాలా కొండి

చాలా యీరాతి వాకిళ్ళ వుంచారె - ఘడియా దక్షిణానా మాది వాకిలి
తామర పువ్వులా మాచేత కొండి - పువ్వుల్లా ఘడియాలు మీరు గొల్తురయ్యా
గిలిగిలి పువ్వులా కొండి చాలా - యీరాత్రి వాకిళ్లా వుంచారే ఘడియా పడమట
నామాది వాకిలి పట్టేడు పువ్వులూ - మాచేత పువ్వులూ మీరు గొల్తురయ్యా
గిలిగిలి ముత్యాల కొండిక చాలా - యీరాత్రి వాకిళ్ళ వుంచారె ఘడియా ॥మన॥

చాకలి మడతలు చక్కగా పర్చి - ఎడుగురు అక్కల్లునూ కొలనాడ బెట్టె
పాదాల చక్కగా పసుపుల్లు రాసి - పరిమెళ కుంకుమ్ము పారాణీ బెట్టె ॥మన॥

వారింట అక్కల్లు యేమి తేరేరు - చలిమిడి వడపప్పు చాల కోరేరూ
బంగారు కలిసాకు పరిమెళ మద్ది - బంగారు కలిశాకు ముత్యాల అద్ది
బంగారు కడవాలో పానకంబు బోసి - పట్టుచీర దెచ్చి పైనొప్ప గప్పి
తమలపాకుల మీద కామమ్మ నుంచి - మల్లియా పూవ్వులూ రెల్లా పువ్వులూ
తంగేడు పువ్వుల్లాతోను ఈ కామును పూజింత్రు - మహిసాక్షీ గుగ్గిల ధూపమ్ము వేసి ॥మన॥

బంగారు పళ్ళెములో పాలు నెయ్యిబోసి - బంగారు కడియాము పాలలో వేసి
వారింట అక్కలు కొలనాడా రండి - వారింటా పేరంటాళ్ళు కొలనాడ రండి
వారింటా దేవతులు కొలనాడ రండీ - వారింటా కామన్నా కొలనాడారమ్మా ॥మన॥

## స్నానకాలు

గంగా వుస్తానా కానా నెలకొన్నట్టి - సాగరపంగవు కాము కొలనాడరమ్మి
కూర్మ పెన్నానా కానానెచి క్రొన్నట్టి - కూర్మగుందిక కామూ కొలనాడరమ్మి
అరసావెల్లి స్థానా కానా నెలకొన్నట్టి - అంచగౌరు కాము కొలనాడరమ్మి ॥మన॥

భాగీరథి స్థానకాన నెలకొన్నట్టి - తీగిదం వకులకాము కొలనాడరమ్మి
జాజిపురస్తాన కానా నెలకొన్నట్టి - జక్కలకాము నీవు కొలనాడారమ్మి
గయాక్షేత్రపు స్తానకానా నెలకొన్నట్టి - గరుడవాహన కాము కొలనాడరమ్మి
శ్రీశైల స్తానా కోన నెలకొన్నట్టి - చిత్రమౌ కామేశ్వరి కొలనాడరమ్మి
భద్రాచల స్తానకానా నెలకొన్నట్టి - భద్రంపు కామేశ్వరి కొలనాడరమ్మి
యీవూర స్తానాకా నెలకొన్నట్టి - లాడనై కామేశ్వరి కొలనాడరమ్మి

మల్లరమ్మాయి కొలసూ మూడువేలుచెయ్యా - పట్టరమ్మాయీ కొలను పదివేలుచెయ్యా
యెత్తరమ్మాయీ కొలను యేడువేలుచెయ్యా - దించరమ్మాయీకొలను దీర్ఘాయువుగానూ
॥మనవా॥

యీకరణిజేసిరి కామేశ్వరి పూజ - నాకమ్ము దేవతలు వీకమైతనర
చేసిన పూజలు శృంగారమొప్ప - పూచేన కల్పము పాలంతనరారగను
లోకములో జనులాకు ప్రాకటంబుగను - లోకమూలో విలసిల్లుచు రూఢికెక్కగనూ
ఆయురారోగ్యముల ధనధాన్యమును - ఆచంద్రార్కమందూ సంతానములునూ
యిచ్చూననుచు జెప్పి బ్రహ్మ నారదుతో.

# సురాభాండేశ్వరము

శ్రీ గణాధిపతి నిన్ను చిత్తానదలతూ - దలచి నే మ్రొక్కెను దయయుంచుదేవ
ఈశ్వర పుత్రుండు యేకదంతుడు - వాక్సుద్ధిగాను వరమప్పుడడిగె
శ్రీ పార్వతీనాథా శ్రీ విశ్వనాథా - మీ పాదములకు నే జేరి మ్రొక్కెదను
ఘనతనైయె యొప్పెటి శ్రీ కాశిలోనయిన - పొలుపొందుగా అన్నపూర్ణను దలతు
పంచక్రోశము కాశిపట్టణ మంధు - పంచపాతకములు బాసిపోనిపుడు
పరగ జెప్పెదను సురాభాండేశ్వరమ్మా - వినుపింతు యీ కథా పుణ్య చరిత్రా
ద్వైతవనంలో ధర్మనందనుడు - ప్రీతి తమ్ములతోడ ప్రియగోష్టిశాయా
మహిమ మార్కండేయ మహిమీద చాలా - ప్రమబదంబని కాంత బ్రస్తుతిశాయ
విభవంబుతోడ సంభవ చిత్తుడనగా - రమణితో ఆ ధర్మరాజు నిట్లనియె
నెవరయిన కాశిలో నే రీతి మెరయ - వినవలెను ఆ ధర్మ విభునికి దెలియా
సంగతి కాశిలో సఖయ పెంపొంది - గంగ యమునా మణికర్నిక గూడి
పాపాత్ములను మరిపావనముజేశి - ఆ పుణ్యనది గంగ ఆ తీర్థకాశీ
పట్టి గంగాతీరమందడవికెక్కి - ఘట్టిగా భూసురుడు ఘనమైనవాడు
కనకతోడీ పరులు గంగ నాగా - మునుపుమెల్ల గలమున్నారు గలసి
అట్టి విప్రునిరూపు వైనముతొ నిలిపి - మనసున ధీరుడై మహాదేవు పేరా
వుదయించి ఈశ్వరుని వొప్పుగానెంచి - మౌనంబుతో ఇతర మార్గములు మాని
స్నానములు నిష్ఠలు సంధ్యలు జపము - కొంతకాలము నడపె గురుతైన నిష్ట
అంతలో ఒకనాడు అతిసొగసులాడి - గంగ నీళ్ళకు బోను కడవచేబూని
శృంగార కంఠముకు చేరువరాగా - అటయోగివైయెనట్టి బ్రాహ్మణోత్తముడు
జపములుగావించి జలములోపలను - పులితోలు వస్త్రంబు భూమందుబరచి
కాషాయ వస్త్రములు కట్టి ధరియించి - వొళ్లెల్ల వీభూది వడితేరగాను
రుద్రాక్ష తావళాల్ మెడనిండ వేశే - జపముచేయుచు నుండే జగతిలోపలను
ఈ రీతి జపమును చేయుచుండగనూ - సరగున కడవగొని యేతెంచి వనితా
దాని జూచుచు తన జపమెల్ల విడచి - భావించి చూచెనే బ్రాహ్మణోత్తముడు

జపమంత నీటనిడి చలముతో చూచె - గొలుగొన్న అగముళ్ళ వనితను జూచి
వలరేచి ప్రేరేప వర్ణింపదలచీ - విరులు తుమ్మెద కరులు యింద్ర నీలములూ
సిరులు ఆసించునే జలజాక్షి కుర్లూ - చంద్రరేఖయు బోలు సఖియ నీ నుదురు
చంద్రముఖ శింగిణివంటి కనుబొమ్మలూ - ముద్దులు గారగా మృదువైన ముఖమూ
అద్దంబుకంటె నిరువైన చెక్కిళ్ళు - కమల దళమ్ములే కలికి నీ కనులూ
వసవరుగు తాజేళ్లు పరుగు మీగాళ్ళు - పసుపు పద్మమునాబోలు అరికాళ్ళు
ఇరిలేడి పిల్లలా నవ్వనిత చూపు - జోక తోడుత పువ్వు సూటి నాసికమూ
జిగిమించు వజ్రాల బోలు పలువరుస - వేడుకొన యాగమళ్ళ వనితాను
చెరుకు విల్లెక్కిడి చెంగల్వ మొగ్గ - చెదరినే భూసురుడ చెదరినేమికే
అంతలో ఆ వనిత గంగ గట్టున్నా - వింతలకు చూపాణి వీధులకు నేగి
గంగ వుదకములచే కడవనుముంచి - మొరగురు తూలగా భుజములకు వుంచి
కుచ్చెళ్ళు మీగాళ్ళు గునిశి గునిశాడా - వచ్చె సోపానధరణి వనితరేపల్లి
ముచ్చటపడి జూచి మోహించి వెంటా - యింపుగారాదలచి నళినాక్షుడపుడూ
ముదముః కన్నుల దృష్టి ముదము నిలవడచి - కాషాయ వస్త్రములు గంగవుదకములూ
దోషములు తొలగించె తులసి మాలికలు - రుద్రాక్ష పేరుల్లు రూఢిగా మెరయ
భద్రాక్ష భటువులు భామల కవురా - గొడుగులను పడిగెలను గోపి చందనలు
పులితోలు చర్మములు విభూతి సంచీలూ - వేషము దాల్చెనే ఈశ్వరుడు వలెనూ
పొమ్మన్న తోడనే పోక బ్రాహ్మణుడు - ద్రిమ్మరితనమున దిగుళ్ళపడుతూ
తిక్క పట్టిన రీతి తెలియక వుండె - మక్కువతో ఆగమగళ్ళవనీ తిట్టులనియె
యిదియేమి ఎరుగవా యీడిగ యిల్లూ - కల్లుకుండ వారి కట్టిన పంది
కోళ్ళ కూడులు మిగుల కుక్క దాగినలు - పిల్లలు గతగగా పెట్టినతొట్టి
గుదిగూర్చి నటువంటి గొర్రె మాంసంబు - నాల దుర్వాసనలు సమకూడ్చినట్లు
కల్లుదాగిన వొల్లు కాకయుజడా - మాల మాదిగలెల్ల మసలు యీ చోట
హీనమ్ము వచ్చేని యీ యిలు నీకు - సహ్యామెల్లాయెనో సద్బ్రాహ్మణుండ
వచ్చిన పనులేమి వయినవే యేమి - చెప్పమని యీ యింతి వేడగా నపుడు
యిట్లనుచు యా బ్రహ్మచారియూ జెప్ప - ఈ పదార్థంబు పల నా కిపుడు
ఈ వేళ నాకోర్కె లీడేర్పవలెను - ఓ ముద్దుగుమ్మరో ఓ పువ్వుబోడి
ఓముద్దు బౌదాలి బింబోష్టి రమణి - ఓ రమణి ఓరత్న ఓ యెలనాగా
ఓ కంబుకంఠి యోసింహామధ్య - ఓ మత్తగజయాన వో రాజహంస
ములగంపు యోదిమ్మరీ కలికి చిలికా - మొగలి పట్టపు పువ్వు మల్లిపూబంతి

ఓయింతి నీమంచి హృదయములు కరుగూ - యీవేళ నీవెంట నేగుదెంచితిని
నీ రూపు నీరేఖ నీ విలాసమ్మూ - రంభ మొదలయినట్టి రమణులందారు
జంభారికొలువులో ఈ జగతిలోను - నీకు సరిరారింక నినుగౌగలించా
నాకు కోర్కెలుపుట్టె నలినాయతాక్షి - నామనసులో తగిలె నలినాయతాక్షి
కాదనక యిప్పుడు కౌగిటనుజేర్చి - మర్మభేదముదీర్చి మగువరో నన్ను
వదలక నన్ను బ్రతికించుమనెను - నెడరేజు వ్రేలయిన నీవెర్రి తిరిగి
తడయక రోకలి తలజుట్టుమన్నా - పతివ్రతను నేను నాపతి మాటలేక
మితితప్పి తిరుగుటా మేరయుగలుగు - ఈ తుచ్ఛదనమునా ఫలమేమిగలదూ
జనులు యెరుగుంటే సిగ్గేలపోను - పెసిమిటి చూచితే మెట్టుగా జంపు
తొల్లి యీ పనులకు తొల్లిగున్నవాడు - చెల్లిపోయినమాట సిద్ధముసుమ్మి
యింద్రుడు యేమాయె యీ పనికి బోవ - చంద్రుడు యేమాయె గురుసతిగూడ
సీతనెత్తుకపోయి చెరను పడిలేసి - అల రావణుడు అడలగా డెల్లె
పాంచాలి మోహించి పట్టి కీచకుడు - కొంచపు తనమునా గూలడా వాడూ
తెలివి తెచ్చుక నీవు తిరిగిపొమ్మనెను
జలజాక్షి రేఖయో జలజాక్షి వినెను - నీతోడి పరుగుడు నేడులేకున్న
నీతోటి రతికేళి నేడులేకున్నా - నిన్ను పొందకయున్న నీరజానేత్రి
నిర్ణయము ప్రాణము విడుతు నీవేళ - కన్నులజూచేవు కమలాయతాక్షి
సన్నలెన్నిక లేని రాధనములు కొన్ని - యెగదిగజేసి నీవెంతజూచినను
తపసి బ్రతికించ తరముగాదనెను - చులకని మాటలకు జాలియేమిటికి
పలుకంగరాదయ్య బ్రాహ్మణోత్తముడా - యెన్ని చెప్పినగావి యెరుగవు నీతి
కొంతైన సుజ్ఞానములు లేవు నీకు - బోధించు చెప్పితె బుద్ధి విననైతివి
గాదను పడియెదవు కళ్ళుగానక
మాపెద్దతనమంతాను నీటినిగలిపి - వలచియున్నాడను కామాక్షి నేడూ
కొంతయిన తనమీన కృపలేదు గదవే - చింతించె ఘడియసేపు చిత్రమ్ముగానూ
పరోపకారమే పరమపుణ్యమ్ము - ధరలోను నీ జీవి ధర్మంపు జీవి
బ్రాహ్మణుడు ధరమీదపడి విరహాగ్ని - పడి బ్రాహ్మణుడు యిచట ప్రాణంబు విడుచు
పతిసూచునంతతో పోవె పాపములు - పతిచేత దండింప బడుదు పాపముకు
చిత్రగతి యని దలపోసి గ్రక్కున హస్త - పంకజంబులు దాసి శంకయులేక
చెయిపట్టితీసె భావించి చూచెను - బ్రాహ్మణుడ యిపుడు నీవేమి చేసేవు
నీ వ్రాతఫలము దయివగతి రీతి - తప్పింప వశమయ్యె దయవ బ్రాహ్మణుడా

మా పడకటింటిలోపలికి పదమన్న - పంతమ్ము చెల్లెనే ఆ బ్రాహ్మడికి
అపుడూ అంతట పరాక్రమార్కుండు క్రుంక - మెరసె చీకట్లు దిశలను మెరసెనంతటనూ
బొరయుచు నక్షత్రములు కౌగలించి - కలువలు వికసించు పలువక్ర రుచుల
తళతళా యనుచు తాటంకిరుచులా - జలజాక్షి పన్నీట స్నానంబుజేసి
కరకంచుచీరయో కట్టిమీగాళ్ళ - కులుకుతూ నటియించ కుచ్చెళ్లుదీర్చి
తలివిగ్రహములో దీపములు వెలుగా - చెక్కుటద్దములపై చెంగులుజారా
పిక్కలు గుబ్బలా బిగువైన రవికె - తెలివి కుంకుమపువ్వు తావి గమయంగ
రాజసమ్ములు తనకాళ్ళ అందెలు - మెరయుచు ఘల్లునా మ్రోయుచుండగను
అమరంగ విప్రునికి ఆనందమాయె - కలికి కన్నులబిరుదు ఆరిగె లోపలికి
తలుపు దగ్గరబెట్టి తాళంబువేసి - పట్టెమంచమువేసి పానుపును పరచీ
ఇరుగడల తలగడలు యిమ్ముగా దాపి - మంచిగంధము తన మెడనిండబూసి
బరువయిన కర్పూర బాగాలొసంగి - తెల్లాటమడుపులే తేజముగ నొసగి
బ్రాహ్మణునితోగూడి భాషించి నగుచూ - యెలమిదేహమ్మునా వేడుక సొగసూ
నుదరంటనొక్కి సయ్యాటల పేరుగా - వారి వాసనలు దీర్చి నిద్రించిరపుడూ
నకులుడు అక్రూరుడును అగమలదాసు - అట్టట్టె తిరుగాడి ఆతాడిచెట్లా
కందుక కావిళ్లు కల్లు వుప్పొంగగా - బిందెలునుంచుకూ ప్రియులను బిలువా
పలికెనూ ఆ కాంత పతిభక్తితోనూ - అతివలోక నాడు అతివగపుతోను
గంగనీళ్ళకుబోను కడవచేబూని - శృంగారమఠముకు చేరువనిరాగా
భావించిచూచెనే బ్రాహ్మణోత్తముడు - సంగతి బ్రాహ్మణుడు జూడగనెవచ్చి
వత్తు సరిపోను సఖియనేపోదూ - చిత్తజభానుడికి చిక్కినవాడా
ఇక్కడ నీవులేవు నిధిమీదవున్నా - ఈతప్పు కొరకై యీవేళ నన్ను
ఘాతచేసిన పనికి కైవల్యపదవి - యికను ఈ పుణ్యంబు నీకు శిద్ధించూ
అనుచును పాదమున వెలదియుపడెనూ - హెచ్చుగా ఆ గవుడు ఆ తలుపుతీసి
భామరో యెక్కడ బ్రాహ్మణుండుండె - నేమాయెనని ధవుడు అటుయిటుతిర్గి
చెల్లంబు హరహర శివశివా అనుచు - బ్రహ్మచారి అనియెట్టి బ్రాహ్మణోత్తముడూ
బ్రహ్మరంధ్రమునా విడిచె ప్రాణములూ - విశ్వేశ్వర కరుణచేయా బ్రాహ్మణుడు
నిలువరమ్ముగా తాను ఈశ్వరుండాయె - మనములో బ్రాహ్మణుడు మనయిళ్ళ కిపుడు
కఠినమానసుడితడు కలియరానేలా - వచ్చి నీమీదవాంచ కోరనేలే
తీర్చెచ్చుట నీవు ముగుద పొమ్మనకా - ఆ యింటిలోపలికి యేల పొమ్మంటివి
వచ్చికొయ్యవు గదె భామరోనీవు నీళ్ళ కేతెంచితివి - యిభరాజగమనా

చుక్కముంగరలోనట్టి సురలోదాగి – పొట్టనిండా ద్రాగి పోయె బ్రాహ్మణుడూ
కాయము విడుతునా గ్రక్కునా – నేను పాయక అగ్నిలో పడుదునేననుచూ
తోయజాతుప్పుడూ తొక్కులాడగను – భూమికి మెరవైన భూశక్తి వెలసె
ఆ సదాశివమూర్తి అయ్యేదా తాననెనూ – యేనుగా చర్మంబు యెలమితోగప్పి
ఘనమైన పులితోలు కాశికావేశి – పుర్రి పేరులు వేశి భూతిపై బూచి
ననియందు దశకలలు తళతళాయనగా – తనకాంతి దశకళలు ధవళంబుబట్టి
చెండికేశ్వరుడపుడు చెయ్యెత్తి పొగడా – రమణ భృంగీ తనయ నందులతోను
ప్రమదులు కొల్వగా ఫాలలోచనుడూ – భరతవిద్యలుజూప పణతులుపాడా
నిలువక దబ్బున ఈశ్వరుండాయె – బలువైన కుంజర్లు వాసుకోనేగ్లు
భళియన శ్రీకాలభైరవుని దలతూ – ఆకాశిలో పల అధికమైనట్టి
కోటిలింగాలను కొమరొప్ప దలతు.

మా పడకటింటిలోపలికి పదమన్న - పంతమ్ము చెల్లెనే ఆ బ్రాహ్మడికి
అపుడూ అంతట పరాక్రమార్కుండు క్రుంక - మెరసె చీకట్లు దిశలను మెరసెనంతటనూ
బొరయుచు నక్షత్రములు కౌగలించి - కలువలు వికసించు పలువక్ర రుచుల
తళతళా యనుచు తాటంకిరుచులా - జలజాక్షి పన్నీట స్నానంబుజేసి
కరకంచుచీరయో కట్టిమీగాళ్ళ - కులుకుతూ నటియించ కుచ్చెళ్లుదీర్చి
తలివిగ్రహములో దీపములు వెలుగా - చెక్కుటద్దములపై చెంగులుజారా
పిక్కలు గుబ్బలా బిగువైన రవికె - తెలివి కుంకుమపువ్వు తావి గమయంగ
రాజసమ్ములు తనకాళ్ళ అందెలు - మెరయుచు ఘల్లునా మ్రోయుచుండగను
అమరంగ విప్రునికి ఆనందమాయె - కలికి కన్నులబిరుదు అరిగె లోపలికి
తలుపు దగ్గరబెట్టి తాళంబువేసి - పట్టెమంచమువేసి పానుపును పరచి
ఇరుగడల తలగడలు యిమ్ముగా దాపి - మంచిగంధము తన మెడనిండబూసి
బరువయిన కర్పూర బాగాలొసంగి - తెల్లాటమడుపులే తేజముగ నొసగి
బ్రాహ్మణునితోగూడి భాషించి నగుచూ - యెలమిదేహమ్మునా వేడుక సొగసూ
నుదరంటనొక్కి సయ్యాటల పేరుగా - వారి వాసనలు దీర్చి నిద్రించిరపుడూ
నకులుడు అక్రూరుడును అగమలదాసు - అట్టట్టె తిరుగాడి ఆతాడిచెట్లా
కందుక కావిళ్లు కల్లు వుప్పొంగగా - బిందెలునుంచుకూ ప్రియులను బిలువా
పలికెనూ ఆ కాంత పతిభక్తితోనూ - అతివలోక నాడు అతివగపుతోను
గంగనీళ్ళకుబోను కడవచేబూని - శృంగారమఠముకు చేరువనిరాగా
భావించిచూచెనే బ్రాహ్మణోత్తముడు - సంగతి బ్రాహ్మణుడు జూడగనెవచ్చి
వత్తు సరిపోను సఖియనేపోదూ - చిత్తజభానుడికి చిక్కినవాడా
ఇక్కడ నీవులేవు నిధిమీదవున్నా - ఈతప్పు కొరకై యీవేళ నన్ను
ఘాతచేసిన పనికి కైవల్యపదవి - యికను ఈ పుణ్యంబు నీకు శిద్ధించూ
అనుచును పాదమున వెలదియుపడెనూ - హెచ్చుగా ఆ గవుడు ఆ తలుపుతీసి
భామరో యెక్కడ బ్రాహ్మణుండుండె - నేమాయెనని ధవుడు అటుయిటుతిర్గి
చెల్లంబు హరహర శివశివా అనుచు - బ్రహ్మచారి అనియెట్టి బ్రాహ్మణోత్తముడూ
బ్రహ్మరంధ్రమునా విడిచె ప్రాణములూ - విశ్వేశ్వర కరుణచేయా బ్రాహ్మణుడు
నిలువరమ్ముగా తాను ఈశ్వరుండాయె - మనములో బ్రాహ్మణుడు మనయిళ్ళ కిపుడు
కఠినమానసుడితడు కలియరావేలా - వచ్చి నీమీదవాంచ కోరనేలే
తీర్చెచ్చుట నీవు ముగుద పొమ్మనకా - ఆ యింటిలోపలికి యేల పొమ్మంటివి
వచ్చికొయ్యావు గదె భామరోనీవు నీళ్ళ కేతెంచితివి - యిభరాజగమనా

చుక్కముంగరలోనట్టి సురలొందాగి - పొట్టనిండా ద్రాగి పోయె బ్రాహ్మణుడూ
కాయము విడుతునా గ్రక్కునా - నేను పాయక అగ్నిలో పడుదునేననుచూ
తోయజాతుప్పుడూ తొక్కులాడగను - భూమికి మెరవైన భూశక్తి వెలసె
ఆ సదాశివమూర్తి అయ్యేదా తానవెనూ - యేనుగా చర్మంబు యెలమితోగప్పి
ఘనమైన పులితోలు కాశికావేశి - పుర్రి పేరులు వేశి భూతిపైబూచి
ననియందు దశకలలు తళతళాయనగా - తనకాంతి దశకళలు ధవళంబుబట్టి
చెండికేశ్వరుడపుడు చెయ్యెత్తి పొగడా - రమణ భృంగీ తనయ నందులతోను
ప్రమదులు కొల్వగా ఫాలలోచనుడూ - భరతవిద్యలుజూప పణతులుపాడా
నిలువక దబ్బున ఈశ్వరుండాయె - బలువైన కుంజర్లు వాసుకోనేగ్లు
భళియన శ్రీకాలభైరవుని దలతూ - ఆకాశిలో పల అధికమైనట్టి
కోటిలింగాలను కొమరొప్ప దలతు.

# శ్రావణ మంగళవారము పాటలు

ఈశ్వర పుత్రునకు - గజావ తారునకు - పార్వతీ తనయునకు భక్తితోనూ
వాక్కు శుద్ధినిచ్చు వైభోగరాయునకు - శారదాంబను నేను సన్నుతింతూ
మంగళగౌరీ కథా - మహిమీద వెలసినా - పాటగావించెదా భక్తితోనూ
మహిమీద ఒకరాజు - సంతానము లేక - సౌభాగ్యవతి పదవి తా నేలుచుండె
పరమేశ్వరుడు తన - యాత్మలో హర్షించి - ఇహపరాదులు వారి కిత్తమనుచు
లింగంబు తానొక్క - జంగమౌతారమై - గురుధర్మ ఘోరాండమనుచు వచ్చె
మేడమీదనుంచి - దిగివచ్చి యాసతీ - బంగారు పళ్ళెముతో నాణెముగనూ
వణచిరాగా చూచి - పరమేశ్వరుడు తాను - నిమిషంబు నిలువగా పోయెనపుడూ
ఇదియేమి చోద్యమో - యెరుగవలెననీ - మరుదినము నాటికీ ముందుగానూ
మరుగు చాటున - యపుడు కాచికొని యుండగా - గంటలు మ్రోగుచువచ్చె శివుడూను
వచ్చిన - జంగాని పోనీక పట్టుకొని - యిదియేమి కారణము యని యడిగెనూ
పుత్ర పౌత్రులు లేరు - మీచేత భిక్షం - హరహర అంటరాదని బల్కెనూ
మాకేగతియనుచు - సతిపతు లిద్దరు - సాష్టాంగ మొనగిరి శివునికపుడూ
పరమేశ్వరుని గూర్చి - తపస్సు చేయమని - ఆనతిచ్చిపోయె ఆ జంగము
సతీపతు లిద్దరును - రాజ్యమును విడిచి - పరమేశ్వరుని గూర్చి తపస్సు చేయుమని
వారిభక్తికి మెచ్చి - పరమేశ్వరుం డపుడు - ప్రత్యక్షమయ్యెనూ రాజుకపుడూ
ఇచ్చితిని ఒక వరము - మెచ్చితిని పొమ్మనుచు - స్త్రీజన్మమా పురుషజన్మ మనగ
ధర్మవతియైనట్టి - పుణ్యవతిని నిత్తునా - పదహారు వత్సరముల సుతునిత్తునా
సతిపతులిద్దరు - సమకూర్చుకొని వారు - పరమేశ్వరునితో భాషించి
ధర్మపతిని చూచి - తాళలేము మేము - పుణ్యమేమో గాని పుత్రుడనెనూ
ఊరికి ముందరా - కాళికా గుడివెనుక - చూత వృక్షమునందు ఫలమున్నదీ
ఆ ఫలము తెచ్చుకొని - భుజియింపుమని పలికి - అంతర్ధానుడయ్యె నా దేవుడూ
ఆరాజు హర్షమున - అవృక్ష మెక్కియు - ఆఫలములన్నియు కోసి తెచ్చి
వణతి ముందరపెట్టి - విప్పిచూడగానే - ఒకటే ఫలమై నొప్పుచుండె
ఈశ్వరుండిచ్చిన - ఫలము ప్రాప్తియింతే - అధికఫలము వచ్చునా
అనుచు భుజియించగ - అతివ గర్భమునిలిచి - నవమాసములు నిండె నాతికపుడు
సూర్యతేజంబులలో - హొప్పేటి సుతునికి - పుత్రోత్సవము బుట్టె బుణ్యశాలి

సంతోషమున రాజు నామకరణం వ్రాసె - నారాయణా యని నామమిడిరి
రాజకుమారునకు రమణులందరు గూడి - వుగ్గులముగా బెట్టి రొమ్ముమీరా
దృష్టితాకకుండ చుక్కబొట్టూ పెట్టి - శిరసంటి తొట్టిలోనుంచి రపుడూ
బాల్యప్రాయమునాడు బాలతొడుగు తొడిగి - ఆట ప్రాయంబునా ఆటజూచి
నాట పెంచినవాని నూట పెంచీనట్లు - కాశీయాత్రకు చాల ధనముకట్టి
కాశికి బోదామంచు ఘనముగా యిద్దరూ - కాశిపట్నానికే వచ్చిరి
ఆ వనానికిపోయితి అతిచాల బడలికగొని - పరమేశ్వరాజ్ఞచే నిలచిరపుడూ
శ్రావణమాసా భౌమవారమున - మంగళగౌరునూ పూజింతురూ
అంగనలు తామరపూలు కొయ్యారాగా - రాజకూతురు వచ్చె రమణివెంట
పుణ్యాంగన లెల్ల పువ్వులు కోసుకరాగా - సందడిపడి రాజు నడుమానిలచె
సత్యవతీకన్న మాంగల్య పతియని - చెరుగుముడి వేసికొని శీఘ్రముగనూ
ఆరాత్రి నగరులో ఆ యిద్దరును నిలిచి - తోటలో నుండగనూ
అక్కడికి చనుదెంచి తన్నంత నిమిషమున - తోడుకొనిపోయి మధుపర్క మిడిరీ
తా జదువు శాస్త్రాలు అన్నియును గావించి - లాజహోమము వేల్చె రమణితోనూ
అగ్నిసాక్షిగ పెండ్లి ఆడినా సతిగూడి - సప్త ఋషులకు మ్రొక్కు సంభ్రమముగ
వధూవరు లిద్దరికి వొప్పు బువ్వంబు - చేయించి రచ్చోట శీఘ్రముగనూ
రాజు అందరు తాము రమ్యముగ భుజియించి - కరములు కడుక్కొని గద్దెనుండె
చిత్తురువు వ్రాసినా చవికెలోపల మంచి - మట్టిమంచెము వాల్చి పరుపు పరచి
కస్తూరి పునుగు జవ్వాది మొదలుగ - దెచ్చి వొప్పుతో కలిపిరి వధువరలకూ
గిన్నెలో పాలు చక్కెర తేనె - యథాత్రములు ఆరగించ తగబెట్టిరీ
కర్పూర భాగాలు పచ్చని చెంబుతో - పన్నీరు తెప్పించి వుంచిరపుడు
దంపతు లిద్దరు యింపుతో భుజియించి - సంతోషముగను తాంబూల మొసగి
సతితొడమీద పాదమాని యాగిన్నె - భక్తితో వుంచెనూ గుర్తుగాను
తూగటుయ్యాలపయి దంపతులిద్దరూ - శయనించి నిద్రలూ జేయగానే
కాలమృత్యువు వచ్చి కాల సర్పంబయి - బాలకుని గరువంగ జొచ్చెనపుడూ
మంగళగౌరీ మగువ స్వప్నమందు - నీపతికిని గండ సమయమీది
మాంగల్యవతి నిద్ర శీఘ్రముగా - మేల్కొని కనుదెరచి చెలియచూచి
మాంగల్యవతి నిద్ర శీఘ్రముగ మేలుకొని - కన్నులూ తెరచి తా కలియచూచీ
కృష్ణ సర్పము చూచి కిలకిల నవ్వుచు - స్వర్ణ కలశము తెచ్చియుంచి
బాలభక్తికి మెచ్చి నాగేంద్రు డప్పుడు - కలశంబులో ప్రవేశించెనపుడు

చుట్లు చుట్లును అతను పవళించియుండ - ప్రదక్షిణం తాజేసి మ్రొక్కి నిలిచె
ముత్యాలు గూర్చిన రవికె తాను విడచి - వాసినాకట్టుకొని యెదుట నిలిచె
పతిప్రాణ మెత్తుకొని పంకజాక్షి - తాను తిరిగి శయనించి కడునిద్రపోయి
అరుణోదయం వేళ ఆరాజు మేలుకొని - నేటి గండము మనకు గడచెనిపుడూ
యెవ్వరికీ చెప్పకా యిద్దరూ తర్లి - కాశికి చేరిరీ శీఘ్రముగనూ
తెల్లవారంగానే యెల్ల ప్రజలులూలేచి - పన్నీరుచిల్కి మ్రుగ్గులు పెట్టి
రత్నాలు గద్దెలు రమణులు వుంచిరి - వధువరులు వచ్చి నిల్చిరపుడు
పెండ్లికూతుర్ని లేపి శృంగారములు జేసి - రత్నాల గద్దెపయి వుంచగనే
తప్పక వరుని ముఖముతాను చూచి - తనపతికాడనీ తలచెనపుడూ
లేచి మేడమీద కూర్చుండి చింతించి - జాణలైనట్టి సఖియలెల్ల
నేర్పుతో నీపతి అవునని యందరూ - తలపోసి తెలిపిరా సఖియలెల్ల
సత్యవతి యాడకన్నె తన తండ్రినీ బిలచి - నామాట వినియు నన్నాదరించు
నీవు సత్రమునేడు నిజముతో నిలిపితే - భక్తితో తాంబూల మిత్తునేను
కాశిచేరియు వారు గంగ స్నానముచేసి - కాలభైరవుల దర్శనము జేసిరీ
అన్నపూర్ణను చాల అతిభక్తి వేడుకొని - విశ్వేశ్వరుని గుడి దర్శించిరీ
మణికర్ణికాదేవి తిరువేణి దర్శించి - బిందుమాధవ దర్శనముచేసిరీ
భాగీరథిని చాల భక్తితో వేడుకొని - తిరిగివచ్చినవారి కాశికపుడూ
కాశిచేరినవారు గంగస్నానము జేసి - కాశిపట్నానికే వచ్చిరపుడు
మహారాజు సత్రాన మామ అల్లుళ్ళు - గంగాడించి నిలిచిరపుడు
వచ్చినవారినీ భుజియింపు డంటేను - వొల్లమని వారినతో పలికిరపుడు
స్వయంపాక మందుకొని యందరూ భుజియించి - నిలిచిరీ నిమ్మాల నీడలోను
కర్పూర భాగాలు కాంతతా నిచ్చె - అక్కడికి వేంచేసే అందునుండి
కాశి వాసులకేల కర్పూరభాగాలు - వొల్లమని వారితో పలికిరపుడు
అరదేశి పరదేశి రాజులు విప్రులు - భుజియించి తాంబూల మందుకొనిరాగ
మీరేల యొల్లరని పరిచారికులు పోయి - తోడుకొనిపోయి రాజసముఖమునకు
రాజ రాజసముఖమున రమణితా కూర్చుండి - నాధుడూ వచ్చేటి రాకజూచి
తాను మనంబున చాల సంతోషించి - తాంబూలమిచ్చి తా కరముబట్టె
తాంబూలమూ యిచ్చి కరముతానుబట్టి - ఆనందబాష్పముల కురిపించెను
ధన్యురాలనైతి దరిజేరితిని నేను - రాజుకు ముద్దు కూతులనైతిని
ఇదియేమి చోద్యమో వెరుగుపడి జూచుచు - ఆశ్చర్యబడి రాజు అడుగగానె

నీకు గుర్తుగలవు నీలవర్ణపు నీవు - సత్యముగ తెల్పవెమో వృత్తాంతము
కాశికి బోదామనుచు కాంతతో నిద్దరము - నిలిచి తోటలోనె వుండగను
అక్కడికి వేంచేసి నన్నింక నిమిషమున - మధుపర్క మిచ్చి కల్యాణమందె
పణతి నా తొడమీద పాదంబు నానించి - హత్తుగా నిలిపెను
సువర్ణ కలశంబుదెచ్చి దేదీప్యమై వెల్గ - బుజ్జగింపుచు కంఠమాలవేసె
ఆకాశమంతాను పందిళ్ళుగా వేసి - భూమియంతటివి అరుగువేసి
తోరణములు గట్టి నగరు శృంగారించి - కళ్యాణ వేడుకగాచేసిరి
గోదానముజేసి భూదానముజేసి - సువర్ణదానము చేసె సొంపుతోను
అశ్వదానముచేసి గజదానము చేసి - కన్య దానముజేసె ఘనముగాను
ఆ రాత్రి నగరిలో కన్య వధువరులు - తల్లిదండ్రులను తలచుకొనెను
అని బుజ్జగింపుచూ మామతో అల్లుడు - శీఘ్రముగ సీమకు వెళ్లవలెను
ముద్దుకూతురికిచ్చె ముత్యాల పల్లకీ - పచ్చలపల్లకీ భాగీరథి
కోటివేలుజేయు ఉత్తమాశ్వమునిచ్చి - అల్లునీ కూతురిని అంపించెను
తెలిసిన ఫలమెల్ల గ్రక్కున వెడలెను - భక్తితో గూడ బాలుడును
గంగను ముందర నుంచుకొని తమ సీమచేరి - తనక్షేమములు చెప్పంపెనూ
తనతోడి జనమెల్ల తక్షణం వెడలగా - భక్తిగా నీబాలు డొచ్చెననుచూ
పుత్రుడని చెప్పగా నుత్సాహమును బొంది - ఆలింగనము చేసి అతివతోను
పమినోమునోచి తేవ్రతముజేసితి - పుత్రుభిక్షంబెట్టె పుణ్యశాలి
సత్యము తప్పకా మాంగల్యములు గదా - మంగలగౌరునూ పూజించిరి
భాగీరదీ చాల భక్తితో పూజిస్తి - మీవంటి అత్తమామను గలుగునా
యెక్కువ రాజ్యము మిక్కిలి సంపదా - తరగతి అయిదు సాధక సౌఖ్యములూ
ఎప్పుడూ పూజవై మాంగల్యములు గలవు - మంగళగౌరునూ బూజిస్తిని
ఈ కథను పాడినవారికి - విన్నవారికి నైదు విభవంబులూ
యిష్ట సంపదలిచ్చు యీరాజ పదవినిచ్చు - సత్ఫలంబిచ్చు సర్వేశురాణి
జయమంగళం నిత్య శుభమంగళం.

# కుమ్మర గుండయ్య కథ

శ్రీ విఘ్నేశ్వర నిన్ను విన్నవించెదను - బాగైనయేతీరు బాగైనమేలు
బాగైన రుద్రాక్ష ఫలితమెవ్వరిది - ఆదికాలమునాడు అయ్యారోమిమ్ము
మోదంబుతో తలచి ముక్తిగొన్నాము - గౌరిపరమేశ్వరీ కడుభక్తి గొల్వ
కడుభక్తి సంసార భక్తితోగొలయ - ఆనంద తాండవంబాడు వేడుకను
పరమభక్తులు శివాపారుజాతములు - వర్షంబు ధన్యులకు సురదేవతులకు
భూసురులు క్షత్రియులు వంశశుద్ధాద్రి - జాతులష్టాదిగా జనులుసేవింప
అష్టాదివర్ణములు అతనిసేవింప - ఆ పురములోవుండు అఖిల పండితులు
పేరు ప్రఖ్యాతిగా బెజవాడలోను - కులమందు కుమ్మర గుండయ్య ఘనుడు
గుండయ్య భార్య నీలాంగిదేవి - పతికిమారాడదు తనుమాట పడదు
అతిముద్దు పూబోణి అతికీరవాణి - పల్లవాధరపాణి పరమ కళ్యాణి
మొగనిచే కొట్టుపడివగవదెన్నటికి - మొగని యెంగిలిలేక ఆరగించదుగా
పురుషుడే దైవంబు పురుషుడేదాత - పురుషుడే తనపాలి పుణ్యదైవంబు
ఈ రేడు జగములకు ఈశ్వరుడే కర్త - తనకు పురుషుడు కర్త తన ప్రాణమునకు
తల్లిగాభావించు యెల్ల కాంతలను - తండ్రిగా భావించు యెల్ల పురుషులను
అతను శంభుడుగాను భావింతురంత - కప్పెరులు గెరిగెలే కౌమండలములు
ఒప్పైన బిందెలు మదనశానలుగా - వొప్పుగావాని శివభక్తులకు యిచ్చు
అతని భక్తులకు యిచ్చు ఆచారపరుడు - శివభక్తులకు యిచ్చు శివపూజపరుడు
అనుదినము గుండయ్య శివపూజచేసు - వకరాత్రి గుండయ్య తడవుండవెడలి
నీలకంఠుని గొలచివిశ్వకాలమున - పార్వతిని సేవించి పర్వకాలమున
ఈశ్వరునిసేవించి వీధియందునురాగా - సాటికెక్కినతేరు వీధిలోమేడ
మేడందువొకచెలియ మేడపై నుండి - కమలాక్షి పద్మాక్షి అప్పచెల్లెండ్రు
కమలాక్షి పద్మాక్షి భోగస్త్రీలేమి - కమలాక్షి పద్మాక్షి వేశ్యకాంతలుగా
ప్రొద్దుపోయి కమలాక్షి భోంచేసిలేచి - కమలాక్షి భోంచేసి కంచములు కడిగి
విసరి యెంగిలి నీళ్ళు వీధిలోకొట్టె - అంతట గుండయ్యరాగానె ఆ నీళ్లు పడెను

# కుమ్మర గుండయ్య కథ

శ్రీ విఘ్నేశ్వర నిన్ను విన్నవించెదను - బాగైనయేతీరు బాగైనమేలు
బాగైన రుద్రాక్ష ఫలితమెవ్వరిది - ఆదికాలమునాడు అయ్యారోమిమ్ము
మోదంబుతో తలచి ముక్తిగొన్నాము - గౌరిపరమేశ్వరీ కడుభక్తి గొల్వ
కడుభక్తి సంసార భక్తితోగొలయ - ఆనంద తాండవంబాడు వేడుకను
పరమభక్తులు శివాపారుజాతములు - వర్షంబు ధన్యులకు సురదేవతులకు
భూసురులు క్షత్రియులు వంశశుద్ధాద్రి - జాతులష్టాదిగా జనులుసేవింప
అష్టాదివర్ణములు అతనిసేవింప - ఆ పురములోవుండు అఖిల పండితులు
పేరు ప్రఖ్యాతిగా బెజవాడలోను - కులమందు కుమ్మర గుండయ్య ఘనుడు
గుండయ్య భార్య నీలాంగిదేవి - పతికిమారాడదు తనుమాట పడదు
అతిముద్దు పూబోణి అతికీరవాణి - పల్లవాధరపాణి పరమ కళ్యాణి
మొగనిచే కొట్టుపడివగవదెన్నటికి - మొగని యెంగిలిలేక ఆరగించదుగా
పురుషుడే దైవంబు పురుషుడేదాత - పురుషుడే తనపాలి పుణ్యదైవంబు
ఈ రేడు జగములకు ఈశ్వరుడే కర్త - తనకు పురుషుడు కర్త తన ప్రాణమునకు
తల్లిగాభావించు యెల్ల కాంతలను - తండ్రిగా భావించు యెల్ల పురుషులను
అతను శంభుడుగాను భావింతురంత - కప్పెరులు గెరిగెలే కౌమండలములు
ఒప్పైన బిందెలు మదనశానలుగా - వొప్పుగావాని శివభక్తులకు యిచ్చు
అతని భక్తులకు యిచ్చు ఆచారపరుడు - శివభక్తులకు యిచ్చు శివపూజపరుడు
అనుదినము గుండయ్య శివపూజచేసు - వకరాత్రి గుండయ్య తడవుండ వెడలి
నీలకంతుని గొలచివిశ్వకాలమున - పార్వతిని సేవించి పర్వకాలమున
ఈశ్వరునిసేవించి వీధియందునురాగా - సాటికెక్కి నతేరు వీధిలోమేడ
మేడందువొకచెలియ మేడపై నుండి - కమలాక్షి పద్మాక్షి అప్పచెల్లెండ్రు
కమలాక్షి పద్మాక్షి భోగస్త్రీలేమి - కమలాక్షి పద్మాక్షి వేశ్యకాంతలుగా
ప్రొద్దుపోయి కమలాక్షి భోంచేసిలేచి - కమలాక్షి భోంచేసి కంచములు కడిగి
విసరి యెంగిలి నీళ్ళు వీధిలోకొట్టె - అంతట గుణ్ణయ్యరాగానె ఆ నీళ్లు పడెను

గోళ్ళూర చమురంటి కొమరార ముడిచి - వెండికాగులతోను వేన్నీళ్ళుదెచ్చి
పయిడికాగులతోను చన్నీళ్ళుదెచ్చి - వేన్నీళ్ళు చన్నీళ్ళు సమపట్లచేసి
సీకాయ అంబళము సిరిసొప్ప అలది - గిలకల్లచే ముంతగుటు కన్నముంచి
చేముంతలందియ్య చెలియలిద్దరును - మగువలిద్దరుగూడి వుతకములుబోసి
స్నానంబుచేసిన గుండయ్యకైనా - తడిపట్లు విడిపించి వెలుపములుయిచ్చి
పట్టుపుట్టములు లెస్సబాగుగాకట్టె - తలహోర్చి తలకురులు జవ్వాజినలది
శివపూజ కురుపెట్టు శివమహాత్మునికి - పన్నెండు స్తంభాల భద్రకూటమున
గోమయముతో నైనశుద్ధి అమరజేసి - శివపూజ ముగ్గొకటి శిస్తుగావేసి
వెండిమర్దనశాల పయిడిదేచెంబు - వెలదులు నావేళ వింతవింతలుగ
శివపూజ పటికంబు సిస్తమరబెట్టి - తుమ్మనిపువ్వులే జమ్మిపత్రీలు
మారెడుబిళ్వంబు మరి జమ్మిపత్రి - సారంబుగల రుద్రజడపత్రి మొదలు
మాసినీపత్రిగా మంచిదవనంబు - ప్రొద్దెక్కిపూసినవి బొండుమల్లెలను
జామెక్కిపూసిన సన్నజాజులును - మందార పుష్పములమరి పూజలమరె
అదిగాక మరికొన్ని కడ్డివొత్తులను - యేకార్తెకడ్డేర్తె వెలమిదూపార్తె
నాగార్తెనందేర్త కుంభార్త మొదలు - పంచమంగళార్తె ఫణతులేపాడి
శివపూజచేసిన శివమహాత్మునికి - ఆరగింపులు బెట్టు అతి భక్తితోనూ
అచ్చనావులపాలు అరటిపండ్లూనూ - తేనెగిన్నెల నెయ్యి టెంకాయిపాలూ
పంచపదార్థములు వడ్డించినాదీ - భోంచేసి లేచిన పాలకుని కేమి
హస్తమెళుకువచేసి అంతరంగమున - చిత్రములువ్రాసిన చిన్న ఇంటిలోనూ
నాలుగుమూలల కానదివ్వెలుగా - నట్టింట వకశయ్య హంసలపరుపు
పరుపున పారిజాతములు పరిపించి - ఆ పైన తూముడేతుమ్మి పుష్పములూ
కూర్చొండి ఓస్వామి కూర్చోండి గురుడా - కూర్చోండి ఈ జాగకొన్ను మనకడ్డీ
ప్రియభక్తితో తట్టుకూర్చుండబెట్టి - పచ్చివిపోకలు పండుటాకులును
గాలించి సున్నము కప్రభోపములు - సున్నాన వకచెవి చుట్టివ్వగానూ
పటానపోకలు అందివ్వగాను - అందంది వకభామ గంధములుబూసూ
పలుమారు వకచెలి పాదములువొత్తు - ఇరుగడల వకచెలియ సురమైనవేసూ
సేవింపుచున్నారు చెలువంబుతోను - దేవమా విన్నపము తగునైదరించు
వెరువక చెప్పవే వేశ్య నాతోను - దాచకచెప్పవే ధర్మంబుగానూ
ఈ పువ్వు ఈ గంధ ఈ పరిమళాదులు - ఇద్దరును యీ శయ్యపాన్పు మీదాను
ఇద్దరము యీ రాత్రి కూడియుండవలయు - కేళికేళిలోన మరి కేళిలోన

ఇద్దరము యీ రాత్రి శివకేళిలోన - ఇద్దరము యీ శయ్యపై భోగించవలయు
రతి ఉపరతులతో మనము యిద్దరము - యీ శయ్యపై మనము పవళిన్చవలయు
హరహరాయన్నాడు గుణ్డయ్య ఘనుడు - శివశివయన్నాడు శివధ్యానపరుడు
ఏమియెరిగి అంటివేవోపాపజాతి - చెయిబట్టిన నా చెలియనేతప్ప
ఎల్ల స్త్రీలను నేను తల్లిగాజూతు - యెల్ల పురుషుల నేను తండ్రిగాజూతూ
మిమ్మంటి వారిని నాతోడుగాజూతు - పరస్త్రీలకూడి వున్నవారికినీ
ఎన్నినోములయిన యేటి పాలగును - యెన్నిపూజలైన వ్యర్థమైపోను
నీవు యేమి యెరిగి అంటివే వోపాపజాతి - ఎరుగుదును వోస్వామి ఏకచిత్తుడవు
అయితే మీ గృహములకు ఏతెన్చరయ్యా - అనుచు గుండయ్యను మేడదింపించి
కమలాక్షి పద్మాక్షి వేన్చేయగానె - శివధ్యాన పరుడైన గుండయ్యాయపుడు
తప్పించుకొని తన గృహముకేవచ్చె - పాదచప్పిడివిని నీలాంగిలేచి
ముంత ఉదకముదెచ్చి ముంగిళ్ళచల్లి - గరిగె వుదకముదెచ్చి పాదములుకడిగి
పాదముకడిగి తాపై జల్లుకోని - మొగడు ముందాయనే సతియెనక చిక్కి
అతివ తన మోహమున పతిరూపుచూచి - పంచశంకనచూచి శంకించిపలికె
ఈ పువ్వు ఈ గంధం ఈ అలంకారం - ఈ పువ్వు ఈ గంధం ఈ పరిమళాదులూ
ఏ మగువ నినుకోరి యెదురుగాదెచ్చె - అంటనని పరస్త్రీని అంటివస్తివిగా
ముట్టనని పర స్త్రీని ముట్టివస్తివిగా - యిట్లుపరస్త్రీని గూడివున్నవారికినీ
నూటవక శివపూజ నీలపాలగును - నీవు ముట్టిముట్టితివైన ముక్కంటుడానా
ఇకనన్ను అంటకే ఈశ్వరుడు ఆన - యికనన్ను అంటితే పార్వతీ ఆన
ఇకనన్ను అంటితే మహారుద్రుడాన - ఆలు అనబెట్టి అరవై యేండ్లు
అనయేలబుట్టితివే నీలాన్గినేడు - నేను గుడికిపోయి సేవించి వీధియందురాగా
వేశ్య యెంగిలి నీళ్ళు నా మీద పడెను - కళ తెలిసి తోడుకపోయి తలకడిగిపంపే
పూబోణి నన్నిట్లు పూజించినాదీ - నీలాంగి నా వల్ల లేదెదోషములూ
అట్లంటె తన పతిని అంటవచ్చించి - అంటవచ్చిన భామ అట్టుటిట్లు దొలిగీ
ఆనబెట్టిన సతిని అంటదోషంబు - అంటితే హరుడు చేపట్టడెన్నటికె
ముట్టితే శివుడు పట్టడెన్నటికి - ఆలు అనబెట్టి అరవై యేండ్లు
మొగడు ఆనబెట్టితే ముప్పైయేండ్లు - అరవై ముప్పై తొంబై యేండ్లు
బాలప్రాయము వక పన్నెండుయేండ్లు - నూటరెండేండ్లతో సరిపోయవయసు
వృద్ధువృద్ధులెరి వృద్ధాదులైరి - సొప్ప సొరుగులు అయిరి సన్యాసులయిరీ
వదలి దంతములన్ని వార్ధికమాయె - నల్లనీకురులన్ని తెల్లగా ఆయె

పొందికలు మన్దారె భోగమెడబాసె - యిద్దరు వకశెయ్యా పాన్పు మీదాను
నాగబెత్తము వకటి నడుమ ధరిఇన్చి - ఘోరింపుచున్నారు బెజవాడలోను
వారి ఆనలు చూచి దేవతలు మెచ్చి - కైలాసగిరి మీద గౌరితో శివుడూ
మగువరో పార్వతీ మనభక్తుడొకడు - మనమీద ఆనకై మగువకెడబాసి
ఉన్నాడు వాడొక్క బెజవాడలోనూ - వారి ఆనలు విడచి వారిని ఒకటిచేసి
మళ్ళీ వచ్చెదాక మన సొకటికాదు - బసవణ్ని కైలాస కావిలేపెట్టీ
పొసక కావిలిపెట్టి పోదమిద్దరము - ఘణాఘణామనియేటి గంట మెడకేసి
రుద్రాక్ష పేరులు రూపమర వేసి - భద్రాక్ష పేరులు బాగొప్ప వేసి
తెగినవేలిక బొంత బెక్కాయముంత - అడుగోడుపడ్డాది పాత్రవకచంక
కళ్ళెంబులేనట్టి ఘననందినెక్కి - సుడిపడి యెండలక సురటి ద్రిప్పుచును
కదిలె భ్రమతలతోను కైలాస గనుడు - వచ్చె పున్నమినాడు సొచ్చె శివపురము
చొచ్చి యా పురమంత శోధించి చూచి - కన్నశెట్టి గుండయ్యా యింటికే వచ్చె
వడతగిలె గుండయ్యా వాకిళ్ళ నిలచి - ఘంట ఘణఘణవాసె ఘనుడప్పైనిలచి
ఆ తపసి రాగానే లేచె గుండయ్యా - శరణార్థి నా పాలిశంభుడా నీకు
శరణార్థి నీ పాలిశంభుడికిరోరె - బహుశరణు మందార బహుశరణు నీకు
బహుశరణు మందార మల్లయ్యా శరణు - ఏ వూరు ఏ భూమి యెరిగింపుస్వామి
కాశీదేశము మాది కన్నాది మొదలు - యాత్రలే పోదాము యెందైనగాని
ఈ వ్యాళ మా యింట శివపూజ ఘనుడ - మా నోము ఫలములూ నేటికీడేరె
కాశిలో లింగాన్ని కనుగొన్నరీతి - అన్నపూర్ణని ఈడ శేవించినట్లు
వీరశైవము ఈడ కనుగొన్నరీతి - మా యింట శివపూజ చేసిపో గురుడా
మీ యింట శివపూజ చేయనేతగదు - మా తోటి జంగాలు యాత్రలేపోయి
మేము వాడవాడలు తిరిగి వలబిక్ష మెత్తి - కన్నేడు బెజవాడ కలబిక్ష మెత్తి
మరివచ్చి మీ యింట మరి ఆరగింతు - మళ్ళి వచ్చినదాక వుందుమోపోదుమో
మళ్ళి వచ్చేదాక ఆనవాలేమి - నేను ఆనవాలు యిస్తాను దాచగలవట్రా
దాచేను వో స్వామి దాచేను గురుడా - దాచెదను యీమని గుణ్డయ్యాయడుగ
కక్షపాలలోవున్న పాత్ర అయిన యెత్తి - కుట్లదీనా పాత్ర గురుతుగాజూడు
అడుగోడునా పాత్ర వీడబెరికేవు - వోటిదీ అనినా పాత్ర పారవేశేవూ
గురుతుగా జూడరా గుండయ్యా ఘనుడా - దాచమనిన నీలాంగి దోచెట్లపెట్టె
పయిడి చెరుగుపట్టి పాత్రందుకోని - పడమటింట్లోను పన్నారుదొంతీ
పన్నారు దొంతడుగు కడవలోపెట్టి - పయినాను బరువైన కుండొకటిపెట్టె

అక్కడక్కడ తిరిగి మాయలా శివుడు - ఇక్కడక్కడ తిరిగె కపటజంగంబూ
మనసులో తన పాత్ర మాయంబుజేసి - ఓ అమ్మయ్యా నా పాత్ర ఇమ్మనివచ్చే
చెలియపోయి కడవలో చెయిబెట్టిచూచె - కప్పెరలేదండి కడవలోపలను
కుండలంతయు వెతికి గురితించకలేక - కడవలన్నియు వెతికి కణిపించలేక
ఆలూను మొగుడూను అతిభీతిపడిరి - అతిభీతిపడ్డారు సతిపతులిద్దరును
ఏకమై దంపతులు వెతికి యిద్దరును - మూగసై గలిచేత నీలాంగిదేవీ
చేసై గలతోన గుండయ్య ఘనుఁడు - శరణార్థి నాపాలిశంభుడా నీకు
కప్పెరకు మీ సొమ్ము దొంగలముగాము - కలయంగ బంగారు కరిగివూదించీ
బంగారుపాత్ర నే నిస్తాను గురుడా - జంగాలు కెందుకు వెండిబంగారు
జంగాలకేలరా బంగారు పాత్ర - దొంగలే కొట్టేరు దోచుకొన్నేరూ
నా కప్పెరవలెకాని నే నొప్పనోయి - నాకు ఆ కప్పెరొచ్చెన నాటనొంటేమీ
నాకు అప్పుసప్పాలేదు ఆస్తేనుకాని - కప్పెరా కాదురా కామధేనువురా
కామధేనువుకాదురా - కల్పవృక్షమురా
ఆ కప్పెరా నాకు - అన్నములు పెట్టు
ఆ కప్పెరా మాకు తల్లిగా పెట్టు
తల్లివలె పెట్టురా తనయు నా పాత్ర - నా కప్పెరా కావలె
నే నొప్పనోయి నా కప్పెరా యివ్వతా నేను పోతాను
కప్పెరకు నీ సొమ్ము - దొంగలము కాము
కప్పెరకు కొప్పెరెడు ధనమిస్తు గురుడా - కోటి వరహాలైన నీకు యిస్తునుగా
మీ కప్పెర నేను దాచలేదండి - ధనము కలిగినవాడని విఱ్ఱవీగకురా
నీవు కుండలమ్మి ధనము గుప్పింతురోరి - పండ్లు అమ్మిన ధనము పట్టిస్తురోరి
దుత్తలమ్మిన ధనము దున్నింతురోరి - పోదాము రావోయి ధర్మచావిడికీ
అట్టెవొడిసి జుట్టుజడబట్టుకొనెను
పతినెట్ట తియ్యంగ సతివెంటవచ్చె - అరుకుంట నీలాంగి వెంబడేవచ్చే
కురికురి గుద్దంగ కూసె కుమ్మారి - మొత్తముతో కూడిరో ముత్తయిదులంత
భక్తులు పదివేలు మొత్తముకూడి - కొత్తజంగాన్ని చూచి గుణ్ణయను చూచీ
పేరుకాలమునాటి పెద్దగుణ్ణయ్య - మెడలునొచ్చెను జడలు విడువమన్నారు
మీవూరి కుమ్మరికి మీరు సహాయంబు - పరదేశి జంగానికి ఎవరు సహాయంబు
బదులు జంగంవుంటె మాకు సహాయంబె - అన్నము పెడతనని ఆశగలిపించీ
దాచిపెట్టినసొమ్ము దోచుకొంటివిగా - దోచుకొన్నద్రోహి ఏమిశాయవలను

నాకప్పెరనీవు దాచలేదానీ - నీవక్కసతిని నీవుముట్టరా
సతినంటెమాటలె మానుమయ్యా గురుడా
నాసిరసైనా యివ్వమన్ననూ యిస్తానుస్వామీ
నా గుండెలు కోసి సమర్పించేను గురుడా - ఇవ్వమన్న బాసలు ఇస్తాను స్వామీ
ఇంటి సతిని నేను అంటేదిలేదు - ఇంటిరా సభవారు యింటిరా మీరూ
అగ్నిసాక్షిగాను ఆలిని పెండ్లాడి - ఇంటి సతిని వీడు అంటనంటాడు
వీడే దొంగ యిక యెవడూ లేడూ వీడేయన్నా - చిక్కితివి చేతులో దిక్కు నీ కెవరు
అగ్ని హోత్రముబట్టి బాసచేసేనూ - పామునుబట్టి నేను బాసలిస్తాను
పాము మంత్రము నీకు పాటింపురోరీ - అన్నిబాసలు నీకు అయివొచ్చురోరీ
అందుకు నీచేత మందులుంటావీ - చుట్టేడు సముద్రాలు నట్టనడుమాను
నాగదరి మడుగులో బాసలిస్తావా - ఇస్తాను వో స్వామి యిస్తాను గురుడా
తనచేతి బెత్తమే దండాయుధంబు - అవతలివతలగట్టి వడియలిద్దరిని
తనచేతి బెత్తమే కావిడిగబన్ని - చుట్టేడూ సముద్రాల నడిమికే మోశా
గంగలో తాడి మడుగులోచూచి - బడుగులిద్దరిని వొడ్డునదించీ
కక్షపాల విభూతి కొమండలవుతకం - అభిమంత్రించి ఆ గంగపై చల్లి
ఓ పుణ్య పతివ్రతా - వో పుణ్య పురుషా
త్రొక్కుతును ద్రోహులను - గంగలోపలను
మినిగిపెణిగి వారు ముందులేచినను - వారేను నా సొమ్ము యిచ్చేటివారు
అతిభీతి పడ్డారు సతిపతులిద్దరును - తనచేతి బెత్తమే గంగలో ద్రొక్కె
పాతాళగంగలో అమరంగ ద్రొక్కి - తనువొచ్చి దక్షిణపు గట్టుననిలచె
గంగ గర్భమునందు తొమ్మిదిగళ్ళు - అంతటా శివుడికి తా తృప్తిబొంది
ఈ గంగవుండేటి మత్స్యాలుకొన్ని - ఈ గంగలోవుండేటి సర్పాలుకొన్ని
చచ్చిరో బ్రతికిరో నీలాంగిదేవి - చచ్చెనో బ్రతికెనో గుండయ్యా ఘనుడు
తనచేతి బెత్తమే - తను లేవదీసే
చేరి పన్నెండుయేండ్లు బాలులైనారూ - అప్పుడిద్దరిని చెయిబట్టి వొడ్డుకేతీసి
నాడు పెండ్లికాదు నేడు పెండ్లెననుచు - ఆకాశ వేణంత పందిలేపెట్టి
భూదేవ అంతయిన అరుగైన వేసి - కూర్చిన ముత్యాలు తోరణాలుగట్టి
కూరవని ముత్యాలు యెదలశాసలను - విష్ణు లక్ష్మిదేవిని పెండ్లికేపిలచీ
బ్రహ్మ సరస్వతిని పెండ్లికేపిలచి - శివుడు పార్వతిచేరి పెండ్లిచేశిరి
రుద్రాక్షకంకణము రూఢి అమరగట్టి - భద్రాక్ష భాష్యకము బాగ మరగట్టి

వల్లభుడు తా కట్టె వనితమెడ పుస్తె - విష్ణు లక్ష్మీదేవి శాసలే పెట్టిరి
బ్రహ్మ సరస్వతీ శాసలే పెట్టిరి - శివుడును పార్వతీదేవి శాసలేపెట్టిరి
కొడుకుల కనుకొని వర్ధిల్లరోరి - మనుముల యెత్తరా మహిమీద నీవు
ఇకమీదు మా మీద అనబెట్టకురా - అనబెట్టితే నీకు అధికదోషమురా
మళ్ళివొచ్చి చేరరా మాసముఖమునకు - అనుచు వేంచేసిరి అమరులందరును
అప్పుడు పుష్పవర్షములు కురిసె - పురహారులపైన
కనకవర్షము కురిసె బెజవాడలోను - ఈ గుండయ్య చారిత్ర పాడించిన విన్న
పాడినవారికి వ్రాసినవారికి - తొలుగును దోషములు వచ్చు పుణ్యములు
యెప్పటి సంపత్తులు యే మారకుండు - ఆయురారోగ్యములు అమరన్గలిగి
చాటుతో కలుగును సంపత్కరములు.

# వరదరాజు పెండ్లి పాట

వాణీదేవి మదినిదలతు వరదరాజు ప్రస్తుతింతు - చారుమతిని దలతు సప్తసాగరమ్మునా
కంచివరదరాజు మీదనుంచి పాట సకలకీర్తి - యంచగను మనపాట ఎంచిపాడరే
కవులకెల్ల మేటియయి కాళిదాసు మదినిదలతు - కార్యంము కర్తయైన స్వామిదలచెదా
వెక్కు సూర్యమండలములు నొక్కచోట పొడిచినట్లు - చక్కనీ వరదరాజు చాయలెట్టివో
భుజా శంఖుచక్రాములు ధగాధగా మెరయగాను - పరగరెండువేలు స్త్రీలు రిచారులూ
అంత సముద్రూని తనయ హంసగమనా పేరుందేవి-నొవ్వ పెరుగుచుండె తనమందిరమ్మునా
తుమ్మెదాగుంపులనంగ తోయజాక్షి కురులు - శింగిణీవిండ్ల బొమ్మలు చెలియబొమ్మలు
చెలియ తామరజుట్టు శేఖరించినట్టైకర్మ - ఉర్వి అరటిస్తంభాలు అతివతొడలునూ
చుక్కలే సాగరములు సూర్యచంద్రూలవిందు - అక్కజముగ వియ్యమందె అతివకనులతో
పొన్నపూలు కోయుటాకు పోదమనుచు చెలులుగూడి - రాచపడుచుని పిలుతమనిరి రమణు
లందరూ
కుందరదన తల్లివద్ద కోమలాంగి వుండగాను - కన్నుసన్న జేసిపిల్చె కాంతవక్కతె
కేళించినవ్వి అపుడు క్రేడెనవ్వు ముద్దుపెట్టి - పూలుగొయ్య బోదువా పువ్వుబోణిరో
రాణివాసమెల్లవిడిచి రమణి తోట్లవెంటనేగ - భావ్యమా ఇది నీకు పద్మలోచనా
అనుచు తల్లిగారవించ వినక నా పేరుందేవి - కొంగుగట్టిన వరహాలన్ని పారజల్లెనూ
ఘల్లుఘల్లుమనుచు తన గజ్జెలందెలు రవముసేయ - మెల్లగ హారామూలు మ్రోగుచుండెను
తరుణిచేరు చుక్కబొట్టు నుదుట నాట్యమూలుసేయ - కొప్పునముడిచిన వూలదండ గునిసి
యాడెను
కన్యకా దిగులుజెంది జాలిపడ్డచందమున - తల్లిచేరదీసి అపుడు పోరుమానెనూ
తల్లిగర్భమపుడు కరిగి తనయతప్పు డెత్తుకొని - పూలుగోయ బోవుమాని బుజ్జగించెనూ
పన్నీటజలకమాడి చెంగావి చీరగట్టి - వన్నెమీర జడవేసె వనితవక్కతే
వారంపు సొమ్ముదెచ్చి భామరమ్మనిపిలచి - నీటుగాను శృంగారించె బోటివక్కతే
సారంపు చలిదిదెచ్చి సఖియ రమ్మానిపిలిచి - వెండివలెను చలిదినేజెట్టె వెలదికరమునా
పసిడి పావాలుదొడిగి పసిడికుండ చేతబట్టి - తీసుక చనుదెంచె నతివ నిందువదనలూ
ఆ రాత్రి రుద్రవీణ అతివలంతా మీటగాను - తక్కుగావించి తరుణులందరూ
సన్నపూల సురటిగాలి సఖియలంతా విసరుగాను - కుందరదన చేతులెత్తె గుణిసియాడగా
ఆడగానె అంతలోను అపుడు కంచి వరదరాజు - బోటివచ్చె అనుచును పొంచిజూచెను

ఇంత చక్కదనము గలది ఇందువదన ఎవ్వరనుచు - కనులతోటి మన్మథుని కాంతజూచెనే
చూడగానె అంతలోను సుందరీ చెలులగూడి - మగువలంతకలసి తమమందిరము కరిగిరి
అతివలంత నిలువగాను అందమూగ లేచివచ్చి - చందనంపు కొలనిలోకి చవుకలించిరి
వారు తీర్థములుజేసితే మను బుజ్జగింతమనుచు - వనరుగా పారుటాకులు కోసుకొనరే
ఒల్లనీ అరటాకులు ఒకరుపెట్టె రకములందు - మొల్లగంధీ ముద్దజేసి నొప్పుగిదరే
పోకపాత్రిల్లు పరచి పాలతిపెట్టు జలములందు - నైవేద్యములుజేసిరా నెలతలందరూ
కరములూ కడుగుకొని కర్పూరంపు తాంబూలము - అతివకొక్క విరిబోణి మడచియిచ్చెను
బొడ్డెమల్లెలూదెచ్చి అందముగ పాన్పుపరచి - ఇందుముఖులు ఇచ్చోట ఉంచిరందరూ
రాచలేమగనుక రాచపడుచుయనుచుయడిగినాము-తగినబహుమతియ్యవమ్మ పేరుందేవమ్మా
నవ్వి పేరుందేవి యపుడు నళినాతులాకునెల్ల - భాగాలు మాడలూ పంచిపెట్టునూ
కొలువుచాలించి లేచి పోదమనును పొన్ననూ - యినీళ్ళలోనికి చనిరా భామలందరూ
ఒక్కప్రొద్దు ఉందమనుచు ఒక్క ఆట ఆడమనుచు - అతివలంత పొన్నమాను నీడకరిగిరీ
వరదరాజు కరుణచేత పొన్నపూలు కోయుచుండ-గూడలాను నిండెనమ్మ కొమ్మలకప్పుడూ
బుజబుజారేకులనుచు కోమలాంగు లాడుకొనిరీ - నాలుగు స్తంభాల ఆటలాడిరీ
ఆడగానే అంతలోను కంచి వరదరాజువచ్చి - బోటివచ్చెను అనుచు పొంచిచూచెను
పట్టుపట్టి మొలనుజుట్టి బంగారు చిక్కటమున - వనిత మొలనుజుట్టె కంచివరదుడప్పుడూ
చంద్రకావిగుడ్డ చెన్నమరగానె ఉంచి ముత్యాలచేల్ల - నా మొఖముతూగునూ
ఉరమునందు మెరయుచుండె కర్ణమూల - చవుకమ్రోప్పు కంఠహారములూ
చిలుకతాళి చంకతాళి యెలమిదాల్చెనూ
పరుగునా చనుదెంచి భామయెదుట నిలచుండి - చంకచాచి బెదరించె సఖియలందర్ని
అనుచు బెదరించగానె అతివలంత వణకుకొనుచు - నీళ్ళలోకిచనిరా భామలందరు
పోదురే వణతులార పొన్నపూలు సుంకమీక యేపుమీర మావనము కేలవస్తిరి
గూడకొక్క మాడయిచ్చి భామచనుదెంచు - మంలె పసిడిబొమ్మ కోపమేల వణతి నీకు
గొప్పకండ్ల వరదరాజు ధిక్కరించి చూడగానె - అతివలంత పొన్నమాను నీడకరిగిరీ
అప్పుడా పేరుందేవి కప్పుకొనుచు పయిటచెంగు - నొప్పిదముగబల్కె కంచివరదుతోడను
మునికొప్పు మొల్లచాయ తామర్లచాయ ముఖము - బొండు సంపెంగచాయ వనితచాయ
పలుకుపలుకు తేనే ధారలొలుకగానె చిలుకపలుకు - కలికిమోవి కంఠస్తానమం కానవచ్చెను
మాడపుచ్చు కొనాలేవు రూకపుచ్చు కొనాలేవు - మానితనకారాగి గాసుకొందువటర
రమణసుంకరి యింత పోతరంపు మాటలేల - జాడజూచి వనములోకి జాణ అరుగునా
జాణవు నీవుగనుక సమరతాడ లేదు - గనుక జాడకట్టి వచ్చినారు జాణవందువా

వనిత జేబులోను వున్న జాలిమాకు సగముయి స్తె - జాడలేదు అనుచు వనములోకి అరిగౌదా
కలికి చిలుక నె త్తికొని కంచిపురము కరుగవలె - వెలదులార మీరుచనరే వేగరమునా
శనివారమ్మ అని వనాభోజనము కొ స్తె - ఘనముజేసి వోరియింత ఘాతుజేతువా
కోసినావు పువ్వులన్ని కోమలి సారజల్లుకొని - పు త్తడిబొమ్మ అప్పున చిక్కుపడెను
అట్టైతొలకరి మెరుపు హంసనడక లేడిచూపు - కలికి చిలుకల కాంతివనము తొలకరించెను
మచ్చకంఠి చిక్కుపడక మరి వేగరమ్మున - బోయి చెలులతోను గల్పుకొనెను చంద్రవదనా
తమగూడలోని పువ్వులు తరుణిగూడ లోనెపోసి - భయముపడి గావించిరా సన్నుతాంగిని
కుంజరమ్మ అచ్చోట కొమరనెదురు వచ్చెననుచు - చెప్పవద్దనుచు పంతమ్మలాడిరి
ఆ కాంత లెల్లగూడి యేకాంతమాడుకొనిరి - అందరూకలిసి వారు అరిగిరప్పుడు
రవికెచుట్టు చుట్టుకొనుచు రమణి శిరస్సు నెత్తుకొనుచు-మగువదోడ్కొని మందిరమున కరిగిరి
యెదురుగాను వచ్చి తల్లి గౌగలించుకొని - భయముదెలిపి గారవించె సన్నుతాంగికి
ముద్దుముఖము గడిగి తల్లి ముత్యాల హారాలిచ్చి - తీర్థమాడి బుజ్జగించె సన్నుతాంగిని
పున్నామ చంద్రునిబోలు నీ మోము అదియేమొ-వన్నెకళలు తప్పియుండెవనిత నేరిస్థివా
అమ్మ కుంజరమ్మ మాకు అడ్డువచ్చెనొక్కచోట - వెరచుకోలేదు అనుచు వెలదిపలికెను
తనను ముందువరదరాజుకు అమ్మ పెళ్ళి సేయమనగ - అంత ధనపుకొండ మనపాలికొచ్చున
ఆ సదాశివుని బ్రహ్మ ఆ క్షణము పిలువనంపకూర్చె - సముద్రూని సుతను కోమలాంగిని
చనిరివారు సాగరముకు చనిరి వేగిరమునపోయి - ప్రియముచేసి కనకంపు పీఠ బెట్టిరీ
వినవోయి సముద్రుడ మనవి వేడ్క వరదరాజులకును - కన్యకా అమ్మనడగ కదలి వ స్తిమీ
వయసుకూడ లేదుగనుక వనితచిన్న పడుచుగనుక - వరదునికి నేడు పెళ్ళి చాయవచ్చునా
నిన్న చేలబట్టి వరదుడు నీ సుతను జూచి భ్రమసి - అన్నమింత జేయ కొరత నున్నవాడు
వట్టిమాటలాడవద్దు ఊరికెమమునంపవద్దు - చి త్తమెరిగి పెండ్లికాయ త్తె పడుడీ
మాసాలలోకెల్ల విశేషమయిన వైశాఖమాస - పంచమ్మినాడు మగువ పెండ్లి
లగ్న నిశ్చయంబుజేసి రమణికిపుడు బుజ్జగించి - నిర్భయముగ కంచపురము స్థలముకరిగిరి
మూడుకోట్ల ఏనుగూలు భద్రగజములు మెరయగాను - పక్షీవాహనంబురూపు డెక్కె ముదమునా
గరుడపచ్చల పల్లకీలో కామాక్షమ్మ యెక్కెనపుడు-గరుడవాహనంబుయెక్కె కంచివరదుడు
నిబ్బరముగ అంతగలసి సాగరముతర్లిరాగ - సకలసురలు మోదమంది వచ్చిరప్పుడూ
ఆకాశమంత పందిళ్ళువేయగాను - భూములంతలేసి అరుగులే బాగవేసిరి
గుచ్చినముత్యాల తోరణంబులే గట్టి - గుచ్చనీ ముత్యాలు పళ్లెరముల నుంచిరి
మరునాడుదయమందు మరుజాము ప్రొద్దువేళ - హరికి వరదులాకు తీర్థములనుబోసిరీ

కన్యకపుడుశృంగారించి స్వామిసన్నిధినిఉంచి-పెండ్లికొడుకు నెదురుకొనిరి ప్రియముతోడనూ
జీలకఱ్ఱ బెల్లము చేడియ శిరస్సున ఉంచ - వరదరాజు శిరస్సున వనిత ఉంచెను
అగ్నిహోత్రు సాక్షిగాను అతివను పరిణయంబు జేసి-అగ్నిసాక్షి ప్రామాణమ్ము వారుజేసిరీ
అపరంజి తాళిబొట్టు ఆదిలక్ష్మి మోమునబెట్టె - కళలుమీర కాంతచంద్రునికళలు దేరెనూ
కనకంపు పళ్ళెరముల ఘనమయిన ముత్యాలు - అమరంగ తలంబ్రాలు అపుడుబోసిరి
అలసిసొలసి తలంబ్రాలు హర్ష మెప్పగానె బోసి - అఖిలబ్రహ్మ దినములు ఆది ఋషులరో
లాజహోమము వేల్చి రమణియపుడు బూజాగించి-పువ్వులుబుక్క వసంతమాడె కంచివరదుడూ
బంగరపు పళ్ళములో పాలునెయ్యిదెచ్చియుంచి - అప్పగించె వరదులాకు మెప్పుతోడనూ
ఆ బాల హస్తమ్ముపాలల్లోనెవుంచి అప్పగించిరి - కామాక్షమ్మకు మెప్పుతోడను
నా మనవిచేకొమ్మి నా సుతను యేలుకొమ్ము - చేకొమ్మనుచు సుతనుచేతి కిచ్చిరి
ద్వారమందు నిలుచున్న మామగారికి మ్రొక్కి - ఖామనంపుమనుచు వారు పయినమ్ముజేసిరి
పుట్టి మూడునాళ్ళులేదు పొలతినత్త వాడకం - చిత్తమెరిగి నీ పనులు చేయనేర్చునా
వింటి కామాక్షమ్మ అతను అన్నమాటకు - విని ఊరకుంట నీకు అది ఉచితమా
తల్లి మరుగుచిన్నదాన్ని తనయ అన పంపరేమొ - తల్లికంటె మారుతల్లి నితనయనంపుడీ
శ్రీ వెంకటాచలా శ్రీపతిప్పుడలిగినాడు - అతివనంపకుంటె మనకు అది ఉచితమా
కౌగలించి నా సుతను గారవించి ముద్దుబెట్టి - పూలుకోయబోయి విభునిపొలతిదెస్తివా
కందదుంప వడినివుంచి చందనంపు బొమ్మవుంచి - తెల్లవరిబియ్యం వడి నిండ ఉంచిరి
పసుపు కుంకమ్ము చాల పణతివడినే ఉంచి - పల్లల్లరాసులు బళ్ళతోనె వెంటదోలిరి
మూడుకోట్ల ఏనుగూలు ముప్పయికోట్ల అశ్వమూలు - పదికోట్ల ఏనుగులు భద్రగజములు
నాభిమాణిక్యమూనునాలుగుదిక్కుల మెరయగాను-పక్షివాహనంబు రూపుడెక్కెభ్రమయగా
గరుడపచ్చల పల్లకెక్కి కామాక్షమ్మతాను - గరుడవాహనంబు యెక్కి కంచివరదుడు
తలుపూలువేయించి పేరూలుజెప్పించి - ఆశీర్వచనముచేసి అక్షంతలిచ్చిరి
వచ్చిన బంధుగులందరికిని వరుస కట్నాలిచ్చి - విందుజేసి వారినగరి పొందుకంపిరి
బంగరంపు మేడలోను పసిడిపాన్పుల మీద - అందమూగ పాన్పుపరచిరపుడు వరదకూ
పన్నీరు అత్తరూ పాన్పుపయిని చిలాకించి - మల్లెవిరజాజులూ సంపెంగలు జల్లిరి
బొంగరంపులావె పణతీ నీవువేగ రావే - కామినీ శోభరావె కలికి రావే
సుంకరీదుతోటి నీవు జూదమాడి ఓడితీవె - అంతధనము గెల్చుకోవె ఇందువదనా
పచ్చియాకు పోకులును పండుతెల్ల నాకులూను - తాంబూలమేసిరా దంపతులిద్దరూ
కోర్కెతోను లింగంపల్లి గోపయారాము - పేర కరుణ కలిగియుంచెచాల కంచివరదుడూ.

# సవతుల కయ్యము

యిందువదనరో వింటివా - సుద్దూలు చంద్రవదనరో గంటివా
మందగమనరో వింటివా - మా రంగాడి మర్మమెల్లా దెలసెనూ
కోమలిరో నన్నేడ బాయకుమనిచెప్పి - పాదముల బట్టేగదే
చెయ్యారాని బాసాలు జేసేగదే - దానింటికి పోనాని బొంకేగదే
అదిచాల వలపించుకుందేగదే - తిరువేంగళరాయుడు పరిమెళగంధము
దాని కుచములపై నిండాను - ఘుమ్ముఘుమ్మాని కన్పడేగదే
నాంచారు మందూల మహిమలు

యేడాదికొకతూరి వరయూరువస్తేను - యేమయ్యా నన్నింత రట్లుజేసేరూ
యేలమ్మ నన్నింత రవ్వజేసేరూ

వుంగారమిమ్మాని కావేటిరంగాని - రంగూగ తానడ్డుకున్నాడట
పట్నాములోవున్న ప్రజలంతజూడగ - విభునిచెయి జిక్కించుకున్నాదట
రంగాని బంగారు రొమ్మెక్కికూర్చోను - తప్పాటె నావల్ల తగనాటె నేను
యేమే వలయూరు నాంచారు - చెలులాతో యేమాని నన్నాడి పల్కితివో చెపుమా
పుట్టితి పెరిగితి యింతదాననైతి - యిటువంటి బూటాక మెన్నాడుయెరుంగ
దేవాతలందారు జేజేయనగా - బృందావనమ్మున పుట్టితినిగాని
పేరుప్రతిష్ఠలతో పెరిగితిగాని - యిటువంటి బూటాక మెన్నాడుయెరుగ
యాళ్వారింట యిచ్చాకములాడిన - హితవూలు జెప్పిన రంగడేకాడా
న్యాయము దప్పుడు నాటికి నేటికి - నన్నెడబాయాడు నాప్రాణనాథుడు
నాకేమి భయమె నీరాజనేత్రి - నీకన్న మూరెడు హెచ్చుయినదాన్ని

అక్కారో మూరెడు హెచ్చాని పల్కితివి - తిరుపాతి కొండపయి యెక్కి నిల్చుంటేని
నేను నేడు పెద్దదాన నగుదును - నావద్ద కాకుండగా నీ వరుని వద్దానయిననూ
అరవ బ్రాహ్మడికూతురా నీకింత అణకువా లేదాయెనే

అక్క అరవవారి చిన్నిపాపాను నేనైతె - అన్నింట నెరజాణ వౌదుము మేము
బ్రహ్మకు చుట్టాలమగుదుము మేము - కొమ్మాన కొనగోరు వంచంగగలవా
నీళ్ళలో బుట్టిన జాలారి కన్య - నీట మత్స్యంపట్టు మీవారు యింట
నీటిమంగళాలు తెల్లానిమత్యాలు - కూర్మాలు గలవాడటవే మీ వారులు జాణాలు గారాటవే

వొప్పయిన మత్యాలు గొప్పావి గలవే - కోరిన పుట్టిల్లు గొప్పభువనామే
యెల్లెట్లు బ్రహ్మకు యేలాటి చుట్టాలు - నేను యెరుగాకుండనూ నా నాధుడెరుగకుండనూ
వుత్తమాసూర్యజా వంశాజు డతడు - గంగా గౌతమి యమున నర్మద కావేరి
అయిదుగురు పట్నంపు రాణులతోను - యెల్లాలోకములు యేలుచున్నాడు
బంగారు కోటలు బాగయిన మేడలు - నేటయిన నాటకపు శాలలో కజోటు
బ్రహ్మాండ భాండములు నాబొమ్మరిళ్ళు - బ్రహ్మాదులెరుగూదురే

దేవునీపెండ్లి కొచ్చేటప్పుడు - విష్ణునీసేవ కొచ్చేటప్పుడూ
కుంచెడు బియ్యమూ కూరాకులాకట్ట - దానమిచ్చుకుంటివా
నీవింత దాచుకున్నాదానవా అమ్మక్క నెగ్గితివా - సవతిపోరుకు వస్తివా

అక్క వెయ్యికాళ్ళు మండపంబూలోన - రంగడు వేడుకతొ కొలువుండగా
యిరువంకలా సతులుండగా పరమభాగవతులుపాడ - పన్నిద్రాళ్వార్లు స్తుతులుసేయా
నారదుడు వీణెమీటా - ఆవేళ కంఠసరులూ యిచ్చెనే యీ రోషము నాడేల లేదాయెనే
సవతి నేడేల నీకు గల్గెనే - అక్కా కోవెలలో రంగేశుడూ
పరిజనముతో కొలువుండగా - యిరువంకలా సతులుండగా పరమభాగవతులు పాడగా
పన్నెద్రాళ్వార్లు సన్నుతిజేయగా - నారదుడు వీణెమీటగా
వేయికోట్లూజేయు వెలలేని పచ్చ - లక్షకోట్లూజేయు రత్నమాణిక్యం
నాధుడు చేబూని నావిడిది కొచ్చె - బంగారు గొలుసూల పట్టెమంచమున
తూగుటుయ్యాలపై శయనించియుండ - కోపామేల నీకు కోమాలియాని
మోవిముద్దాడియు మోహంబు దీర్చి - తెచ్చిన సొమ్ములు కానుకా యిచ్చె
వేడుకతో నామెడను ధరియిస్తినమ్మ
మోహంపుసుదతివి ముద్దారాలవు నీవు - వద్దానే యుండాకనూ
యిటువంటి సుద్దూలు నీకేటికే - అక్క పెద్దాదానవని మిట్టిపడేవేమె

చుట్టుపట్ల వారు చూడంగనూ - మన్మధునీవంటి కొడుకూను గన్నావనా
మండలాధిపతి ఆలివంటివి నీవు - నాపతిని రానివ్వావటే

దేవిడి బంగారు తలుపూలు మూయించి - నావిడిదీకి రాకుండ జేతువచే
దేవూని రావుళ్ళు బెడుదూవచే

అక్క రాకుండ జేసితె నగుబాట్లు గాదచే - రంగాని నాయింటికీ బంపవద్దా
అలుక జూపవద్దా అతనిపై నయినా - యిటువంటీవి కలికీకి లక్షణమా
సతియు పతియూ గలసి - వక్కచోటుండాలి పతినివిడచి సతి యుండూనచే
నీవంటి వంచలమారి గాబోలునూ - అక్కానేల స్త్రీలకు వన్నెకాడయి తిరిగినా
వరుని నడతకు వోర్వాక నీవాశమా - పార్వతివంటి దానికయిననూ
చనువునావివంటివా - నాకన్నా చక్కానిదానావచే

యెక్కాడనుండొస్తివే నావిభూని యెంత రాపిడిబెడితివే
వూరేది పేరేది నీవున్న స్తలమేది - యిచటికిరా కారణమేమే యీాడుజోడుదాన

నావూరేల దలచేవు పేరేల దలచేవు - నావార్ని తలపాను కారణమేమే
వియ్యామందగ వచ్చిరా - నీతోటి కయ్యామందగ వచ్చిరా

తాటంక ముత్యాల కమ్మాలు గదలా - తాటాకీ తలవూచకే నీవు సాటిదానవటవే

అక్కముందునా వల్లాను - యేమి ముచ్చాట గన్నావు
కాక నావల్లాను కడతేరదిపుడూ

వన్నెలాడి నీవాడినమాటలు - భువిలోన చోద్యాముతే

వన్నెలాడి యని నన్నంటివి యిపుడూ - వన్నెమృగమును నేను దెమ్మంటినా
పతిని యడవీకి బంపితినా - రక్కసుని వరియించి రథముపై కెక్కి
లంకలోకి వెళ్ళియుంటినా నేనూ

బిత్తారి నీవగుదువే - దేశదిమ్మారి అటుపోగదే

దిమ్మారివని నన్ను అంటీవి - వోకొమ్మా రొమ్ము పగుల గొట్టించేద
ముడిచి విడిచిన పూలు రంగానాధునికంపి - వలపించుకున్నట్టి నెరజాణపోవె

ఆడదాన పోవే నీతోటిమాటలు యిక నేటికే

ఆడదానివని నన్నంతేవె యిపుడూ
పట్టూజూచుకువుండు పదిలాముగానూ - తిట్టకా నేమానవే అక్కా

మసిబూసి నేరేడు పళ్ళమ్మనేలా
అంగజ జనకూని అంగట్లో బెట్టుదురా పలుమారు

శాంతురాలవని వచ్చియుంటినిగాని - నీతిదప్పిన దానివని యెరుగనె
నీవూరి కొస్తూనటే నీవుండ - వాడలకు నేవత్తునా అక్కనీపేరు
కలలోనయినను దలతునా - సప్తసముద్రాలు ప్రళయము పొంగాగా
నక్కానిజూచి నేవణగూదునా

శునకంబు నేజూచి బెదురుదునా - కుటిలకుంతలిరావె నాంచారురావె

పట్నంపు రాణీరో గొబ్బ్యానరావె పళ్ళురాలగొట్ట
దానిధాటీలు తగుజాతమూ

యేమిశాయగ గలవటే - నన్నిపుడు వంచనలు జేతువంటే
ముందు చెవులాకన్నా వెనుక కొమ్ములువాడి - అన్న సామ్యంబు నిజమాయెనే

యిందుముఖులంతాను వకచోట గుమిగూడి - విభునిగూర్చి యేకాంత మాడంగలేదా
యిందువదనా నీకామాటలు - చెవులాలో సీసంబు పోసినట్లుండు
కర్ణములకు పెద్ద ములుకులయి వుండు

మాటలు నేరాని మృదుభాషిణి నీవు - పద్మానాభుని ముద్దుగుమ్మారో రావె
పారుజాతములు ముడిచీ - పరిమళద్రవ్యముతొ శృంగారించి
చేరబోయి దాని కొప్పుబట్టీసి - కొప్పూలొ విరులన్ని విప్పిదీసుకురారె
కానుకలిత్తూగదె - చెలులార కట్నంబులిత్తూగదే

అక్క గజ్జలా గుర్రమ్ము యెక్కిరంగేశుడు - ఘలుఘలు మనుచు రవళి మ్రోయంగ
మకరకుండలములు మణికిరీటములు - శిరసున శ్రీరామస్తాళి ధరించియు
వచ్చుచున్నాడమ్మ మీ ప్రాణేశుడు - వోయమ్మ వాదులు మానారె
వనజాత విభూడంత వాహనంబాదిగి - ఆది రుద్రాదుల నందర్ని బిల్చుకుని
మావటి కొలువునకు రమ్మనిచెప్పండి - రావమ్మా శ్రీరంగ నాంచారు వేగ
మేలిమగు లడ్డూలు తియ్యని బూరెలు - మరిమరి మండియ్యాలు
తేనె తొనలు చక్కిలములు - ఆరగించెను రంగేశుడప్పూడు

రావమ్మ శ్రీరంగ నాంచారువేగ రావమ్మా - నిగనిగముత్యాల కమ్మాలు మెరయాగ
నటనాతో బంగారు బొమ్మ - గజరాజవరదూడు మెచ్చి నాకిచ్చినా
కంఠసరులుజూడవే - నా కంఠాన వెలుగుతున్న విప్పుడూ
పచ్చలా పల్లకీ పట్టుమాని - యింకనే పుట్టింటికి బోవాలెనూ
పెరియాళ్వారుల కూతుర్ని అనినన్ను - వేవేలవిధముల పూజిస్తురూ గదవే
తెచ్చుకున్నట్టి ఆ దొమ్మరి సతినిం - తిట్లుబడవలసొచ్చె బ్రహ్మవిధీ యిట్లుందిగాబోలునూ
యేలయ్యా యీవాదు లాడించు తున్నావు రంగాధామా
మాటాడబోతేను సవతికొట్టగవచ్చె రంగధామా
పోయిన పుట్టింట పొందూగనుండెద రంగధామా
భూతపిల్లులు జవ్వాది పిల్లులూ రంగధామా
కస్తూరి పిల్లులా కానకంపినదయ్యా రంగనాథా
ముప్పదిమూడు కోట్ల ధనరాసులంపింది రంగధామా
హస్త కంకణాలు ఆ వనితజేయుంచె రంగధామా
సముద్రుడు మీకిచ్చి వేడుకల చూచె రంగధామా
మకరా కుండలములు మీ మామ బంపెను రంగధామా
పన్నీరు చెంబులు బంగారు కోకలు వన్నెల రవికలు రంగధామా
మాణిక్యాలతోకట్టిన మకరీ పత్రికాలు జవ్వాది భరిణేలు ఆడేటి బొమ్మలు
అపరంజి పొమ్మలు పట్టెమంచపు పరుపు
పాలిచ్చు మొదవులు పదివేలిచ్చిరయ్యా నీలవర్ణుడా
వెండిపీ కడవలూ వెలలేని రత్నాలు పగడంపు రోకళ్లునూ
వజ్రములా రోళ్ళు దంతపు దువ్వెన్న ముత్యంపు చిక్కంటు
కాటుక్కారాటము పంపింది యెరుగవా నీలవర్ణుండ
యేటేట తప్పాక సారె చీరిబెట్టె రంగధామా
మురిసేవు ముద్దులా కోమలాంగినిజూచి నీలవర్ణుండ
కడుపునిండగ నీకు అన్నంబు బెట్టేర - పచ్చాని కమ్మాల దుప్పాటి యెరుగూనవే
నీపాదధూళీ మాపైన సోకితెచాలు విజయలక్ష్మి - జన్మ పావనయాయెను
పతితుల మగుదుము ఆదిలక్ష్మి సిగ్గాయె - నీయెగ్గు మాటాలు వినగానె నీలవర్ణాడు
మురసేవు ఆ ముద్దు కోమలాంగిని జూచి - చక్రధారుడా - పరిణయ కాలమందు
నాగవల్లి రోజున నేను మీరు - రత్నపీఠంబుపై గూర్చుండ హోమంబు వేల్చాగ
బ్రహ్మదేవుడు వచ్చి కల్యాము జెప్పగ - సముద్రుడూ యేతెంచి

కట్నకానుకలిచ్చె నీలవర్ణుడా - కరమూడి పచ్చాల నడయాలు బెట్టుకుని
వెలలేని పతకములు మీకంఠమునవేసి - పీతాంబరం గప్పె మీకు విష్ణుడు
కోటి సొమ్ములిచ్చె తావీదుల నిచ్చిరి - వెల్ల ఏనుగులయిన వకలక్ష యిచ్చిరి
పట్టుడేరాలూను పల్లకిలయినాను - పట్టిమంచంబులు పరుపులూ తలగడలు
పతికిచ్చిరయ్యా పద్మనాభా
ఏటా కోటిధనము జంబూద్వీపమంత - మొఖాసా యిచ్చిరి నీటుకాడా
పెద్దభార్య లేచి పంచభక్ష్యాన్నములు వడ్డించ - నంబెరుమాళ్ళయితె తానారిగించెను
హస్తములు కడుగుకుని కర్పూర విడెంజేసి
సతియు పతియును గలసీ సౌఖ్యముగానుండె రంగధామా
సవతులకయ్యంబు భువిలో నెలతలుబాడ - దంపతీ సౌఖ్యంబు బాగుగా పొందెదరు రంధామా.

# వెంకటేశ్వర్లు వేట

శ్రీకరముగ శ్రీ వెంకటనాధుడు - శ్రీతో కొలువయి కూడియుండగా
అవతల వచ్చిరి చెంచు మగువలూ - దయతో కరముగ కనుగొని మ్రొక్కిరి
సాగి నిలచిరీ - జుంటితేనెయలు - కానుక లిచ్చిరీ - వినయమ్ములతో
ఆడి వేడుచూ వేటకురమ్మన - ఆ పల్కులు విని వేంకటనాధుడు
అలిమేల్మంగను జూచి నవ్వుచూ - మానవతీ నా మాణిక్యమ్మా
వేటకుపోవగ కోర్కెయున్నది - శెలవులొసంగితె పోయివచ్చెదను
భామామణిరో నన్ను బంపుమీ - తడవుశాయకుండా
ఆ మాటలు వినిన అలిమేల్మంగయు - నమ్మరాదుగా పురుషుల మనసులు
కోర్కెలువుంటే వేటకుబోవుమి - చెట్లలోపలా వేటలాడుమీ
చెంచితలేమన్న పల్కబోకుమీ - వొట్టు సత్యాల్ వొప్పుకోకుమీ
కపటపుజాతిలో కలియబోకుమీ - గట్టినమ్మికలు యియ్యబోకుమీ
నాయందున దయ తప్పబోకుమీ - వేటకుబోయీ వేగరమ్మనెనూ
ఆ మాటలు విని వేంకటనాధుడు - ఆదిలక్ష్మిరో నీ మాటకు తిరుగా
అడుగుదాటి నేనెప్పుడు నడువా - మాటలు జెప్పుట వేయునేలా
మనసుకు మనసే సాక్షిగాదా - కోటికి యెక్కువ నీవుండగానూ
యేటికి చెంచితలూ

నిన్నే నమ్మిన విభుణ్ణిగాదా - నన్నే కొలచిన దానవుగదా
వనితా నాయెడ అనుమానించకు - మనెను లక్ష్మిభుడూ
శంఖు చక్రములు తా ధరియించుకు - గుండు ఫిరంగీ కాల్బలముతో
గుర్రము లేనుగ లొట్టిపిట్టలు దండు - సేనలతో చెంచులగూడుక
కోనకువేంచేసె

యేకడనున్నవి యేదుపందులూ - లేళ్ళు దుప్పులు గండామృగములు
పెద్దమెకంబులు చిరతపులుల - దండిఅయిన ఆవెలుగు బంటూలూ
వుండుజాడలు చెప్పరె చెంచితలూ

యీ రీతిగ కోనేటయ్య వేటకురాగా - సంతసమంది జల్లి మృగంబులు
ఝూడీ మెకములు చిన్న మృగంబులు - చిరుతపులులూ కోట్లకొలదిగా
గుమిగూడూకొనీ వచ్చినిలచెనూ - వరదు సన్నిధినీ
వాట్లనుజూడగ వేడుకలారాయె - అడవుల వెంటను తిరుగసాగెను
చక్కని చెంచిత సంఘముజూచెను - అక్కజమగు యీ రూపులుజూచె
మక్కువతో యీ మగువలజూచె - వరదుడు వారికి యిట్లనెనూ
పారుటాకులూ కట్టుకున్నారు - పర్ణశాలలో దిగియున్నారు
అడవి మృగములలో కలసున్నారు - యెవరో మీరు వివరము దెల్పండి
అక్కడ గల్గిన చెంచితలందరు - స్వామియనుచు బహు భక్తితోడనూ
కరములు మోడ్చి సాగి మ్రొక్కియూ - వెన్నుని ముందర నిలచి సేవించిరి
వనితలార మీ చక్కదనంబులు - వన్నెలు వాసులు జనులు చెప్పగా
ముచ్చటలయ్యెను నాకు యిప్పుడూ - కానలకు నేను వచ్చెదను
దారి జూపుడీ పోదము రమ్మనెనూ

కట్టుకున్న నీ పారుటాకులూ - కమ్మల చీరలు యెరుగమెన్నడూ
చెవులను బెట్టము సొమ్ములెన్నడు గురువిందలె కానీ

కోనల పెరిగినవారము మేమూ - కూరగాయలతో ప్రొద్దులు పుచ్చుదుము
కందమూలములె భక్షింతూము - మహాఘోరమగు అరణ్యములో
మహాబుషులము మేమూ పలుగర - చెయ్యము ముఖము కడుగమూ

పారుటగాసిన జలకమాడము - తలచిక్కులునూ విప్ప నేరమూ
అందకొప్పులు పెట్టనేరమూ - కలిగిన పువ్వులు ముడువనేరమూ
గట్టుల తిరిగెదమూ మానవకోతుల - మేత్రాసులమూ

మమ్ములజూచితే మనసు రోయదా - కోనేటయ్యా నీకుతగుదుమా
వేటకు వెళ్ళిన వెంకటనాధుడు - సాయంకాలము సెజ్జకు జేరగ
పండ్లు ఫలములూ జుంటితేనియలు - ఫలహారంబులు ఆరగించియు
ముచ్చటలతో నిద్రించంగా - వేగలేచియు చెంచు మగువలూ
డీకొని స్వామీ నగరికిరాగా - అందంబగు వక చక్కని కన్యను
వేంకటనాథుడు చేపట్టంగా - పారుటాకులూ పారవై చెనూ

పన్నీటానే జలకమాడెనూ - కోరిన చలువలు కట్టుకొనియెనూ
కుంకుమ గంధము మేనానలదెనూ - పొంకముతో శిఖపూలు జుట్టెనూ
పొందుగ కస్తూరి బొట్టుపెట్టెనూ - కోరిన చలువలు కట్టుకొనియెనూ
కుంకుమ గంధము మగువకిూనూ - యిష్టాన్నంబులు పళ్ళెరంబులా
వేడుకతో వడ్డించిరి చూత ఫలంబులు - పనసఫలంబులు ఖర్జూరంబులు
కదళీ ఫలంబులు ఖండశక్కరలతో - ఆరగించిరీ దంపతు లిద్దరునూ
శృంగారంబగు నా వనమందున - గాంధర్వముగా పరిణయమయ్యెను
చెంచు చేడెతో సఖ్యముజేసెను - పర్ణశాలలో పానుపువేసెను
యెక్కువ సౌఖ్యము లనుభవించెను - వేటకుబోయిన వేంకటనాథుడు
చెంచు మగువతో నగరికిరాగా - ఆదిలక్ష్మికి జాడలు దెలసీ
తలుపులు వేయించే

జాలంబాయెను లక్ష్మీరమణా - నీ పెదిమేటికి నొక్కుబోయెను
నీ కన్నుల కాటుక లెక్కడివీ

నీపై సొమ్ములు యే వెలదుల - కిస్తివో నిక్కముగ జెప్పు
ఆ మాటలు విని అలివేల్మంగతో - చక్కని మామిడిపండూ దినగా
జీడిసోకి పగిలె

సవతులిద్దరూ సామీ గూడిరి - వైభవకేళుల నొప్పియుండిరీ

లాలితముగ శ్రీ వేంకటనాథుడు - లాలిత నీకథ బుద్ధిజెప్పగా
పాలసముద్రముపై పవళించెను - జగతీపతి యా కోనేటయ్యా
శిరులిచ్చి మమురక్షించును - సంభ్రమముతోడుతనూ.

# చిలుకు ముగ్గుల పాట

శ్రీకరంబగుచున్న శ్రీ లక్ష్మితులసీ - యేకచిత్తంబునా యేమరకదలతు
మహిమీద వెలసినా మహాలక్ష్మి తులసి - మనసు పూర్ణంగాను మరి హరినిదలతు
వేదశాస్త్రంబులా వెలసినా తులసి - పాదుకొని నా హృదయ పావనంగాను
నల్లనిరేకులా తులసమ్మదెచ్చి - బృందావనంవేసి కుదురొప్పనిల్పి
ప్రాతఃకాలమందు గోమయందెచ్చి - అలికిన అత్యంత పాపములు బాసు
ముగ్గున పద్మములు పెట్టిరెవరయినా - మూడులోకంబుల ముక్తులై వుంద్రు
పద్మాన పంచవన్నెల గూర్చి రెవరయిన - లెక్కలేని పుణ్యఫలమనుభ వింత్రు
యెండిన పండినా యేచిపూచినను - నిండయిన భక్తితో నినుగొల్వ వలెనూ
మృత్తికసోకినా మేనంతలోనె - అపమృత్యు లెడబాయు నా క్షణమునందు
నిండువుదకంబులూ పోసినవారలు - మండలం యేలుదురు మత్తేభ గమనా
తులసమ్మ కల్లార జూచి మ్రొక్కినను - అపమృత్యు లెడబాసి ముక్తి బొందెదరు
వలగొని అభినందనంబు జేసినను - వారణాసీ పురివాసమే గద్దు
విప్రకుల వర్ధనుడు వేదబ్రాహ్మణుడు - తప్పదు తనపూర్వ కృతఫలము ఎంతో
పలుమారు వేదములు పల్కుచూతాను - సతిపతులు యిద్దరు అతివినయముతో
సంతతిలేకయూ చింతించుచుండి - పరమేశ్వరుని గూర్చి బ్రస్తుతిశాయ
ఘోరమైనట్టి ఆ తపసునకు మెచ్చి - వనజనాభుండంత ప్రత్యక్షమాయె
విప్రవేషంబునా వచ్చితానిలచి - యెండవానానకయే ప్రొద్దుమీరు
నిండుభక్తితొ నుండ కారణంబేమి - తపముకు మెచ్చితిని కోరుడీ వరము
యిచ్చెద యిష్టంబు యీ క్షణమునందు - సుతులులేని వెత్తి వక్కచేగాని
మహారాజ చింతలూ మరియేమి లేవు - విప్రునిమాటలకు విష్ణుండు తాను
యిచ్చెద వకవరము యింపుమీరంగా - పదహారు వర్షములా బాలునిత్తునా
సౌభాగ్యవతి గాని సుదతి నివ్వనా- విప్రుని పల్కులకు వేద బ్రాహ్మణుడు
సతిపతులు యిద్దరూ మదిలోన దలచి - పుత్రునిశోకంబు పొందలేమింక
సౌభాగ్యవతిగాని సఖియ నిమ్మనెను - వూరువెలుపల నుండు వక చూతమ్రాను
మ్రానుఫలము దెచ్చి పణతికిమ్మనెనూ - అనిచెప్పి విష్ణుండు వైకుంఠమేగె
దంపతులిద్దరు తమ గృహముకొచ్చి - వేకువఝామునా వేగ మేల్కొని
తోటకు యేతెంచి బ్రాహ్మణోత్తముడు - చూతఫలములుగోసి వడినిండ వేసి

యిరవుగా తన యింటికేతెంచి చూడ - వనిత ముందరబెట్టి విప్పి తాజూచె
వక్కచే ఫలమందు వొప్పుగానుండె - పరమేశ్వరుండిచ్చు ఫలమింతె గనుక
అధిక ఫలమొచ్చునా అతివరో మనకు - అనుచును ఆ నాతి ఫలమారగించె
నవమాసములు నిండె నాతి కంతటను - దశమాసంబొచ్చు తగు సమయమందు
చిత్తమొచ్చినట్లు చేసెనా బ్రహ్మ చిత్తరువు - ప్రతిమవలె చెలియ జన్మించె
కట్టడిబుద్ధులు గాంతకూ జెప్పి - గట్టిగ లలాటాన ముమ్మారువ్రాసి
యిచ్చెను వక సుతను యింపుమీరంగ - దశ దినంబులు గడపి తరుణికే తమరు
నారాయణమ్మనుచు నామంబుబెట్టె - అచ్యుతుని దలచుచూ అనుదినంబునను
నాటనుబెంచియు మాటబెంచీరీ - పణతికి పరిణయం బాచరించీరి
పంచమాదినమందు బాలుండు తాను - యెంచంగ యమపురికి అతివేగజనియె
ముద్దుపుత్రిక జూచి ముసలు లిద్దారు - సతిపతులిద్దరు అతిదుఃఖమొంది
అతివకు తగినంత ధనములు యిచ్చి - పరలోక గతులయిరి వృద్ధమిధునంబు
జనని జనకులు లేక చేడె - తానుండె బృందావనంవేసి కుదురొప్పునిల్పి
పూజసేయుచునుండె నా విప్రకన్య - విప్రులు వచ్చినా బిడియంబు విడదు
పెద్దలు వచ్చినా ప్రియము సేయాదు - కాంతలు వచ్చినా కండ్లజూడాదు
కనకంబుపై తాను కాంక్షచూపదు - పరమాత్మకు దయవచ్చి పణతిదగ్గిరకు
విప్రకులవేషమున వృద్ధరూపమున - జన్నిదము ధరియించి వేదంబు జదివి
కప్పుకో చల్లని కావిధోవతులు - వస్త్రంబుచాటునా వటపత్రమూని
హస్తమున దండంబు అవలంబించి - పట్టుకు చనుదెంచె పణతి వాకిటకు
పెట్టుము వకభిక్ష పేదబ్రాహ్మణుడికి - చుక్కతెల్లవారె వక్కభిక్షమ్మ
యెక్కడ వున్నదని యింతితా బల్కె - అరుణోదయంబాయె ఆకలికి వోర్వ
మరణకాలమువలెను మరి వచ్చినాది - పెట్టుము వకభిక్ష పేదబ్రాహ్మడికి
వండి వార్చి తెల్లవారింది - యిదిగో వృద్ధువని వగచి నీవద్ద బెట్టెదను
బలి అయిన పెట్టుమనె బ్రాహ్మణోత్తముడు - బలియిల్లె పొమ్మని పణతి తాబల్కె
యేమయిన గైకొనక యాడనొక్కడును - యేమయిన ఇవ్వనియింతి తాబల్కె
గోశుద్ధిజేసి నా గోమయంగుడ్డ - గొంతితా కోపించి గోవిందుపైని
పడవేయగైకొని యా పారుడపుడూ - యిదె పదివేలని అందుకుని చాల
సరస్సు వద్దకీ పరుగునా జనియూ - పేరికి వస్త్రంబు పెద్దగాజేసి
పరికించి చూచితే ఫలమొక్కటుండె - కందిగింజయుజూచి కడు సంభ్రమమున
కడువేగమునదెచ్చి యా కందిగింజ - నేలపెల్లాగించి నీలవర్ణుండు

సత్యంగల పాదునా విత్తనంనాటి - దొప్పకుదురుగజేసి - దోసెడుదకంబు
నిత్య సంరక్షణలు నేర్పుతోజేసె - కొమ్మ పువ్వూకాయ కొమరొప్పచుండె
నారాయణమ్మయూ నాగలోకంబు - చక్రధరు సన్నిధిని చేరినిలచుండి
కరుణసాగర నాకు గతియేమొచెప్పు - పెట్టినవారికే పుట్టుటేసాక్షి
పెట్టనివారికి పుట్టనిదెనిజము - పెట్టినవారికే పెద్దకాలమ్మ
అయిశ్వర్య విభవములు అజుడుతానిచ్చు - కసువు నీళ్ళునుత్రాగి కడుమయిలగట్టి
యిసుకతిన్నెలవెంట యింతి నీవుండూ - దూసుకుతినుకాయ దోసెడుదకంబూ
ఆశ్రయించుకువుండు అవనిమడుగులనూ - పణతిపొమ్మని పల్కె పురుషోత్తముండూ
వెలదులకు ఆ వ్రతం కాచెంచినపుడూ - ఆశ్వయుజశుద్ధ యేకాదశీ మొదలు
పాటింపకార్తీక పున్నమవరకూ - పతియింపుడే ముగ్గు పరిపూర్తిగాను
చాతుర్మాస్య నెల్లాళ్ళు తులసి పూజించి - ఏకాదశినాడు వుపవాసముండి
నాల్గుఝాములు ముగ్గునాతి తా బెట్టి - హరివాసరంబునా జాగరణజేసి
వుత్తమ యేకాదశి చిలుకు ద్వాదశి - తులసెమ్మనెవ్వరూ పూజించువారు
తులసిని పూజించె శ్రీలక్ష్మిదేవి - అన్ని లోకంబుల ఆనతిచ్చింది
శ్రీలక్ష్మి ఆనతిని సృష్టిలో జనులు - శుభకరంబుగ తులసి పూజింపుచుంద్రు
అందముగ తులసి దేవగురుమందార - కుందనంపూరోలు కుదురుగాద్రోచి
అయిదుశేర్ల బియ్యం పిండి మరగొట్టి - పీసె యేబులం బెల్లమ్మువేసి
ముత్తయిదు తా జేసె మూడు ముద్దల్లు - తులసమ్మ కొకముద్ద తృప్తితోబెట్టె
బ్రాహ్మణుని కొకముద్ద భక్తితోబెట్టి - తన పాలిముద్దయు రోటిపై నుంచె
తనపాలి ముద్దలో పాలునెయ్యి బోసి - శ్రీలక్ష్మి వేంచేసె శ్రీహరికడకూ
దండ నమస్కారంబు దగభక్తిజేసి - వందనంబులుజేసి ముందరను నిలిచె
చిరునవ్వు నవ్వుచూ శ్రీకృష్ణుడపుడూ - శీఘ్రముగ శ్రీహరి సతితోడబల్కె
ఓసతి శ్రీలక్ష్మి సుభద్ర నీవు - కడువేగవచ్చినా కారణంబేమి
చేతులు ముడుచుకొని చేడె తా నపుడూ - శౌరితో ప్రియురాలు చెప్పంగదొడగె
శ్రీకృష్ణ ప్రీతితో చిల్కుదంపేము - శీఘ్రానవేంచేయి శ్రీహరి మీరు
అవనిలోబుట్టినా అన్ని జీవులకూ - ఆధారమివ్వకా అటుమేము చనమూ
మనకులపావనీ మనభక్తురాలు - మన నామ మెన్నడూ మరువదెన్నాడు
ఆ చేడె దోడుకోని అతివ నీవొస్తె - వచ్చెద నేనని వల్లభుడు బల్కె
ఆ మాట విని పణతి ఆశ్చర్యపడుచూ - యింతికి పేరేమి యిల్లెక్కడయ్యా
యిలలో నారాయణమ్మ యింతిపేరు - యిల్లులేకను వుండె అలమర్రి క్రింద

అతివయొద్దకు యేగె సతి శీఘ్రముగనూ - అందెలు పాదార విందమున మ్రోయ
పొంకముగ మృగనాభి కుంకుమాజార - మానుకడ కేతెంచి మగువలిద్దారు
మానవతి వేంచేసి మా నగరుకిపుడు - కోరిన వరమిస్తు కొమ్మరమ్మనగ
పేరెరిగి పిల్చితివి ప్రేమతోనన్నూ - ప్రేమతో మీ నగరున పనియేమొ చెపుడీ
శ్రీకృష్ణ ప్రీతిగా చిల్కుదంచేము - శీఘ్రాన వేంచేయి చెలియ మా కడకూ
ఖిందు ఫలమిచ్చితే అందు వచ్చెదనూ - ఖిందు ఫల మీకున్న అందు రా ననెనూ
యిచ్చెద వక వరము యింతి రమ్మన్నా - హస్తము చాచెనా అతివంతలోన
హస్తకంకణాల ఆ ఆదిలక్ష్మి - అక్షింతలుదకంబు అతివదానుంచె
ఆ చేడె దోడుకుని కడువేగమునను - శ్రీలక్ష్మి వేంచేసె శ్రీహరికడకు
వక వరము యిచ్చి ఆ యింతి నిటుదెస్తి - వచ్చిపోకనయిన హరి జోదరుడ
పతికి వరమిచ్చితే అతివగూడెదను - పతి నంపగా నేను సరగుననురాను
జన్మ జన్మాలను జేసిన పాపమ్ము - చపలాక్షి నాతోటి చెప్పుమిపుడయినా
పదివేల జన్మాల పతిని వేసితిని - పాపవు జీవుడికి హరిప్రాపుగగ్గె
పతితోడ బుట్టినా పతివచ్చితేను - గైకొనక కంట్రకా లాడినదాన్ని
యిరుగనక పొరుగనక యే ప్రొద్దుబోయి - కాంచుడి కలహంబు బెట్టినదాన్ని
కరుణసాగర నాకు గతియేమొ చెపుమీ - నా నామమును విడిచి నన్నుదలచితివి
నాతి నీవు వైకుంఠమందు నుండుమీ - పణతి వైకుంఠపురము కపుడేగె
శ్రీలక్ష్మితోగూడి శ్రీహరియుతాను - ద్వారకాపురమునకు చనుదెంచి వేగ
కశ్యప వశిష్టాది గౌతమా మునులు - అట్టె భారద్వాజులా జమదగ్ని
శౌనకాదులంత నమ్మునీశ్వరులు - కలకంఠుడూ హరికి జలకంబువేగ
కమల నాభులవెంట కదలిరారమ్మా - సరగునను రుక్మిణి జలకమందిచ్చె
తరుణి సత్యభామ తళ్కొప్పనొత్తి - వలనొప్ప రాధికా వస్త్రమందిచ్చె
గంధంబు హరిమేన మిత్రవిందలదె - సూటిగా లక్ష్మణ సురటితా విసరె
విరులు దండలుయిచ్చె వేడుకతో - భద్రజాంబవతి తొడుగులు తెచ్చియందిచ్చె
కాళింది శ్రీహరికి కడునలకరించె - ముద్దుల గుమ్మలు తులసికడకేగి అంత
కుందనపూరోలు కుదురుగా ద్రోసి - అయిదుశేర్ల బియ్యం
అందులోనుంచి - కుందనపు పచ్చలా దోరణాల్గట్టి
మట్టెలల్లాడగా చిట్టిపాదము - పట్టుదొడుగుల సరసపణతి యేతెంచె
కమ్మలల్లాడగా బొమ్మవలెనీవు - రమ్మ సరస్వతీ రమ్మి పేరంటం
శంఖుపూసలపేర్లు ధరియించుకూని - శంకరుల పార్వతీ రమ్మి పేరంటం

యేడువారపుసొమ్ము లింపుతో బెట్టి - ఇంద్రశచీదేవి రమ్మి పేరంటం
చెరుకుచీరలగట్టి చామంతి ముడిచి - చంద్రుని రోహిణి రమ్మి పేరంటం
హస్తకంకణములు హస్తమున మెరయా - అరునుల సూభద్ర రమ్మి పేరంటం
పట్టుపీతాంబ్రము బాగొప్పగట్టి - పాండవుల ద్రౌపదీ రమ్మి పేరంటం
నూడిగంబులుంచి సూటిగా మెరయంగా - సూర్యుని వుషాదేవి రమ్మి పేరంటం
కొల్లారు బళ్ళెత్తి కొడుకులాతల్లి - వేగరా వెంకటరాయులా మంగా
గ్రక్కున కరకంచు చీరయుగట్టి - కాశీవిశాలాక్షి రమ్మి పేరంటం
బ్రాహ్మణవీధులా ఓ పణతులారా - భక్తితో మాతులసి పాడరారయ్యా
వేసారివీధుల ఓ వెలదులారా - వేడుకతో తులసి పాడరారమ్మా
కోమటివీధుల ఓ కొమ్మలారా - భక్తితో మాతులసి పాడరారమ్మా
అనుచు పేరంటాళ్ళ నందర్ని బిలువ - అర్జనుల సుభద్ర లక్ష్మితో వచ్చె
కాంతలందరుగూడి కడువేగవచ్చె - అందముగ తులశిదే వరుగు ముంబార
గోమయం చేతను శుద్ధి దగచేసి - పంచవన్నెల ముగ్గులు పణతులు బెట్టి
పంచదళపద్మములు పణతులుంచిరి - అష్టదళ పద్మాలు అతివలుంచిరి
లక్ష్మియు శ్రీకృష్ణు లలంకరించుకూని - వచ్చి కూర్చుండిరి వరుసతోడుతను
లక్ష్మీనారాయణుల స్థాపించిరచట - పుష్పగంధములతో పూజించిరపుడూ
పొన్నలు పొగడలే బొ  మల్లెలునూ - పారుజాతంబులా తులసి దలంబులతో
పరమాత్మ శ్రీకృష్ణు పూజించిరపుడూ - బెల్లము పంపియు చలిమిడిగొట్టి
ముత్తయిదు తాజేసె మూడుముద్దలూ - ధూప దీపంబులు తృప్తితో యిచ్చి
నయివేద్య మిచ్చెనూ నారాయణునకూ - వేదంబు జదివినా విప్రుని బిలచి
గంధ మక్షతలిచ్చి పాదాలుకడగీ - దక్షిణ తాంబూలాలు భక్తితో నిచ్చి
వాయన దానంబు వనితదా నిచ్చె - దానమందుకు నంత వేదవిప్రుండూ
ఆశీర్వచనము చేసి అక్షింత లిచ్చె - తనపాలి వకముద్ద రోటిలోనుంచీ
పాలు నెయ్యిబోసి పరగ మర్దించి - వేళ్లుగల చెరుకు కోలలూదెచ్చి
నల్లచెరుకు కోల నాతిచేపట్టి - వుంగరములా చేతయు విధాతబట్టి
కంకణములాచేత కాంత తాబట్టె
సోమకుని జంపి వేదము లుద్ధరించి - అందముగల మత్స్యావతారా సువ్వి
మందరగిరి అయిన మర్రిగ్రుంకిపోను - కూర్మావ తారుడైన గోవింద సువ్వి
వసుధ చుట్టుకుపోగ వారాహమయినా - వరహావతారుడా వనజాక్ష సువ్వి
స్తంభము వెడలియు కశ్యపుని జేరి - నరసింహరూపుడా నలినాక్ష సువ్వి

పృథ్వి మూడడుగులూ దానంబుగోరి - బలిదైత్యు నణచు నావామనుడ సువ్వి
పృథ్వి రాజులను బరిమార్చినట్టి - పరశురామావతార నీకునూ సువ్వి
రామావతారమున రావణునిజంపి - సీతానేలునట్టి శ్రీరామ సువ్వి
ముసలమును ధరియించి - అసురులను ద్రుంచి బలరాముడైయున్న పరమాత్మ సువ్వి
బౌద్ధావతారమున బుద్ధులూ బెంచి - స్త్రీల నేలినట్టి శ్రీకృష్ణ సువ్వి
కల్క్యావతారమున ఖలులనూ ద్రుంచి - కలియుగమే బ్రోచినా కమలాక్ష సువ్వి
అల్లోనేరడల్లో యనుచూ అతివలంతా - కలసి చిలుకుదం పేరు
సతులు పతులూగలసి చల్లులాడీరి - శ్రీవిష్ణు పైజల్లె శ్రీలక్ష్మితాను
బ్రహ్మపయి జల్లె భారతీదేవి - శంకరులపయిజల్లె నాయుమాదేవి
యింద్రుని పయిజల్లె శచియుదేవంత - చంద్రుని పయిజల్లె రోహిణీదేవి
సూర్యుని పయిజల్లె నావుషాదేవి - అర్జునుల పయిజల్లె నింతి సుభద్ర
పాండవుల పయిజల్లె ద్రౌపదంతటను - పతులు సతులు తమరు చల్లులాడంగా
విడియమ్ము లిచ్చిరి వేడుకలాయె - ముత్తైయిదుల కాముద్ద ముదముతో నిచ్చె
అల్లోనేరేడల్లో యనుచూ - వుత్తమ యేకాదశి చిల్కు ద్వాదశి
తులసమ్మ నెవ్వరు బూజించువారు - తులసి బూజించెనే శ్రీలక్ష్మిదేవి
అన్నిలోకములకూ ఆనతిచ్చింది - శ్రీ లక్ష్మి ఆసతిని సృష్టిలో జనులు
శుభకరంబుగ తులసి బూజ చేయుదురూ - యీతులసి మహాత్మ్యం పాడినా విన్నా
బాడిన వారికి బ్రహ్మలోకంబు - విన్నవారికి గలదు విష్ణులోకంబు.

# దత్తాత్రేయ జననము

దాసావరేణ్యులు తగుభక్తితోవినుడి - దత్తాత్రేయుని చరితము
శ్రీ సదానందుని చిత్తజనాద్భుత - భాసురాకారుని పరమపవిత్రుని
వాసిగా అనసూయ గర్భసుధా - సముద్రసుపూర్ణసోముని
వాసవామరవినుత యోగా భ్యాసుడైన మహానుభావుని ॥దా॥

వనజాసనుని పుత్రూ డనఘు - డత్రిముని తనయులులేకున్నను
తన మనమున అపుత్రస్య గతిర్నాస్తి - అను వేదవచనముల అంగీకరింపుచు
వనితయగు అనసూయతోడ్కొని - కనకశైలము కడకువేగమె
జని తపోవనమందు ఘనతప ఆచరించుచు నుండగానూ ॥దా॥

నారదుడొకనాడు మీరీ ఉక్కు - శనగలు అ రూఢిగాగైకొని
వారిజభవలోక వైకుంఠకైలాస - భారతీ ఇందిర సర్వ మంగళ అందరినీ
మీరు నాకివి వచనమొప్పగ - జేయుడనగా నేరమనుచును
పలుకనవ్వుచు నారదుడు - తాజేరజనె ననసూయకడకు ॥దా॥

అమ్మాయి శనగలు - నెమ్మదిగావండి ఇమ్మని పలుకగనూ
తెమ్మని ఆ దేవి స్థిరముగా పతిపాదములపై భక్తిని నిలిపి
నెమ్మదిగ కమండల జలము మంత్రింపుచు పైన జల్లెను
అంతలోపల ఉక్కుశనగలు ఉడికినట్లుగ మెత్తనాయెను ॥దా॥

దేవమునీశుడా దేవి మహాత్మ్యము భావములో మెచ్చుచు
వెయివేల విధముల వినుతించి గానముతో
నిదానముగ చాలా భక్షింపూచూ
భూమియందలి యెల్లసతులకు పూర్ణముగ నెరిగింపుచును చని
తీవరంబుగ బ్రహ్మ హరిహర దేవులకు ఆ తెరువుదెల్పెను ॥దా॥

పదునాల్గులోకముల పణతుల నందరిని వెదకివెదకీ చూచితీ
పదరూటవే కను పాతివ్రత్యముగల సుదతీని నే గానాను అనసూయతప్ప
ఇదినిజంబని పలికె నారదుడేక ముప్వురు దేవులంతట
బెదరించి పతులతోడను ప్రేమ బలుకక అలిగియుండిరి ॥దా॥

పణతులారా యలుగ పనియేమొ - దెల్పుడీ హితముగ జేతుమనినా
జడియక లేచి యా సతులూ భర్తలచూచి - విడువక సురమౌని వెసననసూయను
కడు పతివ్రతయనుచు పలికెను - కాన మీరలు వేగజని యా
సతిని జెరుపకయున్న తనువుల - విడుదుమనిరా సతులు ముప్వురు ॥దా॥

కామినులారా ఈ కార్యమెంతటిది - గలదు గడియలో చేతుమనీ
మొగమాటముడిగి త్రిమూర్తులూ - పయనమై కామరూపమున
కపట భూసురులగుచు నిలయము - కపుడు చేరగతాను జూచి
ఆ మునీంద్రులు అపుడువారికి - అతిథిపూజలు ప్రేమసలిపెను ॥దా॥

వరస్నాన సంధ్యలు వార్చియా ముప్వారు - స్థిరమూగ కూర్చుండగా
పరగ అత్రిభార్య పాకముచేసితా - ఉరుపాపళ్ళెరముతో వడ్డింపవచ్చిన
తరుణిగనుగొని మాకు యీ విధి తగదు - నీవిట గురు దిగంబరి
వగుచుపెట్టుము నియమమది - మాకనుచు పల్కిరి భూసురులు ॥దా॥

ఎక్కడైనా ఈ ఆశ్చర్యాము గలదే - అక్కట ఈ లోకామందూ
ఎక్కడి భూసురులేటి కొచ్చిర - నీ చక్కయోగదృష్టి అక్కపటము దెలసీ
మక్కువతో పతిభక్తి మదినిడి - అక్కమండలమందు జలమును
జక్కచేగొని మువురి మీదా - అక్కజంబుగ జల్లె నా సతి ॥దా॥

ఆలోన నా దేవి మాహాత్మ్యమూచేత - బాలగ నా క్షణమె
ఫలియింప ముప్వురు పురిటి - శిశువులగుచు బాలలగతి నేడ్వగా
పణతివారల నెత్తినీరుపోసి - శిరముల తడియునార్చి
జోలపాడుచు నుండె కానీ - లీలశతవర్షములు గడచెను ॥దా॥

అల్లానా సురమౌని అరసీపోయీా వారి యిల్లాళ్ళకు దెల్పెను
ఉల్లాసములో బిట్టు తల్లాడబడి చింత వెల్లివిరియ వచ్చి వెపమ
అనసూయను
పల్లవాధరలపుడు పదముల పట్టి మాకు పురుషభిక్షము
తల్లి పెట్టుమటంచు పైటలు ధరణిపై పరచుకొని వేడిరి ॥దా॥

కాంత లీగతి తన్ను కదసీవేడగను పంతమంతయు పోవిడచీ
అంతరంగమందు నెంతయు కరుణించి
శాంతమొప్పగ మౌని కాంత సద్భక్తితో
వింతగా కమండల జలమ్ములు మంతరింపుచు పైనజల్లగ
అంతలో హరిహర చతుర్ముఖు లంత నిజరూపమ్ము దాల్చిరి ॥దా॥

ధరణి త్రిమూర్తులు ముని దంపతులతోను మనములలో పొగడిరి
ఘనులార మమ్మిటు కరుణించితిరి గాన జననీ జనకులౌచు
ధరణిలో మా వంశమున తలచి వేడుకతోడ మీరు
జననమొందీ ముక్తిపదవిని చాల పోషించుడని పలికిరి ॥దా॥

హరువంశమున మౌనివరుడు దూర్వాసుడు అత్రికి జన్మించెను
సరసిజ భవుని అంశమున సుధాకరు డిరువొంద జన్మించెను
హరి అంశమున వీతాదురుతుడై మార్గశిర చతుర్దశీ వృషభ
లగ్నమందున పరగదత్తాత్రేయు డత్రికి పుట్టెసుతుడై ॥దా॥

పాదారజములు పదునాల్గు లోకముల పావన మొందగను
పాదుకదాల్చి వెంకటనారాయణ కవి నీ ఆధారముగ నాత్రేయుడై యుండె
మోదముతో సద్భక్తి యీా కథ మురిసి పాడిన విన్నవారికి
భేదమెంచక ముక్తిపదవీ ప్రేమ శ్రీపతి యొసగు చుండును.

# ఏకాదశి మహాత్యము

విఘ్నముగాకుండ విఘ్నేశ్వరులకు - మీకు నమస్కారాలు చేశేనుదేవ
ధవళ హారమ్మున ధవళవస్త్రమున ధవళ గంధమ్మున ధవళ పుష్పమున
ధవళాంఙి సరస్వతి తా ప్రియభక్తి - వాక్కున మనసున స్తుతియించరమ్మా
రుక్మాంగు డనియేటి రుగ్వేశ్వరుండు - త్రైలోక్యమంతాను తానేలుచుండె
వెండి స్తంభము మేడ వెలయ కొలువుండె - వెలయగ బ్రాహ్మణులకు వందనంచేసి
ఛమిడి స్తంభము మేడ పరగ కొలువుండె - భక్తితో బ్రాహ్మలకు వందనం జేసి
నదీతీరమున స్నానమ్ముచేసి - పృధివి నిశ్శేషముగ దానమ్ముచేసి
గోవుదానములే భూమి దానములు - అన్నదానమ్ములు అవి కోట్లుచేసె
మహిష దానములు మహారాజు చేసె - అశ్వ గజదానము అధిపతులకిచ్చె
ఒప్పేటి గోవులను అభిమునుల కిచ్చె - నవరత్న ఖచితముగ కట్టించె మేడ
నాటకశాలందు సఖియ లాడగను - పంచ నవరత్నాల కట్టించె మేడ
పార్ణశాలలందు పణతులు పాడగను - సర్వ పాలకుండు ధర్మేశ్వరుండు
ధర్మాంగ ధర్మములు తమరడుగుచుండ్రు - నీతిశాస్త్ర గురుడు అనుష్ఠానపరుడు
వశిష్టమునులను తమరడుగు చుండ్రు - అడిగినా ఆనతి యిస్తురామునులు
యుగములలోకెల్ల ఏ యుగము మేలు - యుగములలో కెల్ల కలియుగము మేలు
జన్మాలలోకెల్ల ఏజన్మ మేలు - పురుషజన్మము కాదు స్త్రీజన్మమనిరి
స్త్రీజన్మం మేలగుట కారణము ఏమి - స్త్రీకి శూద్రునికినీ శుద్ధి ఆచార్య
విధిలేదు స్త్రీలూను పతిభక్తి - కొని శూద్రునికి వేగ గతులడగవద్దు
కానివారికి - కలియుగము మేలగుట కారణము చెపుదు
ప్రతియుగము ముందు పతివేడగా తపసి - తపని ద్వారపానమో సమర
రమనియేటి సమయమున గూడి - తొల్లి పుష్కరుడనగ ఒక విప్రవరుడు
యముడు తా నంపినా దూతలూ వచ్చె - ఆ పరమముని తాను చూతమనిపోగా
యముడు ఏతెంచి తా ఎదురుచనుదెంచి - దండనమస్కారాలు ధర్ముండుచేసె
కలశోదకము తాను మునికాళ్ళు కడిగె - అచ్చ కర్పూరాల తాంబూల మిచ్చె
తప్పుచేస్తి మిమ్ము ధర్మస్వరూపీ - పోవయ్యా నీవందు జనులు పూజింత్రు
మీపట్నంలోపలి శుభవస్తువులన్ని - ప్రియముగా గని మేము పొగడెదమనెను
మాపట్నమంతాను ప్రేమతోజూడ - మీవంటి సాత్వికులు మిగుల దుఃఖింత్రు

ప్రియముగ చూచి పొగడెదననెను - ప్రియము చెప్పవలసి నరకములు చెప్పె
నరకములు యెట్టివో చూచెదననెను - కాళ్ళు కరచెటి కుక్కలవి పదికోట్లు
కళ్ళు పొడిచెటి కాకులవి పదికోట్లు - ఇనుపముక్కుల కాకులను పొడవమంద్రు.
వజ్రదొండ పురుగులు తొలవమందురు - తొలిచేటి కరిచేటి తోకపురుగులను
దండించి జంతిగల వత్తమందురు - ఖండించి గానుగను ఆడమందూరు
పెద్ద జంతిగను వత్తమందురు - అది పత్రి వనముని దుయ్యామందూరు
వ్యధాసనమ్మున వేల్చేటివారు - లోహములు కాచియో పోసేటివారు
తైలముల దొంగిలిన సఖియలనెల్లా - తైల పక్వమువల్ల మాడ్తురు వార్ని
ఉప్పు దొంగిలిన యువిదలనెల్లా - యమలోకకూపాన పడవేతురు వార్ని
కారము దొంగిలిన కాంతలనెల్లా - కోరపురం పాలకోతురు వార్ని
చిచ్చుదొంగిలిన చేడెలా నెల్లా - కడుపుశోకమ్మున యేడ్చేటివారు
అన్నం దొంగిలిన అతివలను యెల్లా - వర్ణసంకారాన పడవేతురు వార్ని
పంక్తి భేదమ్ములు చేసిన స్త్రీల - అరిచేతుల వసికొయ్యలు కొట్టేటి వారు
ఎంగిలీ యెత్తనీ హీనుల నెల్లా - ఇనుపసూదులు పాతి అలకమందురూ
పీటలు ఎత్తనీవారల నెల్లాను - సొరణగంతలవెంట దూర మందూరూ
చండాలం కలిపిన స్త్రీలను ఎల్లా - రక్తగుండాల తోయింత్రు వార్ని
అతిగత్రచేసిన స్త్రీలను యెల్లా - యమకూపమందూనా కూల్చమందూరు
పతివుండి పరపురుషుని వెతకిన స్త్రీల - భగభగా మండేటి వుక్కుస్తంభమున
అడుగోను పతియని అంటింత్రు వార్ని - తనస్త్రీ వుండగా పరస్త్రీని చూపే
పాపకర్మని బట్టి బంధింత్రువాని - పరపురుషుల చూసినా పణతులానెల్ల
పల్లేరుకాయల్ల పొల్లింత్రువార్ని - ముంథముద్దుల మింగినా వార్ని
ఇనుపగుళ్ళు కాల్చి చేతులతో - మింగుమని మెడలమీద గుద్దేటి వారు
చూసిని చూడక ఆడేటి వార్ని - కాల్తురే కమ్మారి కొలిమి తిత్తులను
వేలాల మంగలములోను - కూలుతురు కుమ్మరి ఆవములలోను
వేడి నారసాలు వేడిగా కాచి - అవితెచ్చి కన్నుల తెరవమందూరు
చర్మమ్ము వలవగా సున్నంపువాన - కురియగ రొప్పుచూ కూలబడేవారు
అరగడియ తడవులేదు అవసరమె కాని - అవిధాన పదిమోహానలు చేయుచుంద్రు
దినరకములలోను - పాపములచేతనే పడియున్నవారు
వ్యభిచారి చర్లతో విచ్చియున్నవారు - తలలు విరబోసుకొని అధైర్యపడుచు
హా తల్లి హా తండ్రి అనివగచేటి వారు - హారుణ్ణిగానక అడలేటివారు

చూచి నరకమువారు చుట్టూచునుంద్రు - అచ్యుతారామ గోవిందన్న శరణు
అత్యంత పాపాన ఆదురితపోయె - కర్ణముల విని మోక్షమునకు జనిరి
యమధర్మరాజు పురమంతపాడాయె - తన పురము అంతాను పాడగుటజూచి
చనుదెంచి ఓ దిబ్బమీద కూర్చుండె - తానునూ మంత్రులూ చింతింపుచుండ్రి
దూతల్లనీ యముడు డనిపలికె - హరినామ సంకీర్తన చేసినవార్ని
ఆమడ తొలగుమని శాసించె రాజు - హరినామ సంకీర్తన భయ మంగళము
భూమిలో దానములు చేయంగవలెను - స్త్రీతోను చేసిన దానమ్మెకాని
స్త్రీలేని దానము ఒప్పదందూరు - పతితోడ చేసిన ధర్మమే కాని
తా ప్రియములేదని తమునిశ్చయింత్రు - అనియిట్లు మహర్షులు పలుకగాను
అత్యంత సంతోషమనిపొంగె రాజు - సంధ్యావళీదేవిని పెండ్లాడదలచె
యిదిలగ్న మిది ఘడియ యిదిమూర్త మనుచు - సంధ్యావళీదేవిని పెండ్లాడిరాగ
అక్కడ వెడలియో అవనిపతిరాగ - చార్తలోచన యనగ చారల్ల పురుగు
నలినలిగాగాను చూచె మహరాజు - పయిచార పాకిన హస్తమున దుడచె
హస్తమున దుడచినా ఆజీవజంతవా - చపలాక్షి చైతాకి శాపంబు దీరె
ఒప్పేటి స్త్రీయై ముందారనిలచె - చోద్యపడి మహరాజు చోద్యమాయె యనగ
చేతులు ముడుచుకొని చేసె విన్నపము - పతిప్రాణ ధారపోసి బొంకనను
పతితోడ బొంకిన పాపముల గూర్చి - ఆ పాపఫలముల ఈ ముళ్ళలోను
పుట్టుచు చచ్చుచు తావున్నదాన్ని - ఎన్నడీ శాపమని గౌతముని అడిగె
ఎన్నడు రుక్మాంగజుడు మహరాజువస్తె - శాపములన్నియు శాప్మాయె తనకు
మూడు జన్మముల ఏకాదశుల వ్రతస్తుడవు నీవు - యెల్ల జన్మములలో వొక్క
యేకాదశి ఫలము ధారవొయ్య మనగ - ఉదకములుకొని ధారపోసె నా సతికి
ధార్మికులు భోర్నాద వేంచేస్తిమనుచు - తమ భార్య ఫలము వేంచేస్తి మనుచు
మ్రొక్కుచు ఆ సతి మోక్షానకరిగె - అక్కడ వెడలియో అవని పతిరాగ
కుట్లు కీళ్ళనియేటి ఒక జీవజంతువా - నలినలికాగాను కూలె నా రాజు
పయిచీర పాకిన హస్తమున దుడిచె - హస్తమున దుడిచిన ఆ జీవజంతువా
చపలాక్షి చైతాకి శాపంబు దీరె - ఒప్పేటి స్త్రీయై ముందార నిలచె
చోద్యపడి మహరాజు చోద్యమో యనగ - చేతులు ముడుచుకొని చేసె విన్నపము
పతికి ప్రాణధారపోసి బొంకినను - పతితోడ బొంకిన పాపముల గూర్చి
ఆ పాపఫలములు ఈ ముళ్ళలోను - పుట్టుచు చచ్చుచు తావున్నదాన్ని
ఎన్నడీ శాపమని గౌతముని అడిగె - ఎన్నడు రుక్మాంగదుడు మహరాజువస్తె

శాపంబులన్నియు శాప్మాయె తనకు - మూడు జన్మల ఏకాదశి వ్రతస్తుడవు
ఒక్క యేకాదశి ఫలము ధారవోయె మనెను - ఉదకములు కొని ధారపోసె నా పతికి
ధార్మికులు భోరాధ వేంచేసిరనుచు - తనభాగ్య ఫలములు వేంచేస్తిరనుచు
మ్రొక్కి ఆ సతితాను మోక్షానికరిగె - అక్కడ వెడలియో అవనిపతి రాగ
వెడలెను ఆ రాజు యింతితోకూడ - పొగడాల గొడుగులు పరగతులుపట్ట
తరుచైన ధర్మశాస్త్రములా నీళ్ళ - వశిష్టు డాయన్ని ముళ్ళుపోయించ
హరి దినము చూరకాడని మ్రోగెదారుల్లు - భోగప్ప చంద్రుడికి నగళ్ళలోను
పొలుపమరుచున్నట్టి భోరువాకిళ్ళు - చిలకల్లు ఆ గద్దె చిత్రించినారు
హంసల్లు ఆ గద్దె అమరించినారు - మాణిక్యాల గద్దెలు ఎత్తించినారు
సువర్ణమైన గద్దెమీద గూర్చెండె రాజు - మద్దునా మీనాక్షికే మధునాయజాక్షి
వెయివన్నెవెట్టుకి వెసిరి తన పతికి - అతిచిత్రమగుచున్న హొంబట్లు తెచ్చి
విచిత్రముగా పచ్చడింతూరు - పొద్దోయిపూసినవి పొన్నపువ్వుల్లు
ఆ మంచి పాన్పున అవి చాలబరచిరి
మాపోయి పూసినవి మల్లెపువ్వుల్లు - ఆ మంచి పాన్పున అవిచాల బరచి
జామాయి పూసినవి జాజిపువ్వుల్లు - ఆ మంచి పాన్పున అవిచాల బరచి
అప్పుడే పూసినవి అంబుజపూలు - ఆ మంచి పాన్పున అవిచాల బరచి
నీళ్ళలో పూసినవి నీలాంబరాలు - ఆ మంచి పాన్పున అవిచాల బరచి
పందిళ్ళ పూసినవి బంతిపువ్వాలు - ఆ మంచి పాన్పున అవిచాల బరచి
నేర్పుతో వత్తివేసి నెయ్యిచాల బోసి - కంచువెయి స్తంభాల దివ్వెలువెలుగ
జలకములాడి భోజనములుచేసి - పరిమెళాలందిరి దంపతులువారు
తాంబూలాలువేసిరి దంపతులు వారు - దంపతులు వారరిగిరి తమరు శయ్యకును
సతిపతులు ఇరువ్విరూ సంతోషముగను - ఆనంద సుఖలీల నుండి రంతటను
గర్భచిన్నెలు తోచె కమల ముఖకపుడు - నవమాసములు నిండి నాతి గర్భిణి
త్రిప్పులు చెప్పా ప్రామఖురసాల ప్రవరుడుజేసె - ధర్మాంగులని యేటి నామమ్మునుంచి
ముత్య నవరత్నముల కట్టించ్రి తొట్టె - ముత్యాల చేరుల ఉయ్యాలకట్టి
సరసాన మంత్రిని తొట్టెలోపెట్టి - చాయంగల పటాగిరి మందిరమ్ములను
ఇంద్రుడి వాణెల్లపట్ట - చంద్రుడికి కన్నుల్లు చాయర్లుపట్ట
రమణేంద్రుడు కన్నిక గంభపూర్వశి - అరుంధతి మొదలుకొని పేరంటాళ్ళు
దీవించి యిచ్చిరొప్పుగాను - పచ్చి పసుపు అక్షింతలు పోకలాకులను
పరమేశ్వరుండు కాని మునివేగ వస్తుడ - ఓ ఝూముసతి పుత్రుణ్ణి చూసె

ఓ ఝాము దేవతార్చన మొప్పజేసె - ఓ ఝాము శ్రీహరి సేవల్లుచేసె
కృష్ణ తులసిన్ని ఉదకముదెచ్చి - పుష్పాంగమిచ్చి తన కమండలాలు మడచిరి
తమరు ఏలీనట్టి రాజ్యమ్ములోను - ప్రజలకు పాపములు పొందరాకుండ
ఏ వలను చేసిన పాపములు అన్ని - ఏమిటూ దేహాన సిద్ధమ్ములగును
అనియిట్లు మహర్షులు పలుకగా వినుచు - విద్వాంసులంత కూడి విచారించి
కర్మ నిన్నేమిటికి శాస్త్రములెకాని - విలాసమాదిగా పురాణముగను
శంఖుచక్ర గదాధార్లు సర్వేశ్వరూలు - శౌనేశ్వరోపుచు తపములు తెలుప
పుట్టింది మొదలుకొని పాపముచేసి - దురాచారులై వున్నవారలకు
వారి పాపములన్ని విడివిడిపోయె - మోక్షలోకమ్మునా వుందురు వారు
జపహీనులందరూ జాతాంతకూడు - ఆచారహీనుడు అతిదోషకూడు
వివాహాలు చెరిపే విశ్వాసఘాతి - కలవాణ్ణి చూచితా కాలేటివాడు
శంభుని భక్తులను చెడనాడువాడు - గుడి అందకుంటనగ గుడిధర్భకూడు
లేశ్వర్ల సాగత్య చేసేటివాడు - రాశ్వదోషమ్మునా చేసిన స్త్రీల
వెకిలి దోషమ్మున వ్యర్ధమైచెడెను - అతినిష్ఠ అతిగోష ఆ ప్రియుదాస
నిష్ఠజేసినట్టి నిరహాంతకూడు - సూర్యకంటె వీడు శంతకంటిడ పేతు
నిందించగా విన్న పాపానబోయి - నిందించిన పాపలు ఎందునబోలు
నిందలేని పాపములు లోంగె ఉండెను - వినవయ్య మహారాజ వివేకపరుడ
ఇపుడు మీరడిగిన ప్రశ్నలకు మేము - నిమ్మళముగా నిశ్చయించి చూచితిమి
దశమి ఒక్క పొద్దు సతియున్నతాను - మర్నాడు ఏకాశి ఉపవాసముండి
అంత చాత్రుడితోటి సౌభాషలడిగి - జాశ్రీయన జాగారం చేసిరెవరైన
అతిఫలములైనట్టి పుణ్యములుగలుగు - ద్వాదశినాడు ఓ విప్రవిందుణ్ణి పిలచి
అడుగువారాకుండ అన్నమ్ముపెడితె - ద్వాదశి ఓ ఫలము యిత్తునో అనుచు
ఈ ఫలము ఎవ్వరికి స్తుతియింపరాదు - వైష్ణవ నిందకుడు విప్ర నిందకుడనగ
వేదపాలకుడు సుకాసేనుడు - అన్ని తిధులాపేర్లు చెప్పేద వినుమ
అన్ని తిధులాపేర్లు అడిగీతివైన - ప్రథమ అమావాస్య పితాళ్ళదినము
పాడ్యమి ప్రజాపతి దేవాళ దినము - విదియ శ్రీలక్ష్మి దినము తదియ గౌరు దినము
చవితి స్వామికి కొమారుల దినము - పంచమి పొన్నంగ శయనూల దినము
షష్టిని శ్రీ భశేంద్రూడి దినము - సప్తమి శ్రీ సూర్యదేవార దినము
అష్టమి అష్టలోకపాలకుల దినము - నవమి శ్రీ దురదినము
దశమి కుబేరుడి దినము - ఏకాదశి విష్ణుదేవర దినము

ద్వాదశి త్రైలోక్యపతి కేశవుల దినము - త్రయోదశి సరస్వతి దినము
చతుర్దశి శంకరదేవర దినము - పౌర్ణమి వాసుదేవేంద్రుడి దినము
శుభమైన పంచాది దశాదిదినములను - మోక్షవార ఫలములిచ్చునుసుమి అయ్యా
మోక్షమున పర్వతం ప్రదక్షిణమిచ్చిన - చూడక్క హారిదినము సరిరాదుసుమ్మి
సముద్రతీరమందు ఈ పృథివినందు - దానములుచేసిన ఫలమేమిగద్దు
దశమిన్ని ద్వాదశి ఏకభుక్తమ్ము - భక్తితో ఉపవాసమున్న వారలకు
మొదలు దివ్యశరీర మారోగ్యమౌను - కుడచి వారు సుపుత్రునెత్తుదురు
ఈలోకాన విష్ణుడనంత కాలమున - భూలోకానికే పుణ్యుడై నాడు
అత్యంత సుఖములకు హారుడు అయినాడు - కోరిన వారికి కోరికలు ఇచ్చు
అడిగినవారికి అర్థమ్మిచ్చు - కైలాసవాసైన కండతిథియైన
అపరాండట ఉపవాసముండులే నిజము - పెట్టకా పెడితిమని చెప్పినవారలకు
పూర్వానచేసిన పుణ్యములు చెడును - ఇయ్యకే ఇస్తిమని చెప్పువారలకు
మహిమీదచేసిన ధర్మములు చెడును - ఆకాలమందున్న పెట్టిన్న అది
అపాత్రుడికి దానమిచ్చిన్న అది - అపాత్రుడిచేత కుడిచిన్న అది
ఇన్నివి కూడాను ఇంతిగర్భమున - అటుకాక హారిదినము అసురరణిర్భమున్ని
అన్ని అసుళ్ళు ఎదురుసుమి అనెను - అప్పువాడు ఆస్తి అపవృద్ధుడైన
కాకాని వారితో కయ్యమ్ములొసగి - అలుసు అయాతును కుడువకున్నాను
అశనమ్ములేకతా నిలువ సూడైన - అట్టివారత్యుల కూడుదురు సుమ్మి
అజ్ఞానమన్నదే అది వట్టికలయె - జ్ఞానపాపమనదె అది పిచ్చికలలు
పాపమ్మ అన్నదే కోరింతరాన - కాలేటి తెరవులు చెప్పేద వినుము
దశమిన్ని ద్వాదశి ఏకభుక్తమ్మ - భక్తితో వుపవాసమున్న వారలకు
మొద దివ్యశరీర మారోగ్యమౌను - సుఖములు కుడిచి సుపుత్రుల నెత్తుదురు
ఈ లోకానికి విష్ణుడనంతకాలమున - భూలోకాలకీ పుణ్యుడైనాడు
మాతృపిత బాంధవ వంశమున గూడి - పూతలు పూసుకొని పుష్పములు ముడచిరి
తమ పుష్పమాలికలు ముడుచుకొని తమరు - శ్రీ సాయుజ్యానికి తమరు ఏతెంచినారు
సాయుజ్యానికి గూడిన జననాథు పొగడ - ఏకాదశి మళ్లెనని ఏనుగులపై భేరి
వుత్తమ పురుషులు అయినాను వార్ని - వుములుచెప్పి వుపవాసముంచుదుము
మరిన్ని మధ్యములై అయినాను వార్ని - బుద్ధులుచెప్పి వుపవాసముంచుదుము
కాకున్న కనిష్టు అయినాను వార్ని - ఖండించి ఉపవాసముంచుదుము అనెను
ఖండించి చెండించి దేశములు మణచి - యీ అర్థకె సందేహమే లేదులేదు

పశుకెట్టి పూరివెయ్యాకు మనిరి - పసిబిడ్డలకు ఉగ్గుపెట్టాకు మనిరి
బాల పాపలకు పాలు పొయ్యాకుమనిరి - బాలింతలకు వేడిపెట్టాకు మనిరి
చూలింతలకు చద్ది పెట్టాకుమనిరి - బాలింత సహితముగ పసిబిడ్డవుగ్గు
పెట్టవద్దని ధారపుట్టించె రాజు - ఆ బ్రాహ్మముహూర్తమున ప్రదోషమూన
చేకొని వ్రతములు చెల్లించెరాజు - ఆత్మ ఆత్మకున్న అతినమ్మకున్న
ప్రాకటముగా వెళ్ళినను ప్రవేశించినను - చేకొని వ్రతములు చేయించెరాజు
చెలువుడు రుక్మాంగదుడు చెప్పిన్న కథలు - పెద్దలమని కొందరు పరిహారింతురు
వృద్ధులమని కొందరు పరిహారింతూరు - చనుమని కొందరు పరిహారింతురు
చదరాళ్ళమని కొందరు పరిహారింతూరు - ఏకాశి అన్నమును ఎవరు కుడిచినను
శునకమై పుట్టి శోకమును బొందుదురు - ఏకాశి అన్నమును ఎవరు కుడిచినను
కాకి మాంసము కన్న కనిష్టమగును - హరిదినము ఎవరు కుడిచినను
అంత్యజునితోటి సమానమ్మ అనెను - పచ్చిపాలు తాగి పళ్ళారగించి
వట్టి భోజనమైన భక్షించవలెను - కని కష్టుడనియేటి పాపకర్ముడు
యీభంగి ఉపవాస ముండలే ననెను - అట్టివారి నెల్ల రుక్మాంగదుడు
విరిచి కట్టూకట్టి దొడ్లోనె ఔట్టి - చీమచెద రారగా జీవజంతువులు
జీవముకు జీవమై వున్న జీవములు - వెలిగ విష్ణులోకమ్ముకే జనెను
కాంతలు కసవులు వూడ్చేటివారు - కస్తూరి కళ్లాపి జల్లేటివారు
యింతులూ తమయిళ్లు అలికేటివారు - ముగుదలు ముత్యాల ముగ్గులెడుదురు
పచ్చాకు పందిళ్ళ వేసేటివారు - పసరుటాకుల దళ్లు కట్టేటివారు
సూత్రాన్న సున్నము వేయించువారు - నేత్రాన నెలపట్టు వ్రాసేటివారు
అన్నిళ్ళు శృంగార మమరజేయించె - స్వర్గలోకమంత చేయించె
యమలోక మంతాను వెలుగుచేయించె - యీభంగి హరిదినము గౌరవించిన
పురుషులు పురుషోత్తముల కూడివుంద్రు - ఈభంగి హరిదినము సేవింపుచున్న
వైధవ్యంలేదు ఈ పట్టణములోను - వారిజనాభుని శృంగార మొప్ప
అట్టితరి నరకముకు నారద మునులు - శిష్యులు తానును శీఘ్రముగ వచ్చె
తొలి వొక్కనాడు మేము చూడవచ్చినను - కాళ్ళు కరచెడి కుక్కలవి పదికోట్లు
కళ్ళుపొడిచెడి కాకులు పదికోట్లు - ఇనుప ముక్కులతోను పొడవమందూరు
వజ్రదండ పురుగులు తొలవమందూరు - తొలిచేటి కరిచేటి తోకపురుగులను
సంధించి జంటగా వత్తమందూరు - ఖండించి గానుగను ఆడమందూరు
కడుపెద్ద జంతిగను వత్తమందూరు - పత్రిగా అంగములు దుయ్యమందూరు

వేదాసనమున వేల్చేటివారు - లోహాలు కాచియు పోసేటివారు
తగులముతో తొలగిన సఖులనెల్లారి - తైల పక్వమువలె మాడ్తురు వార్ని
భారము దొంగిలిన సఖులనెల్లరను - కోరపు రంపాల కోతురు వార్ని
ఉప్పు దొంగిలిన ఉవిదలనెల్ల - యమలోక కూపాన పడవేతురు వార్ని
చిచ్చు దొంగిలిన చేడెల నెల్ల - కడుపు శోకమునా వేల్చేటి వారు
అన్నము దొంగిలిన అతివలనెల్ల - వర్ణ సంకారాన పడవేతురు వార్ని
పంక్తి భేదమ్ములు చేసిన స్త్రీలు - అరచేత కొయ్యలు కొట్టేటివారు
ఎంగిలి ఎత్తని వనితలనెల్ల - ఇనుపసూదులు పాతి అలకమందూరు
పీటలూ ఎత్తని వనితలనెల్ల - సోరణగండ్లలో దూరమందూరు
చండాలము కలిపినా స్త్రీల నెల్లరిని - రక్తగుండాలలో ముంచుదురు వార్ని
అవజ్ఞత చేసిన ఆస్త్రీలనెల్ల - యమకూపమందునా కూల్చ మందూరు
పతివుండి పరపతిని వెతకినా స్త్రీల - భగభగా మండేటి వుక్కు స్తంభమును
అడుగోను పతియని అంటింత్రు వార్ని - తనస్త్రీ వుండగను పరస్త్రీని చూసే
పాపకర్ముని బట్టి బంధింత్రు వార్ని - పరపురుషులను చూచిన స్త్రీలను ఎల్లా
పల్లేరుగాయల పొర్లింత్రు వార్ని - భాండ ముద్దుల మింగినవార్ని
ఇనుపగుళ్ళు కాల్చి చేతుల్లో పెట్టె - మింగుమని మెడమీద గుద్దేటివారు
చూచిన్ని చూడమని ఆడేటి వార్ని - కాలుతురు కమ్మారి కొలిమితిత్తులను
వేలుతురు పేలాల మంగలములోను - కూలుతురు కుమ్మరి ఆవములలోను
వేడినా రసాలు వేడిగాకాచి - అవ్వి కన్నులలోన అద్దమందూరు
చర్మము ఒలవగా సున్నంపువాన - కురియగా రొప్పుచు కూలబడు వారు
అరఘడియ తడవులే దవసరమెకాని - ఆ విధాన పది మొహాలు చేయుచుందూరు
అరవయ్యెనిమిది కోట్లు నరకమ్ములోను - పాపములచేతనే పడియుండువారు
వ్యభిచారి చెర్లలో విచ్చిన్నవారు - తలలు విరబోసుకుని అధైర్య పడుచు
హోతల్లి హోతండ్రి అని వగచెవారు - చూచితిమి వారేరి చోద్యమ్ములాయె
అత్యంత పుణ్యాన ఆ దురితపాయె - కర్ణముల విని హరిని మోక్షముకు చనిరి
మంత్రియైనట్టి ఈ చిత్రగుప్తు - కలి వాన ఘంటమ్ము అటు పారవేసి
చనుదెంచి చక్కగా కూర్చున్నవాడు - తన రెండు బాహుల్లు తనకెత్తుకూని
హా అన్న వారిచ్చె అడలె నంతకుడు - మహిమీద దశరథుడు మరి పాండురాజు
మరియాదగా ఏలుదురు భూచక్రమంత - సాధించి లోకమును ఏలేరుగాని
తమ పురము ఏమంత పాడగుటలేదు - ఇపుడు రుక్మాంగదుడు అనియేటి రాజు

తన పురమంతాను పాడుజేసినను - రుక్మాంగదుణ్ణి దూషించగారాదు
శ్రీవిష్ణుస్వామికి దాసుండు అతడు - బలవంతు డాతణ్ణి సాధించరాదు
ఉపాయాన అతణ్ణి సాధింత మనిరి - మేదినిపై నున్న మేలిమైనట్లు
ఉభయమ్ములు తెచ్చి అతివ నిర్మింత్రు - ముత్యముల బోలిన్న మెత్తన్ని కాళ్ళు
ముద్దియ వేళ్ళు చూడ కడులెస్స - మోహనమైన మర్రి పళ్ళవంటి
మాచారి పెదిమల్లు మరిచూడ లెస్స - చక్రవాకములకు సాటయ్యినట్టు
చక్కని చిక్కని కుచములు చిగుళ్ళు - భావించి చూడ మరి పలచన్ని నడుము
నాసికము - నాతి వీణాపట్టి రాగమ్ము తియ్య
నారదుడు తలవాల్చె - తుమ్మెదల నాదంపు సుభగ కంఠమ్ము
తన్ను పుట్టిస్తివి త్రైలోక్యనాథ - తన మోహచారానికి ఎవ్వరని పలికె
ఇపుడు రుక్మాంగదుడు అనియేటి రాజు - అతను పెనిమిటిగాను కోరవే దేవి
సన్న రుద్రాక్షలు జపమాల పేరు - చక్కగా అవి ఏవి చప్పుడు కాకుండ
ఏకాంత పదములకు వెళ్ళినాదేవి - అక్కడ ఆ దేవి తపసుకుండె
ఆ రాజు మనసులో విరహాగ్ని పుట్టి - వేటవెళ్ళేద నంచు తలచె నా రాజు
సంధ్యావళి గూడి ఆలోచించదొడగె - ఇదియేమి చోద్యమొ ఉత్తమ పురుష
ఎన్నడు ఈ హస్త రంగమ్ములేదు - క్షత్రియ వంశాన పుట్టితిరిగాని
క్షాత్రధర్మము నీకు ఎన్నడులేవు - అంగమై భోగం ఎన్నడూ లేదు
భోగస్త్రీలతో భోగమెన్నడు లేదు - పణిహార్ల పిలిపించి పనులానతిచ్చి
వీధివీధుల వెంటసాటి పణిహార్లు - ఇదియేమి చోద్యమో పట్టణములోను
ఎన్నడు ఈ అస్త్రరంగమ్ములేదు - క్షత్రియ వంశాన పుట్టితిరిగాని
క్షత్రధర్మపు నీతులెన్నడూలేవు - భోగస్త్రీలతోటి భోగ మెన్నడులేదు
పరసతితోను యేకాంతమేలేదు - అటుగాక ఆ రాజు వర్తనముచేత
కళలేని విధములు అనుభవించితిమి - రుణములు కాకుండ వేటలాడుదము
వేటలాడి మనము మెప్పుగొందాము - వెండిబిళ్ళలవారు వెయ్యి లక్షల వేలు
రాగిబిళ్ళలవారు లక్ష వెయిమంది - ఖమిడి బిళ్ళలవారు పదిలక్షల మంది
కంచుబిళ్ళలవారు కమ్ముకొనిరాగ - ఇరుగడల వత్తురే రాజు సన్నిధికి
ఆశీర్వచనముచేసి అక్షింతలిచ్చి - చిరజీవిగా వేటలాడిరమ్మన్న
తూరుపు ద్వారాన పడిహార్లు కదలి - తూలాడి కంచెల్లి తాంగిలిగొడుగు
పడమటి ద్వారాన పటాలు గదలె - తరుచైన అవిపెక్కు ధారలుమ్రోగ
దక్షిణ ద్వారాన పడిహారి గదలె - ధారలు బూరలు శృంగనాదములు

ఉత్తరపు ద్వారాన మహారాజు గదలె - ఒప్పైన జేగంటలు ఒప్పులే మ్రోగు
అయాయి దిక్కులవారెల్ల గూడి - నానాయదిక్కులా క్రమణకొస్తూరు
ఆరుస్తు గజముల వేసేటివారు - చంపుచూ పొడుచుచూ నవ్వుకొనుచును
ఉద్యానమౌచున్న వనములకు వచ్చె - ఆ మోత విని గౌతమ మహామునులు
మహారాజు వచ్చెనని యెదురుచనుదెంచె - దండనమస్కారాలు ధర్మిండుచేసె
ఆశీర్వచనమిచ్చి అక్షింతలిచ్చి - తమ ఆశ్రమములకు వేంచేయమనగా
వేటపై ఉన్నాము అత్యంతముగను - వేడలాడిన వెనుక వచ్చెదననెను
వరమొక్కటైన కోరుమా అనెను - మాకేమి వరములో మునినాథ చెపుమా
ఘనములా తురగములు కలవు తనకింక - కొమ్ముటేన్గులు కలవు పదికోట్లు
అక్షయ భాండారులవితరుచు కలవు - ఆ నాటి స్త్రీయైన అతివ వక్కటై
ఆ స్త్రీకి పుట్టిన కొమరుడొక్కరుడు - మనసున తలచితే మరివచ్చి నిలచు
సకలభాగ్యములు కలవు తనకింక - సకలమై భోగములు సంపదలెల్ల
తనకెట్లు వచ్చెనో మునినాథచెప్ప - ప్రథమ జన్మామందు ఒక విప్రుడింటా
గోవులకధిపతై యుంటి వనెను - ఆ బ్రాహ్మణోత్తముడు ఏమిచెప్పినాను
అటువలెనె నీవునూ చేయుచుంటివి - రెండో జన్మాన సంపన్నుడై పుట్టి
సత్పాత్రదానాలు చేయుచుంటివి - మూడో జన్మాన రాజువై పుట్టి
సకలలోకమ్ములూ పేలుచునుంటి - అక్కడ వీడుకొని అవనిపతిరాగ
సర్వాంగ సుందరిని మోహినిని గనెను - చూచినదేహము సుడిపడె నంత
అబ్రపడి మూర్ఛగతులైరి అపుడు - మంత్రులు చూచి వారిట్లు పలికిరి
ఎన్నడు ఎరుగని ఈ వేటకొస్తిమి - వడదాకెనో యనుచు
ఉదకములు తేననుచు వెళ్ళిరంతాను - వీణమోపినట్టి మోహినిదేవి
వీణరాగమ్మునా వీణపాడగను - శాంతమ్ము శౌర్యమ్ముకల రాజచంద్రుడు
భక్తిని పరాక్రమం కలరాజచంద్రుడు - బ్రాహ్మణులపట్లనే స్నేహమందూరు
హరి దినము అన్నమ్ము కుడువరట మీరు - అనియిట్లు పలుకుచూ మోహినీదేవి
వక్షస్థలమ్ము నా హస్తమ్ము మోపె - హస్తమ్ము మోపిన అవని పతికపుడు
అవయవములా ప్రాణాలు వచ్చె - మూర్ఛ తెలిసిరాజు మోహినిట్లనెను
మగువరో మము చూచి వెరవవా నీవు - మా పొడగంచు కడుభక్తి పొందుదువా
ఎవ్వరూ తిరుగనీ ఈ అడవిలోను - ఏకాంత మొక్కటై వెట్లుంటివనెను
ఇట్టికానల్లోను ఈ అడవిలోను - కానల్లో చరియింప కనకష్టమగును
ఇట్టి కానల్లోను ఈ అడవిలోను - వత్తురా స్త్రీలెల్ల మెత్తురా జనులు

తమ తండ్రి తెచ్చియో ఇక్కడ నుంచి - మీరువస్తే నన్ను వరియించు మనెను
అట్టై కానిమ్మని రుక్మాంగుడపుడు - గాంధర్వ వివాహ మాడదలచెను
గాంధర్వ వివాహ మాడునపుడు - ఏమి వరమడిగినా తప్పాకు మనెను
ఊళ్ళూను ప్రోళ్ళూను యిచ్చేదననెను - భూషణమ్ములైన చేయింతుననెను
సంధ్యావళి ధర్మాంగదుడు తప్ప - మిగిలినవారంత పరిచారకులనెను
ఇన్ని నీ మహిమల్లు తావల్లెననెను - ఏ వరమడిగినా తప్పాకుమనెను
అట్టై కానిమ్మని రుక్మాంగులపుడు - గాంధర్వవివాహమాడె నా సతిని
అక్కడ వెడలియు అవనిపతిరాగ - మర్రికొమ్మని ఒక్క అశ్వాన్నిగట్టి
వేట మళ్ళింతుమని పలికె మహారాజు - శీఘ్రాన మళ్ళించిరి సేనాధిపతులు
ఆయది దిక్కుల్ల వారెల్లగూడి - నానాది వైపుల్ల గౌళ్ళదిగిరి
వెండివిరాటలు గుళ్ళు ప్రాకారాలు - భమిడికొమ్మల కోటలవెనాన
గళ్ళు దిగిరీ పురముచాయకీవచ్చి - పరమేశ్వరులు తాను తనయుని పిలచె
వినుము ధర్మాంగుడా వివేకపరుడ - మీ తండ్రి మిముబిలచె విజయమ్ముచేయు
వింటూనె చామరాల్ విధేయులుపట్ట - చిత్రాన పన్నిన్న యేనుగునెక్కి
పొగడుచు కాడేలు బోరుకలగగనూ - అతి శీఘ్రముగవచ్చి అందందు దిగెను
శీఘ్రాన తన తండ్రి పాదములకొరగె - పాదాలపై నున్న బాలుణ్ణిదీసి
వినుము ధర్మాంగదుడ వివేకపరుడ - నీ నేర్పుభంగి
నేర్చిజేస్తినో నేర్వకాజేస్తినో - వనములో నొక కన్య వరియించినాను
సర్వశుభలక్షణా సంపూర్ణురాలు - గాంధర్వ వివాహమాడితిని సఖిని
సంధ్యావళి మనసు నొవ్వకుండాను - చక్కచేయుమని తనయునికి చెప్పె
అట్టైకానిమ్మని ధర్మాంగులపుడు - కనక దిండందలముపై దిండువేసి
పొగడుచు కాడేలుబోరు కలగగను - అతిశీఘ్రముగ వచ్చి అందలముదిగెను
అల్లంతట సుతుడురాగాను చూచి - ఎదురులేచి వచ్చె మోహినీదేవి
సింహాసనమ్మునా కూర్చుండబెట్టి - లోహాసనమ్మున కాళ్ళు కడిగించి
పచ్చయ్యపోకలా పండుటాకులను - పచ్చకర్పూరాన తాంబూలమిచ్చీ
పధ్నాలుగు ఏళ్ళ వృద్ధుగాజూచి - సకల గుణములుగల యోగ్యుడవు
సంధ్యావళీదేవి తనయుడవ నీవు - సంధ్యావళీదేవి గర్భవాసమున
నవమాసములు ఉంటి నంతియేకాని - అమ్మకు నీకూను సమానమనెను
'మీ అమ్మచేతనే కుడువవడ్డించు' - అట్టైకానిమ్మని ధర్మాంగుడపుడు
చనుదెంచె సంధ్యావళున్న చోటికిని - ముత్యాలు కట్టిన చవికెలోపలను

కొత్తచక్కాతోను కొలువున్నదేవి - పనియేమి బాలుడా వచ్చితివనెను
అమ్మ నీకొక కథా చెప్పెద వినవె - వ్రత సాంగపురమందు వక విప్రు భార్య
పతి తను వల్లక ఒక వేశ్య తగిలె - తగిలి యా వేశ్యను ఇంటనే యుంచె
పొలతి తా యిద్దరికి బోరూలు వార్చె - చేడియా ఇద్దరికి చేరి వడ్డించె
నెలత తా యిద్దరికి నేతు లొడ్డించె - వనిత తా యిద్దరికి కుడువంగ బెట్టె
చేడె తమ యిద్దరికి చేతుల్లుకడిగె - పణతి తాను ఇద్దరికి తాంబూలమిచ్చె
పణతి తా యిద్దరికి పరుపుల్లు పరచె - పతివ్రత యిద్దరికి పాదాలువత్తె
ఆతనిచేతనే అనుజ్ఞ పొంది - పైచీర పరచుకొని పద్మాయతాక్షి
భూమిమీదనె శయనింపుచూ ఉండె - ఇట్టికష్టముతోనె ఇంతి కొన్నాళ్ళు
పరమ పతివ్రత గడపుచునుండె - వాడాదు అలవాదు వారిజనేత్రి
అంతట ఆ వేశ్య మనిషి మాంసమ్ము - తైలమ్ముతో గూడ పెట్టె విప్రునికి
పెట్టిన అతడు భక్షించగాను - పరమసతి భార్య డాయంగవచ్చి
వల్లకదాన్ని భక్షించమనెను - శరీరానికి హితవు కాదనిబల్కె
బలిమిని మాంసమ్ము భక్షించగాను - భేతాళ మోచున్న వ్యాధితా కలిగె
అంతాటా ఆ వేశ్య అతని యింటకల - అర్థములన్నీను రయముగా గొనుచు
మిగిలిన శేషమ్ము సొమ్ముదోచుకుని - వేశ్య తన పుట్టిన్న ఇంటికిపోయె
వేశ్య తన్ను విడచి పోగాను చూచి - పరమసతి తనపతి డాయంగవచ్చె
ఉవిద నాదుచెట్ట పట్టింది మొదలు - మీఊరు ఎన్నడూ ఎరగవైతివి
ఈ దురితమున నేను బ్రతికితీనైన - ఇందుముఖి నీ ఋణము తీర్తునుగాని
బ్రతికించి ప్రసాదము పెట్టుమా అనెను - ఏని విన పర్ణ దేహినివలెను
ఏల తన్నూ యింత ప్రార్థించి అడుగా - సతికి తన పురుషుండు దేవుండుకాదా
అదలించి పనులు చేయించుకొంద్రు - అంత తన పుట్టిన్న యింటికిపోయి
అర్థమ్ము కొంతైన అడిగైన తెత్తు - ఎందు నెండపడి పట్టి గడుపుచునుండె
వెజ్జు వేల్పు తాను ఓముచునుండె - అంతనాడు కార్తీక డాయంగవచ్చె
మేక మాంసములు మహిష మాంసములు - చాల మాంసము మీకు సమర్పింతు కాని
తానైన అంటను తాంబూలం శాయను - ధవళ ధవళమ్ములు ముట్టను సుమ్మి
అతిఘోరమైనట్టి ముళ్లులలోను - నిద్రచేయుదు భర్త కారోగ్యమైతె
పురుషుడు ఆవిడ హస్తమ్ములోను - పురుషుని ప్రాణాలు పోయెనుమి అమ్మ
పురుషుడి ప్రాణాలు పోగాను చూచి - పున్నపూ చంద్రుడు పోలునా ముఖము
ముద్దీయ తన వేలు మోచుట్టు తీసి - అంగటిలోనికి పోయి వ్యవహారము చేసి
అతివ తన పురుషుణ్ని అందొక్కనాడు - కాంత తన పురుషుణ్ని గంగ ఒడ్డున

పురుషుణ్ని అందొక్క స్నానముచేసె - పురుషుణ్ని తాన
అతడి భుజములు తనా భుజములును - సందేహాము లేకుండ సంధించుమనెను
అగ్నిహోత్రుడ మమ్ము ఆహుతిగొను మనెను - ఆపరమ పతివ్రతా చెనువులకు వెర
పావకుడు తా మండి భస్మమ్ము ఆయె - నల్లకలువలు పూసె ఆ కొలనులోను
ముద్దియ పురుషుల్లు ముందార నిలచి - సతులూను ఎవరైన పతుల నాడినను
పతివ్రతా ధర్మంబు తప్పుసుమి అమ్మ - ఇంత చెప్పగనేల ఎంతైన తెలుసు
వనములోపల స్త్రీలతే బోలు రాజు - వచ్చేను పదవయ్య వసంతుపురికి
కనక దిండందలంపై దిండువేసి - పొగుడుచు కాడేలు బోరుకలగగను
అతిశీఘ్రముగవచ్చి అందలందిగెను - అల్లంతట తన సతీరాగాను జూచి
అట్టై కానల్లోను అడవుల్లలోను - గాంధర్వ వివాహమాడితిని సఖిని
గాంధర్వ వివాహమాడెటప్పుడు - ఏమి అడిగిన తన్ను తప్పాకుమనెను
సంధ్యావళిని ధర్మాంగదుని తప్పా - తక్కినవారు నీ పరిచారులంటి
కనకదిండందలంపై దిండువేసి - పొగుడుచు కాడేలు భోరుకలగగను
అతిశీఘ్రముగవచ్చి అందలందిగెను - అల్లంతట తన సవతిరాగాను చూచి
ఎదురువెళ్ళి మ్రొక్కె మోహినీదేవి - పాదాలపైనున్న చెల్లెల్ని తీసి
ఆలింగనముచేసె నంభోజగంధీ - అక్కాను చెల్లెలూ ఒక్కటైరపుడు
అంతఃపురములకు అరిగిరి వారు - అక్కాను చెల్లెల్ని ఒక్కటిచేస్తి
పురములోనికి రమ్మి పరమేశ్వరుడా - నల్లన్ని ఆవుల తెల్లన్ని పాలు
వార్చిన వనిగిరి చాట్టు కూరల్లు - వండిపట్టుచేసి భమిడిపళ్ళేల
పసిడి కుడకలు తెచ్చివుంచేటివారు - శ్రీగంధవృక్షములు చింతవృక్షములు
దానిమ్మ వృక్షములు దబ్బవృక్షములు - పులిచాంచ నమ్మలే గుగ్గిలపుచెట్లు
మంచి గంధపుతరువులు పందిళ్ళువేసి - వెండయ్యగాబుల వేణ్ణీళ్లతోడి
భమిడయ్యగాబుల చన్నీళ్ళతోడి - చన్నీళ్ల వేణ్ణీళ్ల సమముగాతొలిపి
ముత్యాల ముంతలతో ముగుదలందియ్య - పగడాల ముంతలతో పణతులందియ్య
మజ్జనంబాడిరీ సర్వేశ్వరూలు - మోహినీదేవికీ రుక్మాంగదుడికి
సంధ్యావళీదేవి కలసి వడ్డించె - మోహినీదేవికీ రుక్మాంగదుడికి
సంధ్యావళీదేవి నేతు లొడ్డించె - మోహినీదేవికీ రుక్మాంగదుడికి
సంధ్యావళీదేవి పెరుగు లొడ్డించె - మోహినీదేవికీ రుక్మాంగదుడికి
సంధ్యావళీదేవి నీళ్ళు చేతులాపోసె - మోహినీదేవికీ రుక్మాందుడికి
సంధ్యావళీదేవి తాంబూలమిచ్చె - మోహినీదేవికీ రుక్మాంగదుడికి
సంధ్యావళీదేవి పరుపొప్పపఱచె - మోహినీదేవికీ రుక్మాంగదుడికి

సంధ్యావళీదేవి పాదాలువత్తె - మోహినీదేవియు రుక్మాంగదుడు
సకల వైభోగముల వుండిరంతటను - అతనిచేతనే అనుజ్ఞపుచ్చుకుని
చనుదెంచి సంధ్యావళున్న చోటునకు - దశమి నేడు అనుచు తల్లడపడుచు
కాంతలు కసవులు వూడ్చేటివారు - కస్తూరి కల్లాపి చల్లేటివారు
మాణిక్యాల దివ్వెలెత్తేటివారు - కరతోరణాలు కట్టేటి వారు
పురుషులు పురుషోత్తముల బోలియుంద్రు - కాంతలు శ్రీలక్ష్ముల బోలియుందురూ
అదియేమి అనిరాజు అదరిపడిలేచి - సింహాసనమ్మున కేతెంచెనపుడు
మగువరో మన నగరవాడల్లవారు - వరుసతో పుష్పాలు కోసి తెస్తూరె
మిగిలిన శేషమ్ము పుష్పజాతులను - సర్వేశ్వరులాకు సమర్పణచేతు
అదియేమి అని మోహిని అదరిపడిలేచి - సింహాసనమ్మున కేతెంచెనపుడు
తప్పితి యీధరరాజుల్లలోను - తనకు ఇచ్చిన వరము తప్పితిరనెను
అరుదుగ మనము కారడవిలోపలను - గాంధర్వ వివాహమాడితివి నన్ను
గాంధర్వ వివాహమాడు నప్పాడూ - సంధ్యావళిని ధర్మాంగదుని తప్పా
తక్కినవారు నీ పరిచారులంటి - వూళ్లుప్రోళ్ళు ఇచ్చేదనంటి
మేడల్లు మిద్దెలు ఇచ్చేదనంటి - భూషణాలేమైన పెట్టేదనంటి
మిక్కిలి సిరులను ఇచ్చేదనంటి - సకలరాజ్యభోగ సంపదలనెల్లా
సకలవైభోగములు ఇచ్చెదనంటి - సకలవైభోగములు తావల్లనంటి
ఇన్ని నీ మహిమల్లు తావల్లనంటి - ఏ వరమడిగినా తప్పాకుమంటి
అట్లె కానిమ్మని సర్వేశులపుడు - గాంధర్వ వివాహమాడెను నన్ను
ఏకాదశి ఉపవాసముండ వద్దనెను - ద్వాదశి సమారాధన చెయ్యవద్దనెను
హారిదినము అన్నమ్ము కుడువమని పలికె - ఇన్ని నీ మహిమలు తావల్లననెను
శ్రీరామరామ యనె సకలేశ్వరుడూ - సకల లక్షణాల సంపూర్ణురాలు
సంధ్యావళిని వేగతోడి తెమ్మనెను - పనులేమివచ్చెనో మహిపతికంచు
శీఘ్రానవచ్చె సంధ్యావళీదేవి - గాంధర్వ వివాహమాడితిని సతిని
గాంధర్వవివాహ మాడెటప్పాడు - యేమి అడిగిన తన్ను తప్పాకుమనెను
దశమి ఒక్కాప్రొద్దు ఉండవద్దంట - ఏకాశి ఉపవాసముండవద్దంట
ద్వాదశి సమారాధన చెయ్యవద్దంట - శ్రీరామరామని సృష్టీశుదేవి
పతులూను సతులను నొవ్వనాడినను - పతివ్రతా ధర్మమ్ము తప్పుసుమి అమ్మ
పతులూను సతులను నొవ్వనాడినను - పతివ్రతా ధర్మము తప్పుదుసుమి అమ్మ
పరమ పతివ్రతవౌదూవు నీవు - పతివ్రతవు గనుక పతివ్రతం కొరకు
అటులైతె నీ కొడుకు వధియింతువమ్మా - అయితేను నా కొడుకు వధియింతుగాని

హరి దినము అన్నమ్ము కుడువనని పలికె - ద్వాదశి సమారాధన మాననని పలికె
యేకాదశి వుపవాసముందునని పలికె - అంతలో ధర్మాంగు డక్కడికి వచ్చి
జాతస్యహి మరణంబు ధ్రువమంద్రు జనులూ - మరణానికే గదా మర్త్యాన పుట్టుక
పుట్టినపుడె స్థిరము కిట్టుటకాదా - కిట్టినప్పుడె వెంట పుట్టుకేగాదా
గోవింద గోవింద గోవింద అనుచూ - గోదావరని యేటినది దీరమునకూ
చింతించకే రాజు శీఘ్రానవచ్చె - "హల్వునెత్తి ఒక వేటు వెయ్యవో" యన్నా
ధర్మాంగ దేవరకు సాక్షైనవారు - సభవారు చూచి తమరిట్లనిరపుడు
ఈలపెట్టి పామునీ తెచ్చుకున్నట్లూ - యిట్టి యీ యమురాల్ని ఎట్లు తెచ్చితిరో
చెట్టెక్కి మృత్యువా తెచ్చుకున్నట్లు - క్రూరకర్మురాల్ని ఎట్లుకూడితిరో
బాలుండు కూర్చుండె బొమ్మవలె అదిగో - సకల గుణములు కల సర్వజ్ఞురాలు
గర్భవాసంబునా పుట్టి నా కొడుకు - పట్టి చంపినవాడు సృష్టిలోలేడు
గోవింద గోవింద గోవింద యనుచు - గోదావరినియేటి నదితీరమునకు
చింతించకారాజు శీఘ్రముగవచ్చే - హల్వునెత్తి వకవేటు వేసె కొడుకును
వనమున్న శ్రీ పుష్ప మాలికయాయె - రెండోమాటు హల్వు వేసినను
వనమున్న శ్రీ తులసి మాలిక ఆయె - మూడోమాటు హల్వు యెత్తినను
అర్బుదా న్యర్బుదాలై వచ్చెపెక్కు - పసిడి వాహనాలు పరదేశులుపట్ట
బ్రహ్మదేవుడు వచ్చి ప్రత్యక్షమయ్యె - నీలాల గొడుగులు నిలచి పట్టగను
నీలకంఠుడు వచ్చి ప్రత్యక్షమాయె - వజ్రాల గొడుగులు వరుసతోపట్ట
శ్రీ కృష్ణ రాయలూ ప్రత్యక్షమైరి - వశిష్టమహాముని ప్రత్యక్షమాయె
తల్లిన్ని తండ్రిన్ని తానును ప్రజలు - పసిడి వాహనాలు ఎక్కిపోగాను
పట్నమంతా కూడి తర్లిపోగాను - అక్కడ మోహిని శిల అయినిలిచె
ధర్మంబు తప్పనీ ధర్మాంగదుణ్ణి - తన బ్రతుకు ఏమని అడిగెనప్పుడు
కొలవగా ధాన్యంబు ఎండబోసినను - అందులో కొంత ఫలముచ్చు కొమ్మనెను
అన్నము వార్చి యీాకడిచుట్టకున్న - అందులో కొంత ఫలముచ్చు కొమ్మనెను
శ్రీ లక్ష్మి దేవమ్మ పండుగనాడు - చుట్టువార దేవతల శుభముతోగొల్చి
మోహినికి వకపూవు పెట్టకుంటేను - అందులో కొంతఫలం పుచ్చుకొమ్మనెను
మోహినికి వకవత్తి వెలిగించకుంటే - అందులో కొంతఫలం పుచ్చుకొమ్మనెను
ధర్మంబు తప్పని ధర్మాంగదుణ్ణి - వ్రతస్థుడైనట్టి రుక్మాంగదుణ్ణి
పాతివ్రత్యం నడిపేటి సంధ్యావళిని - వీరిముగ్గురి నెవరుపాడినా విన్నా
వారికిచ్చినటు వైకుంఠమిచ్చు.

# తిరుమంత్రము

హరిహరి రామానుజా మీ మతమందు నమ్మియున్న దాసుని
హరిహరి భూములందూ యీ వనమందు తిరుమంత్రము కొరకై
భూములన్నియు తిరిగితి మంత్రము కొరకు బుద్ధితో మిముగూడితి
యిమ్మగ మీవెంటను అలసటలేక వెతకి వెతకి తిరిగితీ
గోవతు స్థళమందునా ఆచార్యులు దాహము తెమ్మనెనూ
అటుయిటు వెదకిచూచి జలమందక యిదియేమి చోద్యమనుచూ
ఆకాశమందు జూచి అయిదు పతు లంబ్రబవీధిని వెళ్ళగా
యెగసిపోయేటి పతులా మీరెళ్ళేటి జలమున్న స్థళమేదయ్యా
వినవయ్యా హరిదాసుడా మే మెళ్ళేటి నీడదప్పక రావయ్యా
పయిన పతులు వెళ్ళగా నీడను నిలిచి కొలన్మత్రావుకు వచ్చెనూ
కమండలాముతోనూ తీర్థము తాను గ్రక్కున చాతబూనెన్
తన గురువు యేమాయెనో అనుచు తాను పరుగుపరుగున వచ్చెనూ
అంత ఆచార్యులూ పరమపదము వేంచేసె కాలమందూ
ఇంతకాల మందునా యీ బిడ్డకు అంటదాయెను మంత్రమూ
తన మనసు జాలినొందీ మేదిని పయిని హస్తముంచి తుడిచి
మనమయిన తిరుమంత్రము ఆచార్యులు వినయంబుగా వ్రాసిరీ
దేహమక్కడ విడిచి ఆచార్యులు జేరిరి పరమపదము
ఈటిసాని వక్కతె తిరుమంత్రము వినయంబుగా చదివెను
ఆకున వ్రాసుకుని హస్తముంచి ఆ వారు తుడచివెళ్ళె
జలముదెచ్చిన దాసుడూ ఆచార్యుల స్థళముదగ్గర కొచ్చెనూ
జలమారగించరయ్యా ఆ మీదట మమ్ము రతించరయ్యా
నిద్రలేని ఘనులూ యీ స్థలమందు నిద్రింపతగదు లెండీ
చెంతస్థళ మందున్నట్టి చెరుపుదు జూచి గుండె లెగసిగొట్టెనూ
గురువు నెరుగనయితిని యీ వనమందు గుట్టు తెలియకపోతిని
జలధిగట్టుకు పంపె నా గురువునన్నడవి పాలు జేసెనా
గురువేమొ జేసెగదా యీ వనమందు గుట్టుతెలియక పోతిని
గురువుపై చేయివేసి తనగురుని వూపి వూపి లేపెనూ

తనమనము దృష్టిచేతా తన గురువునకు తగినక్రియలెల్ల జేసి
అంతట పరమాత్ముడు ఆ త్రోవను పసులుగాచు చుండగా
పసులగాచేటి బాలుడా యీత్రోవను పద్మాలెందరు వెళ్ళిరీ
వినవయ్యా హరిదాసుడా యీత్రోవను యీటిసాని వెళ్ళెను
యీటిసానెకు అబ్బెనా తిరుమంత్రము వీరంతా విరజల్లెను
ఆటసానెకు అబ్బెనా యీ మంత్ర మందరికి యెరుకాయెనా
అందరిని వెతుకుకుంటూవెళ్ళిరి వారు హస్తినా పురమందునా
పల్లె గుడిశెలయందునా చోళపుర రాజు పట్నమందున జొచ్చిరీ
అమ్మమ్మ మమ్మేలుమీ చెప్పిన పనులు ఆజ్ఞతో చేయించుమీ
మీరుజేసేటి పనులూ మాకేలయ్యా మావద్ద వుండుమానెన్
ధర్మరాజు సేయుడి యజ్ఞము జూచి హరిదాసు వెళ్ళగానూ
యెవరయ్యా హరిదాసుడూ తెలియక మీరు యిబ్బంది పడుటనుండి
సమయాన ద్వందార్ధము తిరుమంత్రము సమకూడదాయె మాకు
తళియాకు పుచ్చుకుని పాఠనజేసి తలచేను ఆచార్యులా
నాగవాసము లేని ఘంటలు ఘళ్ళుఘళ్ళున మ్రోయగనూ
సభవారు అంతవచ్చి తెరచాటు సభదీర్చి కూర్చుండిరీ
యవరయ్యా హరిదాసుడూ ఇచ్చటికి మీరెందుకు వేంచేస్తిరీ
సమయాన ద్వందార్ధము తిరుమంత్రము సమకూడదాయె మాకు
యీటిసానివద్దను తిరుమంత్రము యిప్పిస్తె పదిలతులూ
ఆమాటలూ వింటునే ధర్మరాజు ఆశ్చర్యముల బొందెనూ
వేయి బ్రాహ్మల కెల్లను సమకూడ వక వైష్ణవుండెక్కువా
ఈటివాళ్ళను పిలువుడీ యిచ్చటికి మన మాటలాడించుదామూ
యీటిసాని వచ్చెనూ దండము బెట్టి నాట్యమాటల జూపెనూ
మాటల జూచి మెచ్చి మేలిమి మిద్దె లానతివ్వగానూ
మిద్దల స్తలము క్రింద కర్ణము లాకు ధరణిపై బడవేసెనూ
ఆయాకు తీసుకుని ధర్మరాజు హరిదాసు కివ్వగానూ
ఆకు పాఠన జేసెనూ హరిపురమందు దాసుడై నిలచుండెనూ
హరిదాసు కథలన్నియు విన్నా కన్నా వ్రాసినా చదివినాను
ఫలమైన తిరుమంత్రము దొరకును వినయంబుగా నమ్ముడి.

# తులసి - చాతుర్మాసాలు

లోకాలకు దిక్కైన వానినే తలతు - మనసులో గణపతి ఆత్మలో తలతూ
దొరకునే తులసివల్లభుల చరిత - వీనులకు విందుగా వివరించు మదిని
ప్రథమ యేకాశనగ పాపమోచనము - విప్రులకొట్టి కోశేకాదశనగా
చైత్రమాస మని యేటి చాతుర్మాసాలు - జనులకు ఒక నిష్ట చేయింతమనిరీ
వడివడివైకుంఠ పురజనులు అంతా - అందొప్ప చాటించె లంబోదరుడూ
వల్లభుని తన ప్రాణవల్లభుని గనెను - అమరాద్రి కడకు మీరరగదలచీరి
మముపెట్టి పంపవే మత్తేభగమనా - దొరకును క్షీరాబ్ధి నువు పుట్టినిల్లు
అనగ తన విభునితో అనుతిరు - అంబుజోదర మీరు అరుగదలచితిరా
ఇనుగ నాలుగు నెలలు యెట్లు వోపెదరో - మిముబాసి ఒకగడియ నిలువంగలేను
వైకుంఠపురవాస వర్తింపలేను - నన్ను తోడుకుపొండి నా ప్రాణనాథా
నీలకంఠుని కన్న నిరుపెంపు బుద్ధి - నీకేలలేదయ్యా నీలవర్ణూడా
భార్యలిద్దారయిన ఫాలలోచనుడూ - వురమునా శిరమునా వుంచుకోలేదా
నళినలోచన మీరు నన్ను దిగవిడచీ - పుండరీకాక్ష మీకు పోతెరవులేదా
ధవళాక్షి యీ మాటలాడవెన్నడు - ధవళాక్షి నీ మదిని తలచవెన్నడు
అని తలపోయుచూ అర్జునలచేత - మాటపడలేకనే మాయపన్నితినీ
ఇడుముడి చనువు నీకిచ్చితినిగాని - శిరసున ధరియిస్తి (శ్రీ) తులసినిన్ను
నా మాట నీవింత నమ్మకుంశేను - నారదుని అడుగవే నలినాయతాక్షి
అనగ విని నారదుడు ఆశ్చర్యపడుచు - జలజాక్షి నీ మహిమ చెప్పవచ్చితినీ
సురులుమునులూ గూడి చూచి వేడుకలా - ధనమందు రాతందు కవ్వమునందు
తరచగా పుట్టిన ధవళాక్షివమ్మా - జలజాక్షి చెన్నునితో స్నేహమొనరించి
జలధిపావనమైన (శ్రీ) తులసివమ్మ - పావనము నేడు నా భాగ్యవశమునను
జలజాక్షి నిన్నిట్లుసేవిస్తి గనుక - ధవళాక్షి నిన్నెట్లు ధరియిస్తి గనుక
యెక్కనడయిన (శ్రీ) తులసమ్మయున్న - అక్కడ అచ్యుతుడు లోలుడై యుండు
యెవ్వరి గృహమందు తులసమ్మ ఉన్నా - అక్కడ యమభటులు జడసిపోదూరు

దేవినూట యెనిమిది తిరుపతులలోను - తిరుపతనగా మధుర తిరుపతగుపడెను
సేవింతురని నిన్ను చూసి మొక్కినను - సుందరి నీవున్న చోటు హరిపురము
అలివేణి నీ చోటు అలకన్న వారు - అచ్యుతుల కరుణకే అర్హులేవారు
ఇంతి నీకుముగ్గు పెట్టన్ని వారు - పద్మనాభుని కృపకి పాత్రుల్లుగారు
అలివేణి నీ చుట్టు అలికిరెవరైన - వారికీవచ్చునూ వైకుంఠపదవీ
ఇంతి నీకు ముగ్గుపెట్టి రెవరైనా - ఇంతులకు వైధవ్య మెప్పటికిలేదు
పని ఒప్పగా పంచవన్నె పెట్టినను - వారి పుణ్యము ఎంచ వశముగాదనెను
దండనమస్కారమ్ము యెవరుచేసినను - మండలము యేలుదురు మత్తేభగమనా
జన్మపావనమైన జన్మాణ్ణి గూర్చి - సేవచేసిన సురులు సకలసౌఖ్యములూ
ఇహములో జగములో సకల సౌఖ్యములు - యీ యిల్లు వర్ధిల్లు యెల్లకాలానా
నలినాక్షి ఇహవినవే ఈ నాలుగు నెలలూ - సతిపతులూ వొకచోట వుండకుంటేను
వారు వైకుంఠ పురములోపలనూ - పసిడి వేదికలపైన పవళించి ఉంద్రూ
వలవరిచిట్టె కన్య వలరాచకన్య - కలికి వరములకొమ్మ కనకంపు బొమ్మ
అలికులవేణియో అంబుజలక్ష్మి - మక్కువ నీ విభుని ఎక్కువ శిరసు
ఎక్కి కూర్చున్న మోహన దేవతవు - కృష్ణతులసి వీవు కృష్ణుడ వీవు
యెండినా వాడినా యేచిపూచిననూ - నిండినభక్తితో నినుగొలవ వలెనూ
అని నారదుడు పల్కి ఆ వాక్యములను - విని తులసి సంతోషవార్నిధినిదేలే
మునినాథ మీ వాక్యములు చాలవింటి - అంపెదము శ్రీ హరిని అమరాద్రికడకు
అమరాద్రీ కడకు మీరరుగదలచితిరీ - బుద్ధులు మాకేల పుండరీకాక్ష
పొలతి చక్కని స్త్రీలు పోలికలు చూసి - కాముడు బాణములు కలుగునా మాకు
ఇంతీ నా మనసు నీ వెరిగి ఇటువలెను - అతివ నన్నెత్తి పొడుచుటలూ యేలే
జలజాక్షి నినుగన్న తండ్రి వుండగను - ఇంతి పరస్త్రీలతో యెట్లు కూడుందు
అవునయ్య యెంత మాటాడితిరిగాని - జలజాక్షి స్త్రీరూపం కానేరడతడు.

# సూర్యుని గుణ్ణాలు

జగతిలో వొప్పేటి సముద్రమునడుమా - వుదయః పర్వతమనగ వొప్పేటికొలను
కొలనుట్టినప్పుడే వెలసె తామరలు - పూసెను బూరుగలు గేదంగి రేకులు
విడువకుండను యెపుడు మొసళ్లు దిరుగు - కుంకుమలు గుండిగలు కుమ్మరి రేళ్ళు
రఘురామ మీరొచ్చి ఈ కొలను ఆడ - ముత్యంబులా బోలు యీ బావి నీళ్ళు
వజ్రంపుకొలనుదీ వట్రువా యిసుక - యీ కొలను వొండ్రయిన గంధంబు బోలు
యీ కొలను వుదకంబు చందనం బోలు - యీ కొలనులో యిసుక అది కనకపొడి
పున్నమచంద్రుడు పూర్ణంబుగాను - దశదిక్కులాదీప్తి దాపునను వెలుగ
ఆదిత్య ప్రభబోలు ఆ పువ్వు వెలుగు - ఈ చేతకమంబు యిరవొప్పబట్టి
యీశ్వర్లచూతాము అంబాళనాథ - కనరాదు దుర్గాలు చొరరాదు అడివి
తూర్పునా వుదయించె బాల భాస్కరులు - ప్రొద్దుప్రొద్దున ఛాయ ప్రొద్దున్న ఛాయ
ప్రొద్దున బొడిచితె అద్దమ్ముచాయ - పొడుస్తున్న భానుడు పొన్నపువుచాయ
ఝామునకు దేవరాజవ్వాది చాయ - జామయిన అటుమీద జాజిపూచాయ
యామద్వయంబున స్ఫటికమ్ముచాయ - మూడవ జామున బంగారుచాయ
గ్రుంకుచూ భానుడూ కుంకమ్ముచాయ - గ్రుంకిన అటుమీద కుసుమంపుచాయ
బింబంబు నెన్నగా సువర్ణఛాయ - పోక పండెర్రన్న ప్రొద్దుయెర్రన్న
అప్పుడు బూసిన మామిడెర్రన్న - హస్తికంత మెర్రన కపిలగురుఛాయ లెర్రన
తూర్పున బొడవంగ చూచినదాన - సూర్య్య పద్మపునోము నోచినాదాన
బాలభాస్కర నీవు వుదయాన బొడువా - పంచవన్నెల ముగ్గు పెట్టినాదాన
జగమెల్ల మీ కీర్తి ప్రఖ్యాతిగాగ - అప్సర్సలాడగా గంధర్వులు బాడ
చామరం వీవగా త్రిభువనంబులకూ - జగతిలో జనులను బ్రోచేటి తండ్రి
ఆత్మబంధువుడవై ఆదరించూమీ - ద్వాదశాదిత్యమూర్తి నీవేను
ఆదిత్యదేవరా నిన్నెపుడుదలచు - కుంకుమంబూబోలు పంకజముచాయ
కుసుమంబు లెన్నంగ ముత్యంబుచాయ - పోకజాజీచాయ పూత కెంజాయ
వెలయనీలముచాయ చందనముచాయ - వజ్రపంజరచాయ వరహాలచాయ
స్వామీ మీ ప్రథమ గుర్రం కుంకుమతో - సమానమగు యర్ర వర్ణమయా

వెండి పర్వతఛాయ ముత్యమ్ముచాయ - పలుగురాతీఛాయ శంఖమ్ముచాయ
మల్లెపువ్వులఛాయ స్ఫటికంపుచాయ - స్వామీ మీ రెండవగుర్రం వెండివర్ణమయా
అంబాళనాధ జయతు

నీలిపర్వతఛాయ నీలాంజనచాయ - కాలరుద్రునిచాయ కపోతచాయ
కారుమొయిళ్ళచాయ కాటికాచాయ - స్వామీ మీ మూడవగుర్రం నీలివర్ణమయా
నీలాంజననాధ జయతు

పసిడిపూత కెంపుచాయ - యర్ర నీ గోవులచాయ
రంజిల్లూ దివ్వెలచాయ - యెడప్రొద్దూ యర్రలచాయ
చాయ పసుపూ బూసినచాయ - స్వామీ మీ నాలుగోగుర్రం నానావర్ణమయా
లలనాధా గుణాజయతు

పచ్చజాజులచాయ యెర్రని కంకులచాయ
పారేటి చిలుకలచాయ - పశిరిక పాములచాయ
యెగిరిన గరుడునిచాయ సవిత్రా మీ అయిదవగుర్రం పశిరికవర్ణమయా
జగన్నాధా గుణాజయతు

తొడలన్నీ గువ్వలచాయ - నడుమెన్న నెమళ్ళచాయ
మెడయెన్న కోవెలచాయ - స్వామీ మీ ఆరవగుర్రం అతినల్లనయా
శ్రీలక్ష్మినాధా జయతు

ముఖము జూచితే తుమ్మెదవర్ణం - వీపుజూచితె నీలపువర్ణం
రవి మీ రూపు రమ్యమైవుండు - స్వామీ మీ యేడవగుర్రం కృష్ణవర్ణమయా
శ్రీకృష్ణనాధా జయతు

హెచ్చుమేసి మీ గుర్రములు - పాపాత్ముల బరిమార్చి
దాసులను రక్షించెను పుట్టితిరి - హిమవత్పర్వతమందున
రక్షించితిరి త్రిభువనంబులు - విడిచిపొడి స్తే కరుళ్ళెర్రన
ఛత్రమెర్రన చామరమెర్రన - వజ్రకవచంబు దొడిగి

## శ్రీ పౌరాణికపు పాటలు

మేరుపర్వతం తిరిగివస్తిరయా - అఖిలాండకోటి బ్రహ్మాండనాయనా
కుంట్లు కురూపులు కుష్టులు - దీనులు అందులు మిమ్మజూడక కుడిచినారు
కోటానుకోట్లు కలరయా - మూరెడు మాను తెచ్చి మూలస్థాపనచేసి
కుంతీదేవికి దుర్వాసముని వరమిచ్చినట్లు
నిన్ను పూజించుటకు మాకు వరమిచ్చి రక్షించు
నిప్పుకు చదలంటునా - నీళ్ళపయి యీగ ముసురునా
దేవా మిమ్మగొల్చిన జనులకు - యీతిబాధలు లేవయా స్వామీ.

# వశిష్ఠ వాక్యములు

ఒకనాడు రాముడు వసిష్ఠునీ బిలచి ఒక ప్రశ్న యడిగినే ఓరామా

తన్నుతా దెలిసితె అన్యవృత్తేమిటికి అదినాకు తెలుసునూ ఓరామ

స్పటికంపు రాయి సాగరములో బడి తా వుదకమాయెనే ఓరామ

అటువలెనె తన మనసు శివుని ధ్యాన్నముచేసి శివుడందు కలిసినే ఓరామ

కీటకమ్మూ యిపుడు భ్రమర ధ్యానముచేసి భ్రమరంబు తానాయె ఓరామ

అటువలెనె తన మనసు శివుని ధ్యానముచేసి శివుడు తానాయె ఓరామ

శ్రీగంధములయందు వున్న వృక్షములన్ని శ్రీగంధమాయెనె ఓరామ

అటువలెనే సత్సంగ మబ్బినవారికి కలదు బ్రహ్మానంద మోరామ

కర్పూరానందు దీపంబు వుంచితే ఏమిని కలవకపోయె ఓరామ

అటువలె కొన్నాళ్ళు హరబుద్ది వుంటె అది చనిపొయ్యేనే ఓరామ

సూర్యుండనేవాడు తపము చూతామంటె కానరాడాయెనే ఓరామ

తా బ్రహ్మమైయుండి సృష్టి చూతామంటె చిద్రూపమాయెనె ఓరామ

మక్కువతో పెంచినా నవక్లేశములు విడచి వెతలుగానక జూడు ఓరామ

విరక్తుడై విషయాల విడచిపెట్టినవాడు అనత్యుడుకాబోడు ఓరామ

వెర్రివాడ నీకు చెడవృత్తులూ సత్యమని జ్ఞానికంతా బ్రహ్మమే ఓరామ

పాముకూసము విడచి పశ్చాత్తాపాన పట్టుకొని వెతకునా ఓరామ

విస్తట్లో భోంచేసి విసిరిపారావేసి మళ్ళి అది ముట్టునా ఓరామ

వర్ణాశ్రమాచార మతాభిమానములు వర్తించడే యోగి ఓరామ

అగ్నిహోత్రు డెన్నడూ సీత మెరుగానట్టె యోగి యేమెరుగడే ఓరామ

దాన మెరుగాకుంటె ధర్మమెటువలె నడుచు అటువలెనె అవన్నీ ఓరామ

స్వప్నమందు యెప్పుడు కర్మ మెరుగనివాడు కర్మేంద్రియనుజులు ఓరామ

దండాము త్రిప్పంగ కుండ కదలాకెపుడు చక్రాము దిరుగునా ఓరామ

ప్రారబ్ధకర్మమూ విడచినా యోగికి ప్రారబ్ధమున్నదా ఓరామ

ధరధనస్సంబు పట్టువిడిచిన తుణమైననిలుచునా ఓరామ

నీవు చూడానట్టె నిప్పునీ చెదబట్టి నీలంతుప్పట్టునా ఓరామ
మెరుగుడు పువ్వు కాంతి రాత్రినందూ గాని దినమందు మెరుసునా ఓరామ
ధన వృక్షములగాలి శాక తగిలీనట్టె అయోగి నడచునా ఓరామ
చెలనంబులేని రాజయోగిని జూచి చెలించెనందురా ఓరామ
గగన తత్వంబులా గగనాగగనములు గరిపించ వచ్చునా ఓరామ
అటువలెనె యోగికీ జననమరణాదులూ యెన్న యెన్నడులేవు ఓరామ
సూర్యుడెన్నాడయిన శశియింట లేకున్న ఎవ్వరెరుగుదురయ్యా ఓరామ
సముద్రు డెన్నాడయిన తరంగ బుద్బుదములు వినయములు కోరునా ఓరామ
క్రీడ యెన్నాడయిన కృష్ణచేతా తాను కష్టురాలాయెనా ఓరామ
పూర్ణ బోధాచేత బ్రహ్మ మెరిగినవాడు పుణ్యాపాపము లెరుగడు ఓరామ
పద్మాసనస్థుడై భూమి నేలినవాడు భిక్షమెత్తకపోడు ఓరామ
దేశికేంద్రునిచేత దేహాత్మ విదురుడై దేహంబు కోరడూ ఓరామ
సువర్ణపుష్పక మెక్కినవాడు శునక మెక్కకబోడు ఓరామ
అటువలెనె ఆత్మస్తుతిని బొందినవాడు విషయములను గోరడూ ఓరామ
కల్పాన దైవాన దైవమన్నా వాడు కడు బుద్ధిమంతుడూ ఓరామ
దేముడూ అని యొక్క దశపూజించి యెట్లు వర్తింతురూ ఓరామ
గారిడీలుగట్టి పట్టు సర్పముచేసి తా భయాపడనట్టె ఓరామ
సంకల్పములచేత నయిన దేవుని జూచి యోగి పూజించడూ ఓరామ
గార్ధభా మెందయిన గంగిగోవవునా దృశ్య దులికొక్కన ఓరామ
దివము యెన్నాడయిన దీప్తికావలెనని దీపంబుగోరునా ఓరామ
పాషాణమెప్పుడూ ప్రేమ నెందయినాను పావనమయ్యాన ఓరామ
ఆత్మలింగముతోను అయిన మీదటను కర్మమే లేదాయె ఓరామ
జుట్టు జందెముతీసి చుట్టాల తలబోసి అదియెట్టి సన్యాసమో ఓరామ
మనస్సంకల్పములు మరి తల్పురాకున్న అది నిత్య సన్యాసమో ఓరామ
కంటియందున దృష్టి నాటకతావుంటె యెట్లుముక్తూడౌ ఓరామ
వంటిగా తానుండి జంట మిమ్మంటితే అది నిత్యముతుడౌను ఓరామ
బ్రహ్మచారులము మేము భామలానంటమని బహుగర్వపడుదురూ ఓరామ
ఆత్మకంటే వస్యమే మెరుగకుంటే నదియె బ్రహ్మచర్యమే ఓరామ
విశ్వేశ్వరులకంటె వేరుగా చూచితె వ్యభిచార మదియును ఓరామ
సంగమాపేక్షించి అంగనల పెండ్లాడి అది దొంగరోచకమౌ ఓరామ

కానలలో తిరిగి కందమూలము తిని కాదు వానప్రస్తు ఓరామ
ఎక్కిపోయె గోడనెక్కి చూచిన గ్రుంగిపడగలడ ఓరామ
విశ్రాంతినీ లేక వరములు యిస్తామనిన వారు బహుమూర్ఖులు ఓరామ
సకలశాంతి విశ్రాంతి పరమబుధులూ జూప సత్పురుషులూ మీరు ఓరామ
అనేకతీర్థంబు లాచరించినయోగి కాత్మలభ్యం కాదు ఓరామ
గట్టిగా పాదములు బట్టుకొని గురుసేవగుట్టు గురుతే మెరుగు ఓరామ
గురుగుర్తు మీదనూ గుట్టునాలుగుపక్క గురుడేసుమ్మి ఓరామ
పాముపుట్టలోనుండి పరమ రహస్యమున అదిమిమ్ము యెరుగునా ఓరామ
పరుల మోసముజేసి పలుకరెవ్వరితోను అదిమిమ్ము యెరుగునా ఓరామ
కలకాలమూ కప్ప కడుచలవ నీళ్ళలో మునిగి మిమ్మెరుగునా ఓరామ
వోరుపున వృక్షములు వొక్కచోట నుండి అవిమిమ్ము యెరుగునా ఓరామ
వనమందు మృగములు నివాసములు చేసుకొని అది మిమ్ము యెరుగునా ఓరామ
గంగాతీరమున కొంగధ్యానముచేసి నిజలింగ మెరుగునా ఓరామ
కొడకొమ్మానెక్కి కోడికూతలు కూసె కోడి మిమ్మెరుగునా ఓరామ
చిలుక ఫలములదెచ్చి చేకొని పిల్లలకు చూపు తెలిసినట్టె ఓరామ
పుట్టు మొదలందునికి పుణ్యమనుచూ తెలిపినను ఓరామ
అటువలెను మీ దయ ఏ నేర్పునైనాను మిమ్ము నెరిగించవలె ఓరామ
మిమ్ము నెరుగుటకు నమ్మినవారికి నమ్మతే సత్సంగమో ఓరామ
సత్సంగతీమీద మాచాతరానంతుడై చెప్పశక్యముకాదు ఓరామ
మహిమోద సత్పురుష - పాదబురదైనాను మైలనిసోకునా ఓరామ
వారిహస్తా శిరాకరములు హరిచరణములు తీర్థములుపోదునా ఓరామ
అంత బ్రహ్మమనా వచ్చు ఆ పరోక్షమీ పొద్దు అతిదుర్లభమౌను ఓరామ
అదితాకితేను కొంత అటుయున్నది అత్యంత సుఖతరము ఓరామ
అందారి హృదయముల ఆత్మరాముడు - ఉండి అపరోక్షమాయెను ఓరామ
దేశాలుతిరుగుచూ దేహోన్నతముచేత దేముని కానరూ ఓరామ
బుద్ధిహీనుండయిన భక్తికలిగినయెడల ముక్తికి యితడౌసుమీ ఓరామ
పాశిభక్తిలేని భూసురుండయినాను కాసుకు కొరగాడు ఓరామ
అగ్నిహోత్రాముసందు బడ్డ కాష్టములన్ని అగ్నిహోత్రమాయెనూ ఓరామ
బ్రహ్మనిష్టా చూడ భూతమాత్రము గాని బ్రహ్మరూపాయెనరా ఓరామ
ప్రపంచపురీయందు పాపకర్మమనునది పారుచున్నది ఓరామ

ఆ నదీవృత్తాంత మంతాను జెప్పేను ఆదరంబుగ వినుడు ఓరామ
అందే ఉదకము ఆనే అదిలోతు త్రుప్తేతరంగములు ఓరామ
సుఖదుఃఖమే తళ్లుదంబుబుద్దే బురదగంటకము కడువిషము ఓరామ
మాయమోహామె సుళ్ళు అధైర్యమదిపడి దేహామె దుర్గ్రిహాము ఓరామ
పాపమెజిలుగ మోహామె చీకటి కామక్రోధమె రాళ్ళు ఓరాము
కళ్లుకానని వాళ్ళు ఆ రాళ్ళు తాకుతూ తుల్లిపడుచుందురు ఓరామ
అవివేకులు అందరూ ఆ నదికితమరోయి అక్కడే మునుగుదురు ఓరామ
గుండుమెడగట్టుకొని నిండినానది యీదగండమూ గడచునా ఓరామ
యంతలో ఆ నదీ దారిసంగడిచేసి దాటినట్లాయెను ఓరామ
సత్సంగతీచేసి వత్సగిర్నానివచ్చి దండమనదారినూ ఓరామ
విశ్వేశ్వరుని శరణు శరణు అన్నవారికి శివుడు తానాయె ఓరామ
వైకుంఠమూనందు వశిష్ఠరాముడు వర్ణించెదీ కథా ఓరామ
పాడినవారికి పరమపదము కలదని భేరివేయించిరి ఓరామ

# శ్రీ రామ నామ మాహాత్మ్యము

| | |
|---|---|
| శ్రీమహత్తత్వార్ధ బోధ వి - శేషమైనది | రామనామం |
| సోమసూర్యాగ్నులను మించిన - స్వప్రకాశము | ,, |
| మూడు గుణముల ప్రకృతి వికృతికి - మూలకందము | ,, |
| పడుతత్త్వంబులకు నావల - నెసగుచున్నది | ,, |
| గ్గాలంసాధనములు వహించిన - నడత దెలుపును | ,, |
| వెల్గులోపల వెలుగుదానై - వెలుగుచున్నది | ,, |
| మూడుమూర్తుల జన్మభూమికి - మూలదైవము | ,, |
| యేడు వ్యసనములను హరించెడి - యిద్ధసూత్రము | ,, |
| సకలలోకంబుల భరియించెడి - సత్యరూపము | ,, |
| ప్రకట యోగీంద్రులకు నైనను - బరమ గోప్యము | ,, |
| నాదబిందు కళామయంబగు - వేదమంత్రము | ,, |
| వాదభేదందులను దొలగిన - వారిభోగము | ,, |
| జ్ఞానదృష్టిని చూడగలిగిన - మాననీయము | ,, |
| లోనవెలుపల నిండియుండెడి - జ్ఞానదీపము | ,, |
| నిరుపమానము నిర్విశేషము - నిష్కళంకము | ,, |
| పరమకళ్యాణ ప్రదంబగు - ప్రణవనాదము | ,, |
| చూపు నిలిపి భజించువారికి - సుఖము నొసగును | ,, |
| చూపు మనసులు నొకటిజేసిన - శుభకరంబగు | ,, |
| పంచవింశతి తత్త్వములకును - మించియున్నది | ,, |
| పంచదశ మంత్రాక్షరములకు - ప్రాణకరణము | ,, |
| కోటికమలజ యజ్ఞ ఫలముల - సాటియైనది | ,, |
| మాటమటిచిన దూరదర్శికీ - మంత్రయోగము | ,, |
| రెండు నొక్కటి జేయువారికి - నిండియున్నది | ,, |
| పండు వెన్నెల కాంతిగల్గిన - బ్రహ్మ నాళము | ,, |
| అన్ని రూపంబులును దానై - యాడుచున్నది | ,, |
| అన్ని రూపంబులను దనలో - నణచుకొన్నది | ,, |
| పాపమనియెడు మేఘమునకును - ప్రళయవాయువు | ,, |

పావనడుమను మెరియుచుండెడి - దీపరాజము రామనామం
కర్మయోగము లెన్ని సలిపిన - గానరానిది ,,
నిర్మలాత్మజ్ఞులకు నెపుడు - ధర్మమైనది ,,
సోహమను మంత్రార్థ విదుల వి - దేహముక్తియు ,,
దేహవాసన వదలినను ఘన - దివ్యదృష్టియు ,,
నిదురలోపల నిదుర దెలిసిన - నిజము దెలుపును ,,
పదిలముగ సాధించువారికి - బరమపదమగు ,,
జన్మ దుఃఖాబ్ధిని దరింపగ - జలుపుచున్నది ,,
చిన్మయాత్ముల కెల్ల గాలము - చిన్మయము (శ్రీ) ,,
అష్టదళముల కమల మందున - నమరి యున్నది ,,
అష్టదేహాంతరము లందున - నంటకున్నది ,,
యేడుమై నిరవధిక నిరుపము - లోకమైనది ,,
శోక మోహ వినాశకరమై - చూచుచున్నది ,,
యేక ప్రాకారముల కావల - నెసగుచున్నది ,,
యేడు శక్తుల గెలచినను దన - తోడ బల్కును ,,
సర్వశబ్దంబులును తానై - సాక్షియైనది ,,
నిర్వికారము శుద్ధ తత్వము - నిర్మలము (శ్రీ) ,,
మూడు కాలములందు బోలయని - ముఖ్యబింబము ,,
మూడు నదులను దాటువారికి - మోక్షలక్ష్మియు ,,
మేరు చిక్రాంతరము నందున - మెరయుచున్నది ,,
కారణా జార్యుని కతంబున - గానవచ్చును ,,
అమృతపానము చేయు సురలకు - నచలమైనది ,,
అమృత వర్షము గురియుచుండెడు - నభ్రమౌ (శ్రీ) ,,
ధారణా యోగీంద్రులకును నీ - ధానమైనది ,,
ఘోరరోగ వనంబులకును గు - ఠారమే (శ్రీ) ,,
ఆదిశేషుని నిదురలేపిన - బోధసేయును ,,
ఆదిమూల ప్రకృతి గతికి న - నాదియైనది ,,
తత్త్వమసి—క్యార్థమనియెడి - తత్త్వమే (శ్రీ) ,,
సాత్త్వికాది గుణంబులకు ని - స్సంగమైనది ,,
అజప గాయత్రిని రచించిన - యాది బీజము ,,

భజనపరులకు నెల్ల కాలము - బ్రహ్మ యజ్ఞము రామనామం
దేశమును గాలమును బొందని - దివ్యతేజము ,,
ఆశలను సర్వముల ద్రుంచువి ఖ - గేశుడగు శ్రీ ,,
తారక బ్రహ్మను భవులను - జేరియుండును ,,
దారితప్పక మ్రొక్కి కొలిచిన - దర్శనంబగు ,,
ఎఱుక మఱుపుల నెఱిగియుండెడు - నెఱుకయే శ్రీ ,,
గరుడగమనాదులకు నైనను - గణ్యమయినది ,,
ముక్తికాంతామణికి నెప్పుడు - ముదమొసంగును ,,
భక్తవరులకు క్షేమకరమయి - ప్రబలుచున్నది ,,
కామ రాగాదులకు నంటని - ధామమే శ్రీ ,,
సోమసూత్ర బిలంబులోపల - జ్యోతియె శ్రీ ,,
చిత్తశాంతిని గలుగజేసెడి - చిత్స్వరూపము ,,
సత్తుచిత్తుల రెంటి నెనసెడి - స్వప్రకాశము ,,
మహదహంకారాది పరిగణ - సహితమయినది ,,
దహావగగన పథంబులోపల - దర్శనము శ్రీ ,,
హృదయకమలజ బిందువులను బెం - పొదవజేయును ,,
ముదముతో భ్రూ యుగము నడుమను - మ్రోయుచుండును ,,
దశవిధములగు మండలములను - దాటియున్నది ,,
కుశలబుద్ధిని గలిగి దలచిన - గోర్కెదీర్చును ,,
నిత్యమయి పదియాఱు కళలను - నిలిచియున్నది ,,
సత్యలోకమునందు సుప్ర - స్థానమయినది ,,
జన్మ మృత్యుజరాది మహిముకు - జండరస్మియు ,,
తన్మయత్వము నొందువారికి దత్పరము శ్రీ ,,
రజత గిరిపతి సతికినెప్పుడు - రమ్యమయినది ,,
సృజనపాలన విలయముల దా - జేయుచుండును ,,
యోగమాయెను దాల్చినట్టి ప్ర - యోగమే శ్రీ ,,
ఆగమాంత విచార నిపుణుల - కాదినామము ,,
నాల్గు దళముల కమలమందున - వెల్గుచున్నది ,,
నాల్గు నక్షర నాదములుగా - నాటియున్నది ,,
క్షరము నక్షరమును రచించిన - గురుని రూపము ,,

| | |
|---|---|
| కరణముల మూటికి నవశ్యం - బెరుగుటకు శ్రీ | రామనామం |
| పరమగోప్యము బ్రహ్మవాదము - భద్రచరితము | ,, |
| స్థిరముగను బిందువును నిల్పిన - సిద్ధియొసంగును | ,, |
| ఆరు దళముల కమలమందున - నమరియున్నది | ,, |
| ఆఱు నక్షర నాదములుగా - నాడుచున్నది | ,, |
| గర్భనరకములన్ని బాపెడు - గానమే శ్రీ | ,, |
| భూర్భువాదిక లోకములకును - భూషణము శ్రీ | ,, |
| వేదచోదితమయి వెలింగెడి - విశ్వరూపము | ,, |
| వేదవాక్య ప్రమాణములచె - బాదుకొన్నది | ,, |
| పరమగురు రూపంబు దానై - పరుగుచున్నది | ,, |
| నిరతిశయ బోధస్వరూపము - నిర్మలము శ్రీ | ,, |
| పదిదళంబుల కమల మందున - గదలకున్నది | ,, |
| పదివిధములగు నాదములుగా - బలుకుచున్నది | ,, |
| సప్తకోటి మంత్రములకును - గుప్తమయినది | ,, |
| సప్తజిహ్వన మండలములలో - జ్ఞప్తియే శ్రీ | ,, |
| జ్యోతిరూపంబును వహించిన - సుప్రకాశముగా | ,, |
| జాతినీతులులేని మానస - జప విధానమురా | ,, |
| జ్ఞానయోగముచేత జూచిన - గానవచ్చును | ,, |
| మానసానందము నొసంగెడి - మౌనమే శ్రీ | ,, |
| అమర ద్వాదశ పత్రకమలము - నంటియున్నది | ,, |
| సమరసముగా బదియు రెండు - క్షరములాయెను | ,, |
| బిందుచలనము లేనివారల - బొందియున్నది | ,, |
| దుమండల మధ్యగతమగు - నిందురూపము | ,, |
| ఘన సుషుమ్నా నాడియందలి - కాంతియే శ్రీ | ,, |
| అనిమిషత్వము నొందినను బ్ర - హ్మత్వ మొసంగును | ,, |
| మూడుదేహంబులను బోని - మూలదేహము | ,, |
| యేడుప్రాకారముల కావల - నెసగుచున్నది | ,, |
| బంధకంబులనెల్ల ద్రుంచెడి - ప్రకటయోగము | ,, |
| అంధులై యున్నట్టి వారల - కందమయినది | ,, |
| పదియునాఱు దళంబులను గల - పద్మమే శ్రీ | ,, |

నీ పదియునాలు స్వరాక్షరములుగ - బలుకుచున్నది రామనావ
దూరదృష్టియు లేనివారికి - దుర్లభము శ్రీ ,,
బిరుపాలను నేర్పఱించెడి - నీతితెలుపును ,,
లేతముదురును దెలియువారికి - దాతయగు శ్రీ ,,
దాతవ్రాసినవ్రాలు దుడిచెడి - దైవమే శ్రీ ,,
ఎందుజూచినగాని యొకతై - పొందియున్నది ,,
సందులేక యజాండరూపము - నొంది యున్నది ,,
ఆది మధ్యాంతములులేక - ననాదియైనది ,,
ఆదిశక్తికి బ్రాణపంక్తియు - బాదిజేయును ,,
శాంభవిని ధరియించువారికి - సాధనము ,,
శంభునేత్రము దెరచిచూచిన - శత్రునాశము ,,
త్రిపుటి మధ్యమునందు వెలిగెడి - దీప్తియే శ్రీ ,,
ఉపరిజిహ్వకు ముందు పలికెడి - జపనిదానము ,,
కపటయోగముచేత నెవరికి - గానరానిది ,,
జపతపోవ్రత యజ్ఞములచే - జెప్పరానిది ,,
రెండుదళముల కమలమందున - నిండియున్నది ,,
రెండు నక్షర నాదములతో - బండియున్నది ,,
మొదటి తంత్రము దెలియువారికి - ముక్తిమార్గము ,,
పదిలముగ బఠియించు మునులకు - బ్రహ్మకర్మము ,,
ఐదుముఖములు గలుగుపక్షికి - నక్షరము శ్రీ ,,
నీదు భూతంబులను ద్రిమ్మెగెడు - నాకసము శ్రీ ,,
మేను మనమును దురభిమానము - లేనిదే శ్రీ ,,
మేనునేనని యున్నవారికి - లేనిదగు శ్రీ ,,
సర్వలోకాతీతమై శివ - సహితమైనది ,,
నిర్వికల్పము నిర్జరామృత - నిత్యభోగము ,,
ద్రష్టదర్శన దృశ్యజాలవి - రహితమయి శ్రీ ,,
దృష్టికిని గోచరముగానిది - దూరదేశము ,,
మండల త్రయమాగ్రమందున - మరగియున్నది ,,
కుండలిని భేదించిచూచిన - బండువెన్నెల ,,
గాలి మనసును దూలజేసెడి - ఘనుని తపసే ,,

| | |
|---|---|
| నీలతోయద మధ్యమందున - నెగడియున్నది | రామనామం |
| అమలభావమిచేత గొలిచిన - నమృతమొసగును | ,, |
| అమృతనాదము లాలకించిన - నమిత సౌఖ్యము | ,, |
| ధరణికి నాకాశవీధికి - దగిలియున్నది | ,, |
| మరణమూర్ఛల బాపుచుండెడి - మంత్రయోగము | ,, |
| పరమతారక రాజయోగ - భ్రాజమానము | ,, |
| చిరతరంబగు పూర్ణ దృష్టికి - సిద్ధియొసగును | ,, |
| ప్రకృతి వికృతుల రెంటికిని స - ద్బ్రహ్మమే శ్రీ | ,, |
| సుకృత దుష్కృత యోగములలో - సోకకున్నది | ,, |
| అచలమయి యానందమయి పర - మాణువైనది | ,, |
| అచలమానసమున భజించిన - నఖిల శుభములు | ,, |
| శివవిరించి హరీంద్రసుమన - స్సిద్ధియే శ్రీ | ,, |
| భవము దోషము కులము రేయుం - బగలు లేనిది | ,, |
| తెలివిలోపల దెలివి దానై - తెలియుచున్నది | ,, |
| వెలుగు చీకటి రెండు లేకయు - వెలుగుచున్నది | ,, |
| సాంఖ్యయోగము బూనుటకుబల్ - సాధనము శ్రీ | ,, |
| సంఖ్యలేని చరాచరంబుల - సాగజేయును | ,, |
| ఆత్మ తపమును జల్పువారికి - నాత్మయజ్ఞము | ,, |
| ఆత్మ జీవాత్ములును దానయి - యాడుచున్నది | ,, |
| మూడవస్థల నెందునంటని - మోక్ష పదవియె | ,, |
| మూడుమూర్తుల బీజములుగా - మ్రోగుచున్నది | ,, |
| ఘనతరోంకారంబు నందున - గానవచ్చును | ,, |
| అనిమిషులు పానంబు చేసెడి - యమృతబిందువు | ,, |
| నారదాది మునీంద్రులకు సం - సారమయినది | ,, |
| మారుతాత్మజు మనసులోపల - మరిగియున్నది | ,, |
| జన్మమరణంబులను బొందని - చదువునేర్పును | ,, |
| చిన్మయంబై సృష్టికిని సువి - శేషమయినది | ,, |
| నరకమను చీకటికి సదమల - తరణిబింబము | ,, |
| పరమగుహ్యము ధీప్రకాశము - బ్రహ్మవాదము | ,, |
| విష్ణులోకము శైవలోకము - విశ్వమయమగు | ,, |
| విష్ణుమాయను గెల్చువారికి - విశదమగు శ్రీ | ,, |

నిర్గుణంబగు చిత్సమాధికి - నిశ్చలము రామనామం
దుర్గుణంబుల ద్రుంచివైచెడి - తుల్యరూపము ,,
నిత్యముక్తికి నిత్యభుక్తికి - సత్యవచనము ,,
సత్యవాక్య ధురీణులకు సం - సర్గమే శ్రీ ,,
సోహమను మంత్రార్థ విదులకు - సోమపానము ,,
మోహమును లోభమును బెంగని - యూహయే శ్రీ ,,
గురుని పాదద్వయము తానై - మెఱయుచున్నది ,,
పరమపదముకు మార్గమిచ్చెడి - చరమరూపము ,,
వేయుదళముల కమలమందున - వెలుగుచున్నది ,,
మాయమాటలు పలుకువారికి - మార్గమియ్యదు ,,
కుండలీంద్రుని పడిగమీదను - బండియున్నది ,,
నిండుగా నిర్గుణ సమాధికి - బండువెన్నెల ,,
దృక్కుదృశ్య విదులకు మిక్కిలి - యెక్కువయినది ,,
ఒక్క నిముషములోన మనమున - నిక్కజేయును ,,
నిక్కుచుండెడి మనసు వృత్తిని - సుక్కజేయును ,,
ఒక్కయక్షరనాదమై పెం - పెక్కియున్నది ,,
ప్రతిని మేషము జపముజేసిన - బరమ ధర్మము ,,
అతులితంబై సర్వగతమై - యాడుచున్నది ,,
వాసనాత్రయములను విడచిన - వారిధనమే ,,
శ్రీ సదాశివయోగ పథమున - ఘప్రసిద్ధియు ,,
జ్ఞానశక్తికి వాది శక్తికి - మానమే శ్రీ ,,
జ్ఞానభూములు నేడు గడచిన - మౌన దేశము ,,
తాను వచ్చెడి దారి దెలిపెడి - జ్ఞానమే శ్రీ ,,
తాను బోధ్యో మార్గసరణిత. - దగవిధించును ,,
జీవభావ మునీశభావము - జెప్పుచున్నది ,,
జీవునికి నీశునికి నైక్యము - జెందజేయును ,,
ఆత్మమంత్రం బాత్మయంత్రం - బాత్మతంత్రము ,,
ఆత్మభోగం బాత్మయోగం - బాత్మయోగము ,,
నిర్వికల్ప సమాధియోగము - నిర్విచారము ,,
సర్వమును వ్యాపించియున్నది - సత్యముగ శ్రీ ,,
క్షుద్రమంత్రజ్ఞులకు నెప్పుడు - క్షోభకరమగు ,,

నిద్రజెందక తన్ను దెలిసిన - ముద్రభావము రామనామం
ఉపనిషత్సారాంశమునకు మ - హోత్సవము (శ్రీ) ,,
జపతపస్స్వాధ్యాయములకును - జన్మభూమియు ,,
ఉపనిషద్గావ్యంబు తానయి - యొప్పియున్నది ,,
కృపణులై కనుగొనెడివారికి - జపలచిత్తము ,,
కులము మతములు లేని బుధులకు - గోర్కె దీర్చును ,,
సలలితంబుగ బ్రణవరవమును - వెలయజేయును ,,
బట్టబయలుగ భక్తులకుగను - పట్టుచున్నది ,,
పట్టుగొమ్మై పరమ మునులకు - బరగుచున్నది ,,
సర్వమును దనలోన నుంచుక - నిర్వహించును ,,
సర్వజగములలోన నుండియు - సంస్మరించును ,,
విశ్వమంతయు నశ్యమయినను - వ్రీలదెప్పుడు ,,
విశ్వరూపము విగ్రహముగా - వెలసియుండును ,,
కంటికిని మనసునకు గుఱిగా - గానరానిది ,,
మింటచిత్తర్వు లిఖించెడి - మేటిదైవము ,,
కంటిపాపను నెనసి మెఱసెడి - ఘనగురుండే ,,
తుంటవిల్తుని భయము బాపెడి - మింటిచంద్రుడు ,,
ద్వాదశాక్షరి షోడశాక్షరి - భోధచేయును ,,
వేదములు నాల్గింటికి నిదను - పాదుకొన్నది ,,
పంచదశ మంత్రప్రభావము - మించియున్నది ,,
సంచిత ప్రారబ్ధముల నుప - సంహరించును ,,
బయలులోపల బయలుతానయి - ప్రకటమయినది ,,
భయములన్నియు బాపుచుండెడి - బ్రహ్మమే (శ్రీ) ,,
చక్రతీర్థములోన వెలగెడి - చంద్రబింబము ,,
వక్రముల మూడింటి బాపెడి - సుక్రమము (శ్రీ) ,,
అమృతకుంభము మీద నాడెడి - హంసయే (శ్రీ) ,,
అమృతనాడి మధ్యమందున - నమరియున్నది ,,
బీజమును మూలమును లేని సు - భూజమే (శ్రీ) ,,
రాజయోగ సుధాబ్ధిగతమగు - రత్నరాజము ,,
పశ్చిమ ప్రాదేశమందున - బరుగుచున్నది ,,
నిశ్చలంబుగ గన్ను దెఱచిన - నిజసమాధియు ,,

అండమును బిండమును రెంటిని - నంటియుండదు రామనామం
దండిగా బ్రహ్మాండమంతయు - నిండియున్నది ,,
కార్యకారణములను మఱచిన - ధైర్యమొసగును ,,
ఆర్యసేవకులైన వారికి - నందియున్నది ,,
సుప్తిజాగ్రత్స్వప్న మూర్ఛల - జూచుచుండును ,,
జ్ఞప్తిమఱచిన వారి మనసున - వ్యాప్తమయినది ,,
నేను నీవును లేని నిర్గుణమౌనమే - శ్రీ ,,
జ్ఞానమజ్ఞానములు రెండును లేనివే - శ్రీ ,,
ఎన్ని కల్పంబులు నశించిన - నేకరూపము ,,
సన్నుతించను దరముగానిది - యెన్నటికి శ్రీ ,,
స్వచ్ఛమగు వాచామగోచర - సత్ప్రకాశము ,,
అచ్చలంబై నిర్భవంబై - యమరియున్నది ,,
కర్మనేత్ర ద్వయముచేతను - గానరానిది ,,
మర్మమెఱిగిన గురువరేణ్యుని - మర్మమే శ్రీ ,,
సకల దృశ్యంబులకు నెప్పుడు - సాక్షియైనది ,,
ఒకటియైనా నా స్వరూపము - లొందియున్నది ,,
చీకటిని వెల్తురును రెంటిని - జెందకున్నది ,,
లోకధర్మములన్ని విడిచిన - శ్రీకరంబగు ,,
నిరతిశయము నిరీహభావము - నిరుపమానము ,,
పరమపూరుష తత్త్వమయమై - పరగుచున్నది ,,
ఇట్టిదని వర్ణించుటకు గుఱి - నెవరెఱుంగరు ,,
గుట్టుదెలిసిన దేశములకే - గుఱుతుపడు శ్రీ ,,
శ్రీ మహావాక్యార్థవేత్తల - నీమమే శ్రీ ,,
వ్యోమమార్గము మీఱినట్ల - సంయోగభావము ,,
వేయుదళముల కమలమందున - మేయుచున్నది ,,
శ్రీ యుతంబగు శక్తివిద్యకు - గాయమే శ్రీ ,,
గంగయమున సరస్వతీ నదు - లంగములుగా ,,
లింగదేహములోన నిల్చుచు - బొంగుచున్నది ,,
అంగమును లింగమును గల్గిన - యపుడె పల్కును ,,
సంగరహిత విచారమైన స - త్సంగమైనది ,,
తోడబుట్టిన దాని బొందెడి - జూడదెలుపును ,,

మూడుదీక్షల బొందినను స - మ్మోద మొసగును
తడియులేని సుపాదతీర్థము - వడయజేయును
పొడియులేని ప్రసాద మొసగెడి - పూర్ణతత్త్వము
దుష్ప్రసంగములన్ని బాపెడి - తుర్యరూపము
నిష్ప్రపంచనిము నిర్మమత్వము - నిత్యశుద్ధము
సప్తసాగరములు తరించిన - సాధ్యమగు శ్రీ
గుప్తమగు నవ్యక్తతత్త్వ - వ్యాప్తమయినది
సృష్టికిని బూర్వంబు నొకటై - చూచుచున్నది
సృష్టిగలిగిన పిదప రెండై - స్పష్టమైనది
అంతరింద్రియములకు నైనను - నంతుదెలియదు
అంతరింద్రియ నిగ్రహులకే - యమరుచున్నది
మాతు సంసర్గము నెఱింగిన - మార్గమే శ్రీ
మాతృభార్యా క్రమమునొకటై - మరగియున్నది
అప్రమేయంబైన చిద్బ్ర - హ్మాండకోశము
అప్రతర్కంబైన మహదా - నందరూపము
పంచవిధ సంస్కారభ్రమలను - బాపుచుండును
పంచకోశములను విడిచిన - బ్రహ్మనిష్ఠయు
పంచభూతంబులకు లంకెలు - ద్రెంచివైచును
పంచయజ్ఞాతీత దృజ్ఞ్మయ - బ్రహ్మమే శ్రీ
సచ్చితానందరూపము - సత్యలోకము
ఇచ్ఛలేని మహాత్ములకు జగ - దేక రూపము
సర్వశూన్యంబప్రమేయము - నర్విరోధము
సర్వతోముఖమయి జగంబుకు - సాక్షియైనది
కారణము దృష్టాంతమునుబొడ - గానరానిది
కోరువారికి గురునిజేరిన - గోర్కెదీర్చును
పంచపావక వెంకటార్యుని - పానయుగళము
చెంచురామ కవీంద్రునికి గరు - ణించుచున్నది
ఈ మహా శ్రీ దివ్యనామము - నెవరుచదివిన
సోమసూర్యాగ్నులను మించిన - గ్రామమిచ్చును
సకల సుభములు సకల సుఖములు - సత్కరించును
సకలమగు సంపదల నొసగును - సంతతము శ్రీ

# వైకుంఠ వర్ణనము

అజ్ఞాన దేహమ్మ యెరుగక యున్నాను పొంగుతూవున్నాను చెప్పుమీ కృష్ణా
అగ్గలంబగు కామక్రోధములాచేత మగ్గుతున్నాను చెప్పుమా కృష్ణా
ఎంచతరుగానట్టి మదమచ్చరములచే ఖాషింపుచున్నాను చెప్పుమా కృష్ణా
ఊసరవిస్లివలె భూషణాదులచేత పోషింపుచున్నాను చెప్పుమా కృష్ణా
దీపానపాకినా తెలియకానకలేక తాపానబొందితి చెప్పుమా కృష్ణా
కోపతాపసమూన గూడుగట్టుకుతిరిగి రాపాడుతున్నాను చెప్పుమా కృష్ణా
చెలుగుచేవాలేని ములగకొమ్మట్టుకొని చెలగుతువున్నాను చెప్పుమా కృష్ణా
మంకుబుద్ధులచేత హరిదాసులా నేను లంకెగూడనైతి చెప్పుమా కృష్ణా
శంకలేక వైకుంఠపురముకు తోవచేరేటి ఉపాయంనాకు చెప్పుమా కృష్ణా
సొంపుతోనేబోయి సూర్యమండలము చూచునుపాయమ్ము చెప్పుమా కృష్ణా
అంకించి పెరిగేటి చంద్రమండలంబు ఇంపుతోడాజూడ చెప్పుమా కృష్ణా
కొంకుకొసరులేని బ్రహ్మాండమండలము ఇంపుతోడాజూడ చెప్పుమా కృష్ణా
వంచించ కామలక వృతుమందున్నట్టి మహాజనులుజూడ చెప్పుమా కృష్ణా
తేజముతో వటావృతుమందున్నట్టి దివ్యభవనముజూడ జెప్పుమా కృష్ణా
తుచ్ఛపడకా నా నక్షత్రమండలము వంక జూడంగగలుగ జెప్పుమా కృష్ణా
మీగుమెచ్చి నిలచున్నట్టి ధృవమండలము నాకు హెచ్చరికగా జూడ జెప్పుమా కృష్ణా
వెతలుపెట్టక చీకటికోణందాటేటి మతముయెట్టిదో నాకు చెప్పుమా కృష్ణా
ఆధీనులకు బరమపదమిచ్చి నిలిపేది భేదములేకుండ చెప్పుమా కృష్ణా
కవులుపొకడగ నల్లది పరమపదమనగ కనులపండువ నాకు జెప్పుమా కృష్ణా
తెలివితోడ సింహద్వారమందున్నట్టి శ్రీ అప్పలదాసుని జూడ జెప్పుమా కృష్ణా
తడబడక నీ సింహద్వారమందున్నట్టి వెడవిస్తరి వీధులేలగా జెప్పుమా కృష్ణా
శక్తికీ మించినవిధమున నే బోయి మరలకుండెడువిధము చెప్పుమా కృష్ణా
అవలీల నారాక పరమపదరాజులకు యెరిగియుండే మతము చెప్పుమా కృష్ణా
ఇదిపరమ భాగవతులు వేగమున సన్నుతించి నిజముచేవేమన్న మతము చెప్పుమ కృష్ణా
భేరిమద్దెళ్ళున్ను వీరకాహాళులు ఘోరుగొలుగుతు మ్రోగ జెప్పుమా కృష్ణా

నే కోరినకోరికలు యీడేరెననిమదిని వేడుకబొంద చెప్పుమా కృష్ణా
అచ్చోటపువ్వుల ఆ రథముపై నెక్కి హెచ్చరికగాజూడ జెప్పుమా కృష్ణా
గ్రుచ్చిన ముత్యపరి వెంటనగరిలో చొచ్చిచూచెటి మతము చెప్పుమా కృష్ణా
శ్రీ రమ్యమగుచు నొప్పేటి ముత్యాల సింహాసనముజూడ చెప్పుమా కృష్ణా
చేరిమునులతోడ చెలులాడుచున్నట్టి శేషుని ధరియింప చెప్పుమా కృష్ణా
శతకోటిమన్మథా చలమమరుతున్నట్టి పతిపాదములుజూడ చెప్పుమా కృష్ణా
పతిభక్తిచేయ లక్ష్మిచేతికిచ్చినా పతిపాదములుచూడ చెప్పుమా కృష్ణా
మునిసతీశాపాన మోపితెచ్చిన చక్కనిపాదములుజూడ జెప్పుమా కృష్ణా
సనకాదినందనులు నెలకొన్నపాదములు నెలకొన్ననాకు చూడ జెప్పుమా కృష్ణా
కోటి మునులందరును కొలుచుకొనిరాగాను కోమలిపాదములుచూడ జెప్పుమా కృష్ణా
దీనుడయి దానవకులము అణచినట్టి సూర్యునిపాదములు చూడ జెప్పుమా కృష్ణా
మద్దులగూల్చి కాళింగుమర్దించిన ముద్దుపొన్న వృక్షమెక్కి - చిట్టిపాదములుజూడ
చెప్పుమా కృష్ణా
బలిచక్రవర్తినీ పాతాళాని కనిచినా చిన్నపాదముజూడ చెప్పుమా కృష్ణా
చోరుండవయి రేపల్లెలోపలి పాలు జుర్రినా హస్తములుజూడ చెప్పుమా కృష్ణా
జారుడవయి గోపికల సన్నాహములుజేసి చేరినహస్తములు చూడ జెప్పుమా కృష్ణా
వెలవెలనున్న పాంచాలికక్షయ వలువలు యిచ్చిన హస్తములుచూడ జెప్పుమ కృష్ణా
కలువల చెలికానిబిలిచి యాడుదమని పిలిచిన హస్తములు చూపుమా కృష్ణా
పచ్చినెత్తురుదాగి హిరణ్యాక్షుని వక్షముజీరిన హస్తములు చె జూడప్పుమా కృష్ణా
సురలెల్ల పొగడగా ప్రహ్లాదుని కభయములిచ్చిన హస్తములు జూడ జెప్పుమా కృష్ణా
ఇచ్చకమున లక్ష్మి వక్షస్థలమునందు నిలిపినహస్తములుచూడ
తత్తరికాడవయి యసురులను ద్రుంచినా హస్తములు చూడ నాకు చెప్పుమా కృష్ణా
కుస్తరించి గురుడు చుంచు దువ్వినట్టి హస్తములు నాకు చూపుమీ కృష్ణా
కాలి అస్తమించిన విభీషణ సుగ్రీవులకు అభయస్త మిచ్చిన హస్తంబులు చూడనాకు
చెప్పుమీ కృష్ణా
ఇంద్రనీలము మణులకు హెచ్చయిన తేట మేను అందంబు చూడనాకు చెపుమీ కృష్ణా
పొందుగా మీ నాభినియున్నట్టి కమలమ్ము అందమ్ము చూడనాకు చెప్పుమా కృష్ణా
గంటల వడ్డాణంబు ఘల్లుమని మ్రోయగా గంటలరవము చూడ చెప్పుమీ కృష్ణా
కంఠమాలికతోను కనక కిరీటము ఒప్పు వైకుంఠపదవి చూడ జెప్పుమా కృష్ణా
శ్రీ పరిమళమ్ములు అలది పువులు ముడుచుకున్నట్టు శ్రీ మనోహరి జూడ చెప్పుమా కృష్ణా

బుద్దెల్ల బ్రోవై చి యశోదకు జూపిన ముద్దు నయనములు చూడ జెప్పుమా కృష్ణా
విద్దెములు బోతు గోపికలు వలయించిన యుగ్రపు నయనములు జూడ జెప్పుమా కృష్ణా
ప్రజ్ఞతో దానములు పారజూచినట్టు దగ్గిర నయనములు జూడ జెప్పుమా కృష్ణా
ఎగ్గులెన్నక కవులు స్తుతియించుచున్నట్టి యథా ప్రకృతి నయనముల జూడ జెప్పుమా కష్ణా
వలికేటి సిరితోటి పలికేటి నవ్వులా కలికి నయనములు జూడ జెప్పుమా కృష్ణా
హితవుడయి శ్రీ లక్ష్మిని జూచిన కమలనయనములు జూడ జెప్పుమా కృష్ణా
ప్రహలాదులాది భాగవతుల బార చూచినట్టు చూపు నయనములు చూడ జెప్పుమా కృష్ణా
అలకచేయకనూ మీ కృపాదృష్టి మామీద నిలుపు నయనములు జూడ చెప్పుమా కృష్ణా
నేరములన్నీని నే చేసుకొంటి బాలను మీకెపుడు పరమాత్మ శరణు
క్రూరుడ కుటిలుడా గుణములెంచకుమీ అటయిట పరుడనే నిను గాననయితి
కష్టులమీద నేకర మెరుగనయితి నిష్ఠురపరుడ నతి భ్రష్టుడనయితి
తల్లిదండ్రివి నీవు దయనేలుమంటి కొల్లలుగ జెప్పెదను ఎల్లవిధములను
పావనులమైతిమని నన్ను వదలాకు తనువు పారజూచ్చి తన మతము చెప్పుమా కృష్ణా
చేరదీసినన్ను ఆలింగనముజేసి క్షేమమడిగెడి మతము జెప్పుమా కృష్ణా
వర్ణనమన్నించి నాంచారు చెంగటను స్తన్యపానముజేయ జెప్పుమా
నీటితోటింపను జ్యోతిమీ మహిమ నేటివేల్పు మిముజూడ చెప్పుమా
హాటకామణిహారములు వెలుగగను హస్తమున శంఖచక్రములు మెరయగను
కోటిసూర్యులకాంతి కొమరొప్పుచున్న కొంకు కొసరులేని మీ ముఖారవిందము
బింకమ్ముతో జూడ జెప్పుమా
తండ్రితనయుడు అందు గలడని ఇందులేడని చాల దూషింపుచూ
కొండలు పగులనార్చి మున్నుదా హిరణ్యుని జేరి
ప్రహలాదుని గాచిన దాసుని హృదయాన నారసింహా అని ఆ దాసు విన్నపము జెప్ప
విని భక్తవత్సలుం డిట్లనిపలికె వినుము దాసుడా విన్నపము జెప్పెద
మనసు నిశ్చలచిత్తము లుడిగి నీవు హరిహరి బ్రహ్మాదులకును అసురులకును సురలకును
అలవిగాని పరమపదమిది సుమ్మి యిలమీదనుండి యెవ్వరు దలచిరయిన
మతిమాయకుండ సమ్మతిగ వినుమి గతులులేవని విచారించపనిలేదు
మతిలోన నెమ్మది మసలుకొనుమీ సతిపతి న్యాయమ్ము తప్పకుండాను
సతిసుత భ్రమతను నింపారవినుమి జాతకర్మములు చెలగినడిపినను
సీతలింపు మతి సిద్ధముసుమ్మి చేతురో అని వగవవద్దు
కాలమెల్ల హరిభక్తి గలిగినను శూలముల బొడుచునని అని వగువవదు

మానమెల్ల జేయు మనను వైకుంఠద్వారములు దూరనా భారమునగుదు
అష్టదిక్పాలకులు అగ్నిదేవతలు దుష్ట దానవులచే తూలేటివారు
కష్టపడితీమని కాకచేసినను కష్టమైన కార్యపుష్టి లేదు వినుమీ
తచ్చనగాళ్ళతో సరసములు వద్దు కుచ్చితపరులతో కూటములువద్దు
మచ్చరించినవారితో మాటాడవద్దు పెచ్చుపెరిగెడివారిని ప్రియంజేయవద్దు
వంచనచాయక మించియాడినను ఎంచకయముడు మన్నించడు వారిని
ఆపదబడ్డవార్ని ఆదరించకున్న తాపానపొంది కూపాన గూలుదురు
సొంపుచెడి కూపాన రూపణగి యుందురు కాక చేసినకప్ప శేషుసరిరాదు
బూకరించిన మేక పులికిసరిరాదు చౌకళించి వురికిన దాట్లువేసినను
ఘనతకు నూరబంది ఘనతసరిరాదు ఇంటికి పల్లేరు పుట వేదములు సరిరావు
బోటుమాటలు చాల బొంకులు వెయ్యి సాటికి సత్యంపు పలుకు సరిరాదు
మందెందగురిసిన మడుగులకు దృప్తిరాదు ఎంచగల గొడుగు నీడలు యిళు।కావు
దీపగలతల హరి యముడు సరిరాదు మూకలరాజు మురవైరి సరిరాదు
అర్థమెంత సంగ్రహించిన ముక్తిసరిరాదు ఆత్మ లెందరయిన పరమాత్మ సరిరాదు
గుత్తెరింగి నీవు పరతత్వమ్ము దెలిసి చిత్తాన దెలిపితివో ముక్తితెరవు
సంసారమనియేటి సాగరములోను మునిగి తేలుచునున్న మూఢులకెల్ల
అలరుకుమ్మరి చేసిన కడవవలెను తడికోర్వవచ్చునా తనువుచందమ్ము
అట్టె బూచెట్టుగట్టు అట్టుమీదబట్టి విశదమ్ముగా మీద వేడుకలుమీర
ఆ మర్మమెరిగి వెతలుగనిపెట్టు దయలేక పెట్టేటిబాధలు పెట్టి
తనచేతి శూలాలు తగదికబెట్టు చేరివేయనిముందు చెయ్యాని పుణ్యాం
అక్కడికిరాదుగా అవిచారంబునష్టి దండిపేటల ధనము దండించి తెచ్చి
నిండువేడుకలతో కుండలాబోసి వూళ్ళు పలుదమని యుబ్బుదురు కొందరు
ఊళ్ళు యేలిన యుపకారమేమి అన్నదమ్ములు తల్లి యాలుబిడ్డలును
తక్కిన చుట్టాలు తగిన బంధువులు ఇక్కడ మితముజెంది యేగిపోగానె
అక్కడికి వారివారడ్డుపడరారు కుండకలశములుదెచ్చి కూర్మినిలిపినను
ఎండనుడికిన పాలు మండలములోను పున్నమవెన్నెల పుణకలో పొయ్యరాదు
అమావాస్యమితిని అడ్డముచేయరాదు కలిమిలేములు రెండు కట్టడని తెలిసి
క్రమము తెలియగవలెను కామకులకెల్ల కష్టము తమర్చి కల్పించియుంటె
కష్టము తమరుచేసిన కర్మమనుకోరు భూమిపాలకు లెవ్వరే పుణ్యులెవ్వారు
బుద్ధిచెప్పగనట్టి పురుషులెవ్వారు ముందుగర్వించిన మూఢులకునెల్ల

చందమ్ము చెప్పెను పొందుగా వినుమి వసుధలోనసురుల వరప్రసాదివలెను
మసల కసురుల నందరనిగొలుస్తి విస్తరించి సురులుచేసిరి విన్నపములు
విస్తరించి అభయ హస్తమిచ్చితిని హెచ్చరికమున బ్రహ్మాధ్యానమ్ము సేయ
ఇచ్చితిని వేదములు చొచ్చిసోమకుని చోరవతో జలధిలోజొచ్చి సోమకుని
చీరిన మత్స్యావతారుడను నేను సురలు అసురులు జలరాసిదరువగను
ఇహమందు మందాద్రి విహితమయినాడు చెదరిన యసురుల బిరుదు చెడకుండ
కుదురయిన కూర్మావతారుడనునేను కటకటా తనుగావుకలడు లేడనక
పటపట స్తంభమున పిడుగులురాల చిటచిటయని హిరణ్యుని చీరివేసి
సంహరించిన నారసింహుడా తాను బ్రోవతోడుత సురలు తము గొలువగాను
కోమలంబయినట్టి గుజ్జులపయిన నీమముతొ నిల్విరి నిశ్చలంబుగను
ఏమనుచు నరుని చెయిజూరబట్టి భూములను అడచిన వామనుడతాను
తండ్రి చంపినకత్తి వీరులందరిని ఖండించివేసితిని మరియొక్కనాడు
నిండిన భూశక్తి మించి వేడుకల దండిగల పరశురామావతారుడను నేను
కంసుబాణాకార కడముట్ట భాస్కరా నిర్వంశంజెయ్యవలె వంశానబుట్టితి
ఈశ్వరు చెవరములు యీరానినాడు గాసిబెట్టిన సురులు చేసిరి విన్నపములు
కోరి దేవకిదేవి చేసినాతపసూ కోరికదీరనీ గొల్లయుదయిస్తి
తలవాడి కోరికా నెలవాడిచెయ్యి బలరామ కృపావతారుడను నేను
త్రిపురములు సాధించితిరి వీధినైన విపరీతమయినగట్టి కర్మలు బుట్టిస్తి
సతుల సత్యమ్ములకు పతులకు జయము ఇతరులకుగానరాదినుప గుగ్గిళ్ళు
అవుపడ గోరుచునే నశ్వద్దనయితి మగువమానమునకు మరిబోటుపెడితి
పెద్దల మెప్పించి బుద్ధులను మెప్పించి నా బుద్ధుడా తాను నయమురంజిల్ల
అసురుల శిక్షించి సురలరక్షించి శరణుజొచ్చిన రామచేపట్టినావు
కృతయుగంబులనుండి యిహములుగలయట్టి మా భక్తులు చెప్పేరు మగువయిటు విను
సత్యహరిశ్చంద్రుడనగ నొకరాజు సత్యమంటి గృహములో తా నున్నవాడు
ధర్మమనుచు తరువుతాబట్టినాడు నిర్మలమయిన మతిని నిల్పినవాడు
శూరోత్తములకతడు సూర్యునిబోలు శాంతగుణములకతడు చంద్రునిబోలు
పరసతి పరధనము పరదూషణములు పరనిందలు బహుభాషలొల్లాడు
వీనులకు నింపైన విష్ణుపురాణాలు ఓరిమితోవింటు పరిపూర్ణుడయియుండె
తప్పును సత్యమ్ము తప్పుసత్యమ్ము ఒప్పులకు ఈ వీగబాహుగొలచుండె

కొల్లలుగ నా దొడ్డయిదుమల్లుబడెను కల్లపనులు కొన్ని కల్పించిమవుని
సలలితముగా సుతుని పాముచే జంపె రుద్రభూమికిబోతె పెద్దశోకించె
విని సతినిగోరి తనువేగ చనుదెంచి మనికి తమ్మిన సుంకం మాకు దెమ్మనెను
పతిబాసిపోతి పర్ణాకుల పాలయితి సుతుని గోలుపోతి సుఖము యెక్కడిది
పడతి నీ మంగళసూత్ర మిమ్మనెను వెడలు మూర్ఛిల్లు కడువెత దీర్చిపల్కె
తన సతిసుత అగుట తా దెలసి రాజు పతినిగావించియో సతిని యిట్లనెను
పలినవాని పని చెయ్యకపోను శంకించగాపోను సుంకము తెమ్మనెను
అంతట కౌశికుడు సుంకంబులేదని యా వీరబాహు పుత్తెంచివేసె
రాచబిడ్డను చంపి యతి ఘోరమున పుచ్చుకొని వేగతా పొంచి నిలుచుండె
చచ్చిన బిడ్డను చేతికందిచ్చి తరువుల చాటుకు తాబోయి నిలిచె
చోరవారేతెంచి చోరులను బట్టి శారుతెంచి సుతును పట్టితెమ్మనెను
సామిద్రోహి దీన్ని చంపంగవలెను భామినితెచ్చి వీరబాహువు కొప్పగించె
వీరబాహువు దీని వీక్షించిచూచి సంహారించుమనచు దాసున కొప్పగించె
పతికప్పగించిన పణతి యిట్లనెను అగ్నిసాక్షిగ పెండ్లి యాడిన పతిని
మగుడివిడువగ ధర్మశాస్త్రంబుగాదు పతియెంత రోగయిన పాటిదప్పినను
సతినీ విడువగరాదు ధర్మశాస్త్రమ్ము నినుబాసి సత్యమ్ము నిలిపిననట్టు
దోషములన్ని విమోచనమాయె భాషిణిపట్టుగా పణతిగూర్చుండి
శ్రీసతివల్లభుల చిత్తానదలచె తనచేతి యాయుధం తప్పకుండాను
వేసిననది పూల చండయ్యెనపుడు సత్యంబు తప్పెనని దల్లడింపుచును
హస్తమెత్తుక వేశ ఆ దినమున హరుడును బ్రహ్మ యింద్రాదులు మొదలుగను
అష్టదిక్పాలకు లతనికి ప్రత్యక్షమయిరి ఓ సత్యహరిశ్చంద్ర యో పరమపురుష
వోడితినని యుచిత వాక్యములు పలికె ఇంద్రుడు పూల వర్షములు గురిపించె
దశదిక్కులను మ్రోగె దేవదుందుభులు సతిసుతతోడ నే సత్యమ్ము నిలిపి
సత్యహరిశ్చంద్రుడు తామువచ్చి కలిసిరి దశరథమహారాజు దేవి
కౌసల్య పుత్రుల్ల నెత్తి భూసురుమెచ్చ కడుచిన్న ప్రాయాన తాటకిజంపి
కౌశికమునినాథ క్రతువుగావిస్తి మీ తండ్రి సత్యమ్ములకు తల్లివరములకు
అతిన తమ్ముడు తాను అడవులకు జనితిమీ గంగాతీరాన కలడు వో యెరుకా
నిమ్మళమైనా మతిని నిల్పినవాడు పోయి మేము అతని పొలిమేరనున్న
నావిని మాకడకు వేగజనుదెంచె ఫలములు కొనితెచ్చి భక్తితోడుతను
యిలనాథ మీరు నా యిలవేల్పులనెను అతనిభక్తికి మెచ్చి యానవాలిచ్చి

వచ్చితినని గడియ వాసిదప్పినను నిటులేకమయినట్టి నిజభక్తి నిలిపి
గ్రక్కున గుహుడుతా వచ్చి కలిసిరి దండకారడవిలో మేమున్న యెడను
మెండుగ శబరి మాకు విందుగావించె తియ్యని ఫలములు తేనెలాతోను
చయ్యనదెచ్చి యుచితవాక్యంబులు బలికె శరణు దశరథరామ శరణు పరమాత్మా
శరణుగద యచ్యుతా శరణుశరణనెను భక్తవత్సలుడ శరణు పరమకళ్యాణి
నిత్యనిర్మలభోగి నిర్వాణభోగి కల్మషమందునా కాకలున్నట్టు
అని చుట్టాలని యెన్న పనిలేదు కామధేనువు బిచ్చి గుప్పించినట్టి సామెతలు
నిజముచెయ్యక తగవుగాదు శబరిభక్తికి గనుక సిద్ధముగ మెచ్చి
యాలంక కవి రావణుండు మాచేత వోమాటకొరకుతా వేగ
సీతగొని చనియె లంకకు మైరావణుడు వచ్చి మహిమ గొనిపోగా
చనుదెంచి వాడిలంక దగ్ధంబుగాను వానిజంపి మమ్ము వసుధపయినుంచి
వాడింక పురుషుడు వా డాత్మజుండు అసురులకు శత్రుండు మాకు నిజభక్తుండు
వసుధలో కీర్తిమంతు హనుమంతుడు వానిజంపి మమ్ము వసుధపై నుంచి
ఆతని శౌర్యమ్మున అతని కౌర్యమున అతడు శూరత్వమున అతడు సాహసమున
హస్తి చర్మము వేరు ఆత్మ యొక్కటియె అనువుగ మాకు సందేహంబు లేదు
వనముల పుట్టి మోక్షంబు యిచ్చుకొరకు క్షణమున రావణు తావచ్చి కలసి
వీర వైష్ణవులనగ విభీషణుడు విశ్వాసమున నతడు వినయముగ వచ్చె
సూర్య చంద్రాదులు క్షణమునందాక భూమండలమునుండి మమ్ముగలియగను
మరుని వాలి హర్షమున సుగ్రీవుని విషయమున స్నేహమునా వచ్చి
సూర్య భగవానులు శుక్ర భగవానులు నారదభగవానులు నరనారాయణులు
వ్యాసులు సురలును కనకాద్రిగిరి గజేంద్రులును దేవకీదేవమ్మ గోపిదేవమ్మ
నందవసుదేవులు నంద గోపికలు గంధాన మసిలిన గోపకొమాళ్ళు
బృందావనములో విహరింపుచంద్రూ ఇహములకు జగములకు యితడు ప్రాపనుచు
ఇహపరమైనా భక్తులెందరు కలసినను పద్మనాభుల శ్రీపాద పద్మములు శరణు.

